


# INDIAN FREEDOM STRUGGLE: MUSLIM HEROES (First Part)

Telugu title of this book is BHARATHASWATANTHRASANGRAMAM: MUSLIM YODHULU.

In this book total life sketches of 35 Muslim Heroes who fought violently against British. It started from Bengal Nawab Sirajuddowla of 1757 Palsy War. and Freedom Fighters of 1875 was given.

In addition to this Book contains near about 700 very Brief Sketches of those Muslim Heroes who fought against British since 1757 to 1947. This book contains some very rare photos of the incidents and sketches Muslim Heroes and Struggle of 1857.

This Book contains total 320 pages of 1/8th Demmy Size with Multi colour title. It was published in 2005. The same was Published second time in the year 2007.

Three more Parts of this book is Planed and May come out with in one or two Years if circumstances allowed

భారత స్వాతంత్ర్య సంగ్రామం

# ముస్లిం యోధులు

ప్రథమ భాగం





సయ్యద్ నశీర్ అహమ్మద్



**సయ్యద్ నశీర్ అహమ్మద్**, డిసెంబరు 22,1955 నెల్లూరు జిల్లా పురిణి గ్రామంలోని రైతు కుటుంబంలో జన్మించారు. తల్లి సయ్యద్ బీబీజాన్, తండ్రి సయ్యద్ మీరా మొహిద్దీన్. పురిణిలో ప్రాథమిక విద్య తరువాత కావలి, నరసరావుపేట, భోపాల్, చిత్రదుర్గ, గుంటూరులలో విద్యాభ్యాసం చేశారు.

రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసి న్యాయవాద వృత్తిలో ప్రవేశించారు. నరసరావుపేట 'ఉదయం' దినపత్రిక విలేఖరిగా పనిచేస్తూ, ఆ పత్రిక విజయవాడ ఎడిషన్ న్యూస్ కో-ఆర్డినేటర్ స్థాయికి ఎదిగారు. అనంతరం 'సిటీకేబుల్ నెట్ వర్క్స్ ప్రైవేట్ లిమిటెడ్' (విజయవాడ)లో అడ్మినిస్ట్రేటివ్-న్యాయవ్యవహారాల సమన్వయకర్తగా బాధ్యతలు నిర్వహించారు. ఆ తరువాత 'వార్త' దినపత్రిక గుంటూరు న్యూస్ బ్యూరో ఇన్‌చార్జ్‌గా పనిచేశారు.

చిన్నతనం నుండే సమకాలీన సమాజాన్ని అధ్యయనం చేయడం ద్వారా పరిశీలనా దృష్టిని, సేవాభావాన్ని అలవర్చుకున్న ఆయన పలు సాంఘిక, సాహితీ, సేవా సంస్థల కార్యక్రమాలలో భాగస్వాములయ్యారు. అఖిల భారత చిన్న పత్రికల సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా, రాష్ట్రంలోని వినియోగదారుల సంఘాల సలహాదారునిగానూ, రాష్ట్రంలోని పలు వార, పక్ష, మాస పత్రికలకు గౌరవ సంపాదకులుగా సేవలందించారు. అంధులు, వికలాంగులు, కుష్టురోగ పీడితుల ఆరోగ్య-అభ్యున్నతికి ప్రత్యేక శ్రద్ధ వహించి కృషి చేస్తున్నారు.

ఆయన రాసిన వ్యాసాలు, కవితలు, కథానికలు పలు పత్రికలలో ప్రముఖంగా చోటుచేసుకున్నాయి. భారత ముస్లిం జనసముదాయాల సామాజిక-ఆర్థిక-రాజకీయ స్థితిగతుల మీద విస్తృత పరిశోధన చేస్తున్నారు. చరిత్ర, ఆర్థిక, సామాజిక శాస్త్రాల అధ్యయనం పట్ల ఆసక్తి మెండు. జాతీయ, అంతర్జాతీయ సంస్థలలో సభ్యునిగా పలు సభలు, సమావేశాలలో పాల్గొన్నారు. మంచి వక్త మాత్రమే కాకుండా చిత్రకారుడు, కార్టూనిస్టుగా కూడా ఆయన ప్రసిద్ధుడు.



భారత దేశంలోని అన్ని సాంఘిక జనసముదాయాల మధ్య స్నేహం, సామరస్యం, సదవగాహన ఏర్పడాలనీ, సమాజంలో సుహృద్భావ వాతావరణం మరింతగా విలసిల్లాలని ఆకాంక్షించే మానవతావాది. అన్ని రకాల అసమానతలు తొలగిపోవాలని కాంక్షించే లౌకిక ప్రజాస్వామ్యవాది.

-ప్రచురణకర్తలు

# భారత స్వాతంత్ర్య సంగ్రామం

# ముస్లిం యోధులు


సయ్యద్ నశీర్ అహమ్మద్

M.Com; LL.B; D.J; D.P.M; D.L.L

Sahitya Rathna ( Hindi )



## ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్

3-506, అప్పాఘర్, ఉండవల్లి సెంటర్-522501,

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా.

✆ 08645-272940, 9440241727

e-mail : naseerahamed@yahoo.com



**భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు - 1**

Muslims in India's Freedom Struggle (Part - **1**)

**సయ్యద్ నశీర్ అహమ్మద్**

Syed Naseer Ahamed

ప్రచురణ సంఖ్య : 7

ప్రథమ ముద్రణ : 2005

ముఖపత్రాలంకరణ : షేక్ అబ్దుల్లా సాహెబ్, విజయవాడ.

ముద్రణ : ముద్రా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ.

**పుస్తకాలకు :**

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

3-506, అప్పాఘర్, ఉండవల్లి సెంటర్-522501,

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా.

**మరియు**

**మైత్రి బుక్ హౌస్, మసీదు సందు, విజయవాడ.**

తెలుగు బుక్ హౌస్, ప్రజాశక్తి, విశాలాంధ్ర,

దిశ, సహచర, తక్షశిల, మణి బుక్‌స్టాల్, నవోదయ,

తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, బహుజన బుక్ సిండికేట్

తదితర అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో లభ్యం.

**వెల : రు. 100-00**

# అంకితం

పుస్తక ప్రచురణకు

ఆర్థిక-హార్థిక సహకారం అందించిన

**మాన్యులు - వదాన్యులు**



**జనాబ్ మొహమ్మద్ రహీముద్దీన్ గారికి**

(డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ (రిటైర్డ్), స్టాంపులు-రిజిస్ట్రేషన్స్ శాఖ)

హైదరాబాదు.



**జనాబ్ మొహమ్మద్ రహీముద్దీన్ :** జనాబ్ నాసర్ మొహమ్మద్, శ్రీమతి సాయెబ్‌బీలకు 1943 జూలై ఏడవ తేదిన, వరంగల్ జిల్లాలోని చరిత్ర ప్రసిద్ధి చెందిన దేశాయిఆత్మకూరు గ్రామంలో మొహమ్మద్ రహీముద్దీన్ జన్మించారు. గ్రామంలో పదవతరగతి పూర్తిచేసుకుని ఉన్నత విద్యకు వరంగల్ చేరుకున్నారు. బి.ఎ చదువుతుండగా జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాలో ఉద్యోగం లభించింది. అక్కడ శిక్షణ పొందుతుండగా, సహచరుల పట్ల అధికారుల ప్రవర్తనకు నిరసన తెలుపుతూ, ఉద్యోగం కంటే ఆత్మగౌరవం ప్రధానమని ఉద్యోగానికి రాజీనామా చేశారు. అనంతరం ఉపాధ్యాయ శిక్షణను పూర్తి చేసి ఉపాధ్యాయునిగా నూతన అధ్యాయాన్ని ప్రారంభించారు. విషయాన్ని బోధించటంలో అక్కడ లభించిన అనుభవం, ఆ తరువాత ఉద్యోగ జీవితంలో ఎంతగానో ఉపయోగపడింది. ఒకవైపు ఉద్యోగ బాధ్యతలను నిర్వహిస్తూనే, రాత్రి కళాశాలలో విద్యాభ్యాసం చేస్తూ బి.ఎ డిగ్రీ పొందారు. విద్యా తృష్ణ తీరని ఆయన పోస్టుగ్రాడ్యుయేషన్ పూర్తిచేసి, ఈనాటికీ న్యాయశాస్త్ర డిగ్రీ కోసం పుస్తకాలతో కుస్తీ పడుతున్నారు.

1965లో సర్వీసు కమిషన్ పరీక్షలు రాసి రాష్ట్ర ప్రభుత్వ స్టాంపులు-రిజిస్ట్రేషన్‌ల విభాగంలో చిరుఉద్యోగిగా ప్రవేశించారు. చిన్నతనం నుండే నాయకత్వ లక్షణాలను ప్రదర్శిస్తూ, విద్యార్థి సంఘం నాయకునిగా వ్యవహరించిన ఆయన ఉద్యోగుల న్యాయపరమైన హక్కుల కోసం సాగిన పలు ఉద్యమాలకు చురుకైన భాగస్వామ్యం వహించారు. ఏ స్థాయిలో ఎవరికి అన్యాయం జరిగినా, ప్రతికూల పరిణామాలను ఏమాత్రం లక్ష్యపెట్టక ధర్మం పక్షాన నిలచి న్యాయం సిద్ధించేంత వరకు విశ్రమించక పోరాటం సాగించటం వలన **' బిగ్ ఫైటర్ '** గా సహచరులలో ఖ్యాతిగాంచారు.

ప్రతి సాంకేతిక-సామాజిక అంశాన్ని అధ్యయనం చేయటం, విశ్లేషించి అవగాన చేసుకోవడంలో ఆయన దిట్ట. జటిల సమస్యలను కూడా సమయస్ఫూర్తితో పరిష్కరించే ఆయనలోని సామర్థ్యం, ఓ ప్రత్యేక స్థానాన్ని ఆయనకు సంతరించి పెట్టింది. ప్రభుత్వ ఉద్యోగుల సంఘాలతోపాటుగా, అల్పసంఖ్యాక వర్గాల ఉద్యోగుల, ప్రజల సంఘాలకు చక్కని మార్గదర్శకత్వం వహించారు. ఆశ్రితుడు చిరు ఉద్యోగైనా, ఉన్నతాధికారైనా సమన్యాయాన్ని, సమగౌరవాన్ని ప్రదర్శించటం వలన **' రహీంభాయి '** గా స్టాంపులు-రిజిస్ట్రేషన్‌లో ఉన్న సహచరుల, ఇతర ప్రభుత్వశాఖలలోని ఉద్యోగుల, ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్నారు. ప్రభుత్వాధికారిగా తన బాధ్యతల నిర్వహణలో ఆయన చూపిన క్రమశిక్షణ, దీక్షాదక్షతలు, పోరాటపటిమ కారణంగా క్రమంగా పదోన్నతులు పొందుతూ **' డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ జనరల్ '** హోదాలో, స్టాంపులు-రిజిస్ట్రేషన్ శాఖలోని అందరిచేత శభాష్ అన్పించుకుని 2001లో పదవీ విరమణ చేశారు.

పదవీ విరమణ చేసిన తరువాత కూడా ఇటు ఉద్యోగులకు, అటు ప్రజలకు సేవలందచేయాలన్న లక్ష్యంతో ప్రజా సంఘాలను, సంస్థలను ప్రారంభించి అటు ఉద్యోగులకు, ఇటు ప్రజలకు సేవలందిస్తూ, ప్రజాసేవానురక్తులకు, సామాజిక సేవను తమ విద్యుక్త ధర్మంగా భావించే వ్యక్తులకు విరమణ-విశ్రాంతి ఉండదని నిరూపించారు. ప్రస్తుతం **' ఆంధ్ర ప్రదేశ్ మైనారిటీ ఎంప్లాయిస్ వెల్‌ఫేర్ అసోసియేషన్ '** ఛైర్మన్‌గా ఉద్యోగుల సంక్షేమానికి నిరంతరం శ్రమిస్తున్నారు.' మనిషి తన కోసం కంటే పరుల కోసం, పదిమంది కోసం శ్రమించటంలో అమితానందం లభిస్తుంది, మనిషి జన్మ సార్థకమౌతుంది ', అని విశ్వసించటం ఆయనలోని సేవాతత్పరతకు నిదర్శనం.

సమాజంలోని అన్ని రంగాలలో వెనుకబాటుతనాన్ని చవిచూస్తున్న ముస్లిం జనసముదాయాల సర్వతోముఖాభివృద్ధిని కాంక్షిస్తూ, రాష్ట్రంలో జరుగుతున్న పలు కార్యక్రమాలలో పాల్గొంటూ, ఆయా జనసముదాయాల సంఘాలకు, సంస్థలకు క్రియాశీలక మార్గదర్శకత్వం వహిస్తున్నారు. రాష్ట్ర-కేంద్ర ప్రభుత్వాలు అమలు పర్చుతున్న సంక్షేమ -అభివృద్ధి పథకాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి, ఆ సమాచారాన్ని ముద్రించి ప్రజలకు అందచేస్తూ, ఆయా పథకాల ద్వారా ప్రజలు లబ్ది పొందేందుకు అవసరమైన అవగాహనా సదస్సులు, ప్రచార కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఆశ్రితులకు 'కాదు-లేదు-రాదు' అనటం ఆయన డిక్షనరీలో లేకపోవటంతో, సహాయ- సహకారాల కోసం రాష్ట్రం నలు దిశల నుండి వచ్చే ప్రజలతో ఆయన RS Consultants నిత్యం రద్దీగా ఉంటుంది.

' భిన్నత్వంలో ఏకత్వం-ఏకత్వంలో భిన్నత్వం ' ప్రధాన లక్షణంగా పరిఢవిల్లుతున్న మన దేశంలోని పలు సాంఘిక జనసముదాయాల మధ్య శాంతి-స్నేహం-సామరస్యాన్ని పటిష్టపర్చేందుకు, సద్భావన, సదవగాహన, సహిష్ణుత సమాజంలో మరింతగా వికసించేందుకు తోడ్పడగల కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఆ లక్ష్యసాధనా సంకల్పంతో కార్యక్రమాలు నిర్వహిస్తున్న సంస్థలకు-వ్యక్తులకు ఆర్థిక-హార్థిక సహకారం అందిస్తున్నారు. ఆ దిశగా అవసరమైన సాహిత్యాన్ని, కళారూపాలను రూపొందిస్తున్న కవులు- రచయితలు-కళాకారులకు చేయూతనిస్తున్నారు.

మనదేశంలోని ప్రజలంతా శాంతి-సౌభాగ్యాలతో గౌరవప్రద జీవితాలు గడపాలని, మాతృదేశం కీర్తి పతాక వినువీధుల్లో సమోన్నతంగా నిలపాలని ఆకాంక్షిస్తూ, జీవిత భాగస్వామి శ్రీమతి రబియా బేగం క్రియాశీలక సహకారంతో మొహమ్మద్ రహీముద్దీన్ ఆ దిశగా అవిశ్రాంతంగా శ్రమిస్తున్నారు.

# విషయ సూచిక



## అనుబంధం

పరిచయ వాక్యం




## ఆచార్య వకుళాభరణ రామకృష్ణ

ప్రముఖ చరిత్రకారులు

హైదరాబాదు


# చారిత్రక సందర్భం...

**మా**నవాళికి చరిత్ర ప్రాణవాయువు. గతాన్ని తెలుసుకోవడం, అధ్యయనం చేయడం, విశ్లేషించడమే చరిత్ర. మానవ సమూహాల సమిష్టి జ్ఞాపకాల దొంతరలే చరిత్ర. జ్ఞాపకశక్తిలేని మానవుడు, దిశానిర్దేశంలేని, ఎక్కడికెడుతున్నాడో, ఎక్కడి నుండి వస్తున్నాడో తెలీని తెగిన గాలిపటంతో సమానం. ఒక జాతి పరిస్థితి కూడ అదే! అందుకే, చరిత్ర మానవ జీవిత గమనంలో ప్రగతి స్ఫోరక పాత్రను నిర్వర్తిస్తుంది. ప్రకృతితో నిరంతరం పోరాటం గావిస్తూ, దాన్ని తనకనుగుణంగా మలచుకొంటూ, మార్చుకొంటూ ప్రకృతి శక్తులను జయిస్తూ ముందుకు సాగుతాడు మానవుడు. ఈ పోరాటంలో భాగంగా, ఉత్పత్తి క్రమంలో మార్పులు చోటు చేసుకొంటాయి. ఉత్పత్తి శక్తులు ఒక దశనుండి మరొక దశకు మారుతున్నప్పుడు సమాజ స్వభావమూ, స్వరూపమూ మారుతూ వుంటాయి. ఈ మార్పుల్ని అర్థం చేసుకోవడమే చరిత్ర. వాటి ఫలితాలే చరిత్ర పరమార్థం. సామాజిక శాస్త్రాలన్నింటిలో చరిత్ర తలమానికమేకాక, తల్లిలాంటిది కూడా. ఇతర సామాజిక శాస్త్రాలు, ఏదొక సామాజికాంశానికి పరిమితం కాగా, చరిత్ర వీటినన్నిటినీ తనలో పొదుగుకొంటుంది. అంతేకాక, చరిత్ర రచన, బోధనల ద్వారా భావజాలాన్ని చొప్పించడానికి వెలుసుబాటు కల్పిస్తుంది.

చరిత్ర ఒక అధ్యయనాంశంగా ఇటీవల కాలంలో నిరాదరణకు గురయింది. శాస్త్ర, సాంకేతిక, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీలు, గ్లోబలైజేషన్ ఉధృతి, రాష్ట్ర ప్రభుత్వ హస్వదృష్టి ఫలితంగా, అనుసరించిన అశాస్త్రీయ విధానాల వల్ల, చరిత్ర ప్రాముఖ్యాన్ని ప్రశ్నించటం జరిగింది. దాని వల్ల వుపయోగమేమిటన్న ప్రశ్నతో తమ అజ్ఞానాన్ని చాటుకొన్నారు. ఫలితంగా ఒక చరిత్రేగాక, యితర సామాజిక శాస్త్రాలూ మరుగునపడి నిర్లక్ష్యానికి గురయ్యాయి. వాటి మనుగడకే పెను ప్రమాదం తటస్థించింది. కేవలం చరిత్రకారులు, సామాజిక శాస్త్రవేత్తలే గాక, ఆలోచనాపరులైన పలువురు మేధావులు యీ ప్రమాదాన్ని సంఘటితంగా యెదుర్కొన్నారు. సిద్ధాంతపర వివరణలు, సెమినార్లు, చర్చలు నిర్వహించి ప్రజాభిప్రాయాన్ని కూడగట్టి ప్రభుత్వ విధానాలను మార్పించగలిగారు. ఇది సామాజిక శాస్త్రవేత్తల ఘనవిజయం. పాలకుల అనాలోచిత, అర్థరహిత, అశాస్త్రీయ విధానాలకు చెంపపెట్టు.

చరిత్ర మరోవిధంగానూ, యిటీవల కాలంలోనే తీవ్ర వివాదాలకు గురయింది. కేంద్రంలో అధికారానికొచ్చిన మతతత్వశక్తులు, వారి మద్దతుదార్లు, చరిత్రను తిరగరాయడానికి పూనుకున్నారు. అమల్లో ఉన్న పాఠశాల చరిత్ర గ్రంథాలను మార్చి, వాటిస్థానే మతభావజాలంతో కూడిన గ్రంథాలను ప్రచురించారు. ఇదొక కుట్ర. కొత్త పుస్తకాల నిండా తప్పులతడకలు. వక్రీకరణలు. వీటితోపాటు చరిత్ర పరిశోధనకుద్దేశించిన సంస్థలను, వాటి వనరులను సొంతం చేసుకున్నారు. దీనిపై దేశంలో తీవ్ర నిరసనలు వ్యక్తమయ్యాయి. కేంద్రంలో అధికారమార్పిడి జరిగి లౌకిక శక్తులు పుంజుకోవడంతో, పరిస్థితులు యథాస్థితికి యిప్పుడిప్పుడే చేరుకుంటున్నాయి.

భారతదేశ చరిత్ర రచనలో వక్రీకరణలు వలసపాలకుల కాలంలోనే ఆరంభమై, నేటికీ కొనసాగుతున్నాయి. తమ వలసవాదదోపిడిని సమర్థించుకోవడానికి, ఆంగ్లేయులు, తమకు ముందు అమల్లోవున్న ముస్లీం పాలనను ‘ క్రూర’, అప్రజాస్వామిక, ప్రజావ్యతిరేక, మతపరమైనదిగా అభివర్ణించారు. తమ పబ్బం గడుపుకోడానికే యిది చేశారన్నది జగద్విదితం. ‘చీలి ముక్కలైన’ భారతదేశాన్ని సమైక్యపర్చడాన్కి, శాంతి, సౌభాగ్యాలు నెలకొల్పడాన్కి తమ పరిపాలన దోహదం చేస్తుందని నమ్మబలికారు. సామాజికంగా సాంస్కృతికంగా, విద్యాపరంగా వెనుకబడ్డ భారతీయ సమాజాన్ని వునరుద్ధరించ బూనుకొన్నామని చెప్పారు. అంతేగాక, దేశంలోని రెండు భిన్న మతాలకు చెందిన ప్రజలను వేరు, వేరు జాతులుగా, కలయికకు, సామరస్యానికి వొదగని భిన్న మానవ సమూహాలుగా వూహించి ప్రకటించడమేగాక, వారి మధ్య చిచ్చు రగిల్చారు. మతత్వానికి దేశంలో అంకురార్పణ యిప్పుడే జరిగింది. ‘ విభజించి పాలించు ’ అనే వారి సిద్ధాంతం, 1857 తిరుగబాటు తర్వాత ప్రబలంగా ఆచరణలోకి వచ్చినా, దానికి పునాదులు 18వ శతాబ్దం ద్వితీయ భాగంలోనే పడ్డాయి. 1857 తిరుగుబాటు, హిందూ-ముస్లీం ఐక్యతకు ప్రతీకగా చరిత్రతో నిల్చిపోతుంది. హిందువులు-ముస్లీంలు మత బేధాలను విస్మరించి, కలసికట్టుగా పరాయి పాలనకు వ్యతిరేకంగా ప్రాణాలొడ్డి పోరాడారు. ప్రత్యేకించి ముస్లీంలు యిందులో అధిక సంఖ్యలో పాల్గొనడానికి, ఆంగ్లేయ సైనికాధికారులను తీవ్రంగా మట్టుబెట్టడాక్కి,

చారిత్రక కారణాలున్నాయి. తిరుగుబాటు తర్వాత ఆంగ్లేయులనుసరించిన మారణ దమనకాండ, ప్రత్యేకించి ముస్లీముల పై ప్రయోగించబడింది. ముస్లింకు గుణపాఠం చెప్పాలన్న తీరులో యీ ప్రతిచర్య కొనసాగింది. దీనితో ముస్లింలు ప్రభుత్వానికి, దాని విధానాలకు మరింత దూరమయ్యారు. వారనుసరించిన యీ ' ఏకాంత విధానం ' వారికే హానికరంగా పరిణమించింది. విద్యావసతులు, తద్వారా ఉపాధి సౌకర్యాలు కోల్పోయి, వర్తకవాణిజ్యాల్లో చురుగ్గా పాల్గొనకపోవడంతో (ఆంగ్లేయ వ్యతిరేకత వల్ల), వారిలో మధ్యతరగతి వర్గం ఏర్పడటంలో జాప్యం జరిగింది. దీంతో ప్రాజ్ఞత (Enlightenment) ముస్లిం సమాజంలో నెలకొనే ప్రతిక్రియ ఆలస్యమైంది. ఇది వారిలోని వున్నత వర్గాలు తమ స్వార్ధ ప్రయోజనా కోసం మతతత్వంగా మలచుకొగా, దానికి ఆంగ్లేయులు ఆజ్యం పోసి పెంచి పోషించారు. 1857 తర్వాత ఆంగ్లేయులు హిందూ-ముస్లీం ఐక్యతను చీల్చడాన్కి, ముస్లీంల యెడల సానుకూల వైఖరి అవలంభించి అక్కున చేర్చుకోనారంభించారు. సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ లాంటి నాయకులను చేరదీసి, వారిలో మతతత్వాన్ని పెంపొందించారు. 1906లో ముస్లీంలీగ్ సంస్థ యేర్పడ్డ తర్వాత, వారికోసం ప్రత్యేక మతపరమైన నియోజకవర్గాల యేర్పాటు చేయడంతో ఆరంభమై, అన్ని విధాల జాతీయోద్యమానికి విఘాతం కల్గించే రీతిలో ఆంగ్లేయులు సాయం అందించారు. హిందూ మతతత్వం సంఘటితమై, 20వ శతాబ్దం రెండో దశాబ్దం నాటికి సంస్థా రూపం ధరించింది. ఈ రెండు తతత్వాలు ప్రత్యక్షంగా స్వాతంత్ర్య పోరాటాన్ని వ్యతిరేకించకున్నా, దాంట్లో చురుకైన భాగస్వాములు కాలేకపోయారు. పైగా కొన్ని సందర్భాల్లో యీ రెండు మతతత్వాలు, జాతీయోద్య ప్రయోజనాలకు విరుద్ధంగా పనిచేశాయి కూడా.

పై నేపధ్యంలో, చరిత్ర రచనలోనూ, పందొమ్మిదొశతాబ్ది ఆరంభం నుండి, వక్రీకరణలు చోటుచేసుకున్నాయి. జేమ్స్ మిల్ రాసిన భారతదేశ చరిత్ర దీనికి నాంది పలికింది. వలసవాద చరిత్ర రచనాపద్దతికి భిన్నంగానూ, తద్విరుద్ధంగానూ తలెత్తిన జాతీయవాద చరిత్రలో, యీ వక్రీకరణలు చాలా వరకు సవరింపబడ్డాయి. అయినా ప్రాచీన భారతదేశం ఔనత్యాన్ని మోతాదుకు మించి కొనియాడి, మధ్య యుగాల చరిత్రను చిన్నచూపు చూడటం ద్వారా చరిత్ర రచన సమతుకాన్ని సాధించలేకపోయింది. ఈ రకమైన రచనాధోరణికి మినహాయింపులు లేకపోలేదు. ఆ తర్వాత ప్రాచుర్యంలోకి వచ్చిన చారిత్రక భౌతికవాద సిద్ధాంత భావజాలం చరిత్ర రచనను మరింత శాస్త్రీయంగావించింది. లౌకికధోరణులను వెలికి తీసి, భారతీయ సంస్కృతి లోని బహుళత్వాన్ని యిది వక్కాణించింది. జాతీయోద్యమంలోని అంతర్గత వైరుధ్యాలను, విశాల ప్రజాపోరాటాల స్వభావాన్నీ, అది సంతరించుకొన్న తీరును విశ్లేషించింది. జాతీయోద్యమంలో పాల్గొన్న భిన్న వర్గాల, మతాల, ప్రాంతాల ప్రజలు దాన్ని ఎలా సంపన్నం చేశారో వివరించింది. ఉద్యమంలో విస్తృతంగా పాల్గొన్న ముస్లీంల భాగస్వామాన్ని సరైనరీతిలో అంచనా వేసింది. దేశ చరిత్రలో ముస్లీముల పాత్ర, వారికున్న స్థానం గూర్చి ప్రత్యేక చరిత్ర గ్రంథాలు అనేకం వచ్చినా, మెజార్టీ మతానికి చెందిన ప్రజల పోరాట సంరంభ వర్ణనలో, మైనార్టీల పాత్ర సముచితరీతిలో డాక్యుమెంటు కాలేదు. ఈ మాత్రమైనా అఖిల భారతస్థాయిలో చరిత్ర రచనలోనే జరిగిందన్న విషయాన్ని గుర్తుంచుకొవాలి. ప్రాంతీయ చరిత్రల్లో యీ ధోరణి రావడానికి మరింత సమయం పట్టింది. దీనికి కారణాలు అనేకం. అదివేరే కథ. 18వ శతాబ్ది మధ్య భాగం నుండి( స్థూలంగా ఆధునిక చరిత్ర ఆరంభం) దేశ చరిత్రలో ముస్లీములు నిర్వర్తించిన పాత్ర, ప్రాంతీయ భాషా చరిత్ర రచనల్లో దాదాపు మరుగునపడింది.

చారిత్రకంగా, మరో కొణం నుండి యీ సమస్యను పరిశీలించినప్పుడు, మన దేశ చరిత్రలో ముస్లీముల పాత్ర గూర్చిన అనేక అపోహలు చోటుచేసుకున్నాయి. ఇటీవల కాలంలో హిందూత్వశక్తులు వీటిని పరిశీలించి పనికట్టుకుని మరీ ప్రచారం చేస్తున్నాయి. ముస్లీంల గూర్చిన కొన్ని మూసపోసిన భావాలు ప్రజలలో ప్రాచుర్యం పొందడం మనం గమనిస్తునే వున్నాం. వారు పరాయి దేవస్థలనీ, దేశ చరిత్రలో విధ్వంసక పాత్ర వహించారని, వారికి దేశభక్తి లేదనీ, విదేశీ ఏజెంట్లనీ, యింకా యోన్నో ఆచారిత్రక, అవాస్తవ విషయాలు ప్రచారం చేస్తున్నారు. వీటికి సమాధానంగా యోన్నో రచనలు వస్తూనే వున్నాయి. ఇప్పుడు మీ చేతుల్లో వున్న యీ గ్రంథం, కొంతవరకు, ప్రాంతీయ భాషాచరిత్రల్లో ఆ లోటును తీర్చడానికి ముస్లీముల పైవున్న అపోహలకు సమాధానంగా పరిగణించవచ్చు.

భారతీయ సమాజం యివ్వాళ ఒక చిత్రమైన చారిత్రక సందర్భంలో నడుస్తుంది. దేశంలోని భిన్న సామాజిక వర్గాలు తమ గుర్తింపును చాటుకొనే ప్రయత్నాలు బలంగా చేస్తున్నాయి. ఈ సామాజిక సందర్భంలో మైనారిటీలు, దళితులు, స్త్రీలు, ప్రాంతీయ భాషావాదులు, సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన యితరులు యిందులో వున్నారు.( సాహిత్యంలోనూ యీ ధోరణి గత మూడు దశాబ్దాలుగా ప్రస్ఫుటంగా ముందుకొచ్చింది) దేశసమైక్యత, సమగ్రతల మాట అటుంచి, యీ ధోరణి వాంఛనీయమైనదిగానే భావించాలి. ఇది సామాజిక అస్థిరతను, అశాంతిని కలిగిస్తుందన్న భావన సరైంది కాదు. ఈ వర్గాలు తమ అస్థిత్వం కోసం, మనుగడ కోసం, చరిత్రలో ప్రస్తుత సమాజంలో తమ వంతు భాగం కోసం పోరాడుతున్నారు. ' భిన్నత్వంలో ఏకత్వం ' సరే ! ఆ ఏకత్వంలోని భిన్నత్వాన్ని సమాజం పూర్తిగా గౌరవించనంత వరకూ, ఆదరించి అర్థంచేసుకునేంత వరకూ, ఏకత్వాన్ని

కాపాడుకోలేమన్న నిజాన్ని గ్రహించాలి. ముస్లీముల దేశభక్తినే మౌలికంగా శంకించే సందర్భంలో యీ లాంటి గ్రంథాల ఔచిత్యం మనకు బోధపడుతుంది.

ఇక్కడ మరో ముఖ్య విషయాన్ని ప్రస్తావించుకోవాలి. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన వుద్యమాలు ( వారి పరిపాలన ఆరంభం నుండే యివి మొదలయ్యాయి), ప్రత్యేకించి ముస్లీములవనో, హిందువులవనో చెప్పడాన్కి వీలుపడదు. తిరుగుబాట్లు ఎవరి నాయకత్వంలో జరిగినా, అన్ని మతాల ప్రజలు వాటిలో పాల్గొన్న యీ తిరుగుబాట్లు ఒక మతానికి చెందినవిగా చిత్రించే అవకాశం లేదు. ఈ గ్రంథంలో రచయిత ఆ విధంగా రాయలేదు కూడా. హిందువులు, ముస్లీములు పడుగు పేకల్లా కలసిపోయిన భారతీయ సమాజంలో మతప్రాతిపదిక పై వర్గీకరణ చేయడం కుదరదు. కానీ, యీనాడున్న రాజకీయ వాతావరణంలో, ముందు చెప్పుకొన్నట్టు, ముస్లీములు తమ గుర్తింపు కోసం, తాము నిర్వహించిన పాత్ర గూర్చి సంజాయిషీ చెప్పుకొవాల్సిరావడం దురదృష్టకరమైనా, అవసరం. చరిత్రను వక్రీకరించి, ముస్లీముల పాత్రను కించపర్చేవిధంగా విశ్లేషించే వారికి యీ లాంటి గ్రంథాలు గట్టి సమాధానాలుగా నిలుస్తాయి. ఇది ఒక రకంగా ఆధునిక భారత దేశ చరిత్ర. చరిత్ర గమనంతో జోడించి, ముస్లీం యోధుల జీవితాన్ని చిత్రించటంలో గట్టి నేర్పును ప్రదర్శించాడు రచయిత.

ఫకీర్ల తిరుగుబాటును ఆంగ్లేయులు అసత్యరీతిలో రచించిన తీరును సవరిస్తూ, ముస్లీం మతోద్యమాలుగానే పరిగణింపబడుతూ వచ్చిన ఫరాజీ, వహాబీల ఉద్యమాల్లోని ఆంగ్లేయ వ్యతిరేకతను వెలికి తీసిన రచయిత కృషి ప్రశంసనీయం. ఈ ఉద్యమ మౌలిక స్వభావం ముస్లీం ధార్మికత అయినా, వాటి రాజకీయ ప్రాముఖ్యాన్ని, రచయిత వివరించాడు. 1857 తిరుగుబాటులో పాల్గొన్న ముస్లీం యోధుల జీవిత చిత్రికలు ప్రముఖంగా యీ గ్రంథంలో చోటుచేసుకున్నాయి. అంతకుముందే 1757 దరిమిలా, ఆంగ్లేయులపై రాజీలేని పోరాటాలు,యుద్ధాలు చేసిన సిరాజుద్దౌలా, హైదర్ అలీ, టిపూసుల్తాన్ మొదలగు ముస్లీం పాలకుల సర్వమత సంభావత్వాన్ని, దేశభక్తిని, త్యాగనిరతిని గ్రంథంలో పొందుపర్చాడు రచయిత. అవసరమైన పటాలు, అప్పటి లేఖల డాక్యుమెంట్ల జెరాక్స్ కాపీలను రచయిత గ్రంథంలో చేర్చాడు. 1857 తిరుగుబాటు ప్రముఖ నాయకుల్లో ఒకరైన నానా సాహెబ్‌కు ముఖ్య సలహాదారుడిగా వుండిన అజీముల్లా ఖాన్ పాటించిన మత సామరస్యాన్ని గూర్చి వివరిస్తూ, మతం విధించిన ఆంక్షలకు అతీతంగా ఎలా నడుచుకున్నాడో తెలియచేశాడు. అజీముల్లా ఖాన్ ' నాకు మతం లేదు ' అని ప్రకటించడమే గాక ' మతం కంటే మాతృభూమి ముఖ్యం ' అని వక్కాణించడం నేటి మతవాదులకు కనువిప్పు కలగాలి. అజీముల్లా ఖాన్ రాసిన గేయంలో ఇలా అంటాడు.

' హిందూస్థాన్ హమారా

హిందూ, ముసల్మాన్ సిఖ్ హమారా

భాయీ, భాయీ ప్యారా '

లౌకికత్వం అంటే యిదే! మతం పేరుతో ప్రజలను వేరుచేసి, రాజకీయలబ్ధి పొందాలనుకొంటున్న హిందూత్వశక్తులకు, ఇతర మతవాదులకు ఈ రచన ద్వారా కనువిప్పు కలగాలి.

1857కు పూర్వం జాతీయతా భావం అంకురించిందని చెప్పలేం. 1857 తిరుగుబాటును కొందరు చరిత్రకారులు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా పేర్కొన్నా, దాని స్వభావాలపై చరిత్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. స్థూలార్థంలో, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలన్నీ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా చెప్పుకోవడం వేరే విషయం. మాతృభూమి కోసం పోరాడ్డం, జాతీయ భావస్ఫూర్తితో, సకల ప్రజానీకం విముక్తి కోసం పోరాడ్డం రెండూ వేరు వేరు సందర్భాలు. ఇక్కడే మనం ఆంగ్లపాలన వ్యతిరేకతకూ, వలసపాలన వ్యతిరేకతకూ వున్న ముఖ్యమైన తేడాను గుర్తించాలి. ఇప్పుడా చర్చ వివరాల్లోకి పోవడం అవసరంకాదని తోస్తుంది.

సయ్యద్ నశీర్ అహమ్మద్ ప్రతిభావంతుడైన రచయిత. మనదేశ చరిత్రలో ముస్లీంల పాత్రను సమర్థవంతంగా బేరీజువేసి, నిజాలను నిగ్గుతీస్తున్న నిబద్ధతతో కూడుకున్న రచయిత. ఆంగ్లంలో ముస్లీంముల చరిత్రకు సంభంధించిన అధికారిక రచనలన్నిటినీ ఆపోసన పట్టాడు. విడివిడిగా, ఒక్కో యోధుడి పై, తిరుగుబాటుపై ప్రచురితమైన గ్రంథాలను సంప్రదించాడు. వాటిలోని ఆయువుపట్లను గ్రహించాడు. వెలుగులోకి తెచ్చాడు. ఆంధ్రప్రదేశ్‌లోని ముస్లీములు స్వాతంత్రోద్యమంలో నిర్వహించిన పాత్ర, ముస్లీం మహిళలపాత్రను వివరిస్తూ పలు గ్రంథాలను రచించాడు. నశీర్ అహమ్మద్ చేస్తూన్న మహత్తరమైన యీ వొంటరి కృషి, ఒక సంస్థ చేయదగ్గది. వృత్తిరీత్యా చరిత్రకారుడు కాకున్నా (వాస్తవానికి ఆ అర్హత అక్కరలేదు) ముస్లీంల గూర్చిన చరిత్రకారుడిగా (నశీర్ ముస్లిం కావడం దీనికి దోహదం చేసివుండొచ్చు) తెలుగు చారిత్రక సాహిత్యంలో నశీర్ శాశ్వత స్థానాన్ని యిప్పటికే సంపాదించుకున్నాడు. నశీర్‌కు ఉజ్వల భవిషత్తును అకాంక్షిస్తూ .

హైదరాబాదు

డిసెంబరు, 2004.

గురు వాక్యం




## ఎ.బి.కె ప్రసాద్

ప్రముఖ పాత్రికేయులు

హైదరాబాదు


# చరిత్ర వక్రీకరణకు దీటైన జవాబు !

బ్రిటీష్ సామ్రాజ్యవాదుల్ని గడగడలాడించి, జాతి,మత,కుల, వివక్షకు దూరంగా యావద్భారత ప్రజలనూ సమీకరించి భారత తొలి స్వాతంత్ర్య సమరానికి నాందీవాచకం పలికిన మొగలాయి చక్రవర్తులలో తొలితరం యోధులలో ఒకరైన బహద్దూర్ షా జఫర్ (1775-1862) వీరోచితంగా పోరాడుతూ, తెల్లవాడి సేనలకు బందీ అయి రంగూన్ జైల్లో మగ్గుతూ ప్రాణాలు విడుస్తూ విడుస్తూ రాసిన కవితలో తనను తాను సంబోధించుకుంటూ యిచ్చిన సందేశం ఏమిటీ? ' ఓరీ, జాఫర్ ! నువ్వెంతటి దురదృష్టవంతుడివిరా ! నువ్వెంతగానో ప్రేమించిన నీ మాతృభూమిలో నీ సమాధి కోసం రెండు గజాల చోటుకు కూడా నీవు నోచుకోలేదు గదా ! " అని జాఫర్ లాంటి మొగలాయి (ముస్లిమ్) యోధులు భారత దేశాన్ని తమ మాతృ దేశంగా, తమ పుట్టినిల్లుగా భావించుకుని రాజ్యాల, ప్రజల రక్షణకు త్యాగాలు చేసిన వీరఘట్టాలను మరచి దేశంలోని ముస్లిములను ఎక్కడనుంచో వచ్చినవారు కాబట్టి వారికి భారత దేశంలో స్థానం లేదని, భారతీయ ఉమ్మడి సంస్కృతిని ఇప్పటికీ గుర్తించి గౌరవించాడానికి సంఘపరివార్ మతోన్మాదులు నిరాకరిస్తూన్నారు.

నిజానికి పండిత రాహూల్ సాంకృత్యాయన్ రాసిన ' వోల్గా నది నుండి గంగా నది దాకా ' ( ' వోల్గా సే గంగా ' ) గ్రంథాన్ని చదివిన ఏ భారతీయుడూ జనపదాల, మహావలసల్ని, మహా కదలికలనూ మరచిపోలేడు. వలసలకు జాతి,కుల,మత ప్రసక్తి ఉండదు. ' చారిత్రిక విభాత సంధ్యలలో మానవకథ ' వికాసానికి సంకుచిత పరిమితులు ఉండవు. మనస్సు సంకుచితం అయినకొద్దీ ఛాందసం పెరుగుతుంది. ఛాందసానికి కళ్ళు మూతపడతాయి, కళ్ళుమూతలు పడిన కొద్దీ మానవ చరిత్రకు, ప్రజలకు, దేశాల స్వాతంత్ర్య సమరాలకు, వీరోచిత సంగ్రామాలకు, వాటిని నిర్వహించిన యోధులకూ వక్రభాష్యాలు పుడతాయి. సుప్రసిద్ధ భారత సాధికార చరిత్రకారులలో ఒకరైన ఆర్.సి.మజుందార్ చెప్పినట్టు, భారత దేశ స్వాతంత్ర్య సమర చరిత్రకు అనేక వక్రీకరణలు జరిగాయి, ఈ మహా సంగ్రామం ఒక్కనేత వల్లనో, ఒక్క రాజకీయ పక్షం వల్లనో పరిసమాప్తికి వచ్చింది కాదు, ఏ ఒక్కరి త్యాగాల వల్లనో సద్యః ఫలితానికి వచ్చింది కాదు, ఏ ఒక్కరి కనుసన్నలలోనో చరిత్ర సృష్టించుకున్నది కాదు. ఈ మహా సంగ్రామంలో యావద్భారత ప్రజలు పాల్గొన్నారు, వీరిలో భారతదేశంలోని భిన్నమతాలకు, విభిన్న సంస్కృతులకు, వివిధ భాషా, మత మైనారిటీలకు చెందిన ప్రజలున్నారు. ' సింధు' శబ్దాన్ని నోరు తిరగక పర్షియన్లు ( ' స ' కారానికి బదులు ' హ ' కారం వాడడం వల్ల) " హిందు " గా మార్చడం వల్ల దేశసమైక్యతా భావానికి పరివార్ మత ఛాందసుల వల్ల ఎంతటి చేటు వచ్చిందో గమనించుతున్నాం! శబ్దంలో వచ్చిన 'వర్ణ' సంకరం ఆధారంగా దేశీయ ఛాందస వర్గాలు దేశ ప్రజల నెత్తిన కుల వ్యవస్థను కృత్రిమపు ' వర్ణ వ్యవస్థ ' గానే మార్చి కూర్చున్నారు వెరసి, ఈ పరిణామాల ఫలితం దేశ చరిత్రను వక్రీకరించడంగా మారింది. ఏ ' విదేశీ పోకడలంటే ఈ ఛాందస వర్గం ఏవగించుకున్నట్టు పైకి కన్పిస్తుందో, ఆదే వర్గం- బ్రిటీషు సామ్రాజ్యవాదులు ' విభజించి-పాలించే' తమ విధానానికి అనుగుణంగా స్టూవర్ట్ మిల్ ద్వారా భారతదేశ చరిత్రను మత ప్రాతిపదిక పైన మూడు యుగాలుగా విభజించగా దాన్ని తలకెత్తుకున్నారు. అవి : హిందూ, ముస్లిమ్,బ్రిటీష్ యుగాలన్న కాల విభజన ద్వారా భారత మానవ కథ ఉద్థానపతనాలను అంచనా వేయసాగారు. దాని ఫలితంగానే ' హిందూత్వ' ఛాందసులు భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ముస్లిముల పాత్రను వారి యోధుల త్యాగాలనూ విస్మరిస్తూ, తమ వ్యతిరేక ప్రచారాన్ని విస్తరిస్తూ వస్తున్నారు. పరిశోధకులు చరిత్రాధ్యయనానికి అందని విషయాలను కూడా మసిపూసి మారేడు కాయ చేస్తున్నారు. ప్రామాణిక చరిత్ర గ్రంథాలను పాఠ్యగ్రంథాలను ఛాందస ధోరణి నుంచి తిరగరాయడానికి ప్రయత్నిస్తు వచ్చారు.

ఈ సమయంలో ఛాందస వర్గాలు మరుగున పెడుతున్న భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను ' సాహిత్యరత్న ' బహు గ్రంథకర్తగా, చరిత్రలోని విస్మృత కోణాలను వెలికి తీసి సమన్వయ దృక్పథంతో పాఠకుల్ని సయ్యద్ నశీర్ అహమ్మద్ చైతన్యవంతుల్ని చేయడం ఎంతో అభినందనీయం. స్వాతంత్ర్య సంగ్రామంలో సిరాజుద్దౌలా నుంచి అమానుల్లా ఖాన్ దాకా, జహీరుద్దీన్ మొఘల్ నుండి జియావుద్దీన్ షేక్ వరకూ- భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో మడం తిప్పని ముస్లిం మహావీరులెందరి చరిత్రనో తలస్పర్శగానైనా అందరికీ తలమానికంగా ఉండేట్టు నశీర్ అహమ్మద్ తీర్చి దిద్దారు. ఈ చిత్రణలో నశీర్ ఎక్కడా అతిశయోక్తులకు పోలేదు సరికదా, తెల్లదలచిన వీరుల అజ్ఞాత చరిత్రలోని వెలుగు

నీడలను, బలహీనతలను మభ్యపెట్టడానికి కూడా ఆయన ప్రయత్నించలేదు.

రాజులు తరాజులు, చక్రవర్తులూ హిందులైనా, ముస్లింలైనా ప్రజాభాహుళ్యాన్ని దోచుకున్న వాళ్ళే, సామ్రాజ్య విస్తరణలో ఎవరూ మినహాయింపు కాదు. కాగా కింది వర్గాల ప్రజలు మాత్రం మత విశ్వాసాలకు భిన్నంగా కలగలిసిపోయి ఉమ్మడి సంస్కృతిని పెను అడ్డంకుల మధ్యనే పెంచి పోషించుకుంటూ వచ్చారని భారతీయ సమాజం సుసంపన్న భిన్నత్వాన్ని కాపాడుకుంటూ రావడంలోని రహస్యమిదేనని చరిత్ర చెబుతోంది. ఒకవైపున ఛాందస బ్రాహ్మణ్యం ' అస్పృశ్యతా ' సూత్రం ఆధారంగా సమాజాన్ని విభజించి తమ ఆధిపత్యం నెలకొల్పుకోడానికి ప్రయత్నించిన దశలోనే ఎక్కడికక్కడ దేశంలో స్థానిక సంస్కృతులను వాటి ప్రత్యేకతలను, విశిష్టతను కాపాడుకొంటూ ఉమ్మడి సంస్కృతీ మహార్ణవానికి దోహదం చేసిన పాయలు జైనం, బౌద్ధం, కబీర్, నానక్‌లు, జోతిబా, ఖండోబా, తుకారామ్, చైతన్య మహా ప్రభు, తంత్ర వగైరాలు.

అలాగే కాలక్రమంలో మలబారు కోస్తాలో ఉన్న ప్రజలకు, అరబ్‌లకు మధ్య వర్తక వాణిజ్యాలు విస్తారంగా జరిగాయి. ఆమాటకొస్తే అరబ్బుల వలస ద్వారానే ఇస్లామ్ ఇండియాలో ప్రవేశించింది. ఆరబ్ వర్తకుల కోసం కోస్తాలో అనేకమంది రాజులు స్వయంగా మసీదులు ( ప్రార్థనాలయాలు) కట్టించారు. అప్పకికే స్థానికంగా ఉన్న ముస్లిములు అరబ్బులతో సంపర్గత పెంచుకున్నారు. మొగలాయీల రాకతో దేశరాజకీయ రంగంలో పెనుమార్పులు వచ్చాయి. మతపరంగా చూస్తే ఇస్లాము స్థానిక 'హిందూ' సంప్రదాయాల మధ్య ఆదానప్రదానాలు పెరిగాయి. ఈ పరిణామం ' సూఫీ ' యోగం, భక్తి ఉద్యమాలూ పేద ప్రజానీకంలో పాతుకుపోయాయి. ఇస్లామ్‌లోని ఛాందస వర్గం నుంచి విడవడిన సూఫీలు ఇస్లామ్‌లోని ఆధ్యాత్మికం వైపు కొందరు, హైందవం లోని ఆధ్యాత్మికం వైపు కొందరూ మొగ్గారు. కాగా కాలక్రమంలో–హిందువులకు ముస్లిములకు మధ్య విభేదాలు, తగాదాలు తలెత్తడం అన్నది బ్రిటీష్ సామ్రాజ్యవాదుల ప్రవేశంతోనే ప్రారంభమయ్యింది.

సర్ విలియం మూర్ లాంటి బ్రిటీష్ గవర్నర్లు విన్సెంట్ స్మిత్ లాంటి పాశ్చాత్య చరిత్రకారులు చరిత్ర వక్రీకరణకు బీజాలు నాటారు. ముస్లిముల గురించి, ఇస్లాం గరించి మతపరంగా తప్పుడు భాష్యాలను వ్యాప్తిచేశారు. ముస్లిముల పైన హిందులకు ద్వేషం కలిగేలా ప్రచారం చేశారు. ఈ విష ప్రచారం ఆధారంగా హిందువులలో ముస్లిం వ్యతిరేక మేధావివర్గం తలెత్తడానికి పునాదులు వేసింది.

ఈ విషప్రచారం మన జాతీయోద్యమాన్ని కూడా ఒకమేరకు ప్రభావితం చేస్తూ వచ్చింది. దాని ఫలితమే, పొరపొచ్చాలు కలగడం, అవి దేశ విభజన పేరిట ఉపఖండ వాతావరణాన్నే మొత్తంగా కలుషితం చేయడమూ! అంతేగాదు హిందువులు, ముస్లిములు, సిక్కులు, పార్శీలు, సింధీలు, బౌద్ధులు, జైనులు, క్రైస్తవులు వగైరా విభిన్న మత బాషా సంస్కృతుల సమాహారంగా ఉన్న భారతీయ ఉమ్మడి సంస్కృతికి చెందిన ప్రజలూ, వివిధ రాజకీయ పక్షాలూ ( కాంగ్రెస్, కమ్యూనిస్టు, సోషలిస్టు, కాంగ్రెస్–సోషలిస్టు, ఫార్వడ్ బ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ వగైరా) భారత జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించగా, ఒక్క కాంగ్రెస్ పార్టీ, గాంధీజీలు ఒక్కరే ఉద్యమాన్ని నిర్వహించినట్టు ప్రచారం చేసుకోవడాన్ని చరిత్రకారుడు మజుందార్ ' త్రీ ఫేజస్ ఆఫ్ ఇండియాస్ స్ట్రగుల్ ఫర్ ఫ్రీడం ' అన్న గ్రంథంలో (1961) విమర్శించారు. గాంధీజీ జాతీయోద్యమంలో ప్రవేశించేనాటికే ' హోం రూల్ ' ఉద్యమం ద్వారా బాలగంగాధర్ తిలక్, అనిబీసెంట్, అరవింద సహాయనిరాకరణోద్యమానికి బలమైన పునాదులు నిర్మించినప్పటికీ, వీరి ఊసే నాటి కాంగ్రెస్ ఎత్తలేదని రాశాడు. అందువల్ల జాతీయోద్యమంలో ఇతర కాంగ్రేసేతర (నాన్ కాంగ్రెస్) పక్షాల పాత్రను తక్కువ చేయడానికి చేసిన ప్రయత్నంతోపాటు, జాతీయోద్యమంలో మైనారిటీల పాత్రను కూడా తక్కువ చేసి చూపడమో అసలు విస్మరించడమో జరిగింది. పనిగట్టుకుని జరిగిన ఈ చారిత్రక వివక్ష వల్ల జరిగిన పని–స్వాతంత్ర్యానంతర యువతరానికి భారత జాతీయోద్యమ చరిత్రలో ముస్లిముల క్రియాశీలక పాత్రకు ప్రాధాన్యత లేకుండా పోయింది. ఎందుకంటే ఈ చారిత్రిక వివక్షకు పూర్వరంగం చాలా బలీయమైనదన్నది మరచిపోరాదు.

జాతీయోద్యమాలలో గాని, ఇతర పోరాటాలలోగాని వీరులూ ఉంటారు, భీరువులూ ఉంటారు. లొంగుబాటు దారులు ఉంటారు. ఈ వైరుధ్యాన్ని మతాలకు, మత విశ్వాసాలకు అంటకట్టరాదు. ఆంగ్లేయులకు ఊడిగం చేసిన కొందరు హిందూ రాజులున్నట్టే, బ్రిటీష్ సామ్రాజ్యవాదులకు సలాములు కొట్టి ' జోహుకుం' చెప్పిన మొగలాయి(ముస్లిములు) పాలకులు, నవాబులూ ఉన్నారు. సామ్రాజ్యవాదుల్ని ఎదిరించి ప్రజాసమీకరణల ద్వారా దొపిడీ పాలకులను 'ముప్ప తిప్పలు పెట్టి మూడు చెర్వుల నీళ్ళు' తాగించిన హిందూ,ముస్లిం వీరులూ ఉన్నారు. కాని అటు విలియం మూర్, ఇటు విన్సెంట్ స్మిత్ లాంటి వారు చరిత్ర వక్రీకరణకు పాల్పడినందున జరిగిన ప్రచారం ఘోరమైనదని చెప్పాలి.

పెక్కు మంది ముస్లిం పాలకులు హిందువులను వేధించి, వారి దేవాలయాలను నాశనం చేసి, దేవతామూర్తుల్ని ధ్వంసం చేశారని, కథలు కథలుగా వ్యాప్తికి తెచ్చారు. ముస్లిం పాలకులు మొత్తం 3000 దేవాలయాల్ని నాశనం చేశారనీ, వాటి పైన మసీదులు కట్టారనీ ఇలా అనేక గాథలను ప్రచార ఊదర ద్వారా వ్యాప్తిలోకి తెచ్చారనీ, నిజానికి ఈ ప్రచారానికి ఆధారం లేదనీ, అబద్దాల అల్లికలో తలపండిపోయిన ' మేధావులు' చేతివాటంగా

వ్యాపింపచేసిన నీలివార్తలనీ పదకొండు సంపుటాలుగా వెలువరించిన ‘ హిస్టరీ ఆఫ్ ఇండియా ’ మహారచనలో చరిత్రకారుడు మజుందార్ పేర్కొన్నాడు! పైగా ఈ గ్రంథాన్ని మితవాద సంస్థగా పేర్కొనదగిన విశిష్ట సంస్థ భారతీయ విద్యాభవన్ ప్రచురించిందని గుర్తించాలి! మంజుందార్ వెల్లడించిన అంశాలే నిజం కాకపోతే ముస్లిం పాలకులైన హైదర్ అలీ, అతని కొడుకూ, పాలక వారసుడుగా వచ్చిన టీపూ సుల్తాన్ బ్రిటీష్ సామ్రాజ్యవాదులపై ధ్వజమెత్తిన చరిత్రను మజుందార్ లాంటి భారతీయ చరిత్రకారుడు పదేపదే మెచ్చుకొవాల్సిన అవసరం లేదు! అంతేకాదు టిప్పూ సుల్తాన్ మైసూరుపాలకుడుగా వున్న కాలంలో సుమారు 30 మంది హిందూరాజులు బ్రిటీషు సామ్రాజ్యవాదుల పట్ల లొంగుబాటును ప్రదర్శించగా, టిప్పూ సుల్తాన్ మహావీరుడుగా నిలచి భారతదేశ పరువుప్రతిష్టల్ని సమోన్నతంగా నిలపిన పాలకుడని మరువరాదు. కాని ఈ మాట నచ్చని ఛాందస సంఘ్ పరివార్ వర్గం టిప్పూ మీద వచ్చిన టీ.వీ సీరియల్‌ను వ్యతిరేకించి విషప్రచారం చేసి, దాని ప్రసారాన్ని అడ్డుకోడానికి ప్రయత్నించింది కూడా! అంతేకాదు, భారతదేశ స్వాతంత్ర్యానికి ప్రమాదం దాపురించిందని మొట్టమొదటగా గ్రహించి దేశాన్నీ ప్రజల్ని హెచ్చరించని వారు పూనా పాలకుడు నానా ఫర్నావీజ్, మైసూరు పాలకుడు హైదర్ అలీ అని ఎంతమందికి తెలుసు? అలాగే, ఈ రోజున ‘ హిందూత్వ ’ నినాదంతో మత వివక్షతో మైనారిటీలలో అభద్రతా భావాన్ని వ్యాప్తిచేసి, సమాజంలో అశాంతికి కారకులవుతున్న సంఘ్ పరివార్ నాయకత్వం అదే ‘ హిందూత్వ ’కు ‘ హిందూ రాష్ట్ర ’ నిర్మాణానికీ ఏ సావార్కార్ కారకుడయ్యాడో, అదే సావార్కార్ సహితం 1857 తొలి స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లిముల త్యాగనిరతిని, పాత్రను ప్రశంసిస్తు తన స్వాతంత్ర్య చరిత్ర గ్రంథంలో రాయలేదూ? తంజావూరు ( తమిళనాడు) మన్నాడ్ (మైసూరు) రాయ్‌ఘడ్ ( సహ్యాద్రి), దివాన్-ఇ-ఖాన్ (ఢిల్లీ) పాలకులంతా ( ముస్లిములు) ఇండియాలో ఆవిష్కరించుకుంటున్న సంగ్రామ రంగంలో పాల్గొంటున్న పాత్రధారులని ఎందుకు కీర్తించవలసి వచ్చింది. బహదూర్ షా తన అవసానదశలో రచించిన కవితలో పేర్కొన్నట్టు తామంతా ఈ మాతృభూమి బిడ్డలేనని ఈ పాలకులు భావించారు గనుకనే! కాగా, బ్రిటీష్ వాళ్ళ పై కత్తి దూసిన సిరాజుద్దౌలా పట్ల విద్రోహిగా మారిన మీర్ జాఫర్ లాగానే అవధ్ నవాబు లాంటి వాళ్ళు, జీనత్ మహల్ లాంటి బ్రిటీషు వాళ్ళకు దాసోహమన్న విద్రోహులూ ఉంటారు. పైగా హైదర్ అలీ, టిప్పూ సుల్తాన్ లాంటి పాలకుల సలహాదారుల్లో సేనాపతుల్లో పెక్కుమంది హిందువులు కొలువుతీరారు. బాజీరావు కొడుకైన నానా సాహెబ్‌కు నమ్మిన దౌత్యవేత్త, వ్యవహారకర్తగా ఉన్నవాడు అజీముల్లా ఖాన్ ! ఇక సుప్రసిద్ధ నాయకులలో ఒకరైన అశోక్ మెహతా తన గ్రంథం ‘ 1857 : ఎ గ్రేట్ రెబలియన్ ’లో భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో(1857) హిందువులు, ముస్లిములు చేసిన తిరుగబాటులో అసంఖ్యాకంగా ప్రజలు పాల్గొన్నారనీ, అది ఏదో ఒక్క మతానికి చెందిన వారు పాల్గోన్న తిరుగుబాటు కాదు. అయితే, చారిత్రిక కారణాల వల్ల బ్రిటీష్ వ్యతిరేక శక్తులుగా హిందువుల కన్నా ముస్లింలే సమరశీల శక్తులుగా(..........) అవతరిచారనీ చెప్పాడు. కనుకనే మెతకగా కనిపించే హిందువు కన్నా ముస్లిములంటేనే బ్రిటీష్ వాళ్ళు ఎక్కువగా భయపడేవారని రాశాడు. అంతేగాక ఆయన యింకా యిలా పేర్కోన్నాడుః

‘ ఈ స్వాతంత్ర్య సమరంలో బ్రిటీష్ వాళ్ళదమనకాండ నిర్బంధ విధానం ముస్లిముల పైన పడినంతగా ఎవరి మీద పడలేదు. ఈ తిరుగుబాటులో పాల్గొన్న ముస్లిం నాయకులలో పెక్కుమంది ( జఝ్జార్, బల్లాబ్ ఘడ్, ఫరూక్ నగర్, ఫరూఖాబాద్ నవాబులు) ఉరికంబాలెక్కారు లేదా ప్రవాసంలో గడిపారు... ఈ సమరంలో పాల్గొన్న ముస్లిముల ఆస్తుల్ని భారీ ఎత్తున బ్రిటీష్ ప్రభుత్వం జప్తు చేసింది. ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకున్న బ్రిటీష్ పాలకులు హిందువులను మాత్రం కొలది నెలల్లోనే తిరిగి ఇళ్ళను చేరుకొవడానికి అనుమతించారు. కానీ ముస్లిం ప్రజల్ని మాత్రం మొత్తంగా స్వస్థలాలకు రాకుండా బహిష్కరించారు. అలాగే ఢిల్లీ డివిజన్‌లోని ప్రతి ముస్లిం ఆస్తిలోనూ నాల్గోవంతు భాగాన్ని బ్రిటీష్ పాలకులు స్వాధీనం చేసుకుని, హిందువుల పై మాత్రం కేవలం 10శాతం జరిమానా విధించారు. ఈ విధంగా ఆనాడు సామ్రాజ్యవాద పాలకుల ఆగ్రహం అంతా ప్రధానంగా ముస్లిముల పైనే కేంద్రీకరించింది. అనాడు ఎవరికన్నా కూడా యమయాతనలు పడివారు ముస్లిములు. సామ్రాజ్యవాదుల ప్రతీకార కర్కశత్వ జ్వాలలకు అమాయకులూ వీరులతోపాటే బలైపోయారు. చివరికి బ్రిటీష్ వారికి విధేయుడుగా ఉన్న సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్( అలీఘడ్ యూనివర్శిటీ) కుటుంబం అనేక బాధలకు గురికావాల్సివచ్చింది. మృత్యువాతపడవలసి వచ్చింది... ఈ సమరంలో ముస్లింములు సాహసవీరులుగా వ్యవహరించడమేకాదు, ఎక్కువగా నష్టపోయిన వారు కూడా ముస్లింములే. వోటమిని అంగీకరించడానికి నిరాకరించడమేగాక చాలా కాలందాకా రాజీపడ్డానికి సిద్ధంగా లేరు. రకరకాల పద్దతుల్లో వారు ప్రతిఘటనాశక్తిని ప్రదర్శిస్తూ వచ్చారు. ఆంగ్లవిద్యను తిరస్కరించారు. తద్వారా ఉద్యోగవకాశాలు కోల్పోయారు. ప్రభుత్వోద్యోగాలూ పోగొట్టుకున్నారు. కాని అదే సమయంలో హిందువులు మాత్రం పాశ్చాత్య భావాలకు ఆకర్షితులై వొదిగిపోతూ, నూతన పరిస్థితులలో రాజీపడ్డారు. ఈ కార్యక్రమంలో ముస్లింములు ఏకాకి అయిపోయారు. సంప్రదాయ విశ్వాసాలలో మునిగిపోయారు.

ఈ విధంగా, అంతకుముందు ఢిల్లీలో రోజురోజుకీ విదేశీపాలనకు వ్యతిరేకంగా

ప్రవర్ధమానమవుతున్న ముస్లిం ప్రతిఘటనోద్యమం కాస్తా ప్రథమ స్వాతంత్ర్య సమరంలో కలిసిపోజొచ్చింది....కాగా హిందూ పునరుజ్జీవనోద్యమానికి కేంద్రమైన కలకత్తా మాత్రం తొలి స్వాతంత్ర్య సమర జ్వాలల తాకిడి నుండి తప్పించుకుంది. ఈ విధంగా పరిణామాలలో కన్పిస్తున్న ఈ తేడా హిందు, ముస్లిం సమాజాల మధ్య విభేదాలకు ప్రాతిపదిక అయింది. సమైక్య భారతీయ ఆత్మ దెబ్బతిని పోయింది. ఇక అక్కడి నుంచీ, ఆ తరువాత దశల్లో రెండు మతాలకు చెందిన వారి మధ్య మతపరమైన స్పర్థలు, వివాదాలు తలెత్తుతూ వచ్చాయి. అంతే ప్రథమ స్వాతంత్ర్య సమరం ( తిరుగుబాటు) అనంతరం ఈ స్పర్థలూ, వివాదాలు మన పౌరజీవితాన్ని చెల్లాచెదురు చేసి, విషపూరితం చేసిన అవాంఛనీయమైన వారసత్వంగా మిగిలిపోయాయని అశోక్ మోహతా రేఖా మాత్రంగా అవేదనతో వెల్లడించాల్సి వచ్చింది. అంతే కాదు, ఆ తరువాతి దశలో ఖిలాఫత్ ఉద్యమానికి మద్దతు పేరుతో కాంగ్రెస్ నాయకత్వం భారతీయ ముస్లిములకు జాతీయోద్యమంలో భాగస్వాములు చేయడానికి ప్రయత్నించినా ( నిజానికి భారత జాతీయ ప్రధాన స్రవంతిలో మొదటి నుంచీ ముస్లిములు భాగంగా ఉన్నారు) ముస్లింములలో ఒక అభిప్రాయాన్ని, అనుమానాన్నీ కల్గించింది. ' ముస్లిములు భారతదచేశంలోనే ఉన్నారు గానీ, భారతీయులు కారు'! 1916-1919 మధ్యలో కాలం కల్గించిన అభిప్రాయం ఇదే! కాని ఈ తప్పిదాన్ని సరిదిద్దుకొడానికి తరువాత కాంగ్రెస్ నాయకత్వం కొంత ప్రయత్నించినా తిరిగి 1937లో గాంధీ నాయకత్వంలో కాంగ్రెస్ మరో తప్పుచేసిందనీ, అనాడు ' ముస్లిములలో నిజమైన జాతీయవాదిగా ఉంటున్న జిన్నా 1937లో ద్వంద పరిపాలనాలో బాగంగా మంత్రివర్గాలు ఏర్పాటుకు అవకాశం వచ్చినప్పుడు కాంగ్రెస్-ముస్లిం లీగ్‌లు కలసి ఉమ్మడిగా సంకీర్ణ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేద్దామని ప్రతిపాదించాడు. కానీ జిన్నా ముస్లింలీగ్ ' నిఖార్సయిన కల్తీలేని భారత జాతీయవాదాన్ని' ప్రదర్శిస్తే తప్ప ముస్లింములు సంకీర్ణంలో స్థానమివ్వబోమని కాంగ్రెస్ నాయకత్వం ప్రకటించి తప్పుచేసిందని, మజుందార్ పేర్కొన్నాడు. ఒక రాజకీయ శక్తిగా పనిచేస్తూన్న ముస్లిం లీగ్‌ను తన రాజకీయ ప్రతిపత్తి వదలుకొని, రాజకీయ ఆత్మహత్యకు పాల్పడాలని కాంగ్రెస్‌వారనడాన్ని మంజుందార్ విమర్శించాడు.'దేశంలో ఉన్నవి రెండే రెండు పార్టీలనీ-అవి, కాంగ్రెస్ మద్దతుదార్లు, వ్యతిరేకులూ, అంతేగాని ఈ రెండు రకాల మధ్య ఏదోక వర్గం లొంగిపోతే తప్ప సంప్రతింపుల ప్రశ్నే లేద' న్న గాంధీజీ వైఖరిని కూడా మజుందార్ చరిత్రకారుడిగా విమర్శించారు. ఈ ఆవేదనను వ్యక్తం చేస్తు మజుందార్ ' కాంగ్రెస్‌తో సంప్రతింపు కోసం జిన్నా పదేపదే ప్రయత్నించినా గాంధీ సంప్రతింపుల ద్వారాన్ని మూసివేశార' ని నిరసనగా వ్యాఖ్యానించారు! ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే- పాతగాథల్ని తవ్వడం కోసం కాదు, ఉన్న చారిత్రిక వాస్తవాలు ఎలా వక్రీకరించడం వల్ల భారత దేశ ఉమ్మడి సంస్కృతీ విలువలకు, వాటి పోషణకు తగిన నారు పోసి నీరు పెట్టగల సెక్యులర్ భావాలకు, సమైక్యతా దృక్పదానికీ ఎంతటి చేటుమూడిందో చెప్పడం కోసమూ, గుర్తు చేయడం కోసమే!

అలాగే ఈ సందర్భంగా, ముస్లిములకు ఆరాధ్య దైవంగా భావించే ఇమాం ఘజాలీ(1058-1111) ఇచ్చిన సందేశాన్ని కూడా ముస్లిం సోదరులంతా గమనించాలిః ' టెర్రరిజాన్నీ మీరు మట్టుపెట్టకపోతే టెర్రరిజమే మిమ్మల్ని నాశనం చేస్తుంది. టెర్రరిజం ఖురాన్‌లోని ప్రతి సూత్రానికీ, ప్రవక్త సంప్రదాయానికీ పూర్తి విరుద్ధం'. ఇస్లాం లక్ష్యం మానవుల మధ్య ఐకమత్యాన్ని నెలగొల్పడం గానీ విడగొట్టడం కాదు, అలాగే సెక్యులర్ హైందవం లక్ష్యం కూడా సమిష్టి సంస్కృతీ విలువల పరిరక్షణ గాని పరిహరించటం కాదు. ఇందుకు ఏకైక మార్గం- జాతీయోద్యమంలో సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా ప్రముఖ పాత్రవహించిన హిందూ-ముస్లిం యోధుల త్యాగాలను ... నిత్యం గుర్తుచేసుకొని మెలగడమే.

ఇందుకు నశీర్ ఆహమ్మద్ ముస్లిం యోధుల వీరగాధల్ని యువతరానికి అందిస్తున్న గ్రంథం అమూల్యమైనదిగా భావించాలి. హిందూ-ముస్లిం ఐక్యతను ఉగ్గడిస్తూ, ఇందుకు వ్యతిరేకులైన శక్తుల తప్పుడు ప్రచారాలకు సమాధానంగా మరోక్కసారి విశ్వకవి టాగూర్ రచించిన ' భారతీయ తీరాలు'(.........)అన్న విశిష్ట కవితను మననం చేసుకుందాం.

**' భారతీయ తీరాలు**
**సకల జాతుల మనుషులను**
**ఒక్క చోట చేర్చాయి**
**మేలుకో, ఓ నా మనసా మేలుకో!**
**చేతులు బారలు చాపి నిలుచున్నా**
**మానవతా దైవానికి నమస్సులు తెలుపుకుంటున్నా**
**మానవతా దైవాన్నే కొలవండి**
**ఎవరి పిలుపునందుకనోగాని**
**మానవులు తెరపై అలలై పడి వస్తూన్నారు**
**భారతమనే సంద్రంలో ఏకమవుతున్నారు-**
**ఆర్యులు, ఆనార్యులు, ద్రావిడులు**
**హూణులు, పఠాన్లు, మొగలాయాలు**
**అంతా వీరంతా ఒక్క శరీరమై కలసిపోతున్నారు.'**




## మహబూబ్ బాషా బహదూర్

**పరిశోశక విద్యార్థి, చరిత్ర అధ్యయనాల కేంద్రం**

**జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం, కొత్తఢిల్లీ**


# అపార్థాల మబ్బుల్ని చెదరగొట్టి అగాధాలను పూడ్చే ఆశాకిరణాలు

సంవత్సరం క్రితం Indian International Centre (New Delhi) లో 'Dalith Muslims' పై జరిగిన నేషనల్ సెమినార్‌లో పాల్గొనడానికి వచ్చినప్పుడు నశీర్‌గారు నా దగ్గరున్నారు నాలుగు రోజులు. రిసీవ్ చేసుకోడానికి రైల్వే స్టేషన్ వెళ్ళినప్పుడు ఆయన్ని మొట్టమొదటి సారి చూడ్డం. ఢిల్లీ నుండి విజయవాడకు వెళ్ళిపోతూ 'నా రాబోయే పుస్తకానికి ముందుమాట రాయాల్సినాయనా నువ్వ' అన్నారు. సందర్భం వచ్చింది; ఇచ్చిన మాట గుర్తు చేశారు. 'ప్రముఖులైన చరిత్రకారులుండగా నేను ముందుమాట రాయడమేంటి' అన్నాను. మళ్ళీ discussion ...'ఆప్త వాక్యం' తప్పక రాయాలన్నారు. ఇంతకీ విషయమేమిటంటే పరిచయమై సంవత్సరం అయ్యీ అవ్వకముందే ఈయన నాకు 'ఆప్తుడు' ఎలా అయ్యాడు? కేవలం ఆయన వ్యక్తిత్వం ద్వారానా? లేక క్రమంగా మా మధ్య పెరిగిన భావాజాల సంఘర్షణలతో కూడిన స్నేహం వల్లనా ? ఇవన్నీ కావొచ్చు కానీ అంతకన్నా ముఖ్యంగా చరిత్ర పట్ల తనలో బాగా వేళ్ళూనుకున్న అంకిత భావమే నన్ను మొదట తీవ్రంగా ఆకర్షించి, క్రమంగా 'ఆప్తుడ్ని' చేసింది. నాకు చరిత్ర అత్యంత ప్రీతికరమైన విషయం. చక్కని భవిష్యత్తును నిర్మించగలగడంలో చరిత్రకున్న సామర్థ్యం పట్ల ప్రగాఢ విశ్వాసం. నశీర్ గారికి కూడా చరిత్ర పట్ల గౌరవం ఉంది. చరిత్రను తెలుసుకోవాలన్న, నలుగురికీ తెలియజేయాలన్న ఉత్సాహం ఉంది. దానికి తగ్గట్టుగా శ్రమించగల సామర్థ్యం ఉంది. నిజాలను నిర్భయంగా బయటపెట్టగల నిజాయితీ ఉంది. ఇద్దరమూ చరిత్ర విద్యార్థులమే కాబట్టీ చరిత్ర పట్ల ఇద్దరికీ తీవ్రమైన ఆకర్షణ ఉంది కాబట్టి ఆప్తులం కాగలిగాం; మరో విధంగా చెప్పాలంటే చరిత్రాధ్యయనమే మమ్మల్ని ఆప్తులుగా చేసింది.

వాణిజ్యశాస్త్రాన్నీ, న్యాయశాస్త్రాన్నీ, హిందీ సాహిత్యాన్నీ farmal గా చదివిన ఈ మనిషి చరిత్ర అధ్యయనం, రచనల్లో యింత passion కనపర్చడమేమిటి? అర్థమయ్యేది కాదు ముందు. మేం కలుసుకున్నాక, మాటలు సాగాక తెల్సింది ఈయనకు సమాజం పట్ల గట్టి బాధ్యత ఉందని; అణగారిన ప్రజల పట్లా, అంచులకు నెట్టివేయబడ్డ వారి పట్లా సానుభూతి ఉందని; వారితో మమేకం కాగల సహృదయమూ, సున్నితత్వమూ ఉన్నాయని, exploitation free, harrassement free సమాజాన్ని నిర్మించాలన్న ఆర్తి ఉండబట్టే చరిత్ర అధ్యయనం, రచన పట్ల యింత అంకితభావాన్ని ప్రదర్శిస్తున్నారు.

ఈయన ముస్లిం గూర్చే ఎందుకు రాస్తున్నారు ? 'ముస్లిం' కాబట్టేనా ? అలా అనుకుంటే మనం పప్పులో పాదం మోపినట్టే ! నశీర్ గారి గూర్చి పూర్తిగా తెలియకుండా మన సమాధానాల్ని మనం ఊహించి తయారు చేసుకోవడం తప్పిదమే ! న్యాయవాది, జర్నలిస్టు అయిన యితనికి అనేక సామాజిక ఉద్యమాలతో సంబంధాలున్నాయి. అణగారిన ప్రజలవైపు, harrassed ప్రజలవైపు నిలబడ్డ మనిషీయన. స్పష్టమైన లౌకిక వాదాన్ని గూర్చి కలులు కంటున్నవాడు. కరడుగట్టిన లౌకిక భావాలున్నవాడు. స్పష్టమైన లౌకిక భావాలను సమాజంలో ప్రచారం చేయలనుకుంటున్నవాడు. అందుకే కొన్ని క్షుద్రశక్తులు తమ విధ్వంసకర భావజాలంతో, సాంస్కృత బాహుళ్య వారసత్వంతో అలరారుతూ వస్తున్న భారతదేశాన్ని సాంస్కృతికంగా నాశనం చేయ్యాలని విశృంఖలంగా ప్రయత్నిస్తున్న నేపథ్యంలో, ముఖ్యంగా దుర్భరమైన బతులీడుస్తున్న ముస్లింలపై తీవ్రమైన, నిరాధారమైన ఆరోపణలు చేస్తూ, వారి అస్తిత్వాన్ని కాలరాయజూస్తున్న 'హిందూత్వ' కాలనాగుల హాలాహల ప్రవాహానికి చాకచక్యంగా తన కలాన్ని అడ్డుపెడుతున్నారు. మతోన్మాద విషపు త్రిశూలాలతో చరిత్ర తోటపై దాడిచేసి మిగిలిన పవ్వులన్నింటిని నలిపిపారేసి, ఒక్క కమలాన్ని మాత్రమే వికసింపజేసి కాషాయం పంటను పండించాలని ప్రయత్నిస్తుంటే చూస్తూ సహించలేక ఆవేదనతో, బాధ్యతతో, కడు జాగ్రత్తతో ఒక అందమైన, ఆహ్లాదకరమైన, అందరూ ఆస్వాదించదగ్గ సువాసనలను వెదజల్లె పువ్వుల్ని పూయించడానికి, వికసింపజేయడానికి తన కలాన్నే హలాన్ని చేసి ఒక చరిత్రకోటను నిర్మించాలనుకుంటున్నారు.

'చరిత్ర మానవాళికి ప్రాణవాయువు' అన్నారు ప్రొఫెసర్ రామకృష్ణగారు. దీన్ని బాగా గుర్తించాలు నశీర్ గారు. అందుకే గుండెల్నిండా చరిత్ర ప్రాణవాయువుని పీల్చుతున్నారు. అంతేనా .. తన మాత్రమే పీల్చుకొనే స్వార్థపరులా నశీర్ గారు! కాదు. అందుకే మనందరికీ పంచిపెడుతున్నారు. చరిత్రకు 'మార్కెట్ వ్యాల్యూ' లేదనీ, దీన్ని చదవడం, బోధించడం నిరర్థకమనీ ఒక పరమ మూర్ఖశిఖామణి చేసిన వ్యర్థ ప్రేలాపనల నేపథ్యంలో ఈయన తమకంతో చరిత్రనెందుకు హత్తుకుంటున్నారన్నది చాలా మందికి అర్థం కాని విషయం. మన సమాజ 'పరిణామం' ఇంతవరకూ దాపురించిన సందర్భంలో నశీర్ గారు చేస్తున్నది వింతపనే !

చరిత్ర రచన వ్యయసాయం అత్యంత సంక్లిష్టమైనది. కొండంత ఓపిక ఉండాలి. తన మీద తనకు అదుపుండాలి. నిక్కచ్చియైన ఆత్మశోధన కావాలి. ఇవన్నీ సాధించాలంటే rigorous శిక్షణ అవసరం. మరి నశీర్‌గారికి ఎవరిచ్చారీ శిక్షణ ?! ఆయన ఎక్కడెక్కడో తిరిగి, ఎవర్నెవర్నో కలసి, ఎంతో కష్టపడి సేకరించి, అధ్యయనం చేసిన పుస్తకాలే ఆయన శిక్షకులు. ఈ విషయంలో తనే

ఆధ్యాపకుదు; విద్యార్థి. నశీరొక స్వయం చోదకశక్తి. లేకపోతే అతి తక్కువ కాలంలో యిన్ని పుస్తకాలెలా రాయగలరు? తన రాబోయే పుస్తకాలేవో అంత confident గా ఎలా చెప్పగలరు? నశీర్ గారిని AP History Congress (జనవరి 2004, విజయవాడ) కి పరిచయం చేసింది నేనే అని చెప్పడానికి సంతోషంగా ఉంది. ఒక పత్రం సమర్పించండని చెబితే ' మీ చరిత్రకారుల మధ్యన నాబోటివారు ఎలా నిలదొక్కుకోగలడు; నేను రాయగలనా ?' అని సమాధానమిచ్చారు. కానీ అప్పటికే ఆయన రచనలని గూర్చి వ్ని, వాటిని చదివిన, ఆయన ఉపన్యాసాలు విన్న చరిత్రోపన్యాసకులు ముక్కున వేలేసుకొని తమవైపు తాము చూసుకుంటున్నారనడంలో అతిశయోక్తి లేదు. AP History Congress (లయోలా కళాశాల, విజయవాడ)లో ఈ విషయమే రూఢి అయ్యింది. అంతేకాక భారతదేశ అగ్రగణ్య చరిత్రకారులలో ఒకరూ, ఆంధ్రప్రదేశ్ గర్వించదగ్గవారూ ప్రస్తుత పుస్తకానికి 'పరిచయ వాక్యం' రాయడానికి సంతోషంగా ఒప్పుకోవడమే నశీర్ రచనల worth ఎంతో స్పష్టం చేస్తుంది.

నశీర్ గారి మాటలను వింటునప్పుడల్లా నాకన్పిస్తుంది; ఈ మనిషి చరిత్ర ఉపన్యాసకుడయ్యింటే ఎంత బాగుండేది అని. చరిత్ర అధ్యయనం యొక్క ప్రాముఖ్యతనీ, ప్రస్తుత చరిత్రను కమ్ముకుంటున్న విషమయ కాషాయ కారుమేఘాలల వెనుకున్న రాజకీయాల్ని బత్తాయి పండును ఒలచినట్టు ఒలచి చెప్పగలిగే ఆయన సామర్థ్యాన్నీ, వ్యక్తీకరణలోని స్పష్టతనీ చూసి ఎన్ని తరాల విద్యార్థినీ విద్యార్థులు బాగుపడేవారోకదా అని. కానీ యిప్పుడు నశీర్‌గారికా అవకాశం లేదు; విద్యార్థులకూ ఆ అదృష్టం లేదు. Public meetings మాత్రమే ఒకింత ఓదార్పు.

ఈయన కేవలం secondary sources ని మాత్రమే పరిశీలించి అంగ్లంలోని విషయాల్ని తెలుగు చేస్తున్నారని కొందరు ముఖం చిట్లించవచ్చు! కాని చిట్లిపోతున్న ముఖాలకు రాసి అవి వికారంగా తయారయ్యే ప్రమాదాన్ని నివారించడానికి ఈయన దగ్గర వేస్‌లిన్ ఉంది. అది ఆయనందిస్తున్న గ్రంథాలు. తెలుగులో రాయడం ద్వారా జ్ఞానాన్ని ప్రజాస్వామీకరిస్తున్నారు నశీర్‌గారు. జ్ఞానమంతా వలసవాదుల భాషలోనే ఉన్నప్పుడూ (I should not ne misunderstood as meaning that all knowledge is preserved in the language of the coloniser i.e English) దాన్ని జనం మధ్యకు తీసుకురావాలన్న ఆలోచనా, అవసరమూ (ముస్లింల విషయానికి సంబందించి) ఎవరికీ పెద్దగా కలగనప్పుడుఉ నశీర్‌గారు చేస్తున్న ఈ గట్టి ప్రయత్నం సర్వదా శ్లాఘనీయమైనది. అపార్థాల మబ్బుల్లోకి ప్రజలను నెట్టివేస్తోన్న శక్తుల ప్రజల మనస్సుల్లో మతతత్త్వ కల్మశాన్ని నింపడానికి ప్రాంతీయ మండళ్ళు స్థాపించి, ప్రాంతీయ భాషలను దుర్వినియోగం చేస్తున్నప్పుడు వాటికి సమాధానంగా ప్రాంతీయ భాషల్లోనే చెప్పాల్సిన అవసరం ఉన్న దృష్ట్యా, సులభంగా లభించిన సమాచారం కారణంగా కొందరు 'జాతీయ నాయకులు' గా తయార్రై, వివిధ ప్రాంతాల్లోని త్యాగధనులను over shadow చేస్తున్న సందర్భంలో నశీర్ పుస్తకాలకు ఎంతో ప్రాముఖ్యత ఉంది.

నశీర్ గొప్ప చరిత్ర కథకుడు (not in strict literary sence); అంతకన్నా భావకుడు. చరిత్ర పాత్రలన్నా, చారిత్రక ప్రదేశాలన్నా కదలిపోతారు. విజయవాడకు చెందిన పాత్రికేయుడు షఫీ



అహమ్మద్‌తో కలసి ఢిల్లీ వచ్చినప్పుడు ఇక్కడున్న పలు చారిత్రక కట్టడాలను అంతా కలసి సందర్శించాం. ప్రతి కట్టడమూ నశీర్‌గారిని కదిల్చింది. ఎర్రకోట దగ్గర నిల్చోని ఆనాటి స్వాతంత్ర్య సంగ్రామ ఘట్టాలను, సమరయోధుల పోరాటాలను గుర్తుకు తెచ్చుకుంటూ, ఆయా చారిత్రక సంఘటనలు జరిగిన ప్రదేశాలను గుర్తించి తన్మయత్వంతో చూస్తూ ఒక్కసారిగా అలనాటి కాలంలోకి వెళ్ళిపోయారు. చరిత్ర పట్ల యింత తాదాత్మ్యం ఉండబట్టే చారిత్రక పాత్రలతో మమేకమై రాయగల్గుతున్నారు. అయన పుస్తకాల్లోని ఈ అంశమే పాఠకుల్ని ఆకర్షిస్తుంది; చరిత్రలోకెళ్ళిపోయేలా చేస్తుంది.

ఈయనలో నాకు బాగా నచ్చింది సంబోధన. ఏమంటారాయన నాలాంటి యువకుల్నుద్దేశించి– 'నాయనా', 'అది కాద్రా నాయనా', 'ఓ నై బేటే' –అని. అందులో కొందరికి ఆయన అధికార స్వరం ధ్వనిస్తుంది. ఎంతో మంది చేయలేకున్న పనిని ఈయన చేయగలుగుతున్నారు కాబట్టీ, యిప్పటికే మంచి పేరుని తన పాకెట్‌లో పెట్టుకుని తిరుగుతున్నారు కాబట్టీ, జెలసీ కారణంగా కొందరికి ఈయన రచన చేయడం ఇష్టముండదు; తన రచనలు మరీ ఇష్టముండవు; మరి ఇలాంటి కలుపుగోలు సంబోధన వారికి ఎలా నచ్చుతుంది? నేను రచయితనీ, అందునా చరిత్ర రచయితనీ (తను 'చరిత్రకారుడు' కానని నశీర్ బలంగా నమ్ముతారు ఎందుకో!!) అన్న consciousnessఉండటం వల్లా. 'ముస్లింల గూర్చి రాస్తున్నది నీ వొక్కడివే' అని ఎంతో మంది uncritical గా చేస్తున్న వ్యాఖ్యానాల కారణంగా బహుశా కల్గిన dominating స్వరం ఉంటే ఉండనీండిగాని ఆ సంబోధనలో లోతైన ఆప్యాయతే తప్పకుండా ఉంది.

నశీర్‌లో అన్నీ positive లక్షణాలే ఉన్నాయా? ఇది ఎవరికి మాత్రం సాధ్యమని! ఆయన వ్యక్తిగత జీవిత లోపాలతో మనకు సంబంధం లేదుగానీ, ఆయనలోని ఒక్కలోపం మాత్రం ఆయన profession పై తీవ్ర ప్రభావాన్ని కల్గించగలదు. అది: మనుషుల్ని త్వరగా నమ్మడం; అలాగే అంత త్వరగా అపార్థం చేసుకోవడం. కొన్ని సందర్భాలల్లో అసలు అర్థం చేసుకోకుండానే పోవడం! చరిత్ర రచనా వ్యయసాయంలో ఉన్నవారి వ్యక్తిత్వంలో ఈ లోపం ఉండడం ఆయా వ్యక్తుల Professional బాధ్యతల దృష్ట్యా తీవ్ర ప్రమాదకారిగా పరిణమించగలదు. ఈ mental frame కల్గి ఉండడం వల్ల మన source-priamary source కానీ, secoundary కానీ యింకా చరిత్ర రచనలోని యితర methods కానీ –మనల్ని సులభంగా మోసగించే ప్రమాదముంది.

'ఏది చరిత్ర' అని ప్రశ్నించుకొని దానికి సరైన కాదుకదా కనీసపు సమాధానాలు సయితం రాబట్టలేకున్న 'ఆంధ్రప్రదేశంలో ముందుగా చెప్పుకోదగ్గ' చరిత్రకారులు విలువైన కాగితాన్ని ఖరాబు చేస్తున్న సందర్భంలోనూ, వక్రీకరించిన చరిత్ర ద్వారా మనుషుల మధ్య అపార్థాలు సృష్టించి, అగాధాలను ఏర్పరిచే దుష్ట ప్రయత్నం జరగుతున్న సందర్భంలోనూ అగాధాలు పూడ్చివేయడానికి చరిత్రను ప్రబల సాధనంగా ఉపయోగించగల నశీర్ లాంటివారు మనకిప్పుడు కావాలి. ఈ దిశగా సయ్యద్ నశీర్ అహమ్మద్ తన సామాజిక బాధ్యతను శక్తివంతంగానూ, సమర్థవంతంగానూ నిర్వహిస్తూ వస్తూన్నట్టే!

◆ ◆ ◆



# ఎందరో ... ఎందరెందరో అందరికి ధన్యవాదాలు

గత పదిహేను సంవత్సరాల కృషి ఫలితంగా మీ చేతుల్లో ఉన్న 'భారత స్వాతంత్ర్య సంగ్రామం: ముస్లిం యోధులు'. నా అధ్యయనం, పరిశోధనా క్రమంలో లభించిన పరిమిత సమాచారం మేరకు ఈ గ్రంథాన్ని రూపొందించాను. ఈ గ్రంథంలో 1757 నుండి 1875 వరకు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలు, యుద్ధాలలో పాల్గొన్న కొంతమంది యోధుల జీవిత రేఖాచిత్రాలను పొందుపర్చాను. ఆ తరువాత రానున్న భాగాలలతో 1875 నుండి 1948 వరకు సాగిన జాతీయోద్యమంలో క్రియాశీలక పాత్రను నిర్వహించిన ఉద్యమకారుల జీవిత విశేషాలు ఉంటాయి. ఈ విధంగా నాకు లభించిన వివరాలు స్వల్పం, అందుబాటులోకి రాని సమాచారం అనంతం. ఆ పరిమితుల మూలంగా భారత స్వాతంత్ర్య సమరంలో ముస్లింల పాత్రను వివరించే ప్రయత్నంలో మీ ముందుకు వచ్చిన ఈ గ్రంథం సమగ్రమూ కాదు, సంపూర్ణమూ కాదని నాకు తెలుసు.

సుమారు ఎనిమిది వంల పేజీలు కాగల ఈ గ్రంథాన్ని తీసుకరావడటం ఆర్థికంగా నాకు కడుభారంగా భావిస్తున్న సమయంలో 'భారత స్వాతంత్ర్యసంగ్రామం: ముస్లిం యోధులు' రఫ్‌డ్రాఫ్టును చూసి ప్రథమ భాగం ప్రచురణకు కావాల్సిన ఆర్థిక సహాయం అందించేందుకు జనాబ్ మొహమ్మద్ రహీముద్దీన్ (డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ (రిటైర్డ్), స్టాంపులు-రిజిస్ట్రేషన్స్ శాఖ, హైదరాబాద్) ముందుకు వచ్చారు. ఆయన తోడ్పాటు లేనట్టయితే ఇంత త్వరగా ఈ పుస్తకాన్ని తీసుకరాగలిగేవాడ్ని కాను.

నాకు అవసరమగు విశేష సమాచారాన్ని సేకరించడంలో చాలా శ్రమించాల్సి వచ్చింది. ఆ శ్రమను చాలా వరకు తగ్గిస్తూ, ఈ కార్యక్రమంలో ప్రధానంగా Prof.Imthiyaz Ahamed (Jawahar Lal Nehru University, New Delhi), Dr. Asghar Ali Engineet (Center for the study of Society and Secularism, Mumbai), Prof. Mukthar Ahamed Makki (Jemshedpur University, Jemshedpur), Prof. Shamshul Islam (Delhi University, Delhi), Prof. Shan Mohammed (Alighar University, Alighar), Mr. Anil Nauria (Writer and Supreme Court Advocate, New Delhi), Dr. Yogindra Shikand (Director, Centre fot Islamic Studies, Hamdurd University, Delhi) తోడ్పాటునిచ్చారు. Prof.Imthiyaz Ahamed, Prof. Shamshul Islam గార్లయితే నా రచనలు పరిశీలించడం మాత్రమే కాకుండా నాకు అవసరమగు గ్రంథాలను సూచించి, ఆ గ్రంథాలు లభ్యంకాక నేను అవస్థలు పడుతుంటే, వ్యయప్రయాసలకోర్చి, ఆ గ్రంథాలను తామ స్వయంగా సేకరించి నాకు అవసరమగు భాగాలను ఎంతో శ్రద్ధతో జిరాక్స్ కాపీలు తీయించి పంపించారు.

నేనే సభ్యత్వం కలిగియున్న Center for the study of Society and Secularism, (Mumbai), Indian Association of Muslim Social Scientists (New Delhi), Institute of Objective Studies (New Delhi) లాంటి సంస్థలు నుండి కూడా ఉపయుక్త సమాచారం లభించింది. Jawahar Lal Nehru University (New Delhi), Alighar Muslim University (Alighar), Acharya Nagarjuni University (Guntur), Andhra University (Vishakapatnam) ల గ్రంథాలయాల నుండి చాలా సమాచారం లభ్యమైంది. మద్రాసులోని కన్నెమరా గ్రంథాలయం, విజవాడలోని Ram Mohan Free Library and Reading Room, హైదరాబాద్, అలీఘర్, ఢిల్లీ, మద్రాసు, బొంబాయి, రాజమండ్రి తదితర ప్రాంతాలలోగల గ్రంథాలయాధికారులు నాకెంతో సహకరించారు.

గత 5 సంవత్సరాలుగా 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల మహత్తర పాత్ర' కు సంబంధించిన విశేషాంశాలను వివరిస్తూ రాసిన ఆర్టికల్స్ ధారావాహికంగా ప్రచురించి 'గీటురాయి' వారపత్రిక సంపాదకులు జనాబ్ యస్.యం.మల్లిక్ గారు నన్ను పాఠక మిత్రులకు పరిచయం చేశారు. నా ఆర్టికల్స్‌ను జనాబ్ వాహెద్ (గీటురాయి) అందంగా రూపకల్పన చేయించారు. ఈ క్రమంలో 'వార్త', 'ఆంధ్రజ్యోతి', 'ప్రజాశక్తి', 'విశాలాంధ్ర' లాంటి ప్రముఖ దినపత్రికల సంపాదకులు నేను రాసిన స్వాతంత్ర్య సమరయోధుల జీవన రేఖాచిత్రాలను ప్రచురించి ప్రోత్సహించారు.

నా రచనలను చదువుతూ, విలువైన సూచనలను ఎప్పటికప్పుడు అందించారు ప్రముఖ చరిత్రకారులు ఆచార్య వకుళాభరణం రామకృష్ణ. నేను సాగిస్తున్న చరిత్ర రచనను ఎంతగానో ప్రోత్సహిస్తూ విలువైన సమాచారంతో ఉత్తరాలు రాయడమే కాకుండా నా గ్రంథానికి 'పరిచయ వాక్యం' కూడా రాసిచ్చారు. నన్ను పాత్రికేయునిగా చేసిన 'ఉదయం' దినపత్రిక సంపాదకులు, ప్రముఖ పాత్రికేయులు, గురుతుల్యులు శ్రీ ఏ.బి.కె ప్రసాద్ గారు 'గురువాక్యం' రాసిచ్చారు. 'ఉదయం'లో పాత్రికేయునిగా నా ప్రగతిని, ఆ తరువాత రచయితగా నా కృషిని గమనిస్తూ, నన్నెంతగానో ఆయన ఉత్సాహపర్చారు. నన్ను ఎంతగానో అభిమానించినా, చరిత్ర రచన విషయంలో ఏమాత్రం రాజీపడకుండా నిర్మొహమాటంగా తగు సవరణలు సూచించిన జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం (న్యూఢిల్లీ) చరిత్ర పరిశోధక విద్యార్థి మహబూబ్ బాషా బహదూర్ 'ఆప్త వాక్యం' రాశారు. నా ఢిల్లీ పర్యటనలో నాకు అన్ని విధాల సహకరిస్తూ, నా వెంట ఉంటూ, నా రచనలకు అవసరమగు సమాచార సేకరణలో నాకెంతో తోడ్పాటునందించారు.

ఈ గ్రంథంలో చాలా చిత్రాలు, ఫోటోలు పొందుపర్చాను. ఈ చిత్రాలను చాలా వరకు నా సన్నిహిత మిత్రులు, ప్రముఖ చిత్రకారులు షేక్ అబ్దుల్లా సాహెబ్ రూపొందించారు. నేను సంప్రదించిన గ్రంథాలలోని వివరాలు, వర్ణనల ఆధారంగా ఆయా యోధుల ముఖకవళికలను రూపకల్పన చేశారు. ఈ చిత్రాలు ఉహా చిత్రాలు అయినప్పటికీ యదార్థ చిత్రాలన్నంతగా అబ్దుల్లా ప్రతిభ కనపర్చారు. స్వాతంత్ర్యసమరయోధుల చిత్రాలను ఇవ్వడమే కాకుండా ఆకర్షణీయంగా ముఖపత్రాలంకరణ చేశారు. అనుబంధంలోని Ram Mohan Free Library and Reading Room (Vijayawada)

గ్రంథాలయాధికారి శ్రీ తుర్లపాటి రాఘవేంద్రరావు అందించారు. ఈ చిత్రాలను అనాటి బ్రిటీష్ చిత్రకారులు, ఆంగ్లేయాధికారులు చిత్రించినవి. ఈ వ్యక్తులంతా ఆయా సన్నివేశాలను చూసినవారు కావటంతో ఆ చిత్రాలు వాస్తవానికి, సహజత్వానికి అత్యంత సమీపంగా నిలుస్తూ అలనాటి సంఘటనలకు అద్దం పడుతున్నాయి.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం జనసముదాయాల పాత్రను వివరిస్తూ, నేను ప్రారంభించిన పుస్తక రచనకు స్ఫూర్తి, ప్రేరణనిస్తూ, ఎప్పటికప్పుడు నన్ను ఉత్సాహపరుస్తూ, పుస్తకాల ప్రచురణ బాధ్యతను స్వీకరించి మా మామయ్య హాజీ షేక్ పీర్ అహమ్మద్ (నరసరావుపేట) తోడ్పాటు ఇస్తున్నారు. అధ్యయనం-రచన సమయాలలో నాకు ఎటువంటి శ్రమ కలుగకుండా, అవసరమగు సమాచారాన్ని, గ్రంథాలను నేను కోరగానే అందుబాటులోకి తెచ్చిపెడుతుఊ నా జీవిత భాగస్వామి శ్రీమతి రమీజా బాను, నా కుమార్తె శ్రీమతి జాస్మిన్ తల్మీజుద్దీన్ ఎంతగానో చేయూతనిచ్చారు.

నా ప్రథమ గ్రంథం మొదలుకొని అనంతరం వచ్చిన నా ప్రతి గ్రంథాన్ని పూర్తిగా చదివి తగిన సూచనలు అందిస్తు ప్రముఖ సాహితీవేత్త శ్రీ కొత్తపల్లి రవిబాబు (తెనాలి), గారెంతో తోడ్పడుతున్నారు. ఈ గ్రంథాన్ని నా సన్నిహిత మిత్రులు శ్రీ మిరియాల బాలా కుమార్ (గుంటూరు) టైపు చేయించి పెట్టారు. ఈ గ్రంథం టైపు సెట్టింగ్, ముద్రణ విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకుని ముద్రా ఆఫ్‌సెట్ ప్రింటర్స్ (విజయవాడ) అధినేత శ్రీ తుమ్మల సుబ్బారావు పుస్తకాన్ని అకర్షణీయంగా తీర్చిదిద్దారు.

ఈ గ్రంథానికి కర్తను నేనైనా, సమాచర సేకరణ వద్ద నుండి, లభించని ఆ సమాచారాన్ని పుస్తక రూపం కల్పించి పాఠకులకు అందించగలిగించేంత సుదీర్ఘ ప్రక్రియ వరకు సాగిన మా ప్రయత్నంలో పైన పేర్కొన్న ప్రముఖులు, హితులు-సన్నిహితులు, మిత్రులు ప్రత్యక్షంగా సహకరించిన వారు కాక, పరోక్షంగా చేయూత నిచ్చినవారు పలువురున్నారు. ఆ కారణంగా ఈ గ్రంథం 'వ్యష్టి కృషి' గా కాక 'సమష్టి కృషి' ఫలితమని భావిస్తున్నాను. ఈ రచనా క్రమంలో వివిధ దశలలో నాకు అన్ని విధాల చేయూత నివ్వడమే కాకుండా, చక్కని సలహాలు-సూచనలను అందించిన ప్రతి ఒక్కరికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

మనదేశంలో అన్ని సాంఘిక జనసముదాయాలలు సదవగాహనతో, సద్భావనతో, సామరస్యవాతావరణంలో అన్ని రకాల అసమానతలకు అతీతంగా, శాంతియుతంగా గౌరవప్రద జీవితాలను సాగించాలన్న ఆకాంక్షతో, ఆ ఆశయ సాధన దిశగా నేను చేస్తున్న చిరు ప్రయత్నానికి అందరి సహాయ-సహకారాలను అర్థిస్తున్నాను.

**- సయ్యద్ నశీర్ అహమ్మద్**
**01.01.2005**

**3-506, అప్నాఘర్**
**ఉండవల్లి సెంటర్-522501**
**తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా**



## పరాయి పాలకుల పెత్తనాన్ని ప్రశ్నించిన ప్రప్రథమ స్వదేశీ పాలకుడు

# 01. సిరాజుద్దౌలా

పదహారవ శతాబ్దంలో వర్తకం పేరుతో ఇండియాలో అడుగు పెట్టిన బ్రిటీషు వర్తకులు స్వదేశీ పాలకుల దరిచేరి, ధనకనక వస్తు వాహనాలను కానుకలుగా సమర్పించి స్థిరపడటం ఆరంభించారు. పరదేశీ వర్తకుల రాకతో వ్యాపారం అభివృద్ధి చెందుతుందని ఆశించిన పాలకులు ఆంగ్లేయ వర్తకులకు అన్ని అవకాశాలూ కల్పించారు. ఆ రోజున వ్యాపారం చేసుకు బ్రతుకుతామంటూ వచ్చిన బ్రిటీషర్లు స్వదేశీ సౌభాగ్యాన్ని చూసి దురాశ పుట్టి స్థానిక సంపదను సంపూర్ణంగా కబళించేందుకు కుతంత్రాలు ప్రారంభించారు. స్వదేశీ-విదేశీ వ్యాపారం మీద పూర్తి పట్టు సంపాదించి, గుత్తాధిపత్యం సాధించుకుని మరిన్ని లాభాలను స్వతం చేసుకోవాలంటే రాజ్యాధికారం హస్తగతం చేసుకోకతప్పదని గ్రహించిన బ్రిటీషర్లు స్వదేశీరాజుల మధ్యనున్న విభేదాలు, విద్వేషాలను ఉపయోగించుకున్నారు.

సరుకును నిల్వ చేసుకునేందుకు స్వంత గిడ్డంగులు కట్టుకుంటామని స్వదేశీపాలకుల ఎదుట సాగిలపడి ఆంగ్లేయులు తగిన అనుమతి సంపాదించుకున్నారు. ఆ గిడ్డంగుల రక్షణ కోసమంటూ పటిష్టమైన కోటల నిర్మాణానికి పూనుకున్నారు. ఆ తరువాత అవకాశాలను బట్టి పథకం ప్రకారంగా స్వదేశీ పాలకుల వ్యవహారాలలో జోక్యం చేసుకోవటం ఆరభించారు. ఈ మేరకు ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల ఎత్తుగడలను గ్రహించి, ఆ కుయుక్తులను వమ్ముచేయ సంకల్పించి, పరాయి పాలకుల పెత్తనాన్ని రూపుమాపేందుకు నడుంకట్టాడు





పాతికేళ్ళుదాటని పోరాట యోధుడు. **' భారత స్వాతంత్ర్య సాయుధ సమరేతిహాసంలో అరుణపుటల్ని తెరిచిన '** ఆ యువకుడు బెంగాలు నవాబు సిరాజుద్దౌలా.

సిరాజుద్దౌలా తాత బెంగాలు నవాబు అల్లావర్ది ఖాన్‌కు ఘసిటీ బేగం (GHASITI BEGUM), మైమూనా బేగం, అమీనా బేగం అను ముగ్గురు కుమార్తెలు. ఆయన చివరి కుమార్తె అమీనాకు ' **బ్రిటీషు దుష్టులను కత్తిపట్టి ఎదిరించిన మొనగాడు** ' గా ఖ్యాతిగాంచిన సిరాజుద్దౌలా 1733లో జన్మించాడు. ఆ సంవత్సరంలో అల్లావర్ది ఖాన్‌ను బెంగాలు నవాబుగా గుర్తిస్తూ మొగల్ చక్రవర్తి ' సనద్ ' జారీచేసినందున మనుమడ్ని సిరాజుద్దౌలా (Light of the State) అని ముద్దుగా పిలుచుకున్నాడు. మగబిడ్డలు లేనందున సిరాజ్‌ను తన వారసుడిగా ప్రకటించాడు. ఈ ప్రకటన పెద్ద కుమార్తె ఘసిటీ బేగంకు రుచించలేదు. ఈ చికాకుల మధ్య 1756 ఏప్రిల్ 9న అల్లావర్ది ఖాన్ కన్నుమూశాడు. ప్రకటించిన విధంగా సిరాజ్ రాజ్యాభిషేకం నిరాటంకంగా జరిగింది. రాజ్యాధికార సంక్రమణ సజావుగా జరిగినా ఆది నుండే అంతర్గత-బహిర్గత శత్రువుల కుట్రలు సిరాజుద్దౌలాను చుట్టుముట్టాయి.

అల్లావర్ది ఖాన్ అంతఃపురంలో రగులుకుంటున్న వారసత్వ వివాదాన్ని గమనించిన బ్రిటీషర్లు అవకాశాన్ని అందిపుచ్చుకునేందుకు పాచికలు కదిపారు. అటు కలకత్తాలోని తమ స్థావరం ' ఫోర్టు విలియం ' ను పటిష్టపర్చటం ప్రారంభించారు. నవాబు అనుమతి లేకుండా కోటను పటిష్ట పర్చుకోవటమే కాదు పలు అదనపు నిర్మాణాలు గావించారు. కోట బురుజుల మీద ఫిరంగులను అమర్చి, ఆయుధ సామగ్రిని, ప్రత్యేక శిక్షణ పొందిన సైన్యాలను సమకూర్చుకోసాగారు. ఆ వరవడిలో కలకత్తా ఖాశిం బజారులోని కర్మాగారాన్ని కూడా ఆయుధాలతో నింపి కోటను కంచుకోటగా, ఖాశింబజారును ఆయుధాగారంగా మార్చుకున్నారు.

వర్తక-వాణిజ్య వ్యవహారాల విషయంలో కూడా ఈస్ట్ ఇండియా కంపెనీ ఇష్టానుసారంగా ప్రవర్తించసాగింది. బెంగాలులోకి దిగుమతి అవుతున్నసరుకుల మీద సుంకాలు చెల్లించడానికి నిరాకరించారు. కలకత్తా రేవులో ప్రవేశించే భారతీయ వర్తకుల సరుకుల మీద కంపెనీ అధికారులు వ్యాపార సుంకాలను పెంచారు. స్వదేశి వర్తక-వాణిజ్యాలకు నష్టదాయకం కాగల ఈ విధానాల మీద నవాబు మండిపడ్డాడు. పూర్వీకుల కాలంలో ఏ ప్రాతిపదిక మీద వ్యాపారానికి అనుమతి పొందారో, ఆ ఆచార-సంప్రదాయాలను పాటించాల్సిందిగా సిరాజుద్దౌలా కోరాడు. ఆ హితవులు ఆంగ్లేయలకు రుచించలేదు.

ఆంగ్లేయుల తీరుతెన్నులు ఇలా ఉండగా, సిరాజుద్దౌలా పెద్దమ్మ ఘసిటీ బేగం తన కుట్రలలో భాగంగా ముషిరాబాదును వదలి, సమీపాన ఉన్న' మోతి ఝీల్ ' అను తోటలోని ప్రాసాదంలోకి, ఆపార ధనరాశులతో, పది వేల మంది పరివారాన్ని తోడ్కొని

వెళ్ళింది. పెద్దమ్మ ఆంతర్యాన్ని పసిగట్టి అమెను నియంత్రించేందుకు సిరాజుద్దౌలా ఉద్యుక్తుడు కాగా, భర్తను కొల్పోయిన ఘసిటీ మీద ఎటువంటి చర్యనూ తీసుకోవద్దని తల్లి అమీనా వారించటంతో సిరాజుద్దౌలా అప్పటికి ఊరుకున్నాడు. తన ప్రయత్నాలలో భాగంగా ఘసిటీ ఢిల్లీ చక్రవర్తికి దూతలను పంపుతూ, ఆంగ్లేయులతో మంతనాలు ఆరంభించింది. అమె ప్రయత్నాలకు దివాన్ రాజ్‌వల్లభ్ వంత పాడసాగాడు. సిరాజుద్దౌలా బెంగాలు నవాబుగా అర్హుడు కాడంటూ, తాను దత్తత చేసుకున్న యువకుడు షౌకత్ జంగ్‌ను నవాబుగా గుర్తిస్తూ ' సనద్ ' ను జారీ చేయాల్సిందిగా ఆమె చక్రవర్తి వద్దకు తన ప్రతినిధులను పంపింది.

బెంగాలు నవాబుగా రాజ్యాభిషక్తుడు కాగానే బురుజుల నిర్మాణం, ఫిరంగుల అమరిక, అదనపు నిర్మాణాలు తదితర కార్యక్రమాలను విరమించుకోవాలని, అనుమతి లేకుండా నిర్మించిన బురుజులను ధ్వంసం చేయాలని ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులను సిరాజుద్దౌలా ఆజ్ఞాపించాడు. ఆ సమయంలోనే ఘసిటీ బేగం మద్దతుదారుడైన దివాన్ రాజ్ వల్లభ్ కుమారుడు కృష్ణదాసు అపార ధనరాసులతో బెంగాలు రాజధాని ముషీరాబాదు నుండి ఫరారయ్యాడు. ఆ కృష్ణదాసుని ఖాశింబజారు ఫ్యాక్టరీ నిర్వాహకుడు డాక్టర్ ఫోర్ట్ ఆదుకున్నాడు. ఆయన సిఫారస్సు మీద కలకత్తాలో కంపెనీ అధికారులు అతనికి ఆశ్రయం కల్పించగా, అది తగదంటూ, కృష్ణదాసును తనకు అప్పగించాల్సిందిగా కోరుతూ కంపెనీ ప్రతినిధికి సిరాజుద్దౌలా లేఖ రాశాడు. అంతఃపురంలోని అంతర్గత కుమ్ములాటల మూలంగా సిరాజుద్దౌలా తప్పక పదవీభ్రష్టుడు అవుతాడని కంపెనీ అధికారులు ఊహాగానాలు ప్రారంభించారు. అనుభవజ్ఞుడు రాజ్‌వల్లభ్ మార్గదర్శకత్వంలో ఘసిటీ బేగం తప్పక విజయం సాధిస్తుందని, రాజ్‌వల్లభ్‌ను తమ ఉచ్చులో బిగించి ఇష్టానుసారంగా ఆడించవచ్చని భావించారు. సిరాజుద్దౌలా రాజ్యభ్రష్టత్వం మీద ఆశలు పెట్టుకున్న కంపెనీ అధికారులు ఆయన ఆదేశాలను బేఖాతర్ అన్నారు.

ఈ పరిస్థితులను గమనించిన సిరాజుద్దౌలా అంతర్గత సమస్యలను పరిష్కరించుకుని, ఆ తరువాత బహిర్గత శత్రువు పనిపట్టాలని భావించాడు. ప్రప్రథమ అస్త్రాన్ని ఘసిటీ బేగం మీద ప్రయోగించాడు. మోతిఝీల్ ప్రాసాదాన్ని చుట్టుముట్టి అమెను ముషీరాబాదుకు రప్పించాడు. అమెకు మీద ఎటువంటి చర్యనూ తీసుకోకుండా వదలి పెట్టినా, ఘసిటీ మాత్రం ఆంగ్లేయుల సహకారం కాంక్షించడమే కాకుండా రాజ్యాధికారం కోసం పరితపిస్తున్న స్వజనులను, అధికారులను సిరాజ్‌కు వ్యతిరేకంగా కూడగట్టం మానలేదు. ఆ ప్రయత్నాలలో భాగంగా బెంగాలు సర్వసేనాని, సిరాజుద్దౌలా బంధువు మీర్‌జాఫర్‌తో మంతనాలు సాగించింది. బెంగాలు సింహాసనం మీద కన్నేసిన మీర్‌జాఫర్ ఎలాగైనా సిరాజుద్దౌలాను సింహాసన భ్రష్టుడ్నిగావించి రాజ్యాన్ని హస్తగతం చేసుకోవాలని కలలు కంటున్నాడు. ఈ





మేరకు అల్లావర్దీ ఖాన్ కన్నుమూసినప్పటి నుండీ అతను ప్రయత్నాలు ఆరంభించాడు. ఆ కుయుక్తిలో భాగంగా మరో సైన్యాధికారి మానిక్‌చంద్‌తో అతను మంతనాలు చేశాడు. ఆంగ్లేయులతో సంబంధాలు ఎర్పచుకునేందుకు ఉవిళ్ళూరుతున్నాడు.

ఈ ప్రతికూల పరిస్థితులలో నవాబు సిరాజుద్దౌలా ఘసిటీ బేగంను నిర్భంధించాడు. చింత చచ్చినా పులుపు చావలేదన్నట్టు, సిరాజుద్దౌలా అంతం చూసేవరకు తాను నిద్రపోనని అమె శపథాలు చేసింది. ఘసిటీ బేగంను సిరాజుద్దౌలా ఎప్పుడైతే లొంగదీసుకున్నాడో అప్పటి నుండి కంపెనీ అధికారులు పునరాలోచనలో పడ్డారు. పొరపాట్లు జరిగాయని అంగీకరిస్తూ, ఆ తప్పులు మళ్ళీ జరగవని సిరాజుద్దౌలా వద్ద నక్క వినయాలు పోయారు.

అటు నిర్భంధంలో ఉన్న ఘసిటీ బేగం ఏమీ చేయలేని పరిస్థితులలో మిన్నకుండి పోయినా, అమె దత్తకుమారుడు షౌకత్ జంగ్ మాత్రం రాజ్‌వల్లబ్ మార్గదర్శకత్వంలో తన ప్రయత్నాలను కొనసాగించాడు. తన దత్త తండ్రి గవర్నరుగా పనిచేసిన పూర్ణియా ప్రాంతాన్ని తన తిరుగుబాటు కార్యక్రమాలకు కేంద్రంగా చేసుకున్నాడు. పూర్ణియాలో రగులుతున్న తిరుగుబాటు కుట్రలను అరికట్టాలని, ఆ దిశగా సిరాజుద్దౌలా తన సైన్యంతో కదిలాడు. ఆ బలగాలు పూర్ణియా చేరుతుండగా, అంతకు ముందు సిరాజ్ రాసిన లేఖలకు కంపెనీ అధికారుల నుండి ప్రత్యుత్తరం వచ్చింది. ఆ ప్రతిస్పందనలో ప్రతికూలత వ్యక్తంకావటం, అంతర్గత శత్రువు కంటే ముందు బహిర్గత శత్రువు ప్రమాదకరంగా మారటంతో, పూర్ణియా మీద దాడిని ఉపసంహరించుకుని కంపెనీ పని పట్టాలనుకున్నాడు.

ఈ మేరకు 1756 జూన్ 4వ తేదిన ముషీరాబాదు చేరుకున్న సిరాజుద్దౌలా కలకత్తా వైపు దాడికి బయలు దేరాడు. ముందుగా ఖాశింబజారులోని కంపెనీ ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకున్నాడు. జూన్ 5వ తేదిన బయలుదేరి జూన్ 16న నాటికి కలకత్తా చేరుకున్నాడు. అక్కడ కంపెనీ సేనలకూ, నవాబు సైన్యాలకూ మధ్య పోరాటం ప్రారంభమైంది. మూడు రోజుల తరువాత కలకత్తా గవర్నర్ డార్కే, విలియం కోటనూ, కోటలోని ఆంగ్లేయులనూ వారి ఖర్మకు వదలి, సముద్ర తీరం ద్వారా పడవలో ఫౌల్టాకు (FULTA) జారుకున్నాడు. జూన్ 20వ తేదిన ఫోర్టు విలియం సిరాజుద్దౌలా స్వాధీనమైంది.

ఈ సందర్భంగా కలకత్తాలో పట్టుబడిన అంగ్లేయ అధికారి యస్.సి.హాల్‌వెల్ (S.C.Holwell) సిరాజుద్దౌలా మీద ఆంగ్లేయులను రెచ్చగొట్టేందుకు పకడ్బందీగా ఓ కథను అల్లాడు. అది ' **బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా** ' సంఘటనగా చరిత్రలో నమోదైంది. ఆ కథనం ప్రకారం, కోటలో పట్టుబడిన 146 మంది ఆంగ్లేయలను కేవలం 18 అడుగుల పొడవు, 14 అడుగుల 10 అంగుళాల వెడల్పుగల ఓ చీకటి గదిలో బలవంతంగా బంధించటంతో, వారిలో ఇరవై ముగ్గురు తప్ప మిగిలినవారంతా రాత్రికి రాత్రే ఊపిరాడక దుర్మరణం

పాలయ్యారని ప్రచారం చేశాడు. ఈ ప్రచారాన్ని ఓ కట్టుకథగా అత్యధిక చరిత్రకారులు కొట్టివేయగా కొందరు మాత్రం పనిగట్టుకుని **బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా** కు ప్రాధాన్యతనిచ్చారు. ఒకవేళ ఈ సంఘటన జరిగిందనుకున్నా, ఈ సంఘటనకు సిరాజుద్దౌలాను బాధ్యుడ్ని చేయటం సబబుకాదనీ, అసలు 146 మంది ఖైదీలను ఎంత బలవంతంగా కుక్కినా ఆ చీకటి గదిలో పట్టించటం భౌతికంగా అసాధ్యమనీ అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. ప్రముఖ చరిత్రకారుడు డాక్టర్ బోలానాథ్ చంద్ ఈ సంఘటనను అసత్యమని పూర్తిగా కొట్టివేశారు. ఈ సంఘటనను అటు కల్నల్ క్లయివు గాని, ఈస్ట్ ఇండియా కంపెనీ గాని ప్రస్తావించలేదనీ, దేశభక్తుడగు సిరాజుద్దౌలాను అపఖ్యాతి పాల్జేసేందుకు ఆంగ్లేయులు ఈ కథనాన్ని సృష్టించారనీ ఆయన స్పష్టం చేశారు. (తెలుగు విజ్ఞాన సర్వస్వము, మొదటి సంపుటి, 1954, పేజీ 377). అసత్యాలను ప్రచారం చేయుటంలో నేర్పరి అయినటువంటి Holwell మాటలు నమ్మశక్యంకావని కె.యం ఫణిక్కర్ పేర్కొనటం గమనార్హం. ( ' Holwell, an early expert in war propaganda through horror stories, was known liar...' - *A Survey of Indian History*, KM Panikkar, 1977, page 215). బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా నమ్మశక్యం కాదనడానికి మంచి ఆధారాలున్నాయని ( The truth of this story has been doubted on good grounds - *An Advanced History of India* By R.C Majumdar,1996, Page 650) అర్.సి. మంజుందార్ లాంటి చరిత్రకారులు కూడా పేర్కొంటున్నప్పటికీ, ముస్లిం వ్యతిరేకత పుణికి పుచ్చుకున్న కొందరు చరిత్రకారులు, వ్యక్తులు–సంస్థలు, ముస్లిం పాలకులు కడు కిరాతకులని ప్రచారం గావించేందుకు బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా కథనాన్ని ఉటంకిస్తూన్నారు.

కలకత్తాలోని ఫోర్టు విలియంను స్వాధీనం చేసుకున్న సిరాజుద్దౌలా తన సేనాని మానిక్ చంద్‌ను కోట బాధ్యతలను అప్పగించి ముషిరాబాదుకు వెళ్ళిపోయాడు. ఈ మధ్యకాలంలో బేగం ఘసిటీ దత్తకుమారుడు షౌకత్ జంగ్ ముమ్మరంగా ప్రయత్నాలు చేసి, ఢిల్లీ చక్రవర్తి నుండి ' **సనద్** ' ను సంపాదించాడు. ఆ సనద్ సహాయంతో బెంగాలుకు తాను అధికారిక నవాబుగా ప్రకటించుకున్నాడు. ఈ కుట్రలో బెంగాలులోని అత్యంత సంపన్న వ్యాపారీ, బ్యాంకరూ అయిన జగత్ సేథి, సర్వసేనాని మీర్ జాఫర్ భాగస్వాములయ్యారు. ఆ కుట్రదారుల మధ్యన ఒక అంగీకారం పూర్తిగా కుదరక ముందే, ప్రతికూల వాతావరణాన్ని కొంత పసిగట్టిన సిరాజుద్దౌలా, పూర్ణియాలోని షౌకత్‌జంగ్ మీద దాడిచేసి, అతనిని అంతంచేశాడు.

అటు ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులనూ, ఇటు ఘసిటీ బేగంనూ, మరోవైపు ప్రమాదకారి షౌకత్ జంగ్ కుట్రలనూ సిరాజుద్దౌలా విచ్ఛిన్నం చేయగలగటంతో మిగిలిన





కుట్రదారులు తేలుకుట్టిన దొంగల్లా మిన్నకుండి పోయారు. ఈ విజయాలతో సంతృప్తిపడిన సిరాజుద్దౌలా భవిష్యత్తు ప్రమాదాలను ఊహించలేదు. ఈ కుట్రలో భాగస్వాములు ఎవరన్న విషయం చూచాయగా తెలిసి కూడా వారిని శిక్షించకుండా మానిక్ చంద్‌కు కలకత్తాను స్వాధీనం చేయటం, మీర్ జాఫర్ పట్ల ఔదార్యం చూపటం తదితర తప్పిదాల వలన సిరాజుద్దౌలా వ్యక్తిగతంగా తాను నష్టపోవడమే కాకుండా భారతదేశ చరిత్ర గతిని మార్చిన అత్యంత ప్రమాదకర సంఘటనకు కారకుడయ్యాడు.

కలకత్తా నుండి పలాయనం చిత్తగించి ఫాల్టా చేరుకున్న ఆంగ్లేయులు అవమాన భారంతో కుతకుతలాడి పోసాగారు. ప్రతిగా షౌకత్ జంగ్‌ను రెచ్చగొట్టారు. సిరాజుద్దౌలా చేతిలో అతను అంతమయ్యాక, కలకత్తా బాధ్యతలను చేపట్టిన మానిక్ చంద్ మీద దృష్టి మళ్లించారు. మానిక్ చంద్ ఆంగ్లేయుల ప్రలోభాలకు తేలిగ్గా లొంగిపోయాడు. కలకత్తాకు చెందిన సంపన్న వ్యాపారి ఓమిచంద్, ప్రముఖ బ్యాంకరు జగత్ సేథిలతో మంతనాలు సాగించి, వారిని తమ దారికి తెచ్చుకున్నారు. నవాబు సిరాజుద్దౌలా తమ అపరిమిత లాభాలకు అడ్డుకట్ట వేశాడని ఆగ్రహంగా ఉన్న వ్యాపారుల కూటమికి చెందిన జగత్ సేథి స్వలాభం కోసం బెంగాలును ఈస్ట్ ఇండియా కంపెనీకి అమ్మివేయడానికి అంగ్లేయులతో లాలుచీకి సిద్ధపడ్డాడు. ఈ కారణంగానే, ప్లాసీ యుద్ధంలో సిరాజుద్దౌలా పరాజితుడయ్యాడని, అసలు ప్లాసీ యుద్ధం, యుద్ధం కాదని, అది బడా వ్యాపారులకు నాయకత్వం వహిస్తున్న జగత్ సేథి బెంగాలు నవాబును ఈస్ట్ ఇండియా కంపెనీకి విక్రయించిన ఓ వ్యాపార వ్యవహారం మాత్రమేనని ప్రముఖ చరిత్రకారుడు కె.యం.ఫణిక్కర్ అంటాడు. ( '..a transaction, not a battle, a transaction by which the compradors of Bengal lead by Jagath Seth sold the nawab to the East India Company.. ' - KM PHANIKKAR, Quoted in *EXPLOSION IN A SUB CONTINENT*, Ed. by Robin Black Burn, Penguin Books, 1975, Page 84 ). ఈ కుట్రకు ఓమిచంద్ సంధానకర్తగా పనిచేశాడు. **ఆంగ్లేయులు ప్రమాదకరం కాని వ్యాపారులు,** అంటూ కంపెనీకి అనుకూలంగా సిరాజుద్దౌలా నిర్ణయాలు తీసుకునేందుకు పథకం ప్రకారంగా కుట్రదారుల దళం వ్యవహరించింది. కలకత్తాలో తమను ఘోరంగా పరాభవించిన నవాబు సిరాజుద్దౌలా మీద పగతో రగిలిపోతూ, ఏ విధంగానైనా కలకత్తాను తిరిగి స్వాధీనం చేసుకునేందుకు కంపెనీ అధికారులు తీసుకుంటున్న చర్యలు నవాబు దృష్టికి రానివ్వకుండా కుట్రదారుల ముఠా జాగ్రత్త పడింది.

కలకత్తాను స్వాధీనం చేసుకునేందుకు భారీ సైనిక దళాలను పంపాలని ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన మద్రాసు కౌన్సిల్ నిర్ణయించింది. నావికాదళాధికారి అడ్మిరల్ వాట్‌సన్, కల్నల్ క్లయివుల నేతృత్వంలో సైనిక దండు 1756 అక్టోబరు 16న కలకత్తాకు బయలుదేరింది. ఈ దండు డిసెంబరు 14వ తేదిన ఫాల్టా చేరుకుంది. గతంలో సిరాజుద్దౌలా

రాసిన లేఖకు సమాధానంగా, కలకత్తా సంఘటనలో జరిగిన నష్టానికి పరిహారం చెల్లించమనీ, అన్ని రాయితీలు, మినహాయింపులను పునరుద్ధరించమనీ డిమాండ్ చేస్తూ అక్టోబరు 17వ తేదిన అడ్మిరల్ వాట్సన్ నవాబుకు లేఖ రాసాడు. ఈ మేరకు అనుకూల నిర్ణయాలు తీసుకోనట్టయితే, **మీదేశంలో చిచ్చుపెడతాను. దాన్ని ఆర్పడానికి గంగా నదిలోని నీరంతా పోసినా చాలవు** ('.. I will kindle such a flame in your country as all the water in the Ganges shall not be able to extinquish ' . - *History of The Freedom Movement In India*, Dr. Tara Cahand, page 220, quoted from S.C Hills *BENGAL IN 1756-57*, Vol. II page clxii) అని బెదిరించాడు. ఈ బెదిరింపు లేఖలను అందుకున్న సిరాజుద్దౌలా, స్వదేశీ ప్రభువుల దయాదాక్షిణ్యాల మీద వ్యాపారం చేసుకోడానికి తమ దేశానికి వచ్చిన వర్తకులకు తన దేశాన్ని తగులబెడతానని బెందిరించేంతటి సాహసమా? అని క్రోధారుణ నేత్రుడయ్యాడు.

కల్నల్ క్లయివు బెంగాలు చేరుకుని ఓ పక్కన సిరాజుద్దౌలాకు లేఖలు రాసి మభ్యపెడుతూ, మరోవైపున విలియం కోటను పునరాక్రమణకు కోసం కలకత్తాకు బలగాలను నడిపించాడు. కుట్రదారులలో భాగస్థుడైన మానిక్ చంద్, క్లయివుతో యుద్ధం చేసినట్టు నటించి పథకం ప్రకారంగా కలకత్తాను క్లయివుకు అప్పగించి, ముషిరాబాదుకు పలాయనం చిత్తగించాడు. 1757 జనవరి 2వ తేదిన క్లయివు కలకత్తాను స్వాధీనం చేసుకున్నాడు. ఈ వాతావరణాన్ని గమనించి దర్బారులోని కుట్రదారులు సిరాజుద్దౌలాకు నచ్చచెప్పి, ఆయనను కలకత్తాకు తొడ్కోనిపోయి, 1757 ఫిబ్రవరి 9వ తేదిన ఆంగ్లేయులతో ' అలీనగర్ సంధి ' పత్రాల మీద సంతకాలు చేయించారు.

ఆ సమయంలో అంతర్జాతీయంగా ఫ్రెంచ్-ఇంగ్లీషు వారి మధ్య ఏడు సంవత్సరాల యుద్ధం ప్రారంభమైంది. ఆ కారణంగా భారత దేశంలోని ఫ్రెంచ్ మరియు ఆంగ్లేయుల మధ్య సహజంగా యుద్ధ వాతావరణం నెలకొంది. ఆ సమయంలో చంద్రనాగూరులోని ఫ్రెంచ్ స్థావరం మీద క్లయివు దాడికి సన్నాహాలు ప్రారంభించాడు. చంద్రనాగూరుకు సమీపంలో ఉన్న సిరాజుద్దౌలా సైనికాధికారి నందకుమార్ కుట్రపూరితంగా వ్యవహరించి, ఆంగ్లేయుల దాడిని ఆపేందుకు ఏ ప్రయత్నమూ చేయకుండా, కంపెనీ అధికారుల నుండి లంచాలు మింగి మిన్నకుండి పోయాడు. ఆ కారణంగా క్లయివు ఫ్రెంచివారిని అక్కడ నుండి తరిమి వేయగలిగాడు. ఆ దాడిలో పరాజితులైన ఫ్రెంచ్ సైనికాధికారులు సిరాజుద్దౌలా శరణు కోరగా, ఆయన వారికి ఆశ్రయం కల్పించాడు. ఈ విషయం తెలుసుకున్న క్లయివు ఫ్రెంచ్‌వారిని తరిమివేసినట్టయితే, సిరాజ్‌కు సైనిక సహకారం అందించేందుకు సిద్ధమని ప్రకటించాడు. స్వలాభం కోసం ఆశ్రితులను పరిత్యాగం చేయటం సరికాదని భావించిన





సిరాజుద్దౌలా అందుకు నిరాకరించి, ఈ చర్య వలన ఎదురయ్యే పరిణామాలను ఎదుర్కొనేందుకు సిద్ధమయ్యాడు.

బెంగాలు నవాబు మీద సంపూర్ణ యుద్ధం ప్రకటించేందుకు సాకు కోసం ఎదురు చూస్తున్న ఆంగ్లేయులకు, ఫ్రెంచ్ అధికారులకు సిరాజుద్దౌలా ఆశ్రయం కల్పించటం అవకాశంగా కన్పించింది. అంతర్జాతీయ పరిణామాల దృష్ట్యా ఫ్రెంచ్ వారి స్నేహంతో సిరాజుద్దౌలా పటిష్టపడితే ముప్పుతప్పదని క్లయివు భావించాడు. అపార సేనావాహిని గల సిరాజుద్దౌలాను యుద్ధంలో పరాజితుడ్ని గావించటం సాధ్యం కాదని గ్రహించిన క్లయివు తనదైన శైలిలో కుయుక్తులకు శ్రీకారం చుట్టాడు. సంపన్న వ్యాపారి ఓమిచంద్‌ను (Omichand) సిరాజుద్దౌలా వ్యతిరేకులను ఏకం చేసేందుకు మధ్యవర్తిగా ప్రయోగించాడు. అటువంటి అవకాశం కోసం ఎదురు చూస్తున్న బెంగాల్ సర్వసేనాని మీర్‌జాఫర్, ప్రముఖ వ్యాపారుల కూటమి ప్రతినిధులు మానిక్ చాంద్, బ్యాంకర్ జగత్ సేథి, రాయ్‌దుర్లభ్ తదితరులు చివరకు ఆంగ్లేయులతో చేతులు కలిపారు. ఈ మేరకు జూన్ 10వ తేదిన రాతపూర్వక ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం ప్రకారంగా సిరాజుద్దౌలాకు చెందిన అపార ధనరాసులను కుట్రదారులు అంతా కలసి పంచుకొనటమే కాకుండా, అత్యధిక బాగం క్లయివుకు ఇవ్వాలని, మీర్‌జాఫర్‌ను బెంగాలు నవాబు చేయాలని అంగీకరించారు.

ఈ విషయాలేవీ తెలియని సిరాజుద్దౌలా ఇంకా మీర్‌జాఫర్, కుట్రదారులైన ఇతర అధికారులు, దర్బారు ప్రముఖుల మీద ఆధారపడ్డాడు. ఆ ముఠా సలహా మేరకు ఫ్రెంచ్‌వారిని తన ఆశ్రయం నుండి పంపివేశాడు. ఆ సమయంలో జరుగుతున్న కుట్రనూ, క్లయివు ఎత్తులనూ వివరించి, రానున్న పెనుముప్పు గుర్తించి జాగ్రత్త పడాల్సిందిగా ఫ్రెంచ్ అధికారులు సిరాజుద్దౌలాను హెచ్చరించారు. నవాబు స్వజనులను ఎక్కువగా నమ్మాడు. మీర్ జాఫర్‌ను జూన్ 15వ తేదిన కలసి శత్రువును తునుమాడటంలో తోడుగా నిలవమని కోరాడు. ఈ సందర్భంగా అద్భుతంగా నటించిన మీర్‌జాఫర్ ఆంగ్లేయులను తరిమి కొడతానని ' ఖురాన్ గ్రంథం ' మీద ప్రమాణం చేసి భరోసా కల్పించాడు.

స్వజనుల మీదా, తన అపార సైనిక బలం మీదా నమ్మకం గల సిరాజుద్దౌలా ఇక రణం తప్పదనీ, విదేశీ ముష్కరులకు రణభూమిలో మాత్రమే బుద్ధి చెప్పాలనీ, తన 50 వేల సేనతో బయులుదేరి **ప్లాసీ** అను గ్రామం వద్దకు చేరుకున్నాడు. యుద్ధానికి సిద్ధంగా ఉన్న క్లయివు జూన్ 23వ తేది నాటికి ప్లాసీ సమీపాన గల మామిడి తోట వద్దకు తన సేనలతో చేరుకున్నాడు. నవాబు వెంటనున్న సేనావాహిని గురించి వివరాలు అందుకున్న క్లయివు తొలిదశలో భయపడ్డాడు. రణభేరి మ్రోగించడానికి సాహసించలేక పోయాడు. స్వప్రయోజనాల కోసం ఎంతటి నైచ్యానికైనా సిద్ధపడగల కుట్రదారుల బలహీనతలను

గమనించిన ఆంగ్ల అధికారి Major Eyre Coote క్లయివును ముందుకు సాగమని సలహా ఇచ్చాడు. ఆ సలహ మేరకు క్లయివు ముందడుగు వేశాడు.

భారతదేశ భవిషత్తును నిర్దేశించిన ' ప్లాసీ యుద్ధం ' 1757 జూన్ 23వ తేది ఉదయం ప్రారంభమైంది. ఒకవైపు మీర్ జాఫర్, రాయ్ దుర్లభ్ అపార సేనావాహినితో, మరో వైపు సిరాజుద్దౌలాకు అత్యంత విశ్వాసపాత్రులు మోహన్ లాల్, మీర్ మదన్ తమ సేనలతో యుద్ధరంగంలో నిలిచారు. ఆంగ్లేయులను తరిమికొట్టాలని ఉవ్విళ్ళూరుతున్న యువ నవాబు సమర శంఖారావం పూరించాడు. సిరాజుద్దౌలాకు అత్యంత సన్నిహితుడైన మీర్ మదన్ దళాలు కీలకమైన ప్రాంతంలో మాటు వేసి శత్రువు మీద ఫిరంగులతో అగ్నిగోళాలను విసరసాగాయి. ఆ దెబ్బకు తట్టుకోలేక అరగంటలో క్లయివు తన సేనలతో మామిడి తోపు చాటుకు తప్పుకున్నాడు. సిరాజుద్దౌలా సేనలకు ఎదురు నిలచి పోరాడటం సాధ్యంకాదని భావించిన క్లయివు 11 గంటల ప్రాంతంలో మళ్ళీ నూతన రణతంత్రంతో యుద్ధరంగంలోకి ప్రవేశించాడు. ఆ సమయంలో సమరోత్సాహంతో ముందుకురికి పోరాడుతున్న సేనాని మీర్ మదన్ తీవ్రంగా గాయపడి కన్నుమూసాడు. అ వీరుని మరణంతో సిరాజుద్దౌలా సేనలు ఖంగుతిన్నాయి.

కుట్రదారులు మీర్ జాఫర్, రాయ్ దుర్లభ్ మాత్రం తమ అపార సేనలతో చోద్యం చూస్తున్నట్టు రణభూమికి దూరంగా ఉండిపోయారు. శత్రువులను భీతావహుల్ని చేస్తున్న మరో సేనాని మోహన్ లాల్ ఆంగ్ల సేనల మీద విరుచుకపడుతూ కలకలం రేపుతున్నాడు. ఆ కీలక సమయంలో మీర్ జాఫర్ నాయకత్వంలోని బలగాలను శత్రువుకు అభిముఖంగా ముందుకు ఉరికించమని సిరాజుద్దౌలా సర్వసైన్యాధిపతి మీర్ జాఫర్‌ను కోరాడు. నవాబు అదేశాలకు భిన్నంగా మీర్ జాఫర్ ప్రవర్తించాడు. శత్రువు భయకంపితుడు అవుతున్న సమయంలో ముందుకు ఉరుకుతున్న మోహన్‌లాల్‌కు తోడుగా నిలవటం కాకుండా, అతడ్ని తన బలగాలతో వెనక్కు రమ్మని అదేశించాల్సిందిగా నవాబుకు మీర్ జాఫర్ సలహా ఇచ్చాడు. ఆ సలహా నచ్చని వీరయోధుడు మోహన్‌లాల్, శత్రువును తరిమి కొడుతూ చాలా ముందుకు వెళ్ళిన సైన్యాన్ని వెనకుకకు పిలవటం నష్టదాయకం కాగలదని నవాబుకు హెచ్చరించాడు. సర్వ సేనాని మీర్ జాఫర్ మాటకు మాత్రమే సిరాజుద్దౌలా విలువనిచ్చాడు. అవిక్రమ పరాక్రమంతో పోరాడుతున్న మోహన్‌లాల్ వెనుకకు తప్పుకోవటం, పోరాడుతున్న సేనలు అకస్మికంగా తిరుగు ముఖం పట్టడంతో సైన్యంలో అయోమయ పరిస్థితి ఏర్పడింది.

ఆ అదను చూసి ఆంగ్లేయులు ఫిరంగులతో దాడిని మరింత ఉధృతం చేశారు. ప్రతిదాడి చేసేందుకు స్వామి భక్తిపరులైన మోహన్‌లాల్, మీర్ మదన్ లాంటి యోధులు సిరాజుద్దౌలాకు కరువయ్యారు.ఆ సమయంలో కురిసిన వర్షం వలన ఫిరంగులు,





మందుగుండు తడిసిపోవటంతో, ముందుకు వస్తున్న శత్రువును నిలువరించడానికి వీలుకాని ప్రతికూల పరిస్థితులు ఎదురయ్యాయి. పోరు సాగిస్తున్న తమను సేనాధిపతులే వెనక్కు తగ్గమని కోరటం, స్వయంగా తమ నాయకులు రణభూమిని విడిచిపెట్టటం, సర్వసేనాని మీర్ జాఫర్, రాయ్ దుర్లభ్ సైన్యాలు రణభూమికి దూరంగా నిలబడి చోద్యం చూడటంతో నవాబు సైన్యంలో భయోత్పాతం కలిగింది. ఏ జరుగుతుంతో తెలియని అయోమయ పరిస్థితిలో ఎటుపడితే అటు సైనికుల పలాయనం చిత్తగించసాగారు. ఈ పరిస్థితులను చూస్తూ నిలుచున్న మీర్ జాఫర్, రాయ్ దుర్లభ్ సేనలు తమ కత్తులను ఒరల నుండి తీయకుండానే యుద్ధభూమిని విడిచిపెట్టాయి. నవాబు సేనలన్నీ రణభూమి విడిచి పెట్టగా, చివరకు నవాబు అంతరంగిక సేనలు, సేవకులు కూడా ఆయనను వదలిపెట్టి వెళ్ళిపోయారు. ఈ విషయం తెలుసుకున్న సిరాజుద్దౌలా ఆశ్చర్యపోయాడు.

ఈ గందరగోళ పరిస్థితులలో రణభూమిలో ఉండటం క్షేమం కాదని సన్నిహితుల సలహా మేరకు సిరాజుద్దౌలా రాజధాని నగరం ముషీరాబాదుకు బయలుదేరాడు. రాత్రంతా ప్రయాణించి రెండవ రోజు అనగా జూన్ 24వ తేది తెల్లవారుజామున నగరానికి చేరుకున్నాడు. ఆపాటికి నవాబు పరాజయ వార్తలు, సైన్యం రణభూమి విడిచి పారిపోయిన సంగతి నగరానికి చేరుకున్నాయి. అపార సేనావాహిని పరాజయ భారంతో వెనక్కు మరలటం వలన నగరవాసులలో భయోత్పాతం కలిగింది. నగరం చేరుకున్న సిరాజుద్దౌలా పరిస్థితులను చక్కబెట్టేందుకు విఫలప్రయత్నాలు చేశాడు. అత్యున్నత స్థాయి అధికారి నుండి క్రింది స్థాయి అధికారి వరకు ఆంగ్లేయుల ప్రలోభాలకు లొంగి, కుట్రలో భాగస్థులు అయినందున ఎవ్వరూ కూడా ఆ యువ నవాబుకు సహకరించలేదు. ఆఖరి నిమిషంలో ప్రమాదాన్ని గ్రహించిన సిరాజుద్దౌలా గత్యంతరం లేని పరిస్థితులలో భార్య లుత్‌ఫున్నీసా, విశ్వాసపాత్రుడైన మరొక సేవకుడ్ని వెంటపెట్టుకుని అంతఃపురం నుండి బయటపడ్డాడు.

జూన్ 25వ తేదిన మీర్ జాఫర్ ముషీరాబాదు చేరుకున్నాడు. కొంతకాలం తరువాత క్లయివు కూడా ముషీరాబాదుకు విచ్చేసి, మీర్ జాఫర్‌ను బెంగాలు సుబేదారుగా ప్రకటించి, ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల ఆదేశాలకు అనుగుణంగా నడుచుకోవాలని ఆజ్ఞాపించాడు. బెంగాలు సింహాసనం సంపాదించి పెట్టిన క్లయివుకు మీర్‌జాఫర్ సాష్టాంగపడుతూ 24పరగణాలను బహుమతిగా అతని స్వంతం చేశాడు. ఈ కుట్రకు సూత్రధారి అయినందుకు క్లయివు మరో 21 లక్షల రూపాయలను తన వాటాగా పుచ్చుకున్నాడు. ఈ సందర్భంగా ఓమిచందన్‌ను బెదిరించి కుట్ర ప్రతిఫలంలో అతనికి భాగం ఇవ్వాల్సింది పోయి, అతని నుండి 20 లక్షల రూపాయలను క్లయివు రాబట్టుకున్నాడు. కుట్రదారులకు సంధానకర్తగా వ్యవహరించిన స్వామిద్రోహికి తగిన శాస్తి జరిగింది.

మీర్ జాఫర్ బెంగాలు నవాబు కాగానే పోటీదారులను తన మార్గం నుండి తొలగించుకునే ప్రయత్నాలు ఆరంభించాడు. ఘసిటీ బేగంను జైల్లో పడేశాడు. ఓ రాత్రిపూట మరో జైలుకు తరలిస్తుండగా పడవ నీటమునిగి అమె చనిపోయిందని ప్రకటించి చేతులు దులుపుకున్నాడు. అంతఃపురం నుండి బయటపడి తప్పించుకున్న సిరాజుద్దౌలాను మీర్ జాఫర్ కుమారుడు మీర్ మిరాన్ వెంబడించి, పట్టుకుని బంధించి ముషీరాబాదుకు లాక్కొచ్చి, దర్బారులో నిలబెట్టగా మీర్ జాఫర్ అతనికి మరణదండన విధించాడు. ఆ ఆదేశాల మేరకు 1757 జూలై 2వ తేదిన మీర్ మిరాన్ కత్తి వేటుకు సిరాజుద్దౌలా శిరస్సు తెగి రాజభవన ప్రాంగణంలో దొర్లిపడింది. ఆ తరువాత సిరాజుద్దౌలా మృతదేహాన్ని ఎనుగు మీద వేలాడదీసి నగర వీధుల్లో ఊరేగించారు. ఈ దారుణ దృశ్యాన్ని చూసి సహించలేకపోయిన సిరాజుద్దౌలా తల్లి అమీనా బేగం నడిబజారులోకి వచ్చి తన బిడ్డ భౌతికకాయాన్ని ఊరేగిస్తూన్న మత్తగజానికి అడ్డంగా నిల్చొని విలవిలలాడినా ఫలితం లేకుండా పోయింది.

ఆంగ్లేయుల పెత్తనాన్ని ఏమాత్రం సహించని యువ స్వదేశీపాలకుడిగా,బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాటం చేసిన తొలినాటి ప్రభువుగా బెంగాలు నవాబు సిరాజుద్దౌలా చరిత్ర పుటలలోకి ఎక్కాడు. బ్రిటీషర్ల ఆధిపత్యాన్ని ఏమాత్రం సహించక పోరాటం జరిపి,**' భారత స్వాతంత్ర్య సాయుధ సమరేతిహాసంలో అరుణపుటల్ని తెరిచిన '** తొలినాటి స్వదేశీపాలకుడిగా నూనూగు మీసాల సిరాజుద్దౌలా ఖ్యాతిగడించి అమరుడయ్యాడు.

సిరాజుద్దౌలాను అంతం చేసి శత్రుశేషం లేకుండా చేసుకున్నాక, ఆ ఆనందం పట్టలేక, స్వదేశీ సైన్యాధికారులు, కుట్రలో భాగస్వాములైన బడా మార్వారి వ్యాపారులంతా, జగత్ సేథి భవంతిలో పండుగ జరుపుకున్నారు. ఆ సమయంలోనే క్లయివుకు జగత్ సేథికి, ఇతర కుట్రదారులకు మధ్యవర్తిగా వ్యవహరించిన ఓమిచంద్ తనను క్లయివు ఏ విధంగా మోసగించింది వెల్లడించాడు. (It is to the Seth's house that victorious commanders adjourned to celebrate the victory and it was there that Omi Chand was told that he had been cheated ' . – *A Survey of Indian History*, KM Panikkar, 1977, page 216 )

ఈ యుద్ధంలో క్లయివు సైన్యంలో మొత్తం 3వేల రెండు వందల మంది ఉన్నారు. వీరిలో 950 మంది అంగ్ల సైనికులు, 150 మందితో 10 ఫిరంగులు గల ఫిరంగిదళం, 2వేల వంద మంది భారతీయ సైనికులు పాల్గొన్నారు. సిరాజుద్దౌలా సైన్యంలో 50 జతల ఎడ్ల ఏర్పాటు కలిగిన ఫిరంగుల దళం,50 వేల కాల్బలం, 18వేల అశ్విక దళాలు ఉన్నాయని 1944 లో E.Marsden అను ఆంగ్ల రచయిత రాసిన *History of India* అను గ్రంథం, Dr. Tara Chand గ్రంథం History of the Freedom Movement In India ద్వారా తెలుస్తుంది. ఈ యుద్ధంలో 23 ఆంగ్ల సైనికులు చంపబడ్డారు. గాయపడిన వారిలో 13 మంది ఆంగ్ల సైనికులు, 36 మంది భారతీయ సిపాయిలు మాత్రమే ఉండటం విశేషం.








ఈ యుద్ధ విజయాన్ని **అతి తక్కువ నష్టంతో ఆంగ్లేయులు గెలుచుకున్న అతి విలువైన విజయం**గా ప్రముఖ చరిత్రకారుడు డాక్టర్ తారాచంద్ అభివర్ణించాడు. ఈ యుద్ధం భారత దేశ ముఖచిత్రాన్ని మార్చివేసిన అనేక పరిణామాలకు కారణమైందని డాక్టర్ తారా చంద్ అన్నాడు. భారత దేశ చరిత్రకు సంబంధించిన ఈ విషాద సంఘటన ప్రభావాన్ని ప్రస్తావిస్తూ, **భారత దేశానికి అంతమెరుగని విషాద కాళరాత్రి దాపురించింది**, అని బెంగాలీ కవి నవీన్ చంద్ర సేన్ అభివర్ణించాడు. ◆



### పరాయి పాలనాధికారుల దోపిడీని ఎదుర్కొన్న యోధుడు

# 02. మీర్ ఖాశిం

భారతదేశ చరిత్రను మలుపులు తిప్పిన ప్రధాన సంఘటనలలో **ప్లాసీ యుద్ధం** ప్రథమ స్థానం పొందగా **బక్సార్ యుద్ధం** ద్వితీయ స్థానంలో నిలుస్తుంది. ప్లాసీ యుద్ధం కుట్రలు-కుయుక్తులకు ఆలవాలం కాగా, బక్సర్ యుద్ధం వీరోచిత పోరాటానికి ప్రతిబింబం. ప్లాసీ యుద్ధంతో పట్టు సంపాదించిన ఆంగ్లేయ వర్తకులు, అధికారులు దురాశాపరులై స్వదేశీ వర్తకాన్ని తునాతునకలు చేస్తూ, అన్ని అపసవ్య, అక్రమ మార్గాలకు పాల్పడుతూ స్వదేశీయులను దోచుకోవటం ప్రారంభించారు. ఈ పరిస్థితులకు కలత చెంది, పరాయి దేశస్థులను శాశ్వతంగా ఈ గడ్డ మీద నుంచి తరిమికొడితే గాని దోపిడి నుండి విముక్తి లభించదని భావించి, రాజ్యక్షేమం, ప్రజల సౌభాగ్యం ఆకాంక్షిస్తూ, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల మీద సమర శంఖారావాన్ని పూరించి, చివరి వరకు పోరుబాటలో నడిచాదొక యోధుడు. ఆ అలుపెరుగని వీరుడు బెంగాలు నవాబు మీర్ ఖాశిం.

ప్లాసీ యుద్ధంలో సిరాజుద్దౌలా పరాజితుడయ్యాక, ఆంగ్లేయులతో చేతులు కలిపి నమ్మకద్రోహానికి పాల్పడిన మీర్ జాఫర్‌కు బెంగాలు నవాబు పదవి దక్కినా, ఈస్ట్ ఇండియా కంపెనీ కనుసన్నల్లో నడుచుకునే కీలుబొమ్మ మాత్రమేనని అతిత్వరలోనే గ్రహించాడు. ఆయన అభిప్రాయాలకు అనుగుణంగా నడుచుకోని దివాన్ రాయ్‌దుర్లభ్, బీహార్ గవర్నర్ రామ నారాయణలను క్లయివు వెనుకేసుకుని వచ్చి వారి మీద చర్యలు తీసుకోనివ్వలేదు. ఆయన





పెత్తనాన్ని సాగనివ్వకుండటమే కాకుండా, ఆయన నుండి అందినంత దోచుకోవటం ప్రారంభించారు. కల్నల్ మాలెసన్ చెప్పినట్టుగా, ' అందినంత మట్టుకు డబ్బు దోచెయ్యటం, ఇష్టమొచ్చినప్పుడల్లా చేతులు దోపి దోసిళ్ళతో డబ్బు బైటకి తీసి బంగారు గోనె సంచిలా మీర్ జాఫర్‌ను వాడుకోవటం కంపెనీ అధికారుల ఏకైక లక్ష్యం ' అయిపోయింది (ఆధునిక భారత చరిత్ర, బిపిన్ చంద్ర, HBT, 2000, పేజీ54).

బెంగాలు కిరీటాన్ని తనకందించిన క్లయివును ఎదిరించే శక్తి చాలక, ఆంగ్లేయులకు శత్రువులైన డచ్‌వారితో స్నేహం ప్రారంభించి, వారి సహాయంతో కంపెనీ అధికారుల పెత్తనానికి గండి కొట్టాలనుకున్నాడు. ఆ విషయం పసికట్టిన క్లయివు ఆరంభంలోనే ఆ ప్రయత్నాలను నిర్వీర్యం చేయటమేకాకుండా, డచ్‌వారిని చిత్తుచిత్తుగా ఓడించి, బెంగాలు మీద తిరుగులేని అధిపత్యాన్ని నెలకొల్పాడు. కంపెనీకి చెల్లించాల్సిన బకాయిలను సకాలంలో చెల్లించక పోవటంతో, అప్పటికే అతని మీద గుర్రుమంటున్న ఆంగ్లేయులు మీర్ జాఫర్‌ను అసమర్థునిగా పరిగణించారు. చివరకు అతనికి ఉద్వాసన పలికేందుకు రంగం సిద్ధమైంది. మీర్ జాఫర్ కుమారుడైన మీర్ మిరాన్ మరణించడంతో, మీర్ జాఫర్‌ను గద్దె దింపితే ఆయన వారసుడు ఎవరు? అను ప్రశ్న కంపెనీ పాలకులకు ఎదురయ్యింది.

ఆ సమయంలో బెంగాలు అధికార రాజకీయాలలో మంచి పేరుప్రతిష్టలు, ప్రజలలో మంచి ఆదరణ ఉన్న మీర్ ఖాశిం పేరు రంగం మీదకు వచ్చింది. మీర్ జాఫర్‌కు మీర్ ఖాశిం స్వయాన అల్లుడు. మీర్ ఖాశింను బెంగాలు గద్దె మీద కూర్చోపెట్టాలని ఆంగ్ల గవర్నర్ వాన్సిటర్ట్ (Vansittart) నిర్ణయించాడు. ఈ మేరకు 1760 సెప్టెంబరు 27వ తేదిన ఆ ఆంగ్ల అధికారి, మీర్ ఖాశిం మధ్యన అంగీకారం కుదిరింది. ఆ అంగీకారం ప్రకారం మీర్ ఖాశింకు ఆంగ్లేయులు డిప్యూటీ సుబేదారు పదవి సంక్రమింపచేశారు. ప్రతిఫలంగా మీర్ ఖాశిం బకాయిల తక్షణ చెల్లింపుకు, బరద్వాన్, మిడ్నాపూరు, చిట్టగాంగ్ జిల్లాలను కంపెనీ పరం చేయడానికి ఒప్పుకున్నాడు. అనంతరం మీర్ ఖాశింను నవాబుగా ప్రకటించారు.

ప్లాసీ యుద్ధం విజయంతో కంపెనీ గుమాస్తాలు, దస్తావేజుల రాతగాళ్ళు, వర్తకులు అపరిమిత అధికారాలు గల కంపెనీ అధికారులైపోయారు. ఈ వర్గీయులందరికి చాల తక్కువ జీతాలు ఇస్తున్న కారణంగా, ఆదాయం కోసం ప్రైవేటుగా వ్యాపారాలు చేసుకోనిచ్చారు. ఈ అధికారాలను ఉపయోగించి స్వదేశీ వ్యాపారులను, ఇతర పోటీదారులనూ వ్యాపారరంగం నుండి తరిమివేశారు.నవాబుకు వ్యాపార సుంకాలను,రవాణా భద్రత ఖర్చులను కూడా చెల్లించ నిరాకరించారు. వ్యాపార అనుమతులను, రాయితీలను అత్యధిక మొత్తాలకు స్వదేశీ వర్తకులకు విక్రయించటం ఆరంభించారు. కంపెనీ ఉద్యోగులు

క్రయవిక్రయాలు జరిపే సరుకుతో స్థానికులు వ్యాపారాలు చేయరాదని అక్రమ ఆంక్షలు విధించారు. తమకు కల్పించిన సౌకర్యాలు, రాయితీలు స్వదేశీ వ్యాపారులకు, ఉత్పత్తిదారులకు నిషేదించాలని ఒత్తిడి ప్రారంభించారు. రైతుల నుండి, ఉత్పత్తిదారులను నుండి తమకు ఇష్టమైన సరుకును బలవంతంగా అతి తక్కువ ధరలకు కొనుగోలు చేస్తూ, తమ సరుకును అత్యంత ఎక్కువ ధరకు నిర్బంధంగా అంటగట్టటం ఆరంభించారు. ప్రజల కనీస అవసరాలు తీర్చే అన్ని వస్తువుల క్రయవిక్రయాల మీద గుత్తాధిపత్యాన్ని ఏర్పర్చుకున్నారు. ప్రజల నుండి కరువు ధరలంటూ ఎక్కువ ఖరీదును వసూలు చేయసాగారు. సుంకాలు, జరిమానాల స్వదేశీయుల నుండి బలవంతపు వసూళ్ళు ఆరంభించారు. అత్యధిక వడ్డీ రేట్లతో స్వదేశీ సంపన్నులకు, కులీనవర్గాలకు అప్పులు ఇవ్వసాగారు. ఈమేరకు తమ అదాయాలను వివిధ అక్రమ పద్దతుల ద్వారా పెంచుకోసాగారు. ఈ విషయాలను డాక్టర్ తారాచంద్ సవిస్తారంగా తన గ్రంథం *(History of The Freedom Movement*, Vol.1 , పేజీ 236) లో వివరించారు.

బ్రిటీషు వారు బెంగాలు విజయంతో విర్రవీగుతూ, ప్రజల జీవన వ్యవహార రంగాలన్నిటిలో చొచ్చుకురాసాగారు. క్లయివు ప్రారంభించిన ధనసంచయాన్ని కొనసాగిస్తూ, కంపెనీ అధికారులు, ఉద్యోగులు కూడా వర్తక-వాణిజ్యాలను ప్రారంభించి, ఇష్టారాజ్యంగా ప్రవర్తించసాగారు. ఈ అనుచిత ప్రవర్తన వలన స్వదేశీ వర్తకం ఇబ్బందుల్లో పడింది. రైతులు, వర్తకులు, ఉత్పత్తిదారులు ఇక్కట్లు పడసాగారు. కంపెనీ అధికారులు, ఉద్యోగులు ఆడింది ఆటయ్యింది. ప్రజలు అధికారుల అనుచిత ఆజ్ఞలను పాటించాల్సి వచ్చింది. కంపెనీ అధికారుల, ఆంగ్ల ఉద్యోగుల, వర్తకుల చిత్తానికి వ్యతిరేకంగా వ్యవహరించటం ప్రాణాంతకంగా మారింది. ఆంగ్ల అధికారుల పెత్తనాన్ని ఈషణ్మాత్రం నిరసించినా ప్రజలకు ముళ్ల కొరడాలతో దెబ్బలు, జైలుశిక్షలు, చిత్ర హింసలు అనివార్యమయ్యాయి.

ఆనాడు కంపెనీ అధికారులు, ఉద్యోగులు అందినంత దోచుకుంటున్న తీరును వారిలోని అత్యాశను బ్రిటీషు చరిత్రకారుడు ఎడ్వర్డ్ థాంప్సన్, జి.టి గారెట్‌లు ఇలా వర్ణించారు. **' ఒక తిరుగుబాటుని ప్రేరేపించటమన్నది ప్రపంచంలో అతి గొప్ప లాభసాటి వ్యాపారంగా తేలిపోయింది. కార్టెజ్, పిరారోల యుగంలో స్పెయిన్ వాసుల్ని ఆవహించిన హిస్టీరియా తరువాత చరిత్రలో కనీవినీ దారుణ ధనదాహం ఇంగ్లీషు వాళ్ళ మనస్సుల్లో నిండిపోయింది. ముఖ్యంగా బెంగాల్ నెత్తురునంతా పూర్తిగా పీల్చేసే దాకా అక్కడ శాంతి అనేది ఉండబోదు'**. (*ఆధునిక భారత చరిత్ర*, బిపిన్ చంద్ర , HBT, 2000, పేజీ 54).

బెంగాలు నవాబుగా అధికారాలను చేపట్టగానే మీర్ ఖాశిం స్వతంత్రంగా వ్యవహరించ సాగాడు. ప్రజల హితవుకు భిన్నంగా సాగుతున్న పరిస్థితులను గమనించి





సహించలేకపోయాడు. స్వదేశీ వర్తకుల, ప్రజల మేలుకోరుతూ ఆంగ్లేయుల వర్తకులను ప్రభావితం చేసే పలు చర్యలను తీసుకున్నాడు. స్వదేశీ వర్తక-వ్యాపారాలు దివాళా తీసేపరిస్థితికి నెట్టబడటం సహించలేకపోయాడు. ఇక మిన్నకుంటే లాభంలేదనుకున్న మీర్ ఖాశిం కంపెనీ అధికారులు, ఉద్యోగుల నిర్వాకాన్ని ఎండగడ్తూ కంపెనీ ఉన్నతాధికారుల కౌన్సిల్‌కు 1762 మే నెలలో ఓ లేఖ రాశాడు.

ఆ లేఖలో, మీ అధికారులు తమ అనుచిత ప్రవర్తనతో నా దేశంలో కల్లోలం సృష్టిస్తున్నారు. ప్రజలను దోచుకుంటున్నారు. నా ఉద్యోగులను లెక్కచేయటం లేదు. కంపెనీ అనుమతులను చూపుతున్నారు. నా ప్రజలను, రైతులను, వ్యాపారులను వేధిస్తున్నారు. ప్రతి కర్మాగారం, గ్రామం నుండి అసలు విలువలో నాల్గోవంతు ఖరీదు మాత్రమే చెల్లించి వ్యాపారుల నుండి, ప్రజల నుండి సరుకును బలవంతంగా ఎత్తుకుపోతున్నారు. ఒక రూపాయి మాత్రమే విలువచేసే తమ వస్తువులను ఐయిదు రూపాయలకు మా వ్యాపారులకు, రైతులకు నిర్బంధంగా అంటగడుతున్నారు. ఈ వ్యవహారానికి అంగీకరించని రైతుల మీద హింసకు పాల్పడుతున్నారు. నా ఉద్యోగుల అధికారాలను చెల్లనివ్వటం లేదని, మీర్ ఖాశిం పేర్కొన్నాడని, ఆంగ్ల రచయిత Philip Woodruff తన పుస్తకం (*The Men Who Ruled India : The Founders*, Page 106) లో పేర్కొన్నారని డాక్టర్ తారాచంద్ తన గ్రంథం *History of The Freedom Movement In India* Vol.1, Page 236 లో ఉటంకించారు.

ఆ వివరణ ఆంగ్లంలో ఈ విధంగా సాగుతుంది, '...this is the way your gentlemen behave ; theymake a distrubance all over my country, plunder the people, injure and disgrace my servants...setting up the clolours and shwoing the passes of the Company, they use their utmost endeavours to oppress the peasants, merchants, and other people of country... In every village and in every factory they buy and sell salt, betel-nut, rice, straw, bamboos, fish, gunnies, ginger, sugar, tabacco, opium and many other things... They forcibly take away the goods and commidities of peasants, merchants. etc., for a fourth part their value, and by ways of violence and oppression they oblige the peasants to give five rupees for goods which are worth but one rupee ; and for the sake of five rupees they bind and disgrace a man who pays a hundred rupees in land tax ; and they allow not any authority to my servants...'

ఆంగ్ల వర్తకుల, అధికారుల దాష్టీకాలను, ప్రజల కడగండ్లను, *A History of England in the Eighteenth Century* Vol.IV Page 263 లో, ' Never before has the natives experinced a tyranny which was at once so skilful, so searching and so strong ' అని రచయిత W.E.H Lecky వర్ణించాడని డాక్టర్ తారా చంద్ పేర్కొన్నారు. ఆ పరిస్థితుల గురించి W.E.H Lecky మరింత వివరణ ఇస్తూ, ఒకనాడు

ప్రజలతో కిక్కిరిసి కన్పించిన జిల్లాలు నిర్మానుష్యమయ్యాయి. ఆంగ్ల వర్తకుల జాడ కన్పించగానే గ్రామాలు ఖాళీఅయ్యేవి, దుకాణాలు బందయ్యేవి అన్నాడు. భయకంపితులైన ప్రజలు రహదారుల మీద దర్శనమిచ్చేవారని,( Whole districts which had once been populous and floursing were at last utterly depopulated, and it was noticed that on the appearance of a party of English merchants the villagers were at once deserted, and the shops shut, and the roads thronged with panic-sticken refujees ' - *A History of England in the Eighteenth Century*, W.E.H Lecky, 264 ) W.E.H Lecky రాశాడు.

మీర్ ఖాశిం ఎన్ని లేఖలు రాసినా ఎటువంటి ఫలితం కన్పించకపోగా, ఆంగ్లేయుల దోపిడీ, వేధింపులూ మరింత పెరిగాయి. ఓర్పు పూర్తిగా నశించటంతో గత్యంతరం లేని పరిస్థితులలో కంపెనీ పాలకులతో ఘర్షణకు సిద్దపడ్డాడు. ఆ కారణంగా కంపెనీ పాలకులకు దూరంగా ఉండాలన్న ఉద్దేశ్యంతో 1762లో రాజధానిని ముషీరాబాదు నుండి మాంఘీర్ (Monghyr) కు మార్చాడు. ఈ అవాంఛనీయ వాతావరణాన్ని తొలగించేందుకు గవర్నర్ వాన్సిటర్ట్ 1762 చివర్లో మాంఘీర్ వచ్చి మీర్ ఖాశింతో చర్చించి ఓ అంగీకారానికి వచ్చారు. అయితే ఆ ఒప్పందాన్ని కంపెనీ తిరస్కరించింది.

గత్యంతరం లేని పరిస్థితులతో స్వదేశీ వర్తకాన్ని పరిరక్షించుకుని, ఉత్పత్తిదారులను, రైతులను కాపాడుకునేందుకు అన్ని రకాల సుంకాలను, రాయితీలను, ప్రత్యేక అనుమతులను పూర్తిగా రద్దుచేశాడు. ఈ చర్యలను ఆంగ్ల వర్తకులు, కంపెనీ ఉద్యోగులు వ్యతిరేకించారు. అన్ని రకాల రాయితీలు, అనుమతులు, మినహాయింపులను తమకు మాత్రమే వర్తింపచేయాలని, ఈ సౌకర్యాలను స్వదేశీ వర్తకులకు వర్తింపచేయరాదని వితండ వాదనను ముందుకు తెచ్చారు. ఈ డిమాండుకు మీర్ ఖాశిం మండిపడ్డాడు. నా దేశంలో నా ప్రజలకు సౌకర్యాలు కల్పించకుండా, మూడు వేల మైళ్ళదూరం నుండి వచ్చి అంగ్ల వర్తకుల డిమాండ్‌లను అంగీకరించాలా? అని ప్రశ్నించుకున్నాడు. ఈ నిర్ణయంతో ఆగ్రహవేశాలు వ్యక్తం చేసిన పాట్నాలోని కంపెనీ కర్మాగారం అధిపతి ఇల్లీస్ (Ellis), ఓ అడుగు ముందుకేసి, పాట్నా పట్టణాన్ని చుట్టుముట్టి స్వాధీనం చేసుకోనడానికి ప్రయత్నించాడు. ఈ ప్రయత్నాన్ని సమర్థవంతంగా మీర్ ఖాశిం తిప్పికొట్టాడు. ఆంగ్ల ముష్కర మూకలను మట్టికరిపించగా ఇల్లీసు పాట్నా వదలి పారిపోయాడు.

ఆంగ్లేయులు ప్రారంభించిన పోరాటం క్రమంగా యుద్ధం రూపు దిద్దుకుంది. ఈ పరిస్థితులను ముందుగా ఊహించి మీర్ ఖాశిం సిద్ధంగా ఉన్నాడు. 1763 జూన్ 10వ తేదిన మేజర్ ఆడమ్స్ 11వందల మంది ఆంగ్ల సైనికులు, నాలుగు వేల మంది సిపాయిలతో తరలి వచ్చి యుద్ధాన్ని ప్రారంభించాడు. మీర్ ఖాశిం 15వేల మంది సైన్యంతో రణభూమిలోకి





దిగాడు. సంఖ్యాపరంగా సైనిక బలగాలు అధికంగా ఉన్నా కూడా, ప్రత్యేక శిక్షణ పొందిన ఆంగ్ల సైన్యాన్ని ఎదుర్కోవటం స్వదేశీ సైనికులకు అసాధ్యమయ్యింది.
మీర్ ఖాశిం రణభూమి నుండి తప్పుకుని అయోధ్యకు చేరుకున్నాడు.

ఆంగ్లేయులను శాశ్వితంగా బెంగాలు, బీహార్‌ల నుండి తరిమికొట్టాలని నిర్ణయించుకున్నాడు. ఈ లక్ష్యసాధనకు తన శక్తి చాలనందున ఇతర స్వదేశీ పాలకులతో సంప్రదింపులు ప్రారంభించాడు. అయోధ్య నవాబు షుజావుద్దౌలా ( Shuja-ud-daulah) ఢిల్లీ చక్రవర్తి షా ఆలం-2 ( Shah Alam - II ) లతో మంతనాలు జరిపాడు. ఆ మంతనాల ఫలితంగా ఆంగ్లేయులను పారద్రోలాలన్న సత్సంకల్పంతో, స్వదేశీ పాలకులతో కూడిన సమాఖ్య ఏర్పడింది. స్వదేశీ ప్రభువులకు నచ్చచెప్పి యుద్ధానికి సిద్ధం చేశాడు. ఈ ప్రయత్నాన్ని ప్రసంశిస్తూ, డాక్టర్ తారా చంద్ తన గ్రంథం *History of The Freedom Movement In India* లో ' The confederacy which he brought into being against the English shows an astute diplomacy far in advance of the age and its failure was again due to the inherent defects of Indian army and State organisation ' అని పేర్కొన్నాడు. మాతృభూమి విముక్తికి కంకణం కట్టుకున్న మీర్ ఖాశిం ప్రేరణతో స్వదేశీ సైనికులు రణరంగంలో వీరవిహారం చేయటానికి ఉవ్విళూరుతున్నారు. ఉమ్మడి సేనలకు నాయకత్వం స్వీకరించి విజయం సాధించాలని పట్టుదలతో మీర్ ఖాశిం ఆలోచనలు సాగుతున్నాయి. మీర్ ఖాశిం అంటే ఆంగ్లసైనికులకు సింహస్వప్నం. ప్రత్యక్ష యుద్ధంలో విజయం కష్టంకాగలదని భావించిన కంపెనీ పాలకులు కుయుక్తులకు పాల్పడ్డారు.

ఆ కుతంత్రం వలన షుజావుద్దౌలా, ఢిల్లీ పాదుషా షా ఆలం సైన్యాలు పూర్తిగా రణరంగంలోకి దిగలేదు. సమాఖ్యలోని ఆ సభ్యులు మీర్ ఖాశింకు నైతిక మద్దతు వరకు సరిపెట్టుకున్నారు. కంపెనీ సైన్యాలు మేజర్ హెక్టార్ మన్రో (Major Hector Munro) నాయకత్వంలో రంగంలోకి దిగాయి. మీర్ ఖాశిం నాయకత్వంలో ఉమ్మడి సేనలు ఎంతగా పోరాడినా, సమన్వయం లేకపోటంతో, 1764 అక్టోబరు 22వ తేదిన మీర్ ఖాశిం బలగాలకు పరాజయం తప్పలేదు. భరత గడ్డ మీద అంతకుముందెన్నడూ జరగని రీతిలో బ్రిటీషు సైన్యాలు, స్వదేశీ బలగాల మధ్య జరిగిన ఈ యుద్ధం బక్సార్ (Buxar) వద్ద జరగటంతో చరిత్రలో **బక్సార్ యుద్ధం** గా ప్రసిద్ధమైంది. ఆ తరువాత అటు ఢిల్లీ పాదుషా షా ఆలం బ్రిటీషర్ల శిబిరంలో చేరిపోయి, శాంతి ఒప్పందంతో పరాయిపాలకుల పంచన సేదతీరాడు. ఇటు అయోధ్య మీద దాడి చేసిన ఆంగ్లేయులు షుజావుద్దౌలాను పాదాక్రాంతం చేసుకున్నారు.

బెంగాలు సింహం మీర్ ఖాశిం మాత్రం శత్రువుకు లొంగకుండా రహస్య ప్రదేశాలలో సంచరిస్తూ, ఆంగ్లేయుల మీద మళ్ళీ పోరాటం చేసేందుకు విఫల ప్రయత్నాలు చేస్తూ, ఆ క్రమమంలో 1777లో ఢిల్లీ సమీపాన కన్నుమూసాడు. ◆



### ఆంగ్లేయుల తరిమివేతకు జీవితాంతం పోరాటం సాగించిన

# 03. హైదర్ అలీ

ఉత్తరాదిన ప్లాసీ, బక్సార్ యుద్ధాలతో తమ కబ్జాను పటిష్టం చేకుకుని, **బెంగాల్ దివాని** ని కూడా హస్తగతం చేసుకున్న బ్రిటీషర్లు ఆ తరువాత దక్షిణాది వైపు దృష్టి సారించారు. పరాయి గడ్డ మీద రాజ్యాధికారం రుచిమరిగిన ఆంగ్లేయ వర్తకులు తాము ఊహించని విధంగా భూసురులై, స్వదేశీ రాజులను పాదాక్రాంతం చేసుకునేందుకు ఉవ్విళ్ళూరుతున్నారు. ఈ రాజ్య విస్తరణకాంక్షను ఆదిలోనే పసిగట్టి, అన్యాక్రాంతం కానున్న మాతృభూమిని కాపాడుకునేందుకు, పరాయి పాలకులను ఆగర్భశత్రువులుగా పరిగణించి, ఆ శక్తులకు, ఆ శక్తులకు సహకరించిన వ్యక్తులూ-వ్యవస్థలకు వ్యతిరేకంగా పోరాడి శత్రుభయంకరుడిగా ఖ్యాతిగడించాడో రణరంగ ధీరుడు. అరివీర భయంకరుడుగా విశ్వరూపం చూపి బ్రిటీషర్లను హడలుకొట్టిన, ఆ మొనగాడి పేరు హైదర్ అలీ.

‘ **దక్షిణ భారతదేశ నెపోలియన్** ’ గా ఖ్యాతిగడించిన హైదర్ అలీ 1722లో ప్రస్తుత కర్నాటక రాష్ట్రంలోని దేవనహళ్ళి గ్రామంలో జన్మించారు. తండ్రి ఫతే మొహమ్మద్ అలీ, తల్లి మజిదాన్ బేగం (Majidan Begum). ఆ ప్రాంతంలోని హైదర్ అలీ దర్వేష్ ఆశీస్సుతో కలిగిన సంతానం కావటం వలన, బిడ్డకు హైదర్ అలీ అని తల్లితండ్రులు నామకరణం చేశారు. చిన్ననాటనే తండ్రి మరణించారు. స్వగ్రామం నుండి మేనమామ వెంట శ్రీరంగపట్నం చేరుకున్నారు. హైదర్ అలీ సాముగరడీలలో ప్రావీణ్యత సంపాదించాడు.





గ్రామంలో ఎటువంటి ప్రమాదం సంభవించినా ఏమాత్రం భయపడక ముందుకురికే సుగుణం వలన సాహసిగా ఖ్యాతిగాంచారు. యువకుల బృందానికి నాయకత్వం వహించి పలు సమస్యల పరిష్కారంలో పాలుపంచుకుని నాయకత్వపు లక్షణాలను పుణికిపుచ్చుకున్నాడు. ప్రజలకు సంబంధించిన అన్ని విషయాలలో క్రియాశీలకంగా స్పందించే హైదర్ అలీకి చదువు అబ్బలేదు. ఈ లోపాన్ని ఆయనకు సహజంగా అబ్బిన అద్భుత శక్తియుక్తులు పూరించాయి. ఆయనది అసాధారణ ధారణాశక్తి. సమస్యను ఇట్టే అవగాహన చేసుకోగల బుద్ధికుశలత, ధృఢ సంకల్పం, పలు పనులను ఏకకాలంలో నిర్వహించగల సామర్థ్యం, అసమాన ధైర్యసాహసాలు ఆయన సొంతం.

ఆనాడు మైసూరు రాజ్యానికి రాజు చిన్న కృష్ణరాజ్ వడయార్. ‘...18వ శతాబ్ది మొదట్లో నంజరాజ్ (సర్వాధికారి) దేవరాజ్ (దల్వాయ్) అనే ఇద్దరు మంత్రులు మహారాజయిన చిక్క కృష్ణ రాజ్‌ని కీలుబొమ్మచేసి రాజ్యాధికారాన్ని వశపర్చుకున్నారు.’ ( ఆధునిక భారత చరిత్ర, బిపిన్ చంద్ర, హెచ్.బి.టి, 2000, పేజీ 6) ఈ ఇరువురు మంత్రులు ఏకగర్భజనితులు. 1749లో జరిగిన దేవనహళ్లి ముట్టడిలో పాల్గొన్న యువకుడు హైదర్ అలీ అద్భుత ధైర్యసాహసాలను ప్రదర్శించటంతో ముగ్ధుడైన నంజరాజ్ ఆయనకు ‘ ఖాన్ ’ బిరుదుతో సత్కరించి, చిన్న సైనిక దళం నాయకుడ్ని చేశాడు. ఆ తరువాత 1750లో నిజాం నవాబు సహాయం కోసం వెళ్ళిన మైసూరు సేనలకు హైదర్ అలీ నాయకత్వం వహించాడు. ఆ రణంలో సంపూర్ణ విజయం సాధించకున్నా, ఈ సందర్భంగా లభించిన నిజాం ఖజానాలో కొంతభాగం మైసూరు రాజ్యానికి తరలించి, మిగతాది తన దేవనహళ్ళికి పంపాడు. ఆ సంపద ద్వారా స్వంత సైన్యాన్ని పటిష్టపర్చాడు. ఈ యుద్ధంలో హైదర్ అలీ ప్రదర్శించిన శక్తిసామర్థ్యాలను గుర్తించిన నంజరాజు, అతనికి పదోన్నతి కల్పించాడు. ఆ తరువాత జరిగిన తిరుచునాపల్లి ముట్టడి సమయంలో ప్రధాన పాత్ర వహించి తిరుగుబాటు కుట్రలను విచ్ఛిన్నం చేశాడు. బ్రిటీషర్ల మద్దతుతో మైసూరు మీద దాడులకు సిద్ధపడుతున్న కర్నాటక నవాబు మహమ్మద్ అలీ ప్రయత్నాలను హైదర్ అలీ గండికొట్టాడు. ఈ సందర్భంగా ఆంగ్లేయుల యుక్తులను, ఆయుధాల వినియోగాన్ని హైదర్ అలీ స్వయంగా గమనించాడు.

స్వదేశీ రాజులకు రక్షణగా ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు స్నేహహస్తం అందించటం వెనుక గల కుట్రను హైదర్ అలీ కుశాగ్ర బుద్ధి పసిగట్టింది. ఈ దుష్టశక్తుల మూలంగా స్వదేశానికి ముప్పుతప్పదని ఆయన లోని దార్శనికుడు ఓ నిర్ధారణకు వచ్చాడు. మాతృదేశం నుండి శత్రువును తరిమికొట్టేందుకు అవసరమగు ఏర్పాట్లుకు శ్రీకారం చుట్టాడు. తిరుచునాపల్లి విజయం తరువాత ఆయన వరుసగా సాధించిన విజయాలకు సంతసించిన నంజరాజు ఆయనకు పదోన్నతి కలిగించాడు. హైదర్ అలీని దిండిగల్ ఫౌజ్‌దారు పదవి

వరించింది. ఫ్రెంచ్ ఇంజనీరు సహకారంతో దిండిగల్ కోటను పటిష్టపర్చుకున్నాడు. ఆయుధాగారాన్ని ఏర్పాటుచేసుకుని, యుద్ధోపకరణాలను, ఆహార పదార్ధాలను, ధనధాన్యాలను దండిగా సమకూర్చుకున్నాడు.

ఆ సమయంలో మైసూరు రాజ్యాన్ని ఏలుతున్న నంజరాజు, దేవరాజు సోదరుల మధ్య కలతలు చెలరేగాయి. ఈలోగా మరాఠాలు దాడులను ఉధృతం చేశారు. అన్ని రకాల అకృత్యాలకు పాల్పడుతూ, అందినంత సంపద దోచుకుపోతున్న మరాఠాలను నిలువరించేందుకు వారితో ఆ సోదరులు సంధిచేసుకున్నారు. ఆ ప్రమాదం తొలగక ముందే నిజాం దాడులు ప్రారంభించటంతో, ఆ పాలకులను కూడా తృప్తి పర్చాల్సి వచ్చింది. ఈ మేరకు అటు మరాఠాలకూ ఇటు నిజాంకూ భారీ మూల్యాన్ని చెల్లించటంతో మైసూరు ఖజానా పూర్తిగా ఖాళీ అయ్యింది. ఉద్యోగులకు, సైనికులకు జీతాలు చెల్లించలేని దుస్థితి ఏర్పడి, సైనికులలో అసంతృప్తి చెలరేగింది. ఆ పరిస్థితిని చక్కదిద్దేందుకు హైదర్ అలీని దిండిగల్లు నుండి శ్రీరంగపట్నం పిలిపించారు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని, నంజరాజు, దేవరాజుల మధ్య సయోధ్య కుదర్చటమేకాకుండా, తన ఖజానాను వెచ్చించి సైనికులకు బకాయిలతోపాటు అదనంగా బోనసు కూడా చెల్లించి క్లిష్ట సమస్యను పరిష్కరించాడు. ఈ చర్యతో హైదర్ అలీ ప్రతిష్ట ఒక్కసారిగా ఆకాశాన్నంటింది.

1758లో మరాఠా నాయకుడు గోపాలరావు నాయకత్వంలో మరాఠాలు మరోమారు మైసూరు మీద దాడిచేశారు. ఆ దాడితో మైసూరు రాజ్య భవిష్యత్తు ప్రమాదంలో పడుతున్న దశలో హైదర్ అలీ సర్వ సేన్యాధిపతిగా బాధ్యతలు స్వీకరించాడు. ఆ యుద్ధం కొన్ని మాసాల పాటు సాగి, చివరకు మరాఠాలతో సంధి కుదిరింది. ఈ పోరాటాల ఫలితంగా మైసూరు రాజ్యం ఆర్థిక పరిస్థితి మరోమారు బాగా సన్నగిల్లింది. ఉద్యోగులకు, సైన్యానికి జీతాలు చెల్లించలేని పరిస్థితి ఏర్పడింది. ఆ సమయంలో తన జీతం తాను తీసుకోకుండా, అధికారులకు ఏర్పాటు చేసిన ప్రత్యేక భోజన సదుపాయాన్ని కాదని, సాధారణ సైనికులతో కలసి వారితోపాటు భోజనం చేస్తూ, ఆదర్శవంతమైన ప్రవర్తనతో మార్గదర్శకంగా నిలిచాడు. ఈ మేరకు పలుమార్లు మైసూరు రాజ్యాన్ని కష్టాల కడలి నుండి గట్టెక్కించిన హైదర్ అలీ చివరకు శ్రీరంగపట్నం చేరుకున్నాడు. ఆనాటి నుండి మైసూరుకు రాజు ఉన్నప్పటికీ అందరి మౌన అంగీకారంతో 1761 నాటికి హైదర్ అలీ మైసూరు శాసకుడయ్యాడు. మైసూరు రాజ్యాన్ని పరోక్షంగా హైదర్ అలీ శాసిస్తున్నప్పటికి అంతర్గత కుమ్ములాటలు, కుట్రలు పొటమరించాయి. ఒక దశలో ఆయన శత్రువులది పైచేయి కావటంతో రాత్రికి రాత్రి శ్రీరంగపట్నం వదలి రహస్యంగా బయటపడ్డాడు. ప్రమాదకర పరిస్థితితులను నమ్మకస్తులైన మిత్రుల సహకారంతో చాకచక్యంగా అధిగమించి, కుట్రదారును కఠినంగా శిక్షించాడు.





బహిర్గత శత్రువులు మరాట్వాడా, నైజాం పాలకులు హైదర్ అలీకి ఇబ్బందులు కలిగించటం ప్రారంభించారు. ఆ సమయంలో పానిపట్ వద్ద మరాఠాలు పరాజితులు కావటంలో హైదర్ అలీకి కొంత ఊపిరి పీల్చుకునే సమయం దొరికింది. ఆ అవకాశాన్ని ఉపయోగించుకుని అతి స్వల్పకాలంలో మైసూరు సామ్రాజ్యాన్ని 80 వేల చదరపు మైళ్లకు విస్తరించాడు. లక్షా 44వేల శిక్షణ పొందిన సైనికులు, మరో 80వేల యుద్ధానికి సర్వదా సిద్ధంగా ఉండే ప్రత్యేక సైనికబలగాలను సమకూర్చుకున్నాడు. ఆ సైనికులందరికి ప్రత్యేక శిక్షణ ఇప్పించాడు. ప్రభుత్వ విభాగాలలో జరిగే ప్రతి చిన్నపని కూడా ఆయనకు తెలియకుండా జరిగే అవకాశం ఇవ్వలేదు. చివరకు గుడారాలకు కట్టే తాడును కూడా తాను పరిశీలించాక కానీ, గిడ్డంగిలోకి అనుమతించేవాడు కాదు. General in the Army of Mogul Empire Mr. M.M.D.L.T చే రాయబడి, టిపూ వారసుడు Prince Gholam Mohammad చేత సరిచేయబడి 1855లో ప్రచురితమైన *The History of Hyder Shah, alias Hyder Ali Khan Bahadur and his son Tippoo Sulthan* అను గ్రంథంలో రచయిత ఆ విషయాన్ని ఈ విధంగా పేర్కొన్నాడు. 'All the operations or measured undertaken by Hyder's government, small or great, were superintended by hismself in person; insomuch that even leather, the lining of bullock bags, or tent walls, and strands of rope, all passed under his inspection, and were then deposited in his stores.' ( *Eminent Muslim Freedom Fighters* by G.Allana, Page 61)

ప్రజల సమస్యలను తక్షణమే పరిష్కరించాలని అధికారులను ఆదేశించి, అవి ఖచ్చితంగా అమలు జరిగేలా పలు చర్యలు తీసుకున్నాడు. ప్రజల సమస్యలు పరిష్కరించటంలో తీసుకున్న నిర్ణయంలో పొరపాటు జరిగితే తప్పును స్వయంగా అంగీకరించి, బాధితుడికి జరిగిన నష్టాన్ని పూరించనిదే నిద్రపోయేవాడు కాదు. నేరస్థుని కుటుంబానికీ, ప్రజలకూ లాభం చేకూరేలా ప్రత్యేక శిక్షాపద్ధతులను అనుసరించాడు. శాసన ధిక్కారాన్ని ఏ మాత్రం సహించకుండా నేరస్థుడు ఎంతటి వాడైనా, స్వపర భేదం లేకుండా కఠినంగా వ్యవహరించాడు. ప్రజల, ప్రభుత్వ అస్తులను తస్కరించిన సంఘటనలు జరిగినప్పుడు ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకోకుండా, విచారణ సంఘాన్ని నియమించి, ఆ సంఘం నివేదిక ఆధారంగా చర్యలకు ఆజ్ఞలు జారీఅయ్యేవి. ఈ లక్షణాల మూలంగా స్వజనుల గౌరవాభిమానాలను పొందటం మాత్రమేకాకుండా, బద్ధ శత్రువులు కూడా ఆయనను ప్రసంశించారు. బ్రిటీషు సైనికాధికారి జనరల్ క్యాంప్‌బెల్ హైదర్ అలీ గురించి ప్రస్తావిస్తూ,' Haider Ali was an extrodinary man and perhaps, possessed as great mental talents as any recored in the pages of history, ' అని అన్నాడు. ఈ విషయాలను మరొక ఆంగ్లేయాధికారి జనరల్ థామస్ మన్రో ( Thamos Munro) ప్రస్తావిస్తూ,'Every department, civil and mili-

tary, posessess the regularity and system communicated to it by the genius of Haider and in which all pretensions derived from his birth being discouraged or extipated, justice severly and impartially administered...and also every department of trust or consequence conferrred on men raised from obscurity gives the Government a vigour hitherto un exampled in India..అని పేర్కొన్నాడు.

ఈ విజయాలు ఇటు స్వదేశీ పాలకులైన మరాఠాలకు, నైజాం సంస్థాధీశునకూ అటు పరాయిపాలకులైన బ్రిటీషర్లకు మింగుడుపడలేదు. ఆనాటికే మరాఠాలు, నిజాం ఆంగ్లేయులకు దోస్తులు కాగా, నిజాం ఇంగ్లీషువారికి ఆప్తమిత్రుడయ్యాడు. నిజాం, మరాఠాలు అసూయకు లోనుకావటమే కాకుండా భవిష్యత్తులో రణశూరుడైన హైదర్ అలీ ప్రమాదకారి కాగలడని శంకించారు. 1765లో మరాఠాలు భారీ బలగాలతో దాడి చేయటంతో హైదర్ అలీ మైసూరులోని కొంత ప్రాంతాన్ని, 32 లక్షల రూపాయలను మరాఠాలకు కోల్పోవాల్సి వచ్చింది. ఆ తరువాత 1766లో హైదర్ నుండి ప్రమాదం సంభవిస్తే రక్షించగలమంటూ నిజాంతో ఒప్పందం చేసుకుని ఉత్తర సర్కారు ప్రాంతాన్ని ఆంగ్లేయులు దిగమింగారు.

ఆ విధంగా లభించిన దమ్ముతో మరాఠాలు, నైజాం పాలకుల మద్దతుతో 1767 ఏప్రిల్ మాసంలో కల్నల్ జోసఫ్ స్మిత్ బలగాలు మైసూరు రాజ్యం మీద దండయాత్ర చేశాయి. ఈ త్రిముఖ దాడిని ఎదుర్కొనేందుకు హైదర్ అలీ అంగబలం కంటె బుద్ధిబలాన్ని ప్రదర్శించబూనుకున్నాడు. ఈ మేరకు సంధికి ప్రయత్నించాడు. అది కుదరలేదు. చివరకు చదువు లేకున్నా రాజకీయ తంత్రంలో ఆరితేరిన హైదర్ అలీ రాజకీయ చతరతను ప్రదర్శించి,యుక్తిగా అటు మరాఠాలను,ఇటు నిజాంను బ్రిటీషర్లకు దూరం చేసి, అనుకూలం చేసుకున్నాడు. కల్నల్ స్మిత్ చంగామ, ట్రింకోమలి తదితర ప్రాంతాలలో హైదరు దళాలను ఓడించటంతో,భయపడిన నిజాం మళ్ళీ ఆంగ్లేయుల చెంతచేరి, హైదరాలికి వ్యతిరేకి అయ్యాడు.

ఈ ప్రతికూల పరిణామాలకు ఏమాత్రం జంకకుండా హైదర్ అలీ బ్రిటీషు సైన్యాల మీద విరుచుకు పడ్డాడు. ఆంగ్లేయులకు అండగా నిలచిన ఆర్కాటు నవాబు అంతుతేల్చేందుకు తన అపార సేనావాహినిని ముందుకురికించాడు. ఆ మెరుపు యుద్ధం తెల్లదొర మతిని పోగొట్టింది. బ్రిటీషర్ల వ్యూహాలను చిత్తుచేయగల ప్రతివ్యూహాలను పన్ని ముందుకు సాగుతున్న హైదరు తీరు కంపెనీ అధికారులను గందరగోళంలో పడేశాయి. ఆటంకాలన్ని దాటుకుంటూ, వరద ప్రవాహంలా పురోగమిస్తున్న హైదరు సేనలు అపరిమితమైన వేగంతో పరుగులు తీస్తూ, మంగళూరును స్వాధీనం చేసుకుని ఆంగ్లేయుల ప్రధాన స్థావరమైన మద్రాసు ముంగిట నిలిచాయి. మూడున్నర రోజులలో 130 మైళ్ళ దూరాన్ని సునాయాసంగా దాటి మద్రాసు సమీపాన ఉన్న సెయింట్ థామస్ వద్దకు 1769 మార్చి నాటికి హైదరు సేనలు చేరుకునేసరికి





ఆంగ్ల అధికారులు గంగవెర్రులెత్తిపోయారట. బతికుంటే ఉంటే బలుసాకుతిని బ్రతకవచ్చని భావించిన బ్రిటీషర్లు హైదర్ అలీ సేనల ఎదుట మోకరిల్లారు. అహంకారం తగ్గి మైసూరు రాజ్యం మీద ఇతరులు దాడిచేస్తే, సుల్తాన్‌కు స్నేహ హస్తం అందించడానికి అంగీకరించారు. ఈమేరకు హైదర్ అలీకి అనుకూలమైన షరతులకు అంగీకరిస్తూ,1769 ఏప్రిల్ 4వ తేదిన కంపెనీ అధికారులు ఆయనతో సంధి చేసుకున్నారు.

ఈ సమరాన్ని **ప్రథమ మైసూరు యుద్ధం**గా చరిత్రనామకరణం చేసింది. ఈ సంఘటనతో హైదర్ అలీ కీర్తిప్రతిష్టలు ఉజ్వలంగా వెలిగి ఇంగ్లాండుకు చేరుకున్నాయి. ప్రాణాలు అరచేత పట్టుకుని పారిపోయిన ఆంగ్ల సైనికుల ద్వారా పరాజయ వార్తలు పలు ప్రాంతాలకు పాకాయి. కంపెనీ అధికారుల పరాజయం ఇంగ్లాండులో ప్రజలను కూడా బాగా ప్రభావితం చేసింది. ఈ పరిణామాల మూలంగా ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రతిష్ట దిగజారి, కంపెనీ షేర్ల ధర 275 నుండి 222కు పడిపోయాయి.( *Eminent Muslim Freedom Fighers*, G.Allana, Page 58) ఇండియాలోని పలు ప్రాంతాలను ఆక్రమించుకుంటూ అపరిమితమైన సంపదను పోగేసుకుంటున్న ఈస్ట్ ఇండియా కంపెనీకి మద్రాసులో హైదర్ అలీ కల్పించిన పరాజయం అశనిపాతమైంది. ఈ పరాజయం లండన్ స్టాక్ మార్కెట్టులో సంక్షోభానికి కారణం కావటమే కాకుండా, మీరు మమ్మల్ని నష్టాల ఊబిలోకి నెట్టారు. ఈ కష్టాల నుండి బయట పడటం ఎలాగో అర్థం కావటంలేదు అని లండన్‌లోని కంపెనీ అధికారులు వ్యాఖ్యానించారు. ( " ..You have brought us into such a labyrinth of difficulties, that we do not see how we shall be extricated from them. ",) అంతేకాకుండా హిందూస్థాన్‌లోని వ్యవహారాలలో మధ్యవర్తులుగా వ్యవహరించాల్సి పని కంపెనీది కాదు అని (" ...it is not for the Company to take the part of umpries of Indostan..." ) అని Court of Directors కంపెనీ అధికారులను హెచ్చరించే పరిస్థితికి ఆ పరాజయం కారణమైందంటే ఆంగ్లేయులలో హైదర్ అలీ ఎంతటి భయోత్పాతాన్ని కల్గించాడో స్పష్టమౌతుంది.

ఈ యుద్ధం తరువాత కొంతకాలం ప్రశాంత వాతావరణం ఏర్పడింది. బద్ధ శత్రువైన ఆంగ్లేయులను మట్టికరిపించి, తన గడ్డ మీద నుండి తరిమివేయడానికి అవసరమైన పథకాల మీద హైదర్ అలీ దృష్టిసారించాడు. బ్రిటీషర్లను పరాజితులను చేయడానికి అశ్విక, పదాతి, మరఫిరంగుల దళాలు మాత్రమే సరిపోవనీ, నావికా దళం ఏర్పాటుకు కృషిచేశాడు. పలు యుద్ధాలు, అంతర్గత కుట్రలు, పోరాటాల మధ్యలో కూడా హైదర్ అలీ తన రాజ్యంలోని ప్రజలకు చక్కని పాలన అందించాడు.

హైదర్ అలీ ఇస్లాం ధర్మానురక్తుడు. ఆయన స్వమతం పట్ల అభిమానం గల

ప్రభువు తప్ప, మతదురభిమాని కాదు. ఒకసారి ఓ ప్రముఖ ముస్లిం ధార్మిక నాయకుడు హైదరాలీ వద్దకు వచ్చి, తన అనుచరులను శ్రీరంగపట్నంలోని కొందరు హిందువులు హింసించారని ఫిర్యాదు చేస్తూ, ముస్లిం ప్రభుత్వంలో ముస్లింలకు న్యాయం జరగటం లేదని నిందించాడు. ఆ ఆరోపణ వింటూనే, ' ఈ రాజ్యం ముస్లింలదని ఎవరన్నారు?' ( ' Who told you that this was a Mussalman government ? ' - Quoted by M.Mujeb in his *THE INDIAN MUSLIMS* page 419 taken from *HIDER ALI* by N K SINHA, CALCUTTA, 1949 page 10 ) అని హైదర్ ఆగ్రహం వ్యక్తం చేశాడు. ప్రభుత్వం అందరిదనీ, పాలకుడు ముస్లిం అయినంత మాత్రాన ప్రభుత్వం ఆ మతానికి చెందినది ఏమాత్రం కాదని స్పష్టంగా ప్రకటించాడు. ప్రజల మత విశ్వాసాలలో కలుగజేసుకోవద్దని అధికారులకు కూడా ఆదేశాలను జారీచేశాడు. బహుళ మతాలు, జాతుల ప్రజలు సహజీవనం సాగిస్తున్న రాజ్యంలో అన్ని మతాల ప్రజలపట్ల సమభావన చూపడం ఆయన ప్రత్యేకత. ప్రజలకు న్యాయం ప్రసాదించేందుకు, న్యాయ స్థానాలలో అన్ని మతాలకు చెందిన న్యాయాధికారులను నియమించాడు. నిందితులు ఏ మతానికి చెందిన వారయితే ఆ మతానికి చెందిన వ్యక్తులను న్యాయమూర్తులుగా నియమించాడు. ఫిర్యాదులను ఆయా వ్యక్తుల వ్యక్తిగత చట్టాలను అనుసరించి విచారించమన్నాడు. ఒకసారి క్రైస్తవులకు సంబధించిన వివాదం ఆయన వద్దకు రాగా, ఆ వివాద పరిష్కారం కోసం ఓ క్రైస్తవుడ్ని నియమించాడు. న్యాయం చేయడానికి తాను అర్హుడను కానని ఆ వ్యక్తి నిరాకరించగా, ఆ వ్యక్తికి నచ్చ చెబుతూ, ".. you who are yourself a Christian, must be better acquinted with the law of Christians than any judge in my dominion; and since my intention is that every one shall be judged by his own law ". (*Eminent Muslim Freedom Fighers*, G.Allana, LPP, New Dedlhi,1993, Page 57), అని హైదర్ అన్నాడు.

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో పోరాడుతున్నా, పోర్చుగీసు వారితో సంబంధాలు సరిగ్గా లేకున్నా ఆయా మతాచార్యులను గౌరవించాడు. ఆరాధనాలయాలను పరిరక్షించాడు. మతాలు, పీఠాధిపతుల పట్ల ఎంతో ఔదార్యాన్ని చూపాడు. ఆలయాల, మఠాల నిర్వహణకూ, పూజారుల, మఠాధిపతుల జీవన పరిస్థితులను మెరుగుపర్చేందుకూ పూజాపురస్కారాలకు తగినంత ధన,కనక,వస్తువులను అందించాడు. ఆలయాల నిర్మాణాలకు సహకరించాడు. స్వయంగా కంజీవరంలోని గోపుర ఆలయం నిర్మాణానికి 1780లో శంకుస్థాపన చేశాడు. మంచి కళాహృదయుడు. మంచి గ్రంథాలయం ఏర్పరిచాడు. మంచి ధారణ శక్తికలవాడు కావటంతో గ్రంథాలలోని విషయాలను జ్ఞప్తినందుంచుకుని సమయానుసారంగా ఆ వాక్యాలను విన్పించేవాడు. కళాకారులను, కవులను ప్రోత్సహించాడు. ఆయన స్వయంగా గాననృత్య వినోదుడు. ఈ విషయాలన్నిటిని *The History of Hyder*





*Shah, alias Hyder Ali Khan Bahadur and his Son Tippoo Sulthan* అను గ్రంథంలో రచయిత Mr. M.M.D.L.T సవివరంగా పేర్కొన్నాడు.

మాతృభూమి నుండి శక్తివంతులైన పరాయి పాలకులను పాలద్రోలటం ప్రధాన లక్ష్యంగా గల హైదర్ 1779 లో బ్రిటీషు వారికి వ్యతిరేకంగా ఉమ్మడి కార్యక్రమాలను చేపట్టేందుకు మరాఠాలు, నైజాం నవాబు సభ్యులుగా ఏర్పడిన మహా సమాఖ్య (Grand Confederacy) లో చేరాడు. ఈ విషయం తెలిసిన కంపెనీ దొరలకు కంగారు పుట్టింది. ఒక్క హైదరును ఎదిరించటమే కష్టంగానున్న సమయంలో బలమైన మూడు శక్తులను ఎదుర్కోవటం సాధ్యం కాదని తలచి, కుట్రలు-కుయుక్తులకు పాల్పడ్డారు. బలసంపన్నమైన మరాఠా సామ్రాజ్యాన్ని ఆంగ్లేయులు కుట్రలు పన్ని నాలుగు ముక్కలు చేసి, వారిలో వారికి తుంపులుపెట్టారు. ఈ విధంగా విచ్ఛిన్నమైన మరాఠాలలో కొందరు బ్రిటీషర్లను వ్యతిరేకించటంతో ఏకాకులను చేసి వారి మీద కయ్యానికి కాలుదువ్వారు. స్నేహం పేరుతో నైజాం నవాబును తమ గుప్పెట్లో ఉంచుకున్నారు. ఉత్తర భారతదేశాన్ని కబ్జా చేసి, ప్రస్తుతం దక్షిణాదిని కబళించాలన్న పన్నాగాలు సాగిస్తున్న ఈస్ట్ ఇండియా కంపెనీకి, మైసూరు పాలకుడు హైదర్ అలీ ప్రధాన అడ్డంకిగా నిలిచాడు. దక్షిణాదిలో బలసంపన్నుడైన రాజ్యాధినేతగా మహోజ్వలంగా వెలిగిపోతున్న హైదరు అలీకి వ్యతిరేకంగా మరాఠా ప్రభువులను, నిజాంను భయపెట్టి రెచ్చగొట్టారు.

బ్రిటీషర్లు ద్వితీయ మైసూరు యుద్ధానికి శ్రీకారం చుట్టారు. ఐరోపా దేశాల నుండి సరుకులను, ఆయుధాలను తెప్పించుకునేందుకు వీలుగా ఉన్న మాహి రేవు పట్టణాన్ని, మైసూరు రాజ్య పొలిమేరల మీదుగా వెళ్ళి ఆక్రమించుకున్నారు. ఈ అతిక్రమణతో హైదరు ఆగ్రహంతో రగిలిపోయాడు. సదేశీ పాలకుల క్షేమం దృష్ట్యా కలసిరావాల్సిందిగా నిజాంకు, మరాఠాలకు సందేశాలను పంపాడు. దూతల ద్వారా ఐక్యతకు కృషి చేశాడు. దక్షిణాదినంతా తమ గూఢాచారులతో నింపియున్న ఆంగ్లేయులు హైదరు యుక్తిని పసిగట్టి ఐక్యతకు అవకాశం లేకుండా నిజాంను, మరాఠాలను తమ పక్షం చేసుకున్నారు. కలకత్తా నుండి చీమలబారు లాంటి సైన్యాన్ని తీసుకుని ఆంగ్లేయాధికారి కల్నల్ పియర్స్ బయలు దేరాడు. భూతలం మీద ఎడు వందల మైళ్ళు ప్రయాణం చేసి కంపెనీ సైన్యం కదలి వచ్చిందంటే హైదరు మీద వారికి ఎంత కసి ఉందో విశదమవుతుంది.

ఆ ప్రతికూల పరిస్థితులలో కూడా శాశ్విత శత్రువు ఆంగ్లేయుల అంతం చూసేందుకు హైదర్ అలీ రణ నినాదం చేశాడు. 1780 జూలై మాసంలో 80వేల మహాసేనను తీసుకుని బయలు దేరాడు. ఈ సేనలో నాలుగు వందల మంది ఆంగ్ల సైనికులు కూడా ఉండటం విశేషం. ఆ విధంగా బయలుదేరిన మైసూరు మహాసైన్యం అక్టోబరు మాసంలో ఆర్కాటును

పాదాక్రాంతం చేసుకుంది. మరోవైపున హైదర్ అలీ కుమారుడు టిపూసుల్తాన్ రాజధానికి 50 మైళ్ళ దూరంలో ఉన్న కంజీవరాన్ని సునాయాశంగా గెలుచుకున్నాడు. జనరల్ బైలీ నాయకత్వంలోని సైనికులను టిపూ ఊచకోత కోసాడు. **బ్రిటీషు సైనిక చరిత్రలో ఇంత అపార నష్టం జరిగిన సంఘటన మరొకటి లేదు.** తండ్రీకొడుకుల నాయకత్వంలోని మైసూరు సేనల పరాక్రమానికి అడ్డు లేకపోయింది. ఆంగ్లేయుల అదృష్టం తిరగబడింది. ఈ విషయాన్ని ఆంగ్లేయాధికారి Sir Alfred Lyall ' the fortunes of the English in India have fallen to their lowest water-mark ' ( *An Advanced History of India*, R.C.Majundar, page 676) అని చేసిన వ్యాఖ్యానం ఆనాటి ఇంగ్లీషు వారి పరిస్థితికి అద్దం పడుతుంది. మద్రాసును రక్షించుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడగానే, వాతావరణం ప్రతికూలించిందని గ్రహించిన గవర్నర్ జనరల్ వారెన్ హేస్టింగ్స్ అదనపు బలగాలు, అవసరానికి మించిన ధనమిచ్చి, ఆంగ్లేయుల సర్వసైన్యాధ్యక్షుడు Sir Eyre Coote ను పంపించాడు. స్వదేశీ పాలకులు బేరూరు నైజాం, సంస్థానాధీశులకు, సింధియాలకు ఆశలు చూపి మాయమాటలతో లోబర్చుకుని హైదరుకు సహాయం అందకుండా చేశాడు. అయినా Colonel Braith waite ను మైసూరు సైన్యాలు పరాజితుల్ని చేశాయి.

ఆ తరువాత నుండి మైసూరు పులులకు ఇబ్బందులు వచ్చిపడ్డాయి. 1781లో పోర్టినోవాను Sir Eyre Coote కు కొల్పోవాల్సి వచ్చింది. శత్రువు శత్రువు మిత్రుడన్న రాజనీతిని అనుసరించి ఆంగ్లేయులను పరాజితులను చేసేందుకు చేయూత నివ్వాల్సిందిగా బ్రిటీషర్ల శత్రువులు, తనకు మిత్రులైన ఫ్రెంచివారిని హైదర్ అలీ సహాయం కోరాడు. అంతర్జాతీయంగా ఇంగ్లాండ్-ఫ్రాన్స్‌ల మధ్య శత్రుత్వం ముగియటంతో మైసూరుకు ఫ్రెంచ్ సైన్యాల సహాయం చివరివరకు అందలేదు. ఆ అనుకూల పరిస్థితులలో ఆంగ్లేయులు మైసూరు రాజ్యంలోని భాగాలను మాత్రమే కాకుండా డచ్చి, ఫ్రెంచి వారి స్థావరాలను కూడా స్వాధీనం చేసుకుంటూ దాడులను ఉధృతం చేశారు.

ఈ విధంగా విదేశీ శత్రువుతో రణం చేస్తుండగా స్వదేశీ పాలకులు, పాలెగాండ్లు మలబారులోని నాయర్లు, నిజాం మద్దతుతో తిరుగుబాటును ప్రకటించారు. ప్రస్తుతం ద్విముఖ పోరాటానికి హైదరు సిద్ధం కావాల్సివచ్చింది. మలబారు తిరుగుబాటుదారుల పని పట్టేందుకు టిపూను పంపించాడు. ఈ రకంగా ఒకచోట పరాజయం, మరోక చోట విజయం లభిస్తూ ద్వితీయ మైసూరు యుద్ధం సాగుతుండగా, వర్షాకాలం వచ్చింది. వర్షాకాలం రావటం వలన యుద్ధ మేఘాలు అంతరించసాగాయి. ఈ లోగా అనారోగ్యం పాలైన ఆంగ్ల అధికారి Sir Eyre Coote నిష్క్రమించగా అతని స్థానంలో మరోక ఆంగ్లేయాధికారి General Sturat వచ్చాడు.





ఆ యుద్ధం నాటికి హైదర్ అలీ వయస్సు 60 ఏండ్లు. ఆ వయస్సులో కూడా అసమానమైన వేగంతో, ఆయాసరహితంగా వందల మైళ్లు అశ్వరూఢుడై అవిశ్రాంతంగా పయనిస్తూ విదేశీ శక్తులను తరిమికొట్టేందుకు ఆయన జరిపిన పోరాటాలు చరిత్ర ప్రసిద్ధికెక్కాయి. ఆయన అశ్విక దళాల శక్తి సామర్థ్యాలను కీర్తిస్తూ, అలెగ్జాండర్ డౌ తన స్వీయ చరిత్రలో, ' ఆయన గుర్రాలకు రెక్కలు ఉన్నాయా? అని భయపడేవాళ్ళం ' అని పేర్కొన్నాడు. ' we were alarmed as if his hourses had wings to fly over our walls.' ( Prof. Sheik Ali' Article titled *Tipu sultan : His Vision And Mission* In Radiance 1-7 August 1999, Page 14) ఆయన సాగించిన యుద్ధాలను ప్రస్తావిస్తూ, ప్రముఖ ఆంగ్ల రచయిత, ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారి Sir W.W Hunter రాసిన *A Brief History of the Indian People* రాసిన గ్రంథంలో ' హైదర్ అలీ సైన్యాలు పిడుగులాగా బ్రిటీషర్ల మీద విరుచుకపడేవి ' అన్నాడు. ('..the army of Hider Ali fell like thunderbolt upon British Posessions..' page 191) బ్రౌనింగ్ మరొక ఆంగ్ల రచయిత హైదర్ అలీ యుద్ధ లక్ష్యాలను వివరిస్తూ, ' ఇంగ్లీషు వారిని దక్షిణ దేశం నుండి వెళ్లగొట్టమే ' అని అన్నాడు.( ' his main object of driving the English out of Southren India. But he had overrun large tracts of their country, occupied most ot their principal forts and fought steadly and with success against his antagonists' , *Eminent Muslim Freedom Fighters*, G.Allana, page 54)

ప్రబల శత్రువు నుంచి అద్భుతమైన ప్రశంసలందుకున్న మహాయోధుడు హైదర్ అలీ చివరివరకు అంగ్లేయులతో పోరాడుతూ, పోరాటమే జీవితంగా గడిపాడు. అద్భుత విజయాలకు చిరునామాగా ఖ్యాతిగాంచినప్పటికీ మృత్యువుతో సాగిన పోరాటంలో మాత్రం ఆయన విజయలక్ష్మిని దక్కించుకోలేకపోయాడు. చివరకు ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని చిత్తూరు జిల్లా నరసింగరాయుని పేట వద్ద పుట్టకురుపు (క్యాన్సర్) వ్యాధితో బాధపడుతూ, ఆ మహా వీరుడు 1782 డిసెంబరు 7వ తేదీన కన్నుమూసాడు. Hyder was one of the ablest personalities in the history of India, అని ప్రముఖ చరిత్రకారుడు RC Mujumdar చే కీర్తించబడిన హైదర్ అలీ ఇంగ్లీషు వారితో పోరాడేందుకు మరొక యోధుడు టిపూ సుల్తాన్‌ను తన వారసుడిగా మాతృభూమికి అందించి కనుమరుగయ్యాడు. ◆

'...ప్రజల సంతోషంలోనే నా సంతోషం. నా ప్రజల సంక్షేమంలోనే నా సంక్షేమం ఇమిడి ఉంది. నాకిష్టమైందల్లా మంచిదని నేను భావించను. నా ప్రజలకు ఏది ఇష్టమో దానిని నా అభీష్టంగా భావిస్తాను...నా ప్రజలకు ఎవరు శత్రువులో వారు నాకూ శత్రువులు. నా ప్రజలతో ఎవరు కలహిస్తారో, వారు నాతో యుద్ధం ప్రకటించినట్టు. **– టిపూ సుల్తాన్**



## బ్రిటీషర్ల మీద తొలి తిరుగుబాటు బావుటాను ఎగరేసిన ఫకీర్ల సేనాని

# 04. మజ్నూషా ఫకీర్

ఇండియా లోకి అడుగిడిన బ్రిటీషర్లు మెల్లగా స్వదేశీ పాలకుల వ్యవహారాలలో జోక్యం చేసుకుంటూ, తిన్నగా వివిధ పరగణాల అధికార పగ్గాలను తమ ఆధీనంలోకి తీసుకున్నారు. ఈ పరంపరలో బెంగాలు దివానీని హస్తగతం చేసుకున్నాక, ప్రజల సౌభాగ్యాన్ని అందినంత దోచుకుపోవాలని సంకల్పించి రెవిన్యూను మూట గట్టుకోడానికి సాగించిన ప్రయత్నలలో భాగంగా గ్రామీణులను, రైతు జనావళిని దోపిడీకి గురిచేసారు. విన్నూతన రెవిన్యూ పద్ధతులతో మధ్యదళారుల, వడ్డీవ్యాపారుల దోపిడీకి వలసపాలకులు అవకాశాలు కల్పించారు. ఈ నూతన విధానాల వలన గ్రామాలు విలవిల్లాడి పోయాయి. ఈ పీడన, అసంతృప్తి, ఆగ్రహం నుండి 1765 ప్రాంతంలో తిరుగుబాట్లు రగులుకున్నాయి. ఈ తిరుగుబాట్లలో హిందూ సన్యాసులు, ముస్లిం ఫకీర్లు కలసి పాల్గొన్నందున, అవి **ఫకీర్లు- సన్యాసుల తిరుగుబాట్లు** గా చరిత్ర ప్రసిద్ధి పొందాయి.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రారంభమైన ఈ తొలి తిరుగుబాటులో ముస్లిం ఫకీర్లకు మజ్నూషా ఫకీర్ నాయకత్వం వహించారు. ఆయన బెంగాల్ పరగణాలోని కాన్పూరు సమీపాన గల మాఖన్‌పూర్ గ్రామనివాసి. **మంజూ షా** అని కూడా ఆయనను ప్రజలు పిలుచుకున్నారు. మజ్నూషా ధార్మిక వ్యవస్థ పరంగా చూస్తే **మదారి** సాంప్రదాయానికి చెందిన ఫకీర్. మదారి తెగలో **పీర్-మురీద్** సంబంధాలు ఉంటాయి.





పీర్-మురీద్‌ల సంబంధం అంటే గురు-శిష్య సంబంధం అన్నమాట. ఈ సంబంధాలు ధార్మికమైనవి కనుక చాలా బలమైనవి. గురువు ఆదేశిస్తే తమ ధన మాన ప్రాణాలను కూడా అర్పించడానికి శిష్యులు సర్వదా సిద్ధంగా ఉంటారు. ఈ రకమైన ధార్మిక గురువులు ప్రజల ధార్మిక వ్యవహారాలలో మార్గం చూపటమే కాకండా, నిత్యజీవన వ్యహహారాలకు కూడా మార్గదర్శకం చేయటం ఆనవాయితి.

ప్రతి సంవత్సరం లాగే 1771లో బెంగాల్‌లో జరిగిన ఉత్సవాలకు ఫకీర్లు పెద్ద సంఖ్యలో విచ్చేశారు. ఆంగ్లేయుల పెత్తనాన్ని సహించని ఫకీర్లను ఆదిలోనే అణిచివేయాలని ఎదురు చూస్తున్న కంపెనీ పాలకులకు ఈ ఉత్సవం ఒక సాకుగా దొరికింది. కంపెనీ పాలకుల మీద తిరుగుబాటు కోసం ఫకీర్లు ఆయుధాలు సమకూర్చుకుంటున్నారన్న సాకుతో ఉత్సవంలో పాల్గొన్న ఫకీర్ల సమూహం మీద కంపెనీ అధికారులు కాల్పులు జరిపించి,150 మందిని బలి తీసుకున్నారు. ఈ సంఘటన రగిల్చిన ఆగ్రహజ్వాలల నుండి పుట్టుకొచ్చారు, ఫకీర్ల మహా సేనాని మజ్నూషా ఫకీర్. కంపెనీ అధికారుల మీద అక్కడక్కడ తిరగబడుతున్న ఫకీర్లు ప్రతికారేచ్ఛతో ఆయుధాలు చేపట్టారు. ప్రజలనూ పూర్వపు జమిాందారులను, స్వదేశీ పాలకులను కూడగట్టడం ఆరంభించారు. ఈ మేరకు మజ్నూషా స్వదేశీ పాలకుల సహకారం కోరుతూ లేఖలు కూడా రాసారు.

ఈ నేపథ్యంలో ప్రారంభమైన ఫకీర్ల-సన్యాసుల తిరుగుబాటు క్రమంగా ప్రజల పక్షం వహించింది. ఆనాటి గ్రామీణ ప్రజల, రైతుల, ఇతర వర్గాల ప్రజల పట్ల కంపెనీ పాలకులు అనుసరిస్తున్న రాక్షస విధానాలు, భయంకర క్షామంలో కూడా కర్కశంగా వ్యవహరించిన ఆధికారుల తీరుతెన్నులు ఫకీర్లలో కోపానికి కారణమయ్యాయి. ఫకీర్లను బలి తీసుకున్న కిరాతక సంఘటనలు అటు ఫకీర్లను, ఇటు సన్యాసులను, ప్రజలను, పూర్వపు జమిాందారులను ఏకం చేసాయి. ఆణిచివేత, దోపిడి నుండి విముక్తం కావాలంటే ఫిరంగీలను తరిమి వేయటమే మార్గమని ఆయా వర్గాలు తీర్మానించుకున్నాయి.

ఆనాడు మజ్నూషాను పోరాట దిశగా నడిపించిన పరిస్థితులనూ, వాతావరణాన్నీ బీర్‌భూంకు చెందిన ప్రముఖ బెంగాలి కవి జమీరుద్దీన్ దఫాదార్, 1873 సంవత్సరంలో రాసిన *Majnu Shaher Hakikat* అను పద్యకావ్యంలో వివరించారు. ఈ పద్యకావ్యం ప్రకారంగా, మజ్నూషా ఫకీర్ తన గురువు దర్వేష్ హమీద్ మజార్ వద్దకు వెళ్లగా, ఆనాటి భయంకర పరిస్థితులను వివరిస్తూ, **లక్షలాది ప్రజానీకం క్షామం వలన మరణిస్తున్నారు. వాళ్ల జీవితాలను కాపాడు. కంపెనీ ఏజెంట్లు,అధికారులు అధిక రెవిన్యూ కోసం రైతులను, చేతి వృత్తుల వారిని, ప్రజలను హింసిస్తున్నారు. ప్రజలు గ్రామాలు వదలి వెళ్ళిపోతున్నారని,** ఆయన పేర్కొన్నారు. ( Lakhs of people are dying in famine; try to save their

lives ! The Company's agents and paiks torture artisans and ryots for exorbitant revenue and people are deserting villages, *The Fakirs and Sannyasi Uprising*, Atis K. Dasgupth, 1992, Page 62) ఈ పరిస్థితుల గురించి స్వయంగా తెలుసుకునేందుకు పర్యటన చేయాల్సిందిగా ఆయన మజ్నూ షాను ఆదేశించారు.

ఈ పర్యటనలో పలు ప్రాంతాలను సందర్శించి ప్రజల కష్ట సుఖాలను, ఇక్కట్లను స్వయంగా తెలుసుకున్న మజ్నూషా, తన లక్ష్యాలను ప్రజల ముందుంచారు. బ్రిటీషర్ల రాక్షస చర్యలను సహించలేకున్న ప్రజానీకం ఆయన శిష్యవర్గంగా ఏర్పడ్డారు. ప్రధానంగా 1773 నాటి క్షామం కారణంగా ప్రజలు మజ్నూషా దళాలలో పెద్ద సంఖ్యలో వచ్చి చేరారు. ఆనాటి కంపెనీ పాలకులు, జమీందారులు వ్యవహరించిన దయాదాక్షిణ్యాలు లేని విధానాల ఫలితంగా ప్రజలు, ప్రధానంగా రైతులు, మజ్నూషాకు మద్దతు పలికారని కంపెనీ అధికారులు రాసిన లేఖల ద్వారా తెలుస్తుంది. ( In the years subsequent to the famine, their ranks were swollen by a crowd of strarving peasants , *The Fakirs and Sannyasi Uprising*, Atis K. Dasgupth, 1992, Page 07 ) ప్రజల మత వ్యవహారాలలో జోక్యం చేసుకుంటూ పలు ఇక్కట్లు కలుగచేస్తున్న వైనం కూడా మజ్నూషా ఈ సందర్భంగా గమనించారు. ఈ చర్యలు కూడా అటు ముస్లిం ఫకీర్లలో ఇటు హిందూ సన్యాసులలో కోపకారణమయ్యాయి. 1772 ప్రాంతంలో నాటోరు మహారాణి భవానీకి ఆయన లేఖ రాస్తూ ఫకీర్లు, ప్రజలు ఉద్యమించడానికి తెలిపిన కారణాలలో ఈ విషయాన్ని కూడా ప్రస్తావించారు. ఆ కాలంలో ఆంగ్లేయులు హత్య చేసిన 150 మంది ఫకీర్ల విషాద సంఘటనను కూడా ఆయన రాణి దృష్టికి తెచ్చారు. ( ' He wrote letters to Maharani of Nator that English had obstructed them in visiting the shrines and other places and rising was inevitable ' - *Muslims and Inidia's Freedom Movement* , Shan Muhammad, IOS, New Delhi, 2002, Page 04 )

ఈ మేరకు ఏర్పడిన భారీ శిష్యబృందంతో మజ్నూ షా తన గురువు వద్దకు చేరారు. ప్రజల దుర్భర పరిస్థితులను వివరించారు. ప్రజల వేదలను తెలుసుకున్న గురువు తీవ్రంగా వ్యధ చెందారు. ఫిరంగీల మీద తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసారు. చివరకు, **నాగా సన్యాసులతో కలసి ఆయుధాలు చేపట్టండి. ఆహార పదార్థాలను, రైతుల పంటలను దాచిపెట్టిన గిడ్డంగుల మీద దాడులు జరపండి. ఆహార పదార్థాలను ఆకలితో అలమటిస్తున్న ప్రజలకు పంచండి. ఫిరంగీలను తరిమివేయండి. అంతకంటే మరో ప్రత్యామ్నాయం లేదు. ఆయుధాలు చేపట్టండి. ముందుకు కదలండి,** అంటూ మజ్నూషా ఫకీర్‌ను సాయుధ పోరాటానికి దర్వేష్ ఆజ్ఞాపించారు. ( Take up arms, unite with the Naga Sanyasis, raid the storage where rice was hoarded, distribute all provisions among the starved and drive out the English as no alternative is left., *MUJNU SHAHER HAKIKA* (Bengali) quoted in *The Fakirs and Sannyasi Uprising*, Atis K. Dasgupth, 1992, Page 63)





ఆ ఆదేశాలను అందుకున్న మజ్నూ షా తొలుత తమ పోరాటానికి నాయకత్వం స్వీకరించి, విదేశీయులైన ఫిరంగీలను తరిమి వేయటానికి సిద్ధం కావాల్సిందిగా స్వదేశీ పాలకులను అభ్యర్థించారు. భారత దేశంలోని ప్రజలందరి ధార్మిక వ్యవస్థల రక్షణ కోసం, మత ధర్మాలకు అతీతంగా ప్రజల పోరాటాలకు నాయకత్వం వహించమని రాణి భవానీని కోరటం ద్వారా మజ్నూషా ఆనాటి రాజధర్మాన్ని గౌరవించారు. మాతృదేశం నుండి ఫిరంగీలను తరిమివేయాలని, బాధా సర్పదష్టులైన ప్రజలను, కంపెనీ పాలకుల దోపిడీ దాష్టీకాల నుండి విముక్తం చేయాలన్న ఉత్తమ లక్ష్యసాధన కోసం, ఆ పోరాట వీరులు మతాలకు అతీతంగా వ్యవహరించారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ దోపిడీ,పెత్తనాలకు వ్యతిరేకంగా తిరగబడిన ఫకీర్లకు నాగా సన్యాసుల స్నేహహస్తం లభించింది. ఫకీర్లు-సన్యాసులు కలసి ఫిరంగీల మీద చేసిన దాడులలో పలు విజయాలు సాధించారు. ఒక చోట సన్యాసులకు ఫకీర్లు నాయకత్వం వహిస్తే, మరోచోట ఫకీర్లకు సన్యాసులు నాయకత్వం వహించి ఈస్ట్ ఇండియా కంపెనీ సేనలను మట్టి కరిపించి చరిత్ర సృష్టించారు. మజ్నూషా గెరిల్లా పోరాట పద్ధతులను అనుసరించారు. జమీందారులు, వడ్డీ వ్యాపారులైన మహాజన్లు, జమీందారులు, కంపెనీ పాలకులు, కంపెనీ అధికారుల మీద దాడులు సాగించారు. జమీందారులకు ముందుగా దాడి విషయం తెలిపి, కంపెనీ పాలకులకు సవాల్ విసిరి మజ్నూ షా దళాలు దాడులు చేసిన సంఘటనలు ఉన్నాయి. పకడ్బందీగా పథకాలు రూపొందించి విజయవంతంగా అమలు చేసి మజ్నూషా ఫకీర్ కంపెనీ అధికారులను, పాలకులను ఖంగు తినిపించారు.

పథకాలను ఖచ్చితంగా అమలు చేయడానికి, గ్రామీణులకు ప్రత్యేక శిక్షణ ఇచ్చి పటిష్టమైన గూఢాచారి వ్యవస్థను మజ్నూ షా ఏర్పాటు చేసుకున్నారు. ఈ గూఢాచారులు కంపెనీ సాయుధ దళాల కదలికలను మజ్నూ షాకు క్షణాలలో చేరవేసేవారు. ఈ రహస్యం తెలియని ఆంగ్లేయాధికారులు తమ పథకాలు మజ్నూషాకు ఎలా అందుతున్నాయో అర్థంకాక అయోమయంలో పడేవారు. మజ్నూషా దళాలు వందల సంఖ్యలో ఫలానా చోటున సమావేశం అయ్యారని, బహుశా ఫలానా ప్రాంతం మీద దాడి జరుపగలరని స్థానిక అధికారుల నుండి ఖచ్చితమైన సమాచారం అందినా, కంపెనీ బలగాలు మజ్నూషా దళాలను నిలువరించలేక పలుమార్లు చతికిలపడ్డాయి. ప్రతి ప్రధాన పోరాటంలో 500 మంది వరకు పాల్గొన్న ఫకీర్లను సమీకరించటం, వ్యూహాత్మకంగా శత్రువు మీద దాడి జరపటం, పకడ్బందీగా పథక రచన జరగటం గమనిస్తే, ఫకీర్ యోధుల యుద్ధకళాచాతుర్యం, మజ్నూషా సామర్థ్యం

అర్థమవుతుంది. మజ్నూషా దళాలు ప్రధానంగా ఈస్ట్ ఇండియా కంపెనీ కచ్చేరీలు, కర్మాగారాలు, కంపెనీ తొత్తుల ప్రాసాదాలు, కోటల మీద దాడులు జరిపాయి. ప్రజల నుండి బలవంతంగా వసూలు చేసిన రెవెన్యూను మూటగట్టి కంపెనీకి చేరవేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయన్న సమాచారం అందగానే ఆ ప్రాంతం మీద దాడి జరిగేది. ఆ ప్రాంతంలో వసూలు చేసిన రెవిన్యూ మొత్తాలను స్వాధీనం చేసుకుని ప్రజలకు అందజేసి ఫకీర్లు మాయం అయ్యేవారు. ఈ సందర్భంగా రెవెన్యూ నగదు, ఫకీర్ల పరం కాకుండేందుకు ముందు జాగ్రత్తగా తమ అధికారులను, గుమాస్తాలను, కంపెనీ తొత్తులైన జమీందారులను కచ్చేరిల నుండి పారిపొమ్మని కూడా కంపెనీ పాలకులు సలహాలిచ్చిన సంఘటనలను బట్టి మజ్నూషా ఎంత పకడ్బందీగా దాడులు నిర్వహించారో అర్థం చేసుకోవచ్చు. చివరకు కంపెనీ సాయుధ బలగాలు కాపలా ఉన్నా, ధైర్య సాహసాలతో మజ్నూషా దళాలు దాడులు జరిపి చరిత్ర సృష్టించాయి.

ప్రజలను పీడించి అధిక వడ్డీని గుంజుతున్న వడ్డీ వ్యాపారస్తుల (మహాజనులు) పట్ల మజ్నూషా నిర్దాక్షిణ్యంగా వ్యవహరించారు. ప్రజల నుండి, తమ గూఢచారి సభ్యులనుండి సమాచారం అందగానే వడ్డీ వ్యాపారుల ప్రాసాదాల మీద దాడులను నిర్వహించటం, లభించిన నగదును స్వాధీనం చేసుకోవటం, మహాజనుల వద్దనున్న రుణపత్రాలను, భూతనఖా ప్రతాలను, భూస్వాధీన పత్రాలను తగులబెట్టేసి, భవిషత్తులో మహజనులకు ప్రజలు ఎటువంటి బకాయిలు చెల్లించాల్సిన అవసరం లేదని ప్రకటించి, ఎటువంటి వసూళ్ళూ చేయరాదని మహజనులను శాసించి ఫకీర్ల దళాలు అదృశ్యమయ్యేవి. ఈ దాడులు సాగిస్తూనే ఆనాడు స్వదేశీ వర్తక-వాణిజ్యాన్ని దుంపనాశనం చేస్తున్న కంపెనీ వర్తకులు, వారి తొత్తులైన వర్తక-వాణిజ్యవర్గాల మీద దాడులు జరుపుతున్న సన్యాసుల నాయకుడు భవాని పాథక్‌తో మజ్నూషా మంచి సంబంధాలను సాగించారు.

ఆ దాడుల సందర్భంగా చంపటం, గాయపర్చటం లాంటి సంఘటనలకు అవకాశం ఇచ్చేవారుకారు. శతృవు నుండి ప్రతిఘటన ఎదురైతే మాత్రం దయా దక్షిణ్యాలు చూపేవారు కారు. ఈ హింసకు స్వపరబేధాలుండేవి కావు. మతం ఆసరాతో తప్పించుకో చూసిన కంపెనీకి చెందిన ముస్లిం అధికారులను కూడా విడిచి పెట్టకుండా, ప్రజలకు శతృవా? కాదా ? అన్నది ప్రాతిపదికన మజ్నూషా దళాలు సంహారం సాగించాయి. స్త్రీలు, వృద్ధులు, పిల్లల పట్ల మజ్నూషా, ఆయన దళాలు ఎంతో గౌరవంగా ప్రవర్తించాయని కంపెనీ అధికారులు రాసుకున్న డైరీలు వెల్లడిస్తున్నాయి. ఈ దాడులలో సామాన్యప్రజానీకానికి ఎటువంటి ఇబ్బంది కానీ, కష్టనష్టాలు కానీ కలగకుండా జాగ్రత్తలు తీసుకోవటం జరిగింది. సామాన్య ప్రజలకు ఏ విధంగానూ కష్ట నష్టం కలుగకుండా మజ్నూషా చర్యలు తీసుకున్నారు.





ఈ మేరకు స్పష్టమైన అదేశాలను జారీ చేశారు. ( ' Mudgenoon ( Majnu) has given injuctions to his own followers to aviod all kinds of oppression or severity and to take nothing but voluntary contributions from the people by way of charity ' A letter dated 25th junuary 1772 from Supervisor of Rajshahi to the Controlling Council of Revenue of Murshidabad, quoted by Antis K. Dasguptha, page 65) ఈ మేరకు సాయుధ దళాలకు తగిన హెచ్చరికలను జారీ చేయటమేకాక, ఉల్లంఘన జరిగితే స్వపర భేదం లేకుండా ఎంతటి సన్నిహితుడైనా కఠిన శిక్షతప్పేది కాదు.

కంపెనీ పాలకులు సన్యాసులు-ఫకీర్లను దోపిడీ దొంగలుగా, దుండగులుగా ముద్రవేసారు. ఆంగ్లేయుల రికార్డులన్నిటిలో దోపిడీ దొంగలుగా మాత్రమే అటు ఫకీర్లుగానీ, ఇటు సన్యాసులు గానీ కన్పిస్తారు. ప్రజలు మాత్రం కంపెనీ పాలకుల పీడన నుండి తమను రక్షించడానికి వచ్చిన ఆపద్బాంధవులుగా వారిని భావించి ఆదరించి గౌరవించారు. కదన రంగానికి వారి వెంట నడిచారు. ప్రజల క్రియాశీలక భాగస్వామ్యంతో సన్యాసులు-ఫకీర్లు వేల మైళ్ళు విస్తరించిన ప్రాంతంలో 40 సంవత్సరాల పాటు అంగ్లేయులను ఎదుర్కొంటూ ఆధిపత్యం సాగించారంటే, ఆ ప్రాంతపు ప్రజల చురుకైన భాగస్వామ్యం లేకుంటే ఇది సాధ్యమయ్యే పనికాదు. ఫకీర్లు సామాన్య పేద వర్గాలను ఇక్కట్లు పెట్టినట్టు ఆరోపణలు లేక పోవటానికి కారణం మజ్నూషా రూపొందించిన నియమ నిబంధనలు కారణమని చెప్పుకోవచ్చు. మజ్నూషా పిలుపునిస్తే ఏ క్షణాన్నైనా వేలాది మంది సాయుధులైన ప్రజలు కంపెనీ బలగాలను ఎదుర్కొనేందుకు రాగలరని అధికారులు, కంపెనీ పాలకులకు రాసిన డైరీలలో, నివేదికలలో స్పష్టంగా పెర్కొన్నారంటే, మజ్నూషా ఎంతటి ప్రజాభిమానాన్ని సంపాదిచుకున్నారో బహిర్గతమవుతుంది.

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను సవాల్ చేస్తూ సాగిన తిరుగుబాటులలో కంపెనీ సాయుధ దళాల ఉన్నతాధికారులు జనరల్ మెకంజీ, లెఫ్టినెంట్ టైలర్, లెఫ్టినెంట్ బ్రినెన్స్, కమాండర్ కెనిత్, కెప్టన్ రాటన్, మేజర్ బుచ్చన్, రాబర్ట్‌సన్ తదితరులను, ప్రాంతీయ కలెక్టర్లను మజ్నూ షా పరాజితులను చేశారు. మెకంజీని 1765లో జరిగిన పోరాటంలో ఘోరంగా ఓడించారు. 1769లో జరిగిన మరొక పోరాటంలో ఆంగ్ల అధికారి కమాండర్ కెనిత్ హతమయ్యాడు. కంపెనీ సాయుధ దళాలు అనేక సార్లు పలాయనం చిత్తగించాయి. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను సవాలు చేస్తూ, కంపెనీ రెవిన్యూకి నష్టం కలిగించటమే కాక, సాయుధ బలగాలకు తీరని ప్రాణనష్టం కలిగించిన మజ్నూ షాను బందిoచడానికి ఎంతగా ప్రయత్నించినా కంపెనీ అధికారులు విజయం సాధించలేక పోయారు. ప్రజలకు ఎన్ని ఆశల చూపినా, హింసలు పెట్టినా, జమిందారులు కుట్రలు, కుతంత్రాలు పన్నినా, ఒక కట్టడితో సాగిన ఫకీర్లను, వారికి కవచంలా నిలబడిన గ్రామీణ ప్రజల నుండి దూరం

చేయటం సాధ్యం కాలేదు.

1776లో మజ్నూషా నాయకత్వంలో ఫకీర్ల ఉద్యమం చరిత్ర సృష్టించింది. బొగ్రా వద్ద విశ్రాంతి తీసుకుంటున్న మజ్నూషా అనుచరులను లెఫ్టినెంట్ రాబర్ట్‌సన్ నాయకత్వంలో కంపెనీ సాయుధ బలగాలు చుట్టుముట్టాయి. అకస్మికంగా శతృవు వచ్చిపడటంతో, విజయమో–వీర స్వర్గమోనంటూ, మజ్నూషా ఎదుర్కొన్నారు. ఈ పోరాటంలో రాబర్ట్‌సన్ బలగాలు అధిక సంఖ్యలో ఉన్నందున, ' అనువుగాని చోట అధికులమనరాద' న్న గెరిల్లా పోరాట సూత్రీకరణలను అనుసరిస్తూ, శతృవును నిరోధిస్తూ, లెఫ్టినెంట్ రాబర్ట్‌సన్‌ను గాయపర్చి, అనుచరులతో సహా మజ్నూషా అడవుల్లోకి తప్పుకున్నారు. ఈ సంఘటనలో వందలాది కంపెనీ సాయుధ బలగాలు హతమయ్యాయని లెఫ్టినెంట్ రాబర్ట్‌సన్, బొగ్రా కలెక్టర్ కు 1776 నవంబరు 14 రాసిన లేఖలో వివరించాడు.

పూర్వీకుల గ్రామమైన మస్తాన్ ఘర్‌ను మజ్నూషా కేంద్రంగా ఎంచుకున్నారు. ఆ తరువాత నాలుగు దశాబ్దాల పాటు విరామెరుగక సాగిన ఫకీర్ల పోరాటానికి మస్తాన్ ఘర్ ప్రాంతం కేంద్ర స్థానమై దేదీప్యమానంగా వెలిగింది. మస్తాన్ ఘర్ ఫకీర్లకు పుణ్యక్షేత్రంగా, సాయుధ పోరాట వీరులకు రాజధానిగా, శిక్షణా కేంద్రంగా ఆయన తీర్చిదిద్దారు. ఆనాడు మజ్నూ షా అధికార పగ్గాలను చేపట్టడానికి గానీ, అధికారాన్ని వ్యవస్థాగతం చేసుకోడానికి గానీ ఏనాడూ ప్రయత్నించ లేదు. ధార్మిక చింతన గల వ్యక్తి కనుక ఆయన ఆ దిశగా ఆలోచన కూడా చేయలేదు. ప్రజల మిత్రుడిగా ప్రజాసమస్యల పరిష్కారంతో సరిపెట్టుకున్నారు. ప్రజలను, సహచరులను కాపాడుకునేందుకు, అన్యాయ్యాన్ని ఎదుర్కొనేందుకు రక్షణ వ్యవస్థను కల్పించుకున్నారు. ఈ విధంగా మజ్నూ షా ఫకీర్ సాగించిన రాజీలేని పోరాటం, ఫకీర్ల–సన్యాసుల మధ్యన వెల్లివిరిసిన ఐకమత్యం మూలంగా ఈ తిరుగుబాట్లు బెంగాలు, బీహార్, అస్సాం, ప్రస్తుత భూటాన్, నేపాల్, బంగ్లాదేశ్ తదితర ప్రాంతాలకు వ్యాపించాయి. ప్రధానంగా మేంసింగ్, ఢక్కా రంగాపుర్ , బొగ్రా రాజాషాహి, బీనాజ్‌పూర్, మాల్డా, కూచ్ బీహర్, ముషిరాబాద్, బరద్వాన్, బీరంపూర్ లాంటి ప్రధాన జిల్లాలలో ఫకీర్ల నేతృత్వంలో సమాంతర ప్రభుత్వాలు నడిచాయి.

1786 డిసెంబర్ 29వ తేదీన మజ్నూషాను ఎలాగైనా పట్టుకొవాలని బొగ్రా (BOGRA) జిల్లా ముంగ్రా గ్రామంలో విడిది చేసిన లెఫ్టినెంట్ బ్రినాన్స్ బలగాలు, ఆయన స్థావరాన్ని చుట్టు ముట్టాయి. ఈ పోరులో మజ్నూషా అనుచరులు పలువురు కన్నుమూసారు. ఆ సందర్భంగా మజ్నూషా గాయపడ్డారు. అయినా శత్రువకు చిక్కకుండా గుర్రం మీద అత్యంత వేగంగా ఆయన కదన రంగం నుండి తప్పుకున్నారు. మజ్నూషాను లెఫ్టినెంట్ బ్రివాన్స్ వెంటాడినప్పటికీ ప్రజల సహాయంతో కంపెనీ బలగాలకు టోకరా ఇచ్చి, ఎవ్వరికీ చిక్కకుండా మాఖన్‌పూర్‌కు చేరుకున్నారు. గాయం కారణంగా ఆయన పరిస్దితి చాలా





ప్రమాదకరంగా మారింది. మజ్నూ షా ప్రాణాలకు ముప్పు ఏర్పడింది. ఆ విషయం తెలిసిన కంపెనీ అధికారులకు మజ్నూ షాను అరెస్టు చేయడానికి ఇంతకంటే మంచి అదను దొరకదని భారీ సంఖ్యలో సాయుధ బలగాలను దించి, అంగుళం అంగుళం గాలించటం ప్రారంభించారు. ఆయనకు అయిన గాయం ప్రాణాంతకంగా తయారయ్యింది. మజ్నూషాను పరిస్థితి ప్రమాదకరంగా మారినప్పటికీ, శత్రువు తమను చుట్టుముట్టి ఉన్నందున, ఆయనను చికిత్స నిమిత్తం మరొక ప్రాంతానికి తరలించటం అనుచరులకు సాధ్యం కాలేదు.' Inspite of their best efforts, the officials and the sepoys of the Company could not, for a single occasion, capture Majnu, though the latter was severely injured in his last enounter; ' అని ఆంగ్లేయాధికారులు తమ ఉత్తరాలలో రాసుకుని గాయపడిన ఆ ప్రజానాయకుడు మజ్నూషాను పట్టుకోలేక తమ అసమర్థతను ప్రకటించుకున్నారు.

సుదీర్ఘ పోరాట చరిత్రలో పలుమార్లు శతృవు వలయం నుండి చాకచక్యంగా తప్పించుకున్న ఫకీర్ల మహాసేనాని మజ్నూషా ఫకీర్‌కు ఈ సారి మృత్యువుకు టోకరా ఇవ్వటం సాధ్యం కాలేదు. ఈ విధంగా బ్రిటీషర్ల మీద తొలి తిరుగుబాటు జెండాను ఎగురవేసిన మహా నాయకుడిగా ఫకీర్ల మహాసేనాని మజ్నూషా ను పేర్కొంటూ, ప్రముఖ ఆంగ్ల చరిత్రకారుడు Cleig రాసిన *Memory of Warren Hastings* అను గ్రంథంలో ( Against this ruthless invador (*British)* first flag of revolt was unfurled by Majnu shah, the leader of a band of Fakirs along with Bhawani Pathak, the leader of a band of Sannyasis. It lasted upto 1800 ) అభివర్ణించినట్టు, ప్రముఖ చరిత్రకారుడు Dr. Santimay Ray తాను రాసిన *Freedom Movemnt and Indian Muslims*, PPH, New Delhi, 1983 page 1, లో ఉటంకించారు. ఈ సందర్భంగా మజ్నూషా ఫకీర్ బ్రిటీషర్ల మీద సాగించిన పోరాటాలను, ఆయన సామర్థ్యాన్ని Dr. Santimay Ray వివరిస్తూ,' The role of Majnusha is particularly Significant. He was an organiser of great ability, a great commander-in-chief who fought in the midst of a very trying situation against the superior armed forces of the British. He inflicted series of defeats to British armies led by Mackenzi ' అని పేర్కొన్నాడు.

చివరకు ఆ మహాయోధుడు మజ్నూషా ఫకీర్ తన పూర్వీకుల గడ్డ మాఖన్‌పూరు లోని తన ప్రియమైన మస్తాన్ ఘర్‌లో అనుచరులు, ప్రియజనుల మధ్య 1787లో కన్నుమూసారు. ◆



**పరాయి పాలకుల రాజ్యవిస్తరణ కాంక్షను పసికట్టి పరాక్రమించిన యోధాగ్రేసుడు**

# 05. టిపూ సుల్తాన్

భారతదేశ రాజకీయ చరిత్రలో పద్దెనిమిదవ శతాబ్దపు ఉత్తరార్ధ భాగం ఎంతో కీలకమైనది. బెంగాల్ నవాబు సిరాజుద్దౌలాను పరాజితుడ్ని చేసి, బెంగాల్ దివానిని హస్తగతం చేసుకున్న ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు, దక్షణాదిని ఆక్రమించుకోవటానికి యుక్తులు, కుయుక్తులు పన్నుతున్నారు. ఈ సామ్రాజ్యవాద శక్తుల రాజ్యవిస్తరణ కాంక్షను అర్థం చేసుకోలేని స్వదేశీపాలకులు పరస్పరం కలహించుకుంటూ శత్రువుకు దారి చూపుతున్నారు. ఆ సమయంలో **నేనున్నా నేనున్నా నంటూ** భారత రాజకీయ చిత్రపటం మీద ఉదయించిన సూరీడు **మైసూరు పులి** గా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్.

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులను తొడగొట్టి సవాల్ చేసిన టిపూ సుల్తాన్ 1750 నవంబర్ 10వ తేదీన కర్ణాటక రాష్ట్రంలోని కోలార్ జిల్లా దేవనహళ్ళి గ్రామంలో జన్మించాడు. ఆయన తండ్రి హైదర్ అలీ, తల్లి శ్రీమతి ఫాతిమా ఫక్రున్నిసా. విద్యాగంధం లేని హైదర్, తన బిడ్డకు మంచి విద్యాబుద్దులు చెప్పించాడు. తండ్రి ప్రత్యేక పర్యవేక్షణలో యుద్ధ కళను ఔపోసన పట్టిన టిపూ, పదిహేను సంవత్సరాల వయస్సులో రాజ్యపాలన వ్యవహారాలలో, తండ్రితోపాటు యుద్ధాలలో పాల్గొన గలిగిన, స్థాయినీ, సామర్థ్యాన్నీ సంతరించుకున్నాడు. 1763లో జరిగిన మలబార్ పోరాటంలో తొలిసారిగా పాల్గొన్నాడు 1769-72 వరకు మరాఠాలతో సాగిన యుద్ధాలలో పాల్గొని, అసమాన ధైర్యసాహసాలు





ప్రదర్శించాడు. ప్రథమ మైసూరు యుద్ధంలో బ్రిటీషర్ల కూటమి నుండి నిజాం నవాబును దూరం చేసేందుకు చాకచక్యంగా దౌత్యం నడిపి రాజనీతిజ్ఞుడు అన్పించుకున్నాడు. పురాతన సాంప్రదాయ యుద్ధరీతులను అనుసరిస్తూనే, పాశ్చాత్య యుద్ధ వ్యూహాలకు అనుగుణంగా సైన్యాన్ని ఆధునీకరించి మంచి తర్ఫీదు ఇప్పించాడు. సరికొత్త ఆయుధాలను, యుద్ధవ్యూహాలను రూపొందించాడు.

దక్షణాదిలో మైసూరును బలిష్టమైన రాజ్యంగా నిర్మించాలని అహర్నిశలు శ్రమించిన హైదర్ అలీ 1782 డిసెంబరు 6న యుద్ధభూమిలో చివరి శ్వాస వదిలాడు. ఈ వార్త టిపూకి అందేనాటికి ఆయన మలబార్ తీరాన కల్నల్ హంబర్ స్టోన్‌ను తరిమి కొడుతున్నాడు. తండ్రి కన్నుమూసిన వార్త విన్న టిపూ సత్వరమే శ్రీరంగపట్నం చేరుకుని, 1782 డిసెంబర్ మాసంలో మైసూరు రాజ్యలక్ష్మిని చేబట్టి **మైసూర్ సుల్తాన్** అయ్యాడు. టిపూ రాజ్యాభిషేకం రోజుననే, ప్రజలను ఉద్దేశించి మాట్లాడుతూ, **మిమ్ముల్ని వ్యతిరేకించినట్టయితే నేను నా స్వర్గాన్నీ, నాజీవితాన్నీ, నా సంతోషాన్నీ కోల్పోవచ్చు. ప్రజల సంతోషంలోనే నా సంతోషం. నా ప్రజల సంక్షేమంలోనే నా సంక్షేమం ఇమిడి ఉంది. నాకిష్టమైందల్లా మంచిదని నేను భావించను. నా ప్రజలకు ఏది ఇష్టమో దానిని నా అభీష్టంగా భావిస్తాను...నా ప్రజలకు ఎవరు శత్రువులో వారు నాకూ శత్రువులు. నా ప్రజలతో ఎవరు కలహిస్తారో, వారు నాతో యుద్ధం ప్రకటించినట్టు**, అని ప్రకటించాడు.

టిపూ రాజ్యాధికారం చేపట్టగానే రాజ్యాన్ని కబళించడానికి కాచుకుని కూర్చున్న స్వదేశీ, విదేశీ శత్రువుల కుయుక్తులను గమనిస్తూ, ప్రజారంజకమైన పాలనను అందించేందుకు శ్రద్ధ చూపాడు. ప్రజలకు సంబంధించిన అన్ని రంగాలలో విప్లవాత్మక మార్పులు చేసాడు. పలు పరిశ్రమలను స్థాపించి వాటిని అభివృద్ధిపర్చాడు. పలు ప్రాంతాల నుండి చేతి వృత్తి కళాకారులను, నిపుణులను రప్పించి ప్రజలకు శిక్షణ ఇప్పించాడు. స్వదేశీ వర్తక, వాణిజ్యాలు, పరిశ్రమల అభివృద్ధికీ, ఎగుమతులు, దిగుమతుల ప్రోత్సాహానికీ కృషి సాగించాడు.ఆధునిక ఆయుధాల తయారికి అవసరమగు సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపాదించేందుకు, విదేశాలతో వాణిజ్య సంబంధాలను పటిష్ట పర్చేందుకు, బుద్ధి కుశలతతో వ్యవహరించి విజయం సాధించాడు. విదేశీ వర్తకులను ఆహ్వానించినా, బ్రిటీషర్ల వస్తువుల వాడకాన్ని ఆయన అంగీకరించ లేదు. ఇగ్లాండు వర్తకుల నుండి ఎటువంటి వస్తువులను కొనరాదంటూ, ప్రభుత్వ వ్యాపార ప్రతినిధులకు ప్రత్యేక ఆదేశాలను జారీచేసి, విదేశీవస్తువుల బహిష్కరణకు శ్రీకారం చుట్టాడు. స్వదేశీ పరిజ్ఞానానికి విదేశీ సాంకేతిక పరిజ్ఞానం జోడించి రాకెట్ల నిర్మాణానికి ప్రయత్నాలు చేశాడు. తూనికలు-కొలతల వ్యవస్థను ఆధునీకరించాడు. నౌకా వ్యాపారాన్ని వృద్ధిచేసాడు. వర్తక, వాణిజ్య, పారిశ్రామిక రంగాలలో ప్రభుత్వ పాత్రను అధికం చేస్తూ,

ప్రభుత్వ వ్యాపార సంస్థను (State Trading Corporation) ఏర్పాటు చేసాడు.

వ్యవసాయ రంగాన్ని ప్రోత్సహించాడు. నీటి పారుదల సౌకర్యం కల్పించేందుకు అధిక శ్రద్ధ వహించాడు. ఆనాడు కావేరి నది మీద ఎక్కడయితే ఆయన ప్రాజెక్టు కట్టాలని ఉద్దేశించాడో, ఆతరువాత అదే ప్రాంతంలో కృష్ణరాయసాగర్ ప్రాజెక్టు నిర్మాణమైంది. రైతుకు భూమి మీద హక్కును కల్పించాడు. బంజరు భూములను మాగాణులుగా మార్చే రైతుకు, మూడు సంవత్సరాల పాటు పన్నుల మినహాయింపు కల్పించాడు. పండిన పంట భాగాన్ని పన్నుగా నిర్ణయించి, ఆ పన్ను వసూలుకు దళారులను తొలచించి ప్రభుత్వ ఉద్యోగులను నియమించాడు. వ్యవసాయ పనిముట్ల కోసం రైతులకు రుణసౌకర్యం కల్పించాడు.

ప్రాక్-పశ్చిమ దేశాల సామాజిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని సంతరించుకున్న టిపూ సాంప్రదాయక ప్రభుత్వ పాలనకు భిన్నంగా, ప్రజలకు ఉత్తమ సేవలను అందచేసే ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టిన తొలి స్వదేశీ పాకుడిగా ఖ్యాతి గడించాడు. **టిపూ పాలన ఆశ్చర్యంగా అత్యంత ఆధునిక సూత్రాలకు అనుగుణంగా సాగిందంటూ** ప్రముఖ ఆంగ్లేయ రచయిత ఫెర్నాండజ్ తన గ్రంథం ' *Storm Over Srirangapatnam*' లో ప్రశంసించాడు. పూర్వీకుల సాంప్రదాయలను గౌరవిస్తూనే ప్రజోపయోగకర సంస్కరణలకు టిపూ అంకురార్పణ చేశాడు. సంస్కరణల అమలు విషయంలో వ్యక్తిగత కష్టనష్టాలను ఆయన ఖాతరు చేయలేదు. వ్యభిచారం, బానిసత్వం, బహు భర్తృత్వం, మద్యపానాన్ని నిషేధించాడు. మలబారు మహిళలు నడుం పైభాగాన ఎటువంటి ఆఛ్ఛాదన లేకుండా అర్ధనగ్నంగా తిరగటం గమనించి, మహిళలంతా పైయద కన్పించకుండా రవికలు ధరించాలని ఆజ్ఞలు జారీ చేశాడు. ఈ ఆజ్ఞలను ఖాతరు చేయని వారి పట్ల కఠినంగా వ్యవహరించాడు. నరబలులను నిషేధించాడు. ఫకీర్లు-సన్యాసులు మాదక ద్రవ్యాలను తీసుకోవటం నేరంగా పరిగణించాడు. అనాథలైన బాలికల క్రయవిక్రయాలు క్షమార్హం కాని తీవ్ర నేరాలుగా ప్రకటించి, పొగాకు సేవనం అనారోగ్యకరమని నిషేధించాడు. దుబారాను తగ్గించాలని, సంపాదనలో ఒకశాతం కంటే ఎక్కువ మొత్తాన్ని విలాసాలకు ఖర్చు చేయరాదని అధికారులకు ఆజ్ఞలు జారీచేసాడు. వికలాంగులకు, అంధులకు ఆత్మస్థైర్యం కలుగ చేసేందుకు పలురకాల సహాయక చర్యలు అమలు చేశాడు. చిన్న, చిన్న నేరాలకు పాల్పడిన వ్యక్తులకు విధించే శిక్షలును సంస్కరించాడు. చిన్న తప్పిదాలకు కఠిన శిక్షలను, జరిమానాలను విధించటం కాకుండా గ్రామాల పొలిమేరల్లో నేరస్థులు మొక్కలను నాటాలని, ఆ మొక్కలకు సక్రమంగా నీళ్ళు పోస్తూ, బాగా పెరిగేంత వరకు సంరక్షణ బాధ్యతలను నిర్వహించాలని శాశించాడు.

టిపూ విద్యాధికుడు కావటమే కాకుండా, సాహిత్యాభిలాషిగా కూడా పేర్గాంచాడు. కన్నడ, తెలుగు, మరాఠి, అరబ్బీ, పర్షియన్, ఉర్దూ, ఫ్రెంచ్, భాషలను నేర్చుకున్నాడు.





పండితులను గౌరవించటం, సాహిత్య సభలను నిర్వహించటం, గ్రంథాలను రాయించటం పట్ల ఎంతో ఆసక్తి చూపాడు. స్వయంగా 45 గ్రంథాలు రాశాడు. అనునిత్యం రాజకీయాలు, పోరాటాలు, యుద్ధాలలో మునిగి తేలుతూ కూడా ప్రతిరోజూ ఏదో ఒక పుస్తకాన్ని కొంతసేపన్నా చదవనిదే టిపూ విశ్రమించేవాడు కాదట. చిన్ననాటనే ఆయన తనకోసం ప్రత్యేక గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. టిపూ స్వయంగా ' Fauji Akhbar ' అను ఉర్దూ వారపత్రికను సైనికుల సమాచారం నిమిత్తం 1793లో ప్రారంభించి, జీవిత చరమాంకం వరకు దానిని నడిపాడు. స్వయంగా ' జాకోబియన్ క్లబ్ ' అను సంస్థను ప్రారంభించి, ఆ సంస్థ ప్రారంభోత్సవం సందర్భంగా మొక్క నాటుతూ, ఆ మొక్కకు **స్వేఛ్ఛావృక్షం** (Tree of Liberty) అని నామకరణం చేయటమే కాకుండా తనను తాను **మైసూరు పౌరుడు**గా ( TIPU , CITIZEN OF MYSORE) పిలుచుకున్నాడు. ఒక రాజరిక వ్యవస్థకు చెందిన పాలకుడు ఈ విధంగా ప్రజాస్వామిక భావన ప్రకటించడం విశేషం.

ప్రజలను విద్యావంతులు చేయటానికి టిపూ ప్రత్యేక చర్యలు తీసుకున్నాడు. విద్యను నిర్బంధం చేసి, ఉచిత విద్యను ప్రవేశ పెట్టాడు. పలు విద్యాలయాలను ప్రారంభించాడు. శ్రీరంగపట్నంలో విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని ఆ విశ్వవిద్యాలయానికి JAMIAL UMUR అని నామకరణం చేయాలని ఉవ్విళ్ళూరాడు. ఈ విశ్వవిద్యాలయంలో భారతీయ విజ్ఞానంతో పాటుగా, పాశ్చాత్య విజ్ఞానాన్ని బోధించాలని, మానవీయ,సాంకేతిక విద్యాభ్యాసానికి అగ్రస్థానం కల్పించాలని ఆశించాడు.

టిపూ సుల్తాన్ ఇస్లాం ధర్మానురక్తుడు. ఆయన ఖురాన్ గ్రంథాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. నిత్య జీవితంలోని సమస్యల పరిష్కారం సందర్భంగా ఖురాన్ గ్రంథం నుండి ప్రవచనాలను అతి సునాయసంగా ఉల్లేఖిస్తూ, పరిష్కార మార్గాలు సూచించటంలో ఆసక్తి చూపాడు. స్వమతం పట్ల అభిమానం గల ప్రభువు తప్ప, ఆయన మత దురభిమానికాదు. ఓ పాలకునిగా ఆయన మతాతీతంగా వ్యవహరించాడు. ప్రజల మత విశ్వాసాలలో ఏమాత్రం కలుగజేసుకోవద్దని ఆదేశాలను జారీచేశాడు. బహుళ మతాలు, జాతులకు చెందిన ప్రజలు సహజీవనం సాగిస్తున్న రాజ్యంలో అన్ని మతాల ప్రజలపట్ల సమభావన చూపడం టిపూ ప్రత్యేకత. ప్రతి ఒక్కరి మత సాంప్రదాయాలను గౌరవించాడు. నైతిక విలువలకు భంగకరం కానంతవరకు ఏ మత సాంప్రదాయాలనూ ఆయన పట్టించుకోలేదు. ప్రజలకు సరైన న్యాయం ప్రసాదించేందుకు, న్యాయస్థానాలలో పలు మతాలకు చెందిన ధార్మిక పండితులను, న్యాయాధికారులను నియమించాడు. ప్రజల ఫిర్యాదులను, సమస్యలను వ్యక్తిగత చట్టాలను అనుసరించి విచారించమన్నాడు.

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో పోరాడుతున్నా క్రైస్తవ మతాచారులపట్ల

ఎంతో గౌరవం, ఆదరణ చూపాడు. మసీదు-మందిరాల మధ్య టిపూ తేడా చూపించ లేదు. 1791-92లో మైసూరు రాజ్యం మీద దాడి జరిపిన మరాఠాలు, శృంగేరి పీఠానికి చెందిన విలువైన వస్తువులను, ఆస్తిపాస్తులను దోచుకున్నారు. ఆలయంలోని శారదామాత విగ్రహాన్ని కూడా పెకలించి బయటకు విసిరివేశారని, అగౌరవపరిచారని, శృంగేరి పీఠాధిపతి టిపూకు ఓ లేఖ రాస్తూ అ దుస్సంఘటన వివరాలను తెలిపారు. ఆ విషయాలను తెలుసుకున్న టిపూ జరిగినదానికి బాధపడుతూ, **పవిత్ర స్థలం పట్ల పాపం చేసిన వ్యక్తులు అందుకు ప్రతిఫలాన్ని అనుభవించక తప్పదని** ఆగ్రహం వ్యక్తం చేశాడు. ఆలయ పునరుద్ధరణకు సహాయం చేశాడు. పలు ఆలయాలకు గ్రాంటులను, ప్రత్యేక నిధులను, బంగారు వెండి ఆభరణాలను, వస్తువులను సమర్పించాడు. తండ్రి హైదర్ అలీచేత శంఖుస్థాపన చేయబడిన కంజీవరం గోపురాలయం నిర్మాణాన్ని ఎంతో శ్రద్ధతో పూర్తి చేయించాడు. దిండిగల్ కోటమీద దాడి చేసినప్పుడు కోటలోని ఆలయానికి కించిత్తు నష్టం వాటిల్లకుండా ఫిరంగిదళం దాడులు జరపాలని, ఖచ్చితమైన ఆదేశాలు జారీ చేశాడు. టిపూ నివాసగృహానికి సమీపాన ఒకవైపు మసీదు, మరొకవైపున శ్రీరంగనాథస్వామీ ఆలయం ఉన్నాయి. నమాజుకు రమ్మని మసీదునుండి వినపడే పిలుపుకు ఆయన ఎంతటి ప్రాధాన్యం యిచ్చేవాడో, శ్రీరంగనాథస్వామీ ఆలయం నుండి వినవచ్చే జేగంటలకు అంతే ప్రాముఖ్యాన్నిచ్చాడు. టిపూ సైన్యంలోని 19మంది సేనాధిపతులలో 10 మంది, 13 మంది మంత్రులలో ఏడుగురు హిందువులని ప్రముఖ చరిత్రకారుడు శ్రీ బి.యన్. పాండే వెల్లడించారు. సమాజంలోని కొందరు వ్యక్తులు సాగించే కిరాతక చర్యలను ఆ వ్యక్తికి చెందిన కుల, మతాలకు చెందిన జనసముదాయాలకు అంటగట్టడాన్ని తీవ్రంగా పరిగణించాడు. తప్పుచేసిన వ్యక్తిని మాత్రమే నిందించాలి తప్ప, ఆ వ్యక్తికి సంబంధించిన యావత్తు సమాజాన్ని తప్పు పట్టడం అహేతుకం అన్నాడు.

టిపూ సుల్తాన్ మత సామరస్యాన్ని ఎంతగా పాటించినా, ఈ గడ్డను ఆక్రమించుకున్న బ్రిటీషర్లు, ముస్లిం వ్యతిరేకతను నింపుకున్న స్వదేశీ చరిత్రకారులు, టిపూను మతోన్మాదిగా చిత్రించ ప్రయత్నించారు. ఆయన బలవంత మత మార్పిడికి పాల్పడి, తీవ్ర వత్తిడిని తెచ్చినందున మతాంతీకరణ ఇష్టంలేని 3 వేలమంది బ్రాహ్మణులు ఆత్మాహుతి చేసుకున్నారని ఆరోపిస్తూ, కలకత్తా విశ్వవిద్యాలయం సంస్కృత విభాగం అధిపతి డా॥ హరిప్రసాద్ శాస్త్రి రాసిన మెట్రిక్యులేషన్ స్థాయి చరిత్ర పాఠ్యపుస్తకంలో పేర్కొన్నారు. ఈ పుస్తకం చాలా కాలం బెంగాల్, అస్సాం, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలోని ఉన్నత పాఠశాల విద్యార్థుల చరిత్ర పాఠ్య గ్రంథంగా చలామణీ అయ్యింది. సత్యదూరమైన ఈ విషయం డా॥ బి.యన్. పాండే దృష్టికి 1928-29లో వచ్చింది. ఈ విషయం మీద ఆయన విస్తృత పరిశోధన జరిపారు. అరోపణలు చేసిన డా॥హరి ప్రసాద్‌ను డాక్టర్ పాండే ఎన్ని సార్లు





సంప్రదించినా,అభియోగాలకు ఆధారాలు చూపకుండా, కనీసం ప్రశ్నలకు సమాధానం ఇవ్వకుండా ముఖం చాటేయడంతో, ఈ విషయాన్ని ఆయన కలకత్తా విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ దృష్టికి తీసుకువెళ్ళారు. అనంతరం, అభియోగాలలోని అసత్యాన్ని,దురుద్దేశాన్ని గుర్తించిన విశ్వవిద్యాలయం పాఠ్య గ్రంథాల జాబితా నుండి శ్రీ శాస్త్రి గ్రంథాన్ని తొలగించారు.

టిపూ 17 సంవత్సరాల పాటు సాగించిన పరిపాలనలో అత్యధిక సమయం తన రాజ్యాన్ని కబళించాలనుకుంటున్న బ్రిటీషర్లను, నిజాం నవాబు, మరాఠాలను ఎదుర్కొంటూ గడిపినప్పటికీ, స్వదేశీ వ్యవహారాలను చక్కదిద్దుకుంటూ, అంతర్జాతీయ వ్యవహారాలను దక్షతతో నిర్వహించి చరిత్రకారుల ప్రసంశలను అందుకున్నాడు. అసమాన ధైర్యసాహసాలతో తండ్రికి తగిన తనయుడనిపించుకున్న టిపూ పలు విజయాలను సాధించాడు. మలబారు యుద్ధంతో ప్రారంభమైన ఆ వీరుని జీవితం అటు ఈస్ట్ ఇండియా కంపెనీతో ఇటు స్వదేశీపాలకులైన నిజాం, మరాఠాలతో పోరుచేస్తూ ముందుకు సాగింది. టిపూ తన రాజ్యాన్ని ఉత్తరాన కృష్ణానది నుంచి, దక్షిణాన దిండిగల్ వరకు అంటే సుమారు 400 మైళ్ళు పొడవున, పశ్చిమాన మలబారు నుంచి, తూర్పున తూర్పు కనుమల వరకు సుమారు 300 మైళ్ళు విస్తరింపచేశాడు.

ఈ పరిస్థితులను సహించలేక, అసూయా ద్వేషాలతో రగిలి పోతున్న నిజాం నవాబు, మరాఠాలు టిపూకు వ్యతిరేకంగా ఏకం కావటమే కాక ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో చేతులు కలిపారు. ఈవిధంగా ఏర్పడిన స్వదేశీ-విదేశీ పాలకుల కూటమి వలన టిపూకు పలు సమస్యలు ఎదురయ్యాయి. చివరకు టిపూ భవిష్యత్తును నిర్దేశించిన శ్రీరంగపట్నం ముట్టడి ప్రారంభమైంది. కర్నాటక వైపు నుండి జనరల్ హారిస్, కూర్గ్ నుండి జనరల్ స్టూవర్ట్, హైదరాబాదు నుండి లార్డ్ వెల్లస్లీ, దక్షిణం వైపునుండి కల్నల్ రోడ్, కల్నల్ బ్రౌన్ చుట్టు ముట్టారు. బ్రిటీషర్ల కలలను నిజం చేయడానికి నిజాం, మరాఠా పాలకులు, పాలెగాళ్ళు, కంపెనీ సైన్యాలకు తోడుగా నిలిచారు. 1799 మే మాసం 4వ తేది ఉదయం శ్రీరంగపట్నం మీద ముప్పేట దాడి భారీ స్థాయిలో ప్రారంభమైంది. ఆత్మస్థైర్యం, ధైర్యసాహసాలు గల టిపూ బలగాలు శత్రువు మీద విక్రమించాయి. అంతర్గత శత్రువును టిపూ కనిపెట్టలేక పోయాడు. ఆయన అత్యంత నమ్మకస్థుడిగా వ్యవహరించిన దివాన్ మీర్ సాధిక్ ఆంగ్లేయులతో చేతులు కలిపాడు. టిపూకు స్వామి ద్రోహం చేశాడు. శత్రు సైన్యం కోటలోకి సునాయాశంగా ప్రవేశించడానికి దారిచూపి సహకరించాడు. టిపూ ఈ విషయాన్ని గ్రహించేలోగా పరిస్థితులు చేతులు దాటిపోయాయి.

ఆ సమయంలో కోట నుండి సురక్షిత ప్రాంతానికి తప్పించుకోమని అధికారులు, మంత్రులు ఎంతగా నచ్చచెప్పినా వినకుండా, విజయమో లేక వీరస్వర్గమో తేల్చుకోవాలని

టిపూ నిర్ణయించుకున్నాడు. **నక్కలాగా వంద సంవత్సరాలు బ్రతికే కంటే సింహంలా ఒక్క రోజు బ్రతికినా చాలు** అని గర్జిస్తూ, శత్రుసైన్యాల మీద విరుచుకుపడ్డాడు. ఆంగ్లేయాధికారులు టిపూను సమీపించడానికి భయపడేంతగా భయోత్పాతం కల్గించాడు. సాహసించి ముందుకురికి శత్రువు వలయంలో చిక్కుకున్న టిపూకు తుపాకి గుండొకటి దూసుకు వచ్చి తాకటంతో తీవ్రంగా గాయపడ్డాడు. శరీరాన్ని తొలుచుకుంటూ దూసుకెళ్ళిన తుపాకి గుండు కలిగిస్తున్న భయంకర బాధను పళ్ళ బిగువున భరిస్తూ, ఖడ్గం చేతబట్టి లేచి నిల్చోడానికి శత విధాల ప్రయత్నించి టిపూ విఫలమయ్యాడు. ఆ సమయానికి టిపూ సైన్యం భారీ సంఖ్యలో హతమైంది. ఆయన అంగరక్షకులు సుల్తాన్‌ను రక్షించుకునే ప్రయత్నంలో హతమయ్యారు. ఒక వైపు శరీరంలో రక్తమంతా ధారలు కట్టి భూమిని తడిపేస్తున్నా నీరసం ఆవహిస్తున్నా, క్రమంగా ప్రాణం పోతున్నా టిపూ తన చేతిలోని ఖడ్గాన్ని మాత్రం వదల లేదు. ఆ సమయంలో శత్రువుది పైచేయి కావటం, కోటలో ప్రవేశించిన శత్రువును ఎదిరించే శక్తి టిపూ బలగాలలో సన్నగిల్లటంతో యుద్ధ వాతావరణం కొంత తగ్గు ముఖం పట్టింది.

ఆ అవకాశంతో బ్రిటీష్ సైనికులకు అడ్డులేకపోవటంతో దోపిడీ ప్రారంభమైంది. టిపూ నేలకొరిగిన ప్రాంతంలో ఆయన ఖడ్గం, ఆయన ధరించిన బెల్ట్ మీద పొదిగిన బంగారాన్ని, వజ్రాలను గమనించిన ఓ సైనికుడు, ఆ వ్యక్తి టిపూ అని ఎరుగక, ఆయన స్పృహలో ఉన్నాడన్న విషయం తెలియక, ఆయన ధరించిన బెల్టును ఊడబెరుక్కోడానికి టిపూను సమీపించాడు. ఆ స్థితిలో కూడా శతృ సైనికుడు సమీపిస్తున్నాడని గమనించి, శరీరంలోని బలాన్నంతా కూడదీసుకొని ఆ సైనికుడ్ని తన కరవాలానికి ఎరచేసాడు. అస్తమించాడని భావించిన వ్యక్తి అకస్మాత్తుగా కత్తి దూయటంతో కంగారు పడిన కంపెనీ సైనికుడు టిపూ మీద తుపాకి కాల్పులు జరిపాడు. టిపూ సుల్తాన్ విక్రమించటం చూసిన సైనికులు విచక్షణా రహితంగా గుండ్ల వర్షం కురిపించారు. ఆ గుండ్ల వర్షంతో టిపూ సుల్తాన్, 1799 మే మాసం 4న తేది సాయంకాల సమయాన కన్నుమూసాడు.

టిపూ సుల్తాన్ కదన రంగంలో ప్రాణాలు వదలిన నాలుగు గంటల వరకు ఆయన మరణించిన వార్త శత్రువుకు తెలియరాలేదు. ఆయన మరణం అనూహ్యమైనది. అందువలన ఆంగ్లేయాధికారులకు నమ్మకం కుదరలేదు. చివరకు బ్రిటీష్ సైనిధికారి జనరల్ హరిస్, తన సాయుధ బలగాలను, టిపూ బంధువులు, సేవకులకు వెంటబెట్టుకొని స్వయంగా వచ్చి మృత వీరుల గుట్టలలో టిపూ కోసం వెతులాట ప్రారంభించాడు. చివరకు విశ్వాసపాత్రులైన అనుచరుల మృతదేహాల మధ్యన టిపూ విగత జీవుడై కన్పించాడు. అప్పటికీ టిపూ మరణించడాన్ని స్వజనులు మాత్రమే కాదు బ్రిటీష్ అధికారులు కూడా నమ్మలేకపోయారు. కంపెనీ బలగాలు, అధికారులు టిపూ మృతదేహాన్ని సమీపించేందుకు



సాహసించ లేకపోయారు. టిపూ మృతదేహానికి అల్లంత దూరంలో నిల్చోని, చుట్టూతా సాయుధులైన సైనికులను నిల్చోపెట్టి, ఏక్షణాన్నైనా గర్జించేందుకు వీలుగా టిపూకు తుపాకులు గురిపెట్టించి టిపూ మృతదేహాన్ని సమీపం నుండి పరిశీలించి, టిపూ మరణాన్ని జనరల్ హరిస్ ధృవపర్చుకున్నాడు. ఆ తరువాత ఆనందం పట్టలేక కేరింతలు కొడుతూ, ' **ఈ నాటి నుండి ఇండియా మనది** ' (Now India is Ours) అని ప్రకటించాడు. టిపూ మీద విజయం సాధించాక జరిగిన విందులో ఓ ఆంగ్లేయాధికారి Thomas Munro మాట్లాడుతూ " We can easily capture all of India but Tipu is the only hurdle.." అన్నాడంటే టిపూ బ్రిటీషర్ల దురాక్రమణను ఎంత బలంగా ఎదుర్కొన్నాడో అవగతం అవుతుంది.

ఈ విధంగా బ్రిటీషర్లతో కదన రంగాన పోరాడుతూ, రణ భూమిలోనే చివరి శ్వాస వదలిన స్వదేశీ పాలకులలో టిపూ ప్రథముడని చరిత్ర ఆయనను కీర్తించింది. (.."Tipu Sultan was the single brave hero of Indian Histroy who fighting the Britishers met his martydom in the battle field..." Prof.Jaya Prakash) ప్రజల మనస్సులలో టిపూ ఏర్పరచుకున్న సుస్థిర స్థానాన్ని గమనించిన గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీ బ్రిటీష్ సైన్యాధికారులకు ఇచ్చిన విందులో మాట్లాడుతూ, ' **మిత్రులారా మిమ్మల్ని, నన్ను ఈ ప్రపంచం మర్చి పోవచ్చు. అయితే టిపూ స్మృతులు కలకాలం నిలిచిపోగలవు** ' ( " I fear my friends that Tipu's memory will live long after the world has ceased to remember you and me..." ) అని నివాళులు అర్పించటం విశేషం. శత్రువు చేత కూడా ఘనమైన నివాళులు, ప్రశంసలు అందుకున్న టిపూ లాంటి స్వదేశీ పాలకులు భారతదేశ చరిత్రలో అరుదు. చివరి నెత్తురు బొట్టు నేలరాలే వరకు బ్రిటీషర్లతో పోరాడి, భారతదేశం గర్వించదగిన ముద్దుబిడ్డగా ఖ్యాతిగాంచి టిపూ సుల్తాన్ చరిత్రపుటలలో అరుదైన శాశ్వత స్థానం పొందాడు. ◆

### బ్రిటీష్ వలస పాలకులను ముప్పుతిప్పలు పెట్టిన వహాబీ ఉద్యమ నిర్మాత

# 06. సయ్యద్ అహమ్మద్ బరేల్వి

భారత స్వాతంత్ర్యసంగ్రామంలో భాగంగా సాగిన పలు పోరాటాలలో అర్థ శతాబ్దిపాటు బ్రిటీష్ వలసపాలనకు వ్యతిరేకంగా ప్రత్యక్ష పోరాటాలు సాగించి **వహాబీ ఉద్యమం** ప్రత్యేక చరిత్ర సృష్టించింది. ఆ తరువాత భారత స్వాతంత్ర్యోమంలో అగ్ని యుగంగా ఖ్యాతిగాంచిన కాలం నాటి సాయుధపోరాట వీరులకు మాతృదేశంకోసం ఉరికొయ్యలు, తుపాకి గుండ్లను చిరునవ్వుతో స్వీకరించేందుకు వహాబీ యోధులు ప్రేరణగా నిలిచారు. అటువంటి వహాబీ వీరులను తయారు చేసి, బ్రిటీష్ వలస పాలకులకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం సాగేందుకు ప్రజలను ప్రేరేపించిన మహనీయుడు సయ్యద్ బరేల్వి.

16 వ శతాబ్దంలో అరేబియాలో అబ్దుల్ వహాబ్ ప్రారంభించిన శుద్ధ ఇస్లాం ధార్మిక సంప్రదాయ ఉద్యమం ' వహాబీ ఉద్యమం ' గా ఖ్యాతి చెందింది. ఆ ఉద్యమాన్ని భారత దేశానికి పరిచయం చేసిన సయ్యద్ అహమ్మద్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని రాయబరేలి జిల్లా బరేలి గ్రామంలో 1766లో జన్మించారు. 1803లో ఆయన విద్యాభ్యాసం పూర్తి చేసి, ఇంటికి తిరిగి వచ్చి వివాహం చేసుకున్నారు. ఆ తరువాత ఆయన టోంక్ (Tonk) నవాబు అమీర్ ఖాన్ సైన్యంలో చేరాడు. స్వతంత్ర నవాబుగా పాలన సాగిస్తున్న అమీర్ ఖాన్ సైన్యంలో ఆయన మంచి సైనిక శిక్షణ పొందారు. ఆయన పక్షాన పలు యుద్ధాలలో పాల్గొని యుద్ధ ఎత్తుగడలలో మంచి ప్రావీణ్యం సంపాదించి సాహసోపేత యుద్ధ వీరుడిగా ఖ్యాతి గడించారు.





1817లో అమీర్ ఖాన్ బ్రిటీష్ పాలకుల ఆధిపత్యాన్ని అంగీకరించటంతో, పరదేశీయుల పొరుగు కూడా గిట్టని సయ్యద్ అహమ్మద్, నవాబ్ అమీర్‌ఖాన్ సేవలో గడపటం ఏమాత్రం ఇష్టం లేక ఆ ఉద్యోగాన్ని మానివేశారు.

టోంక్ నుండి తిరిగి వచ్చాక ఆనాడు సాగుతున్న ఇస్లామిక్ పునరుద్ధరణ ఉద్యమాలకు మార్గదర్శకత్వం వహిస్తున్న ప్రముఖ ఇస్లామిక్ తత్వవేత్తలు షా వలీయుల్లా (1703-62), ఆయన కుమారుడు అబ్దుల్ అజీజ్ (1746-1823) ధార్మిక సిద్ధాంతాల పట్ల అకర్షితులయ్యారు. ఆ సిద్ధాంతాలను ప్రజలకు వివరిస్తూ , ఆయన అనేక ప్రాంతాలు పర్యటించాడు. మీరట్, ముజఫర్‌నగర్, షహరాన్‌పూర్ జల్లాలలో, ఆ తరువాత అలహాబాద్, బెనారస్, కాన్పూరు, లక్నోలలో, పర్యటించి రోహిల్‌ఖండ్‌ను దర్శించారు. ఈ పర్యటనలలో ఆయన తన ధార్మిక సిద్దాంతాలను బాగా ప్రచారం చేసారు. ఈ సందర్భంగానే ఆయన సామాన్య ప్రజలు ఎదుర్కొంటున్న ధార్మిక-లౌకిక సమస్యలను సమీపం నుండి గమనించారు. ఈ సమస్యలకు పరదేశీయుల పాలన ప్రధాన కారణమని ఆయన భావించారు. అందువలన ఆ పాలకుల నుండి దేశాన్ని విముక్తి చేయాలని నిర్ణయించుకున్నారు.

1821 జూలై నెలలో సయ్యద్ అహమ్మద్ బరేల్వి రాయబరేలి నుండి హజ్‌యాత్ర ప్రారంభించారు. 1822 మే మాసంలో ఆయన మక్కా చేరుకునే సరికి ఆయన వెంట మొత్తం 800 మంది శిష్యులు వచ్చారు. మక్కాలో ఆయన అబ్దుల్ వహాబ్ గురించి, ఆయన ప్రచారం చేస్తున్న శుద్ధ ఇస్లాం గురించి విన్నారు. ఆవిధంగా ఆయనకు అబ్దుల్ వహాబీ బోధిస్తున్న వహాబీ సాంప్రదాయం పరిచయమైంది. ఈ తాత్విక సిద్దాంతానికి సయ్యద్ అహమ్మద్ ప్రభావితుడయ్యారు. ఖురాన్ ఆదేశాలు, మహమ్మద్ ప్రవక్త బోధనల పునాదుల మీద సాగుతున్న వహాబీ ఉద్యమ సాంప్రదాయాలను, ధార్మిక తీరు తెన్నులను అనుసరించాలని నిర్ణయించుకున్న సయ్యద్ అహమ్మద్ బరేల్వి 1824 ఏప్రిల్ మాసంలో స్వదేశం చేరుకున్నారు.

స్వదేశం రాగానే స్థానికంగా నెలకొనియున్న రాజకీయ, సాంఘిక, ధార్మిక పరిస్థితులను గమనించారు. వహాబీల ధార్మిక మార్గం ప్రకారంగా శుద్ధ ఇస్లాంనూ, ప్రవక్త మార్గాన్నీ ముస్లింలు తు.చ తప్పకుండా అనుసరించేలా చూడాలంటే, అది ఇస్లామిక్ రాజ్యంలో మాత్రమే సాధ్యమని సయ్యద్ అహమ్మద్ భావించారు. బ్రిటీష్ పాలకులను స్వదేశం నుండి తరిమి వేయాలని సంకల్పించారు. ఈ మేరకు శిష్యులను సమాయత్తం చేయసాగారు. భారత దేశం నుండి ఆంగ్లేయుల తరిమివేత ప్రధాన ధ్యేయంగా భారీ సంఖ్యలో వహాబీ కార్యకర్తలను సమకూర్చుకునేందుకు దేశమంతటా పలుసార్లు పర్యటనలు చేసారు. ఈ పర్యటనలలో ప్రజలకు తన తాత్విక, ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలనూ, విధానాలనూ వివరించారు. ఆయనకు భారీ అనుచరవర్గం ఏర్పడింది. ఈ పర్యటనల సందర్భంగా పలుచోట్ల

వహాబీ కేంద్రాలను ఏర్పాటు చేసారు. ఆ కేంద్రాలకు సమర్థులైన నిర్వాహకులను నియమించి, వహాబీ తత్వ ప్రచారం చేయాల్సిందిగా, బ్రిటీషర్ల మీద ధర్మపోరాటం ప్రారంభించాల్సిందిగా ఆయన ఉద్బోధించారు. ఆ తరువాత తమ మతపరమైన, రాజకీయ విధానాలను అమలు పర్చేందుకు సరైన స్థావరం కోసం అన్వేషణ సాగించారు.

ఈ ఆలోచనల పర్యవసానంగా వాయవ్యసరిహద్దు ప్రాంతాలలోని పర్యటించి కొన్ని ప్రాంతాలను ఎంపిక చేసుకున్నారు. ఆఫ్ఘన్ తెగలు ఆయనను గురువుగా స్వీకరించాయి. ఆ తెగల ప్రజానీకాన్ని వహాబీ సిద్ధాంతాలతో ప్రభావితం చేసి, సరిహద్దు అవతలి వైపు నుండి కూడా సహాయం పొందవచ్చని ఆయన ఆశించారు. ధర్మపోరాటం కోసం కదలి రమ్మని శిష్యులకు, అనుచరులకు పిలుపునిచ్చారు. ఆయన పిలుపుకు మంచి స్పందన లభించింది. 1826 జనవరి 17 తేది ప్రాతఃకాలాన సయ్యద్ అహమ్మద్ బరేల్వీ తన స్వస్థలమైన రాయబరేలి నుండి బ్రిటీషర్ల మీద, ఆ శక్తులకు తొత్తులుగా మారిన స్వదేశీ పాలకుల మీద అంతిమ పోరు సాగించేందుకు బయలు దేరారు. ఆయన అదేశాల మేరకు ప్రాణాలను తృణప్రాయంగా భావించి త్యజించటానికి ఏ మాత్రం వెనుకాడని భారీ శిష్యగణం ఆయన వెంట కదిలింది. మౌల్వీ మహమ్మద్ ఇస్మాయిల్ లాంటి ప్రముఖ సహచరులతో ఏర్పడిన సలహా మండలి కూడా ఆయన వెంట ఉంది. ఆయన ప్రథమంగా గ్వాలియర్ చేరుకున్నారు. గ్వాలియర్ సంస్థానాధీశుడు ఆయనను గౌరవంగా ఆహ్వానించాడు. అక్కడ తన అనుచరవర్గాన్ని సైనిక వ్యూహంతో విభాగాలుగా మార్చి అక్కడ నుండి టొంక్ చేరుకుని, అజ్మీర్, రాజపుటానా దాటుకుంటూ సింధ్ చేరుకున్నారు. ఆయన ఊహించిన విధంగా సింద్ అమీర్ సహకారం అందలేదు. అటువంటి నిరాశాపూరిత స్పందన ఎదురవుతున్నప్పటికీ ఆయన పట్టుదలతో ముందుకు సాగుతూ, 1826 నవంబరు 20వ తేదీన, అనగా దాదాపు పది మాసాలపాటు మూడు వేల మైళ్లు మేరకు సాగిన లాంగ్ మార్చ్ తరువాత చివరకు తన బలగాలతోపాటుగా పెషావర్ చేరుకుని, చివరకు గమ్యస్థానం చేరుకున్నారు.

గమ్యస్థానం చేరుకోగానే సయ్యద్ అహమ్మద్ స్వతంత్ర్య రాజ్యస్థాపనకు శ్రీకారం చుట్టారు. తమ ధర్మపోరాటాన్ని ప్రారంభించేందుకు ఆయన చార్‌సద్దా అను ప్రాంతాన్ని ఎన్నుకున్నారు. అక్కడ నుండి తొలుతగా బ్రిటీషర్లకు అనుకూలంగా వ్యవహరిస్తున్న, తమను పూర్తి స్థాయిలో శత్రువగా పరిగణిస్తూ, తమ మార్గానికి అడ్డంకిగా ఉన్న పంజాబ్ మీద యుద్ధాన్ని ప్రకటించారు. ఒక వైపు యుద్ధ ప్రకటనలుగావిస్తూ, మరోవైపున వాయువ్య సరిహద్దు ప్రాంతాలలోని ప్రజలకు శుద్ధ ఇస్లాం గురించి బోధిస్తూ, ఇస్లాంకు వ్యతిరేకమైన మూఢాచారాలను విడనాడమని ప్రచారం చేసారు. ఈ మార్పులు నచ్చని పఠాన్ నాయకులు ఆయన ఆదేశాల పట్ల అంతగా ప్రతిస్పందించలేదు. సామాన్య ప్రజానీకాన్ని ఆకర్షించినంతగా





ఆయన భోధనలు ఆంగ్లేయుల నుండి లబ్దిని పొందుతున్న స్వార్థపరులైన నాయకులను సహజంగానే ఆకట్టుకోలేకపోయాయి. అయినప్పటికి ఆయన స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించారు. ఆయన కలలుగన్న విధంగా శుద్ధ ఇస్లాం ప్రకారంగా ఆయన రాజ్యపాలన ప్రారంభించారు. ఈ పరిస్థితులను పఠాన్ జాతి జనులు, ముఖ్యంగా పఠాన్ నాయకులు ఏమాత్రం అంగీకరించలేకపోయారు. ఈ మేరకు కొంతకాలం గడిచాక ఆ ప్రాంతంలో స్థిరత్వం లభించింది. స్వతంత్ర రాజ్యపాలనకు ఒక రూపు లభించాక, ఆయన శిక్కుల మీద ధర్మ యుద్ధం ప్రకటించారు. తొలి దశలో శిక్కులు, ఆహ్మద్ అనుచరుల మధ్యన పలు ఘర్షణలు, దాడులు జరుగుతూ వచ్చాయి. చివరకు 1831లో బాల్‌కోట్ వద్ద మహారాజా రంజిత్ సింగ్‌తో నిర్ణయాత్మక యుద్ధం ప్రారంభమైంది. ఈ యుద్ధంలో సయ్యద్ అహమ్మద్ తన అనుచరులతో వీరోచితంగా పోరాడారు. ఈ సందర్భంగా ఆయన ప్రధాన అనుచరుడు మౌలానా మహమ్మద్ ఇస్మాయిల్, ఆయన ముఖ్య అనుచరులు 3 వందల మంది వరకు షహీదులయ్యారు.

చివరకు 1831 మే 6 తేదిన సయ్యద్ అహమ్మద్ బరేల్వీ షహీద్ అయ్యారు. ఆయన ఆనాడు ఆరంభించిన పోరాటం దశాబ్దాల పాటు సాగింది. భారత దేశమంతటా వహాబీ ఉద్యమ పతాకాలు రెపరెపలాడాయి. ఆయన అపార శిష్యగణం ఆయన ప్రభోధాన్ని ఆదేశంగా స్వీకరించి ఆంగ్లేయుల వ్యతిరేక పోరాటాలలో ముందుకు నడిచింది. ఈ శిష్యబృందమే 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్యసమరంలో అగ్రభాగాన నిలచి ప్రాణాలు అర్పించింది. ఒక దశలో వహాబీలే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి కారకులని బ్రిటీష్ అధికారులు భావించే స్థాయిలో సయ్యద్ అహమ్మద్ బరేల్వీ అనుచరులు బహుముఖ పాత్రను నిర్వహించారు. (.. Even in the case of the Mutiny, (Sri Jhon kaye) tells us that undoubtedly the prime movers in the rebellion (*of* 1857), and those who most zealously fanned its sparks into flames, were Musalman's and those Musalmans were undoubtedly Wahabis."- *The Communal Triangle In India* , Ashok Mehata and Achyut Patwardhan, Kitabistan, Allahabad 1942, page 96).

సయ్యద్ అహమ్మద్ బరేల్వీ చూపిన మార్గం వెంట నడుస్తూ స్వతంత్ర భారతావనిని సాధించేందుకు ఎంతో మంది వహాబీలు బలయ్యారు. మాతృదేశం కోసం చివరకంటా రాజీలేని పోరాటం జరిపిన వహీబీలు భూలోక నరకంగా ఖ్యాతిగాంచిన అండమాన్ జైలుకు పంపబడిన తొలినాటి స్వాతంత్ర్యసమర యోధులుగా ఖ్యాతిగడించారు. బ్రిటీషు పాలకుల పెత్తనం నుండి భారతావని విముక్తయమ్యేంత వరకు సయ్యద్ అహమ్మద్ బరేల్వీ రగిలించిన స్వేచ్ఛా-స్వాతంత్ర్యోద్యమ దీక్షతో వహాబీల పోరు సాగించి చరితార్థులయ్యారు. ◆



## బ్రిటీష్ వలసపాలకు వ్యతిరేకంగా విక్రమించిన వీరుడు

# 07. టిటూ మీర్

బ్రిటీషు వలసవాదుల పాలన ప్రారంభం నుండి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా చరిత్రకెక్కిన తిరుగుబాటు వరకు బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా పలు తిరుగుబాట్లు జరిగాయి. ఈ సాయుధ పోరాటాల చరిత్రలో వహాబీలు సాగించిన తిరుగుబాటు చాలా ప్రధానమైంది. ఈ ఉద్యమ స్థాపకుడు సయ్యద్ ఆహమ్మద్ బరేల్వి కాగా, ఆ ఉద్యమానికి సమరశీలత కల్పించి, బ్రిటీషర్లు ఈ గడ్డను వదలి వెళ్ళేంత వరకు సాగిన పోరాటాలకు ప్రేరణగా నిలచిన కార్యశూరుడు టిటూ మీర్.

బెంగాల్‌లోని నర్కేల్‌బరియా ప్రాంతంలోని హైదర్‌పూర్ లేక చాంద్‌పూర్ లో 1782లో ( 1183 మాఘమాసం 14వ తేదిన ) టిటూమీర్[1] జన్మించారు. తల్లి పేరు రొఖయాబి. తండ్రి పేరు మీర్ నిస్సార్ అలీ. సన్నకారు రైతు కుటుంబం. టిటూ మీర్‌ను టిటూ మియా అని కూడా పిలిచేవారు. వ్యవసాయం పట్ల ఏమాత్రం ఆసక్తి చూపని ఆయన

**1. బెంగాలి రచయిత్రి మహాశ్వేతా దేవి రాసిన ' టిటూ మీర్ ' అను గ్రంథంలో మీర్ నిస్సార్ అలీని టిటూ మీర్ తండ్రిగా పేర్కొన్నారు. వహాబీ ఉద్యమ చరిత్ర గ్రంథాలు, టిటూ మీర్‌ను మీర్ నిస్సార్ అలీ గా పేర్కొన్నప్పటికీ, మహాశ్వేతా దేవి మాత్రం ఆయన పేరును టిటూ మీర్‌గానూ తండ్రి పేరు నిస్సార్ అలీగానూ పేర్కొనటం, అటు టిటూ మీర్ కూడా తన సంతకంలో ' మీర్ నిస్సార్ అలీ కుమారుడు టిటూ మీర్' అని పేర్కొనటం వలన ' టిటూ మీర్ ' మాత్రమే ఆ యోధుని సరైన పేరు అన్పిస్తుంది.**



గ్రామీణ ప్రాంతాలలోని సాంప్రదాయక ఆయుధాలు ఉపయోగించటంలో కాలం గడుపుతూ, ఆ విద్యల్లో మంచి కౌశల్యం సంపాదించారు. గ్రామంలో ఎవరిక ఏ ఆపద వచ్చినా నేనున్నానంటూ సహాయమందిస్తూ, బాధితులకు మన్ననలు పొందాడు. అన్యాయాన్ని -అధర్మాన్ని ఏ మాత్రం సహించని ఆయన సహజగుణం పలుమార్లు జమిందారుల మనుషులతో, పోలీసులతో ఘర్షణలకు కారణమైంది. ఆయన బాలుడుగా ఉన్నప్పుడే వహాబీ నాయకుడు మిష్కిన్‌షా తో పరిచయం కలిగింది. అ సమయంలో బ్రిటీషర్లకు, జమిందారులకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రజా పోరాటాల గురించి తెలుసుకున్నారు.

చిన్నతనం నుండి వ్యాయామం పట్ల ఎక్కువ మక్కువ చూపిన టిటూ మీర్ కొద్ది కాలంలోనే మంచి వస్తాదుగా ఖ్యాతిగాంచారు. ఈ మేరకు కుస్తీ పోటీలలో పాల్గొనడానికి ఆయన స్వస్థలం వదలి కలకత్తాకు వెళ్ళిపోయారు. అక్కడ ఇమడలేక 1815లో తిరిగి వచ్చిన ఆయన నాడియా ప్రాంతానికి చెందిన జమిందారు భూదేవపాల్ చౌదరి కొలువులో చేరారు. ఈ సందర్భంగా నాడియాలో జరిగిన ఒక ఘర్షణలో పాల్గొనటం వలన ఆయనకు మూడు సంవత్సరాల శిక్ష పడింది. ఈ సంఘటన తరువాత జమీందార్ కొలువును వదలిపెట్టారు. ఆ సమయంలో వహాబీ తత్త్వ ప్రబోధకుడు సయ్యద్ అహమ్మద్ బరేల్వి గురించి విన్నారు. ఆయనను కలుసుకునే ప్రయత్నంలో ఉండగా, కలకత్తాలోని కులీన వర్గానికి చెందిన మీర్జా సాహెబ్ కొలువులో చేరారు. ఆయన టిటూ మీర్‌కు సయ్యద్ ఆహమ్మద్ సాగిస్తున్న పోరాటాల గురించి వివరించారు. ఈ సందర్భంగా అహ్మమద్ శిక్కుల మీద సాగిస్తున్న పోరాటానికి కారణాలను వివరించారు.( " Why did Ranjith Singh sign a treaty with the British? why did he sign away the freedom of Tonk, Peshawar and places like that ? why did he surrender Punjab, the land of the brave, to the English ? All this filled his anger " - *Titu Mir*, Mahasweta Devi, Page 51) ఆ సమయంలో బ్యారక్‌పూరు వద్ద ఆంగ్లేయాధికారుల ఆజ్ఞలను ధిక్కరించి, మృత్యువును ఆనందంగా కౌగలించుకున్న భారతీయ సైనిక యోధుల గురించి విన్నారు. ఓ కుగ్రామంలో జన్మించినా ప్రపంచంలో ఏం జరుతున్నదన్న విషయాలను తెలుసుకోవడానికి ఆసక్తి చూపటం వలన, ఆ మేరకు ఆయన సంపాదించిన పరిజ్ఞానం భవిష్యత్తులో ఎంతో ఉపయోగపడింది.

1823 ప్రాంతంలో మీర్జా సాహెబ్ కుటుంబీకులతో పాటుగా ఆయన మక్కా వెళ్లారు. మక్కాలో ఆయన సయ్యద్ అహమ్మద్‌ను కలిసి పలు విషయాల మీద చర్చించారు. ఈ సందర్భంగా, ' పరాయిపాలకులను పాలద్రోలడానికి నేను పనిచేస్తాను. ముస్లిం సమాజాన్ని పక్షాళన చేయాల్సి ఉంది. అందుకు మనమంతా నడుం కట్టాలని ' ఆయన చేసిన ప్రబోధం టిటూ మీర్‌ను బాగా ఆకట్టుకుంది. ఫరాజియా ఉద్యమ నిర్మాత హాజీ షరియతుల్లాను

కూడా టిటూ మీర్ మక్కాలో కలిసారు. ఈ ముగ్గురు నాయకుల కలయిక భారత దేశంలో బ్రిటీషర్లకు వ్యతిరేకంగా ' వహాబీ-ఫరాజీ ' ఉద్యమ స్రవంతులు సాగటానికి ఉపయోగపడింది.

టిటూ మీర్ మక్కా నుండి తిరిగి వచ్చాక కొంతకాలం కలకత్తాలో గడిపి నర్కేల్‌బరియా దగ్గర గల హైదర్‌పూరు వెళ్లి అక్కడ స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని, వహాబీ తత్వప్రచారం చేయటం జీవితాశయంగా నిర్ణయించుకుని, ఆ ప్రయత్నంలో గ్రామాలు, పట్టణాలు తిరుగుతూ ప్రజలకు నైతిక, ధార్మిక బోధనలు చేయసాగారు. ఆ పర్యటనల సందర్భంగానే ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు, జమీందారులు, మహాజనులు సాగిస్తున్న దోపిడీని చూసారు. ప్రజల ఆక్రందనలు విన్నారు. ప్రజల సమస్యల పరిష్కారం కోసం, ఈ దోపిడీని, దోపిడీ శక్తులను నిరోధించాలని నిర్ణయించుకున్నారు.

ఈ పరిస్థితులు ఇలా ఉండగా కంపెనీ పాలకులు ప్రజల జీవితాలను పెను మార్పులకు గురిచేసే పలు చర్యలను అమలులోకి తెచ్చారు. కంపెనీ పాలకుల చర్యల వలన ప్రజలు కష్టనష్టాలను అనుభవించాల్సి వచ్చింది. ఈ నిరాశ నిస్పృహల నేపథ్యంలో టిటూ మీర్ బోధనల వలన, బెంగాల్‌లోని పలు జిల్లాల్లో వహాబీల ప్రాబల్యం బాగా పెరగసాగింది. వహాబీలంతా ఒక కట్టుకావటంతో, తామంతా ఒకే సమూహమన్న చైతన్యం పెరిగి, పీడనకు వ్యతిరేకంగా పోరాడాలన్న ఆలోచనలు ప్రజలలో అంకురించింది. ' ఐకమత్యం మహాబలం' అను నానుడిని అనుభవంలో తెలుసుకున్న బాధిత ప్రజలు మతప్రసక్తి లేకుండా జమీందారుల అక్రమ డిమాండ్లను తిరస్కరించటం ప్రారంభించారు. .

ఈ వాతావరణం మింగుడుపడని **పూర్వా** గ్రామం జమీందారు వహాబీలను అడ్డుకునేందుకు పలు అమానుష చర్యలు అమలులోకి తెచ్చాడు. ముస్లిమేతరుల పండుగలకు వహాబీల ముక్కుపిండి విరాళాలు వసూలు చేయటం ప్రారంభించాడు. నిరాకరించిన ప్రజలను హింసించటం, నిర్బంధించటం, అవమాన పర్చటం నిత్యకృత్యమైంది. కంపెనీ అధికారుల ఆజ్ఞలనూ, జమీందారు ఆదేశాలనూ శిరసావహించని వ్యక్తుల జీవితాలు దుర్భరమై పోయాయి. ప్రజలు జమీందారు చర్యలను నిరసించారు. వహాబీలు ఆగ్రహం వ్యక్తం చేయసాగారు. అణిగిమణిగి ఉన్న ప్రజలలో వ్యక్తమౌతున్న మార్పును గమనించిన పూర్వా ప్రాంతానికి చెందిన జమీందారు కృష్ణదేవరాయ్, గ్రామంలోని వహాబీ పెద్దలను పిలిపించి హెచ్చరించాడు. వహాబీలు గడ్డం తీసివేయాలని లేదా గడ్డం పెంచినందుకు రెండురూపాయల ఎనిమిది అణాలను ' **గడ్డం పన్ను** ' కట్టాలని ఆదేశించాడు. ఆ గడ్డం పన్ను చెల్లించడానికి వహాబీలు నిరాకరించారు. జమీందారు ఏజెంట్లు బలవంతంగా గడ్డం పన్నును వసూలు చేయటమే కాక, నిరాకరించిన వహాబీల గడ్డాలను పట్టుకుని గుంజటం లాంటి అవమానకర చర్యలకు పాల్పడ్డారు. ( their beards were plucked by the Zamindar's agents -





*Wahabi And Farazi Rebels of Bengal,* Nirmal Kaviraj, PPH, New Delhi, 1982 Page 34 ) ముస్లింలు సహించారు. ప్రజలలు ఓర్పు వహించారు. జమీందారు మరింత రెచ్చిపోయాడు. నిస్సహాయులైన గ్రామ రైతుల మీద పగబట్టాడు. ప్రజల గృహాల ఆస్తుల మీద దాడులు చేయించి విధ్వంసం సృష్టించాడు.

జమీందారు ఆగడాలు మితిమీరటంతో తప్పనిసరి పరిస్థితిలో ఆ చర్యలను నిలువరించేందుకు టిటూ మీర్ నాయకత్వంలో ప్రజలు తిరగబడ్డారు. ఈ సందర్భంగా 1763-1800 నాటి ఫకీర్ల పోరాటాలలో పాల్గొన్న నేతల వారుసుడైన షకీర్ కురబాన్ షా తన అనుచరులతో టిటూమీర్‌తో కలిసాడు. ప్రజలు, వహాబీలు, నర్కేల్ బరియా గ్రామం చేరుకున్నారు. సాంప్రదాయక ఆయుధాలను సమకూర్చుకున్నారు. పోరుకు సిద్ధమయ్యారు. సుమారు ఐదు వందలమంది పూర్వా గ్రామం మీద 1831 నవంబర్ 6న దాడి చేసారు. ఈ విషయాన్ని పసిగట్టిన జమీందారు, సంపన్నులు ముందుగానే గ్రామం విడిచి పారిపోయారు. కంపెనీ పాలకుల, అధికారుల నిరంకుశ పాలన, జమీందారుల దాష్టీకాలతో విసిగిపోయిన ప్రజలు, తిరగబడిన వహాబీల వెంట సాగేందుకు ముందుకు వచ్చారు. ఈ దాడులను నిరోధించగల స్థాయి అటు జమీందారులకు గాని ఇటు పాలకవర్గాలకు గాని లేకపోవటంతో వహాబీలలో ఆత్మస్థైర్యం పెరిగింది.

ఆచార సాంప్రదాయాలను అవమాన పర్చారన్న కసితో ఆరంభమైన దాడులు ఆ తరువాత క్రమంగా దిశను మార్చుకున్నాయి. ప్రజల సామాజిక, ఆర్థిక కడగండ్లను టిటూ మీర్ పరిగణణలోకి తీసుకున్నారు. ఈ మార్పు వలన, మతాలతో సంబంధం లేకుండా క్రమక్రమంగా అన్ని మతాల, వర్గాల, పేద ప్రజానీకం మహమ్మద్ నిస్సార్ ఆలీ వెంట నడిచారు. ఆ తరువాత భారీ సంఖ్యలో బలగాలు చేకూరటంతో, నర్కేల్‌బరియాలో ( Narklberia) ఆయన ఓ వెదురు కర్రల కోటను నిర్మించారు. ఈ కోటలో ఒక్కొక్క విభాగానికి ఒక్కొక్క గదిని ఏర్పాటు చేసారు. ఆయుధాల గది, ఆహార పదార్థాల గది, కార్యాలయం, తదితర ప్రత్యేక ఏర్పాట్లను కల్పించారు. ఆయుధాలను, ఆహార పదార్థాలను భారీగా సేకరించారు. బలగాలను సమకూర్చుకుని పోరాటంలో శిక్షణ ఇప్పించారు.

సయ్యద్ అహమ్మద్ బరేల్వీ బాల్‌కోట్ రణంలో 1831లో కన్నుమూసాడని తెలిసిన తరువాత, టిటూ మీర్ వహాబీల నూతన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. ఆయన బాద్షా గాను, మొయిజుద్దీన్ మంత్రిగాను, మేనల్లుడు మాసూం సైన్యాధిపతిగాను, బాఖేర్ మొండల్ జమేదారుగా ప్రకటించబడ్డారు. ఈ మేరకు ఆయా ప్రాంతాల జమీందారులకు సమాచారమిస్తూ, అవసరమైన వస్తువులను పంపాల్సిందిగా, పన్నులు కట్టాల్సిందిగా అదేశిస్తూ అజ్ఞాపత్రాలను పంపారు. ఈ పత్రాల మీద **'మీర్ నిస్సార్ అలీ కుమారుడు టిటూ మీర్'**

అని ఆయన సంతకాలు చేశారు. ఈ లేఖలు జమీందారులలో కలవరం కలిగించాయి.

టిటూమీర్ చర్యలను తొలుత కంపెనీ అధికారులు అంతగా పట్టించుకోలేదు. పూర్వా గ్రామం మీద దాడి జరుగకముందే అధికారులకు సమాచారం తెలిసినా ఫలితం లేకుండాపోయింది. ఆయన దళాలు బలపడే కొద్ది పోలీసు అధికారుల నుండి, నీలి మందు పంటను పండిచేందుకు ఇండియా వచ్చిన బ్రిటీషు **ప్లాంటర్ల** నుండీ ఫిర్యాదులు రావటంతో ఆంగ్ల అధికారులు మేల్కొన్నారు. ఈ తిరుగుబాటును అణిచివేయడానికి కలకత్తా కమీషనర్ బరాసత్ జాయింట్ మెజిస్ట్రేట్ డేవిస్‌కు ప్రత్యేక ఆదేశాలిచ్చి పంపారు. టిటూ మీర్ బలగాలను ఎదుర్కోలేక ఆ అధికారి పలాయనం చిత్తగించాడు. మరొక అధికారి అలెగ్జాండర్ చావుతప్పి కన్ను లొట్టపోయి పారిపోయాడు. ఈ తిరుగుబాటు దళాల ధైర్య సాహసాలను వర్ణిస్తూ, తుపాకులు ఎక్కుపెట్టినా, వెనుకంజ వేయకుండా తిరుగుబాటు వీరులు ముందుకు దూసుకు వచ్చేవారని నాడియా జిల్లా మెజిస్ట్రేట్ ఆశ్చర్యం వ్యక్తం చేసిన సంఘటనలు, వహాబీలు, వారి వెంట నడిచిన ప్రజల శౌర్య పరాక్రమాలకు అద్దం పడతాయి. బ్రిటీషు సైనిక–పోలీసు బలగాలు పారిపోయాయని, ప్రాణాలు కాపాడుకోటానికి తాను కూడా పారిపోవటం జరిగిందని, ఆయుధాలతో తరుముకు వస్తున్న తిరుగుబాటు దారుల నుండి తప్పించుకొడానికి 5 మైళ్ళు పరిగెత్తానని ఆ ఆంగ్ల అధికారి రాసుకున్న నివేదికలో ఈ విధంగా వివరించాడు. ("..all most every person on my side running away. and that individual assistance was of no avail,I also was obliged to run for my life,..after running 5 miles I reached."- *Wahabi And Farazi Rebels of Bengal,* Page 40)

ఒకవైపు బ్రిటీషర్ల దాడులను ఎదుర్కొంటూనే, రైతు మీద జులుం ప్రదర్శిస్తున్న ప్లాంటర్ల మీద దాడులు ప్రారంభించారు. బలమైన రక్షణ వ్యవస్థ కలిగిన ప్లాంటర్లు, తిరుగుబాటు దళాలను ఎదుర్కొనలేక ఆత్మరక్షణార్థం కర్మాగారాలు, విలాసవంతమైన భవనాలు వదిలి నగరాలకు పారిపోయారు. జమీందారులు, ప్లాంటర్లను మాత్రమే కాకుండా ఈ శక్తులకు మద్దతు ఇస్తున్న ధనిక వర్గాల పట్ల కూడా టిటూ మీర్ నిర్దాక్షిణ్యంగా వ్యవహరించారు. ఈ సందర్భంగా హిందూ–ముస్లింలనీ బేధాల్ని చూపలేదు. ఒక సందర్భంలో షేర్‌పూర్ గ్రామానికి చెందిన సంపన్నుడు యార్ మోహమ్మద్, జమీందారుకు వత్తాసు పలుకగా ఆయన, ఆయన సోదరుని ఇంటిమీద విధ్వంసకర దాడి జరిగింది. మరో సందర్భంలో టిటూ మీర్‌తో చేతులు కలపగలనని బూష్నా జమీందారు శ్రీమనోహర్ రాయ్, బ్రిటీషర్లను బెదిరించిన సందర్భాలు కూడా ఉన్నాయి.

ఆంగ్లేయ అధికారులను, కంపెనీ బలగాలను తిప్పికొడుతూ టిటూ మీర్ బలగాలు బెంగాల్‌లోని బరాసత్, నాడియా జిల్లాలు, పరిసర ప్రాంతాల మీద పట్టు సంపాదించాయి.





ఈ ప్రాంతాలలో టిటూ మీర్ అనుచరులదే చివరి మాటయ్యింది. కంపెనీ పాలన, జమీందారుల పెత్తనం కనుమరుగైంది. చివరకు ఆయా ప్రాంతాల పోలీసు అధికారులు నివేదికలను చూశాక, జమీందారులు పలు ఫిర్యాదులను సమర్పించాక, కలకత్తా కమీషనర్‌కు ప్రత్యేక అధికారులు కల్పించి, సైన్యాన్ని రంగంలోకి దించారు. మేజర్ స్కాట్ నేతృత్వంలో పది రెజిమెంట్ల కాల్బలం, ఒక అశ్విక దళం, ఫిరంగి దళం, ప్రత్యేక రక్షణదళాలను పంపారు. మేజర్ స్కాట్‌కు సహకరించేందుకు గతంలో టిటూ మీర్ చేతిలో పరాజితుడైన అలెగ్జాండర్, కెప్టెన్ సదర్‌లాండ్‌లను కూడా ఆయన వెంట పంపారు.

ఆ సమయంలో వహాబీల నాయకుడు టిటూ మీర్ తన బలగాలతో నర్కేల్ బరియాలో ఉన్నారు. 1831 నవంబర్ 19వ తేదిన, భారీ బలగాలతో అన్నివైపుల నుండి కంపెనీ అధికారులు వహాబీల కోటను చుట్టు ముట్టారు. టిటూ మీర్ అనుచరులు శత్రు బలగాలను వీరోచితంగా ఎదుర్కొన్నారు. టిటూ మీర్ నేతృత్వంలో విజయమో–వీర స్వర్గమో అంటూ కోటలోని బలగాలు పోరాడసాగాయి. ఆ సమయంలో కంపెనీ అధికారి మెక్‌డొనాల్డ్ దృష్టి టిటూ మీర్ మీద పడింది. ఆయనను గుర్తించాక, ఆయనకు అభిముఖంగా ఫిరంగిని పెట్టి పేల్చటంతో టిటూ మీర్ తీవ్రంగా గాయపడి కుప్ప కూలిపోయారు. ఆంగ్లేయ బలగాలు ముందుకు దూసుకు వచ్చి ఫిరంగులతో టిటూ మీర్ కోటను ధ్వంసం చేశాయి.

ఈ విధంగా తిరుగుబాటు వీరుడు టిటూ మీర్ 1831 నవంబర్ 19న కదనరంగంలో శత్రువుతో పోరాడుతూ కన్నుమూసారు. ఆ అమర వీరుడి భౌతికకాయానికి స్వయంగా తాము అంత్యక్రియలు జరుపుకుంటామని గ్రామస్తులు అభ్యర్థించినా, కాదంటూ ఇస్లాం మత సాంప్రదాయాలకు విరుద్ధంగా మృతదేహాన్ని అంగ్లేయాధికారి అలెగ్జాండర్ తాను స్వయంగా దగ్గర ఉండి దహనం చేయించాడు. ఈ సందర్భంగా అతను మాట్లాడుతూ, " ..If we do not burn his body,Titu Mir will not be totally destroyed. If his followers get hold of his dead body they will start another rebellion. Even his corpse is dangerous. Burn the fort..." ( *Titu Mir* , Mahasweta Devi, Page117) అని భయాన్ని వ్యక్తం చేశాడు.

ఈ రణంలో 50 మంది అమరులయ్యారు. వహాబీల నాయకులనూ, దళాలనూ అలీపూర్ జైలులో బంధించారు. గులాం మాసుంకు ఉరిశిక్ష విధించారు. గ్రామం నడివీధిలో ఆయన భౌతికకాయాన్ని రోజుల తరబడి వేలాడదీశారు. ఈ పోరులో తీవ్రంగా గాయపడిన మీర్ నిస్సార్ అలీ కుమారుడు తోరబ్ అలీ, గౌహర్ అలీకు పలు రకాల శిక్షలు పడ్డాయి. ఈ సంఘటనలో మొత్తం 197 మందికి కఠిన కారాగార శిక్షలు, ద్వీపాంతరవాస శిక్షలు విధిస్తూ తీర్పు చెప్పటంతో, స్వాతంత్ర్య సంగ్రామంలో **బరాసత్ తిరుగుబాటు** గా ప్రసిద్ధి చెందిన పోరాటం తాత్కాలికంగా ముగిసింది. ◆



### దోపిడి శక్తుల గుండెల్లో భయోత్పాతం సృష్టించిన

# 08. హాజీ షరీయతుల్లా

స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో విప్లవకారులకు స్ఫూర్తిదాయకమైన ఉద్యమాలలో ఫరాజీ తిరుగుబాటు ప్రముఖ స్థానం పొందింది. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు భారత దేశంలో నిలదొక్కుకుంటున్న కీలక సమయంలో బ్రిటీషర్ల మీద తిరుగుబాటును ప్రకటించిన ఫరాజీ ఉద్యమాన్ని నిర్మించి, ప్రజలను, ప్రధానంగా గ్రామీణ రైతాంగాన్ని, పోరు బాటన నడిపించిన మహానేత హాజీ షరీయతుల్లా.

తూర్పు బెంగాల్‌లోని ఫరీద్‌పూర్ జిల్లా, బహదూర్ గ్రామాన 1780లో షరీయతుల్లా జన్మించారు. ఆయన తండ్రి అబ్దుల్ జాలిబ్ సన్నకారు రైతు. తల్లిదండ్రులు చేనేత శ్రామికులు. చిన్ననాటి నుండే ఆధ్యాత్మిక చింతన అలవడిన షరియతుల్లా 18వ ఏటనే హజ్ చేయడానికి మక్కా వెళ్ళారు. అక్కడ మహా పండితుడు ' షేక్ తాహిర్ ఉర్ సంభాయల్ మక్కీ' (Shaikh tahir-ur-Sambai-al-Makki) వద్ద శిష్యరికం లభించింది. ఇస్లాం ధార్మిక గ్రంథాలను కఠోర శ్రమతో అధ్యయనం చేశారు. ఆధ్యాత్మిక పండితుడిగా ఖ్యాతి గడించారు.

మక్కాలో చారిత్రక వహాబీ ఉద్యమ నిర్మాత సయ్యద్ అహమ్మద్ బరేల్వీ, పోరాట వీరుడు టిటూ మీర్‌లను ఆయన కలుసుకున్నారు. శుద్ధ ఇస్లాం నుండి దారితప్పుతున్న ముస్లింలను సరైన ధార్మిక మార్గంలో నడిపించడానికి కావాల్సిన కృషిని, అ ప్రయత్నాలకు అడ్డుకాగల ఫిరంగీయుల మీద చేయాల్సిన ధర్మపోరాటం గురించి చర్చించి మార్గాన్ని





నిర్దేశించుకున్నారు. 1802లో మక్కా నుంచి స్వగ్రామమైన ఫరీద్‌పూర్ చేరుకున్నారు. స్వదేశం రాగానే, మక్కాలో సాగిన చర్చలు, ఎంచుకున్న జీవిత లక్ష్యాలకు అనుగుణంగా హాజీ షరియతుల్లా ధార్మిక బోధన ప్రారంభించారు. తూర్పు బెంగాల్‌లోని పలు ప్రాంతాలు, గ్రామాలను ఆయన సందర్శించారు. ఈ మేరకు సాగిన ప్రబోధనల వలన ఫరీద్‌పూర్, బాఖర్‌గంజ్, మైమ్‌సింగ్ ప్రాంతాలలో ఆయనకు మంచి అనుచర వర్గం ఏర్పడటంతో, ప్రస్తుత బంగ్లాదేశ్ రాజధాని ఢాకా (Dacca) సమీపాన గల నవాబారి (Navabari) అను గ్రామాన్ని తన కేంద్రంగా చేసుకుని షరియతుల్లా తన కార్యకలాపాలను ఆరంభించారు.

మాతృదేశం ఆంగ్లేయుల పాలనలో ఉన్నందున, శత్రు దేశంగా ప్రకటించి, ఈ దేశాన్ని శత్రుదేశం నుండి స్వదేశంగా మార్చాలని హాజీ షరీయతుల్లా భావించారు. ఈ మేరకు ఆ లక్ష్యసాధన కోసం నడుం కట్టి, ఆయన మార్గదర్శకత్వంలో సాగిన శిష్యులు **ఫరాజీలు** గా పిలువబడ్డారు. ఆ ఫరాజీలు సాగించిన పోరాటాలు **ఫరాజీ తిరుగుబాట్లు** గా చరిత్రలో గణుతికెక్కాయి.

ఆయన సాగించిన పర్యటనలలో గ్రామీణ ప్రాంతపు ప్రజల, ప్రధానంగా రైతుల, కుల వృత్తులను అనుసరిస్తున్న కుటుంబాల వెతలను గమనించారు. ఈ వెతలకు ఆంగ్లేయ పాలక వర్గాలు, ఆయా వర్గాల తొత్తులైన జమిందారులు, మహాజనులు, అధికారులు ప్రధాన కారణమని గ్రహించారు. ప్రజలను పీడిస్తున్న ఆయా వర్గాల పట్ల ఆయన తీవ్ర అగ్రహం వ్యక్తం చేశారు. ఈ విషయాన్ని గ్రహించిన ఆ దోపిడీ వర్గాలు ఫరాజీలకు వ్యతిరేకంగా ఏకమయ్యాయి. విభజించి పాలించు తరహా పద్ధతులను అనుసరించాయి. ఫరాజీలు ప్రబోధిస్తున్న, ధార్మిక సాంప్రదాయలతో ఏకీభవించని ముస్లింలను ఫరాజీలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టారు. ఈ కుట్రలు, కుయుక్తుల కారణంగా 1831లో రాంనగర్ గ్రామంలో ఫరాజీలకు, జమీందారుల మద్దతుదారుల మధ్య ఘర్షణ జరిగింది. ఆ సంఘటనను పురస్కరించుకుని హాజీ షరియతుల్లా మీద కేసు నమోదు చేసారు. సాక్ష్యం లేకపోవడంతో ఆయనను విడిచి పెట్టాల్సి వచ్చింది. ఆ తరువాత ఆయన నవబారి నుండి ఫరీద్‌పూర్ వెళ్లిపోయారు.

ఈ సంఘటనలు ఫరాజీలను ఏ మాత్రం నిరుత్సాహపర్చలేదు. హాజీ ప్రవచనాలు, ప్రబోధం వలన, ఆయా ప్రాంతాల సామాజిక పరిస్థితుల నేపథ్యంలో ఫరాజీల సంఖ్య అనూహ్యంగా పెరిగే కొద్దీ ప్రజలలో ఆత్మస్థైర్యం పుంజుకోసాగింది. నిర్మాణపరంగా ఫరాజీలు ఒక పద్ధతి ప్రకారంగా సంఘటితమయ్యారు. జమీందారుల అకృత్యాలను ధైర్యంగా ఎదుర్కోటానికి సిద్ధమయ్యారు. జమిందారుల, కంపెనీ అధికారుల పెత్తనం, దోపిడీ చర్యల వలన బాధ పడుతున్న గ్రామీణ పేద రైతాంగం ఫరాజీల వెంట నడిచింది. సంఘటితమౌతున్న ఫరాజీలను నిలువరించకపోతే ఎదురుకానున్న ఇక్కట్లను గుర్తెరిగిన జమిందారులు, ఫరాజీలన

వ్యవస్థను రూపుమాపడానికి పథకాలు సిద్దంచేసుకున్నారు. జమిందారులు, వడ్డీ వ్యాపారులు ఏదో ఒక సాకుతో ప్రజలను హింసించసాగారు. జమిందారుల అణిచివేత, హింసపెరిగే కొద్దీ సామాన్య ప్రజలు ఫరాజీలకు అనుకూలంగా మారసాగారు. జమిందారులు, పాలకవర్గాలు ఊహించినట్టుగా కాకుండా, ఫరాజీల సంఖ్య, ఫరాజీలను సమర్థించే గ్రామీణ రైతుల సంఖ్య క్రమంగా పెరగసాగింది.

బ్రిటీష్ ప్లాంటర్ల మీద, జమిందారులు, మహాజనుల మీద తిరుగుబాటుకు హాజీ షరియతుల్లా పిలుపునిచ్చారు. ఫరాజీల సంఖ్య పెరిగేకొద్ది, ఆయా ప్రాంతాలలో వారికి పట్టు లభించే కొద్దీ అణిచివేత, హింసనూ ప్రజలు ఎదుర్కొవటం ప్రారంభించారు. ప్రజల మీద, ఫరాజీల మీద అణిచివేత ఉధృతం అయ్యేకొద్దీ ప్రతిఘటన పెరిగింది. అణిచివేత పెరిగే కొద్ది ప్రతిఘటన పెరిగింది. పాలక వర్గాల అణిచివేత వికృతరూపం ధరించే కొద్ది ప్రజలు ఆయనకు మరింత చేరువకాసాగారు. జమిందారుల దోపిడి, ప్లాంటర్ల కిరాతక చర్యల నుండి తమను కాపాడేందుకు తరలి వచ్చిన రక్షకుడిగా షరీయతుల్లాను ప్రజలు గౌరవించసాగారు. ఈ విషయాన్ని, Dr. James wise,1894 లో *Journal of the Royal Asiatic Society of Bengal*, part III రాసిన ఒక వ్యాసంలో ".. the more he persecuted, the more did he (*shriathulla)* become the symbol of a new awaking amongst the peasantry. During the next four years he was called upon to face tryannical indogo planters, oppressive *mahajans* and *zamindars,* whenever there had been a case to defend.." అని అన్నాడని *Freedom Movement and Indian Muslims(Page 6)* గ్రంథంలో ప్రముఖ చరిత్రకారుడు డాక్టర్ శాంతి మోయ్ రాయ్ ఉటంకించారు.

ప్రజలకు మార్గదర్శకత్వం వహిస్తూ, పాలక వర్గాల ఉచ్చులలో చిక్కుకోకుండా హాజీ షరీయతుల్లా జాగ్రత్త పడ్డారు. ఫరాజీలు నిర్వహించిన తిరుగుబాట్లకు ఆయన క్రియాశీలక స్పూర్తిని అందించినప్పటికీ బ్రిటీష్ అధికారులు, పోలీసు వర్గాలు, చట్టాలు ఆయన దరి చేరలేకపోయాయి. ఆయన మీద కేసులు నమోదు చేసినప్పటికీ ప్రజాబలం గల ఆయన మీద అరోపించిన నేరాలను రుజవు చేయటం ప్రత్యర్థులకు, పోలీసులకు సాధ్యం కాలేదు. ప్రజాకంటకుల మీద ధ్వజమెత్తటం ప్రారంభించిన ఫరాజీలు, తమ మార్గానికి అడ్డు నిలుస్తున్న ప్రతి ఒక్కరినీ, శత్రువులుగా పరిగణించారు. ప్రజలలో వచ్చిన ఈ మార్పు ఆర్థిక, సాంఘిక, రాజకీయ, మార్పులకు కారణమైంది. ఆ క్రమంలో ఘర్షణ అనివార్యమైంది. ఈ వాతావరణం మూలంగా పలు గ్రామాలలో ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడ్డాయి. జమిందారులు, కంపెనీ పాలకులు ప్రజలను హింసించ సాగారు. ప్రజల మీద జమిందారుల, అధికారుల దాడులు అధికం కావటంతో షరీయతుల్లా వ్యక్తిగతంగా ఘర్షణ వైఖరిని విరమించుకున్నారు. చివరకు





ఆధ్యాత్మిక వ్యవహారాల మీద దృష్టి నిల్పారు. ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడపసాగారు. ప్రజల అణిచివేత, పీడనను, వ్యతిరేకించినందున, శుద్ద ఇస్లాంను, సమానత్వాన్ని బోధించినందున, తూర్పు బెంగాల్ అంతటా షరీయతుల్లా ప్రవచనాలు బాగా ప్రచారం పొందాయి. బలమైన శిష్యవర్గం ఏర్పడింది. ఈ శిష్యులు, ఆ తరువాత ఐయిదు దశాబ్దాల వరకు జరిగిన ఫరాజీల ఉద్యమానికి పటిష్టమైన పునాదులు వేశారు. ప్రజలు, పీడిత ప్రజానీకం, రైతులు ఆయనను తమ తండ్రిలాగా గౌరవించారు. ఆయన చూపిన బాట నడిచారు. ఈ విషయాన్ని కూడా డాక్టర్ జేమ్స్ తన వ్యాసంలో '..his pure and simple life dedicated to the cause of the oppressed, clarity of his social philosophy, his uncomprising and gentle courage made him the beloved idol of the poor who looked upon him as their fathe ', అని పేర్కొంటూ, అనాడు హజీ షరీయతుల్లా సాగించిన కృషికి సాక్ష్యం పలికాడు. ఈ వ్యాసంలో హాజీ షరియతుల్లా కృషిని, ఆయన ప్రజలలో రగిలించిన చైతన్య జ్వాలలను ప్రస్తావిస్తూ, పాలక వర్గాలు, ".. ఆయనను హింసించే కొద్దీ షరీయతుల్లా పేద, పీడిత ప్రజల ప్రతినిధిగా, రైతాంగ నూతన చైతన్యానికి సంకేతం ఆయ్యాడ..' అని డాక్టర్ శాంతిమోయ్ రాయ్ తన *Freedom Movement and Indian Muslims* గ్రంథంలో పేర్కొన్నాడు.

హాజీ షరీయతుల్లా ప్రారంభించిన, ఫరాజీ ఉద్యమం తొలిదశలో మత సంస్కరణల లక్ష్యంతో అవిర్భవించినా, ఆ తరువాత రైతుల ప్రాథమిక సమస్యలకు, తగిన పరిష్కారాలను వాగ్దానం చేసి, అచిరకాలంలోనే తన ప్రధాన బలాన్నీ బలగాన్నీ ఈ వర్గం నుండి సమీకరించు కొగలిందే, అని *Wahabi and Farazi Rebels of Bengal* (Page 90) గ్రంథ రచయిత Dr. Narahari Kavi Raj పేర్కొనటంతో ఫరాజీల ఉద్యమ క్రమ పరిణామం, స్వరూపం, స్వభావం అవగతమౌతుంది.

19 వ శతాబ్దం వరకు అటు బ్రిటీషర్లను, ఇటు జమీందారులను ఎదుర్కొంటూ పులుల్లా పోరాడి, రైతుల తిరుగుబాట్లను విజయవంతం చేయటమేకాక, ప్రజలలో స్వేచ్ఛా కాంక్షను, స్వతంత్ర భావాలను ఉద్దీపింపచేయడంలో హాజీ షరీయతుల్లా ప్రబోధాలతో ప్రభావితమైన ఆయన అనుచరులు ఆ దిశగా చాలా వరకు కృతకృత్యులయ్యారు. అర్ధ శతాబ్ది పైగా ఉధృతంగా సాగి, మరో అర్ధ శతాబ్ది పాటు సమకాలీన సమాజాన్ని ఫరాజీలు ప్రభావితం చేశారు. మాతృభూమి విముక్తిని కాంక్షిస్తూ భారత స్వాతంత్ర్య సంగ్రామంలోని సాయుధ పోరాట యోధులకు స్పూర్తిదాయకంగా నిలచిన ఫరాజీలకు చక్కని మార్గనిర్దేశం చేసిన హాజీ షరీయతుల్లా 1840 లో కన్నుమూసారు. ◆



## బ్రిటీష్ పాలకుల గుండెల్లో గుబులు పుట్టించిన నాయకుడు

# 9. హిక్మతుల్లా ఖాన్

ప్రథమ స్వాతంత్ర్య సమరంలో స్వదేశీ పాలకులూ, ప్రజలు మాత్రమే కాకుండా, బ్రిటీష్ ప్రభుత్వంలో ఉన్నతాధికారులుగా బాధ్యతలు నిర్వహించిన స్వదేశీయులు కూడా పాల్గొని ప్రాణాలర్పించారు. ఆ యోధుల చరిత్రలను బయటకు పొక్కనివ్వకుండా బ్రిటీష్ పాలకులు తొక్కిపెట్టడంతో స్ఫూర్తిదాయకమైన ఆ సంఘటనల వివరాలు మరుగునపడి పోయాయి. చరిత్రపుటలలో దాగి ఉన్నటువంటి అటువంటి చారిత్రక యోధుల జాబితాలో హిక్మతుల్లా ఖాన్ ప్రముఖులు.

ప్రస్తుత ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని (అప్పటి) ఫతేపూర్ జిల్లాకు ఆయన డిప్యూటి కలెక్టర్. బ్రిటీష్ ప్రభుత్వంలోని బంట్రోతు కూడా భారతీయులపై అధికార దర్పం, పెత్తనం చలాయిస్తున్న రోజులవి. ఆ రోజుల్లో డిప్యూటీ కలెక్టర్ అంటే పెద్ద హోదా, అపరితమైన అధికారం, అటువంటి డిప్యూటీ కలెక్టర్ పదవి వరించిన హిక్మతుల్లా ఖాన్ జిల్లా మీద తిరుగులేని అధికారాలు చలాయిస్తున్నారు. ప్రభుత్వాధికారిగా ఉంటూ కూడా స్వదేశీయుల మత సంబంధిత వ్యవహారాలలో అధికారాలు జోక్యం చేసుకుంటే నిరసన తెలిపిన సంఘటనలున్నాయి. పరిపాలనా వ్యవహారాలలో శిక్షణ పేరిట మత ప్రబోధాన్ని సాగిస్తున్న ఆంగ్లేయాధికారుల చర్యలను ఆయన వ్యతిరేకించారు. ఒక సారి శిక్షణ పేరుతో గ్రామ





పట్వారీలను మిషనరీ పాఠశాలకు పంపి అక్కడ శిక్షణ బదులుగా మతబోధ చేయటం, మతగ్రంథాలను ఇవ్వడం పట్ల ఆయన అభ్యంతరం తెలిపారు. ' ( '..they were sent to the Missionary school despite the objection of the Muslim Deputy Collector Hikmathulla Khan ', - *Eighteen Fifty Seven*, Surendra Nath Sen, Govt. of India Publications, New Delhi, 1957, Page10)

అది మార్చి 1857 సంవత్సరం. భారతదేశంలోని స్వదేశీ పాలకులు, ప్రజలు, మాతృదేశంపై అపార ప్రేమాభిమానాలు గల భారతీయ సిపాయిలు, తొలిసారిగా తిరుగుబాటు బావుటాను ఎగురవేసారు. మాతృభూమిని బ్రిటీషర్ల దాస్యంనుండి విముక్తం చేయాలన్న దృఢ సంకల్పంతో ఆయుధం చేతపట్టి కదనరంగానికి కదులుతున్నారు. మే 11వ తేదినాటికి మీరట్‌లోని భారతీయ సైనికుల తిరుగుబాటు ఊపందుకుంది. ఆ జ్వాలలు భారత దేశమంతటా వ్యాపించసాగాయి. ఆడ, మగ భేదం లేదు. జాతి, మత, కులం ఆలోచనలు లేవు. అందరిదీ ఒక్కటే బాట. అందరిదీ ఒక్కటే మాట. అందరిదీ ఒక్కటే లక్ష్యం. అదే ఆంగ్లేయుల పాలన నుండి మాతృభూమి విముక్తి. ఆ సమయంలో హిక్మతుల్లా ఖాన్‌లోని స్వరాజ్య కాంక్షాపరుడైన స్వదేశీ నాయకుడు మేల్కొన్నాడు. డిప్యూటీ కలెక్టర్ పదవిని తృణప్రాయమన్నాడు. కంపెనీ ప్రభుత్వంలో అత్యున్నత పదవిని గిరవాటు వేశాడు.

1857 జూన్ 10వ తేదీన సమర శంఖారావం పూరించాడు. భరత గడ్డ బిడ్డడు శత్రువును తునుమాడేందుకు ఆయుధం చేబట్టాడు. ఫతేపూర్‌లో స్వతంత్ర స్వదేశీ పాలనకు అంకురార్పణ చేసాడు. అప్పుడు ఫతేపూర్ జిల్లాకు కలక్టర్‌గా జె.డబ్ల్యు. షారర్ పని చేస్తున్నాడు. ప్రభుత్వ ఉన్నతాధికారి, అదీ తన క్రింది అధికారి ప్రభుత్వంపై తిరుగుబాటును ప్రకటించటంతో షారర్ ఖంగు తిన్నాడు. ఈ విషయాన్ని ఆ తరువాత జె.డబ్ల్యు షారర్ రాసిన *Life During The Indian Mutiny* లో పేర్కొన్నాడు. అంతేకాకుండా బ్రిటీషు ప్రభుత్వానికి ప్రధాన శత్రువుగా, విద్రోహిగా హిక్మతుల్లాను పేర్కొనటమే కాకుండా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభించిన వారిలో ప్రథముడుగా ఆయనను అభివర్ణించాడు. ( '..Sharar addresses him as number one enemy and traitor of the British and held him solely responsible for the outbreak of Mutiny. - An eassy titled *The Muslim Who Started First War Of Independence*, by S.M.Saad, Published in Islamic Voice(Monthly), March 2000 ). జైళ్ళలోని యోధులను, ప్రజలను విడుదల చేశారు. ప్రభుత్వ ఖజానాలో 9 లక్షల రూపాలను స్వాధీనం చేసుకున్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన ఉన్నతాధికారి సాగించిన ఈ అత్యంత సాహసోపేతమైన చర్యను ఆంగ్లేయ అధికారులు జీర్ణంచుకోలేకపోయారు.

సర్దార్ హిక్మతుల్లా ఖాన్ నాయకత్వంలో ఫతేపూర్‌లో స్వతంత్ర పాలన

ప్రారంభమైంది. ఆ పరిస్థితులకు దిమ్మెర పోయిన బ్రిటీష్ ప్రభుత్వం తేరుకొనేలోపు, ఫతేపూర్‌ను పూర్తిగా ఆధీనంలోకి తెచ్చుకోవటమే కాక, ప్రభుత్వ ఖజానాను కూడా తిరుబాటు యోధులు స్వాధీనం చేసుకున్నారు. ఈ నగుబాటును సహించలేని బ్రిటీష్ అధికారి రాబర్ట్ థక్కర్ విముక్తి పోరాట వీరుల మీద అతి కిరాతకంగా దాడులు ఆరంభించాడు. తిరుగుబాటుదారుడన్పిస్తే చాలు ఎటువంటి తటపటాయంపూ లేకుండా కాల్చివేయమని ఆదేశాలు జారీ చేశాడు. ఈ ఆదేశాలను అవకాశంగా తీసుకుని ఆంగ్లేయాధికారి రాబర్ట్ థక్కర్ స్వేచ్ఛను కాంక్షిస్తున్న నిరాయుధులైన సామాన్య ప్రజల ఊచకోతను సాగించాడు. ఆ చర్యతో తిరుగుబాటు యోధులు మండిపడసాగారు.

సర్దార్ హిక్మతుల్లాకు శ్రీదరియాన్‌సింగ్, శ్రీ శివదయాల్‌సింగ్, శ్రీబాబా గయాదిన్ దుబే, మౌల్వీ లియాఖత్‌ఆలీ, మౌల్వీ అహ్మదుల్లా, జనరల్ తిక్కా సింగ్, జ్వాలా ప్రసాద్ లాంటి తిరుగుబాటు నాయకులంతా అండగా నిలిచారు. ఒక వ్యూహం ప్రకారంగా రాబర్ట్ థక్కర్‌ను ఎదుర్కొన్నారు. పోరు సాగింది. తిరుగుబాటు శక్తుల తెగింపు, ధైర్యసాహసాల ఎదుట బ్రిటీష్ సైనికుల ఆటలు సాగలేదు. బ్రిటీష్ అధికారికి పరాజయం తప్పలేదు. లొంగిపొమ్మంటూ థక్కర్‌కు తిరుగుబాటు నాయకుడు హిక్మతుల్లా వర్తమానం పంపారు. ప్రజలు, తిరుగుబాటుదారుల పట్ల అతి దుర్మార్గంగా వ్యవహరించిన రాబర్ట్ థక్కర్ లొంగుబాటుకు అంగీకరించలేదు. హిక్మతుల్లా ఆదేశాల మేరకు శ్రీబాబా గయాదిన్ ఆ ప్రజా హంతకుడ్ని కాల్చివేశారు. రాబర్ట్ మృతితో బ్రిటీష్ సైనికులు లొంగిపోయారు. బ్రిటీష్ అధికారులు ప్రాణాలను అరచేత పెట్టుకుని పలాయనం చిత్తగించారు. బందా జిల్లా ఛిల్లా అను ప్రాంతంతో తలదాచుకున్నారు.

స్వతంత్ర్య సేనాని హిక్మతుల్లా సహచరులు ఫతేపూరు పాలనను పూర్తిగా స్వాధీనం చేసుకున్నారు. జైళ్ళలో మగ్గుతున్న ప్రజలకు గౌరవంగా స్వేచ్ఛను ప్రసాదించారు. ఆవిధంగా స్వేచ్ఛ పొందినవారంతా సంపూర్ణ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల సాధనకై హిక్మతుల్లా నాయకత్వాన్ని గౌరవించి స్వీకరించారు. స్వదేశీ స్వతంత్ర పతాక ఫతేపూర్‌లో రెపరెపలాడింది. బ్రిటీష్ దాస్యం నుండి విముక్తమైన ఫతేపూర్ స్వేచ్ఛావాయువులను పీల్చుకుంది. ఈ విజయం దేశంలోని తిరుగుబాటు దళాలకు, నాయకులకు ఉత్సాహాన్నిచ్చింది. ఈ పరిస్థితి బ్రిటీష్ గవర్నర్ లార్డ్ కానింగ్‌కు పుండుమీద కారం చల్లినట్టయ్యింది. ఈ పరిణామాలను ఉపేక్షిస్తే బ్రిటీష్ ఆధిపత్యానికి భరత గడ్డ మీద నూకలు చెల్లగలవని గ్రహించిన కానింగ్, హిక్మతుల్లా ఖాన్‌ను అంతమొందించేందుకు, తిరుగుబాటును అణిచేసేందుకు నిర్ణయించాడు.

భారతీయ పాలకులపై దాడులకు, యుద్ధాలకు ప్రఖ్యాతులై జనరల్ హ్యావ్‌లాక్, జనరల్ రోనాల్డ్‌లను అఘమేఘాలమీద రప్పించి, ఫతేపూర్ తిరుగుబాటును అణిచివేసేందుకు





ఆదేశాలిచ్చాడు. తిరుగుబాటు దారుల పరాజయం తప్ప మరేది తాను వినదల్చుకోలేదని జూన్ 20న హుకుం జారీ చేసాడు. ఆదేశాలందుకున్న బ్రిటీష్ సైన్యం ఫతేపూర్ వైపు కదిలింది. దారిలో తీవ్రమైన విధ్వంసం, అమానుష మారణకాండకు పాల్పడుతూ, సైనిక పటాలాలు ముందుకు సాగాయి. బ్రిటీష్ సైన్యాలు యుద్ధానికి సిద్ధమై వస్తున్నాయన్న వర్తమానం అందుకున్న హిక్మతుల్లా మాతృభూమి రక్షణలో ప్రాణాలర్పించ సిద్ధమైన వీరసైనికులతో కలసి పోరుకు సిద్ధమయ్యాడు.

హిక్మతుల్లా ఖాన్ నైజం తెలిసిన బ్రిటీషర్లు ఎత్తులు వేసారు. ఫతేపూర్‌కు బయలుదేరిన హ్యావ్‌లాక్ ఫతేపూర్ సమీపాన గల 'ఖాగా' ను స్వాధీనం చేసుకుని వ్యూహాత్మకంగా అక్కడ తాను ఆగి, రోనాల్డ్‌ను మాత్రం ముందుకు సాగమన్నాడు. రోనాల్డ్ తిరుగుబాటు దళాలను ఎదుర్కొంటూ అతి కష్టం మీద బిలాండాకు చేరుకున్నాడు. తిరుగుబాటు దారుల నుండి తీవ్ర ప్రతిఘటనను చవిచూసిన రోనాల్డ్ దండోపాయాన్ని వదిలి బేధోపాయాన్ని ఆశ్రయించాడు. ఫతేపూర్ సమీపానికి చేరి, అక్కడే తిష్టవేసి పరిస్థితులను అంచనా వేయసాగాడు. పదవులకు, ధనానికి ప్రలోభపడే వారిని చేరదీసి ఆశలు చూపి లోబర్చుకునేందుకు కుటిల యత్నాలను ఆరంభించాడు. చివరకు రోనాల్డ్ ప్రయత్నాలు ఫలించాయి. తిరుగుబాటు యోధులకు సంబంధించిన కీలకమైన సమాచారాన్ని అందించగల విద్రోహులను ఆకర్షించగలిగాడు.

విద్రోహుల ముఠాను మచ్చిక చేసుకున్న సమాచారం అందటంతో జనరల్ హ్యావ్‌లాక్ తన సైనిక బలగాలతో హుటాహుటిన ఫతేపూర్ బయలుదేరాడు. జూలై 12, 1857 కల్లా హ్యావ్‌లాక్ బలగాలు బిలాండ చేరుకున్నాయి. జనరల్ రోనాల్డ్ బలగాలతో కలసి బ్రిటీష్ సైన్యం హిక్మతుల్లా దళాలపై విరుచుకు పడింది. బ్రిటీష్ బలగాలను తిరుగుబాటు దళాలు వీరోచితంగా ఎదుర్కొన్నాయి. మాతృభూమి విముక్తి కంటే తమ ప్రాణాలు పెద్ద విలువైనవి కాదంటూ హిక్మతుల్లా సహచరులు తెగించి భీకర పోరును సల్పారు. భారీ ప్రాణనష్టం జరిగింది. చివరకు బ్రిటీష్ సైనిక దళాలదే పై చెయ్యి అయ్యింది.

స్వతంత్ర సేనాని హిక్మతుల్లా ఖాన్ బ్రిటీష్ సైన్యాధికారులకు చిక్కలేదు. ఆయనను బంధించకపోతే ఈ విజయం వృధా అని భావించిన బ్రిటీష్ అధికారులు హిక్మతుల్లాను బంధించేందుకు సర్వవిధాల ప్రయత్నించారు. చివరకు విద్రోహులు రంగ ప్రవేశం చేసారు. హిక్మతుల్లా ఖాన్ సమాచారాన్ని రాబట్టి బ్రిటీష్ అధికారులకు చేరవేశారు. బ్రిటీష్ సైన్యాలు హిక్మతుల్లా ఖాన్‌ను బంధించేందుకు అన్ని వైపుల నుండి ముట్టడించాయి. విద్రోహుల కుట్ర వలన ఫతేపూర్ ముద్దుబిడ్డడు హిక్మతుల్లా ఖాన్ బ్రిటీష్ సేనాధికారులకు చిక్కారు.

ఫతేపూర్ తిరిగి బ్రిటీషర్ల వశమై పోయింది. ఈ తిరుగుబాటు చుట్టు ప్రక్క ప్రాంతాల

మీద తీవ్ర ప్రభావం చూపించటం వలన, తిరుగుబాటులను తలెత్తనివ్వకుండా దారుణంగా అణచివేయ సంకల్పించిన ప్రభుత్వం తిరుగుబాటు నేతల పట్ల అతి కిరాతకంగా వ్యవహరించింది. హిక్మతుల్లాను భయంకర చిత్రహింసలకు గురిచేసింది. ప్రజలలో, తిరుగుబాటుదారులలో భయోత్పాతం కలిగించేందుకు1857 జూలై 12వ తేదిన హిక్మతుల్లాను ఫతేపూర్‌లోని (ప్రస్తుత) ముస్లిం ఇంటర్ కళాశాల వద్ద గల చింతచెట్టుకు ఉరితీసి, అక్కడే ఆ మహావీరుని భౌతికకాయాన్ని ఓ వారం రోజులపాటు వ్రేలాడదీసారు.

( ' captured by the British after the defeat of the rebels and executed by hanging from a tamarid tree in front of the Muslim Inter College at Fatehpur on July 12, 1857 ', - *Who's Who of Indian Martyrs* (Vol. III), Dr. P.N Chopra, Govt. of India Publications, New Delhi ,1873, Page 55 ). ఆనాడు హిక్మతుల్లా వెంట నడిచిన యోధులను బ్రిటీష్ సేనలు వెంటాడి, వేటాడి వధించాయి. ఆ త్యాగనిరతుల గాథలు మాత్రం తగినంత ప్రాచుర్యానికి నోచుకోకపోవడం అత్యంత దురదృష్టకరం.

ఈ రక్తసిక్త గాథలన్నీ, ఆయా సంఘటనలలో ప్రధాన పాత్రను నిర్వహించిన బ్రిటీష్ అధికారులు తమ స్వదేశంలోని తమ బంధుమిత్రులకూ, ఉన్నత అధికారులకూ రాసిన లేఖలు, రిపోర్టుల ద్వారా మాత్రమే నిక్షిప్తమయ్యాయి. ఆ విధంగా పదిలపర్చబడిన సమాచారం అప్పుడప్పుడు బహిర్గతమవుతోంది. ఆనాటి వీరయోధుల సాహసకృత్యాలను, అద్వితీయ త్యాగాలను తెలుకోవాలంటే ఆయా రికార్డులను ఆశ్రయించక తప్పదు. అసమాన పోరాట యోధుడు హిక్మతుల్లా ఖాన్ చరిత్రకు సంబంధించిన ఎన్నో విషయాలు ఆనాటి జిల్లా కలక్టర్ జె.డబ్ల్యూ. షారర్ జూన్13,1857న తన భార్యకు రాసిన లేఖలో రాశాడు. ఆ లేఖ ప్రకారంగా, **ఫతేపూర్ నుండి తప్పించుకుని వచ్చిన జోసఫ్, థక్కర్ మరణం తెలియచేశాడన్నాడు.ఆ కథనం ప్రకారంగా, ఫతేపూర్ డిప్యూటీ కలెక్టర్ ఆదేశాల మేరకు థక్కర్‌ను కాల్చివేయటం జరిగింది. ఇదంతా మహమ్మదీయుల కుట్ర. జూన్ 10న ఫతేపూర్ డిప్యూటీ మెజిస్ట్రేట్ మరియు కలెక్టర్ నాయకత్వంలోని తిరుగుబాటు దారుల వశమైందని, లార్డ్ కానింగ్ కార్యదర్శులకు ఫ్రాంక్ తెలిపాడు. వారు 9 లక్షల రూపాయల ప్రభుత్వ ఖజానాను స్వాధీన పర్చుకున్నారు. జైళ్ళను తెరచి ఖైదీలను వదిలేసారు. ఆప్రాంతానికి ఒక నవాబును నియమించారు. అయితే పాలనా వ్యవహారాన్ని నడిపేది మాత్రం ఓ డిప్యూటీ కలెక్టర్,** అని వివరించాడు. ( ' ..Poor Joseph has escaped from Fathepur to bring us the news of Mr Thakkar's death. He was shot by order of Deputy Collector. The whole plot at Fathepur was a Mohammadan conspiracy. Frank mentioned to one of Lords Canning's secretaries, that Fathepur was lost at 10th June and fell into the hands of an influential band of Mohammadan conspirators headed by Deputy Magistrate and Collector of the District. They have opened the jail and got posession of the treasury nine lacs. A





Hitler Nawab was setup but the Deputy Collector is the Principal Manager ' - ( *The Muslim Who Started First War Of Independence*, by S.M.Saad, Published in Islamic Voice (Monthly), From Bangalore, March 2000)

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల మీద విరుచుకు పడిన తిరుగుబాటు దళాల అణిచివేత తరువాత, జనరల్ హ్యావ్‌లాక్ ఆ ప్రాంతంలో కనీవినీ ఎరుగని భీభత్సాన్ని సృష్టించాడు. ఈ విషయాన్ని లండన్‌కు రాసిన లేఖలలో ఆయన స్వయంగా రాసుకున్నాడు. ఫతేపూర్‌ను స్వాధీనం చేసుకున్నాక అపారమైన ధనసంపదలను స్వాధీనం చేసుకున్నట్టూ, విధ్వంసం చేసి, పట్టణాలను తగుల పెట్టినట్టూ రాసుకున్నాడు. తిరుగుబాటుదారులెవ్వరినీ వదలలేదని, 12 సంవత్సరాలు నిండిన పఠాన్ బాలుడెవ్వడూ కూడా బ్రతికి బయట పడలేదని అతగాడు పేర్కొన్నాడు. ఘన విజయం సాధించామని గొప్పగా జనరల్ హ్యావ్‌లాక్ స్వయంగా రాసుకున్నాడు. ' ..After cornering Hikmathullah General Haveloc created havoc in the area. In a letter to London General Haveloc wrote that they had achieved a very big victory and that the wealth collected after taking over of Fathepur was indescribable. Fathepur was burning and not even a single pathan child of twelve years was spared during the mass slaughter '. - (Ibid)

స్వదేశీ పాలకులను తొలగించటానికి పూనుకున్న బ్రిటీషర్లను ఎదుర్కొనటం ఒక ఎత్తయితే, బ్రిటీషర్ల స్వాధీనంలోని ప్రాంతాల కోసం పోరాడి, స్వంతం చేసుకోవటం మరోఎత్తు. స్వంతం చేసుకున్న రాజ్యాలను నిలుపుకోవటం, అసంఖ్యాక సైనికబలగాలు గల బ్రిటీషర్లను ఎదుర్కొని నిలువరించటం అసాధ్యం. అటువంటి రోజుల్లో, 32 రోజుల పాటు హిక్మతుల్లా ఖాన్ స్వతంత్ర పాలన సాగించి చరిత్ర సృష్టించాడు. ఫతేపూర్ చారిత్రక పోరాటం గురించి అధ్యయనం చేసిన చరిత్రకారులు, ఈ తిరుగుబాటు మరి కొన్నాళ్లు కొనసాగి ఉంటే ప్రథమ స్వాతంత్ర్యసమరం పరిణామాలు మరోవిధంగా ఉండేవని అభిప్రాయ పడ్డారు. ఈ తిరుగుబాటు విజయం ఎంతటి ఉత్సాహానికి కారణమైందో పరాజయం కూడా అంతటి దురదృష్టకర పరిణామాలకు హేతువైందన్నారు. విద్రోహుల కుట్రకు హిక్మతుల్లా ఖాన్ బలికాకున్నట్టయితే, మరికొంత కాలం జనరల్ హ్యావ్‌లాక్ ఫతేపూర్‌లో హిక్మతుల్లా ఖాన్ సృష్టించిన పరిస్థితులను చక్కదిద్దడానికి ఉండిపోవాల్సి వచ్చేది. ఆ విధంగా బ్రిటీష్ సైనిక ఉన్నతాధికారి హ్యావ్‌లాక్ ఫతేపూరులో కొంతకాలం ఆగిఉండి ఉంటే కాన్పూరు, అలహాబాద్, ఝాన్సీ తదితర ప్రాంతాలకు అపార బలగాలలో ఆయన వెళ్ళగలిగేవాడే కాదు. అసలు ఆ విజయాలు సాధించేవాడు కాదు. ఆ బలగాలు కనుక రాకున్నట్టయితే స్వదేశీపాలకుల పోరాటాలు విఫలమయ్యేవి కావని, చరిత్రకారులు వక్కాణించారంటే ఫతేపూర్‌లో హిక్మతుల్లా ఖాన్ ఆయన అనుచరులు నిర్వహించిన పాత్ర ఎంత విశిష్టమైనదో గ్రహించవచ్చు. ◆



**విముక్తి పోరాటంలో మాతృభూమి కోసం బలైన రణరంగ ధీరుడు**

# 10.' షహీద్ ' పీర్ అలీ

బ్రిటీషర్ల రాజ్య విస్తరణ కాంక్ష వెర్రి తలలు వేసినకొద్ది, ప్రజానీకం మీద వలస పాలకుల దాష్టీకాలు పెరిగే కొద్దీ, భారతీయ జనసముదాయాలలో ఆగ్రహం, స్వదేశీ పాలకులలో అసంతృప్తి హద్దులు దాటింది. ఫలితంగా 1857లో తిరుగుబాటు జ్వలించింది. భారతదేశం మొత్తం అగ్ని పర్వతమైంది. పలు ప్రాంతాలలో తిరుగుబాట్లు రగిలాయి. పలువురు ఈ తిరుగుబాట్లకు నాయకత్వం వహించారు. బ్రిటీషర్లను తీవ్రంగా ప్రతిఘటించిన వారి ప్రస్తావనలు మాత్రమే చరిత్రలో నమోదయ్యాయి. నమోదుకు నోచుకోని వీరోచిత గాథలు ఎన్నో చరిత్ర పుటలలో కనుమరుగై పోయాయి. అలా మరుగునపడిన ఎంతోమంది అమరవీరులు ప్రజల జ్ఞాపకాలకు అందకుండా పోయారు. అటువంటి వీరులలో ఒకరు షహీద్ పీర్ అలీ.

ఆయన బీహార్ రాష్ట్రానికి చెందిన అజీమాబాద్ నివాసి. బ్రిటీషర్ల పై రాజీలేని పోరు సాగించిన **వహాబీ ఉద్యమం** వలన ఆయన ప్రభావితుడయ్యారు. '..పీర్ అలీ మొదట లక్నో నివాసి. పాట్నాలో పుస్తక విక్రేతగా స్థిరపడ్డారు. ఆయన తాను విక్రయించే పుస్తకాలను చదివి స్వాతంత్ర్య భావాలను అలవర్చుకున్నాడు. అతడు చిన్న పుస్తక విక్రేతే అయినా పాట్నా విప్లవ మండలిలో ఆయనకు మంచి గుర్తింపు ఉన్నది. పాట్నాలోని ఆంగ్లేయాధికారి టేలర్ అమానుష చర్యలు ప్రారంభించేసరికి పీర్ అలీకి కోపం ఆగలేదు.





తన దేశీయులు పడుతున్న యమయాతనలను సహించలేక తాను అనుకున్న దానికన్న ముందు తిరుగుబాటు చేశానని తర్వాత తెలియజేశాడు' (*1857 స్వరాజ్య సంగ్రామం*, వి.డి.సావర్కార్, నవయుగ భారతి ప్రచురణలు, హైదరాబాదు, 2001 పేజీ 120)

భారత దేశంలోని పలు ప్రాంతాలలో బ్రిటీషర్లతో పోరుసల్పిన ఆనాటి వహాబీల వారసుడుగా పీర్ అలీ 1857 లో బ్రిటీషర్లపై తిరగబడ్డారు. ఆ పోరులో భాగంగా ఆత్మ గౌరవం, తిరుగుబాటు తత్వం గల స్వదేశీ పాలకులను, నాయకులను సమైక్యం చేసేందుకు ఆయన కృషి సల్పారు. ఈ మేరకు పీర్ అలీ కృషిని ప్రస్తావిస్తూ Dr.Q.Ahamad తన పుస్తకం *The Wahabi Movement in India* (Page 220) లో, '..Great aim of Pir Ali and his collaborator Moshiuzzaman of Lucknow was to effect a coordination of the activities of feeling of idiscontent into powerful and homogeneous movement against the government..' అని పేర్కొన్నారు. స్వదేశీయులలో సమైక్యత, సమన్వయం ద్వారా మాత్రమే బ్రిటీషర్లను తరిమి వేయగలమని నమ్మిన పీర్ అలీ ఆ దిశగా పని చేశారు. తిరుగుబాటు కార్యకలాపాలను సమన్వయ పర్చేందుకు ప్రయత్నాలు చేసారు. ఆనాడు స్వదేశీ పాలకులు తమ రాజ్యాలు అన్నిటికన్నా గొప్పగానూ, తాము అందరికన్నా గొప్పగా భావించటం వలన, అటువంటి స్వదేశీపాలకులను ఏకం చేయాలన్న పీర్ అలీ లాంటి ఐక్యతావాదుల లక్ష్యం పూర్తిగా సిద్ధంచలేదు. భారత దేశంలో అనేక ప్రాంతాలలో బలమైన తిరుగుబాట్లు ఆనాబు జరిగినా అవి విజయవంతం కాకపోవటానికి ప్రధాన కారణం స్వదేశీ పాలకులలో సమన్వయం లోపించటం, ఐక్యత కనిపించక పోవటం అన్నది చరిత్ర ఎరిగిన సత్యం.

పీర్ అలీ లాంటి వీరులు తమ సర్వస్వం త్యాగం చేయటానికి సిద్ధపడినా తిరుగుబాటు నాయకులు కలసికట్టుగా వ్యవహరించక పోవటం, ఆ కారణంగా ఉమ్మడి వ్యూహం కరువు కావటం వలన బ్రిటిషర్లకు తిరుగుబాటును అణచివేయటం సాధ్యమైంది. పీర్ అలీ కూడా తన ప్రయత్నాలు తాను చేసి చివరకు తనతో కలసి వచ్చిన వారితో 1857 జూలై 3న తిరుగుబాటు చేశారు. ( '..On 3 July an uprising was organised by Pir Ali, who was then one of the chief organisers of revolt..', - *Freedom Movement and Indian Muslims*, Santimoy Ray, PPH, 1983, Page 15) ఆయన నాయకత్వంలోని దళం బ్రిటీషర్ల ఆయుధగారం మీద దాడిచేసి ధ్వంసం చేసింది. ఈ పరిణామాలతో ఆగ్రహించిన బ్రిటీష్ సైనికాధికారులు పీర్ అలీ దళాన్ని మట్టుపెట్టేందుకు కంకణం కట్టుకున్నారు. విస్తృతంగా గాలింపు ప్రారంభమైంది.

బ్రిటీష్ పాలకుల పంచన చేరి, వారి కరుణా కటాక్షాల కోసం వెంపర్లాడే తొత్తులు, పీర్ అలీ దళం సమాచారాన్ని బ్రిటీషర్లకు అందించారు. బ్రిటీష్ సైనిక మూకలు ఒక్కసారిగా

దాడి చేసి పీర్ అలీని ఆయన దళం సభ్యులు 43 మందిని అరెస్టు చేశాయి. ఈ యోధులందరినీ నిందితులుగా పేర్కొంటూ ప్రఖ్యాత ' **పాట్నా కుట్ర కేసు** ' సమోదయ్యింది. ఆ కేసు విచారణ సందర్భంగా నిందితుల వాదనకు కనీసం అవకాశం కూడా లేకుండా బ్రిటీషు న్యాయాధికారులు విలియం టేలర్, లోవిస్ విచారణ తంతును పూర్తిచేశారు. ఆ కుట్రకేసులో 19 మందికి ఉరిశిక్ష, 5 గురికి జీవితకారాగార శిక్ష, మిగిలిన వారికి వివిధరకాల శిక్షలు విధించారు. ఆ దళం నాయకుడు పీర్ అలీకి కూడా ఉరిశిక్ష ఖాయమైంది. ఆయన సహచరులకు విధించిన శిక్షలు ఆయన కళ్ళ ఎదుటనే అమలు జరిగాయి. ఆ పరిస్థితి పీర్ అలీలో బ్రిటీషర్ల పట్ల మరింత కసి, ద్వేషాన్ని పెంచింది. సంకెళ్ళతో పూర్తిగా బంధించబడిన పీర్ అలీ సింహంలా గర్జించారు. ఆయనకు కూడా ఉరిశిక్ష విధించారు. ఆ శిక్షను అమలు చేసేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ఆ సమయంలో ఆయన పరిస్థితి ఎలాగుందో, విలియం టేలర్ **పాట్నా సంక్షోభం** *(Patna Crisis)* అను గ్రంథంలో కళ్ళకు కట్టినట్టుగా వివరించాడు. ఆ కథనం ప్రకారంగా, **'..ఆయనకు ఉరిశిక్ష ఆదేశించబడింది. పీర్ అలీ నుండి ఈ కుట్ర వివరాలను రాబట్టేందుకు ఉరిశిక్ష విధించటానికి ముందు నా గదిలోని అధికారుల సమక్షానికి తీసుకువచ్చారు. పూర్తిగా సంకెళ్ళ చేత బంధించబడి ఉన్నాడు. సంకెళ్ళ వలన ఆయన నిలబడలేకున్నాడు. కూర్చోలేకున్నాడు. బాగా అలసి పోయి ఉన్నాడు. శరీరమంతా రక్తసిక్తమై ఉంది. ఆయన ధరించిన వస్త్రాలు బాగా చిరిగి పోయి ఉన్నాయి. రక్తపు చారికలు కట్టి ఉన్నాయి. అత్యంత దయనీయ స్థితిలో ఉన్నా, ఉరిశిక్ష విధించబడినా అతని కళ్ళల్లో కాంతి తగ్గలేదు. భయం జాడలు ఏమాత్రం కన్పించ లేదు. నిర్భయుడైన అంతటి ధైర్యశాలిని మేము చూడలేదు..',** (From Hindusthani Musalmano Ka Jang-e-azadi mein Hissa(HIndi) by Syed Ibrahim Fikri,1999, page 21) అన్నాడు.

ఆ మహాయోధుని తమదారికి తెచ్చుకోడానికి ఆంగ్లేయాధికారులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. ఆ ప్రయత్నాలు విఫలమయ్యాక ఆయనను ఉరి తీయడానికి ఏర్పాట్లు పూర్తి చేశారు. అప్పటికీ బ్రిటీష్ సైనికాధికారులు పీర్ అలీని అంత తేలిగ్గా అంతం చేయదలచుకోలేదు. తిరుగుబాటు రహస్యాలను వీలైనంత మేరకు రాబట్టి తీరాలనుకున్నారు. '..పీర్ అలీ ! నీవు ఇప్పటికైనా ఇతర విప్లవకారుల పేర్లు చెబితే బ్రతికి బయటపడుతావు..' అని ఆంగ్లేయాధికారి అన్నాడు. ఆ రహస్యాలు వెల్లడిస్తే క్షమాభిక్ష ప్రసాదిస్తామని, ఉరిశిక్ష రద్దుకు సిఫారసు చేస్తామని, అందలం ఎక్కిస్తామనీ ఆశలు చూపాడు. ఆ అధికారి వంక పీర్ అలీ ప్రశాంతంగా చూశాడు. ఆ సుఖభోగాల ఆశలు ఆయనను అణుమాత్రం కదిలించలేక పోయాయి. బ్రిటీష్ సైన్యాధికారుల దురాశాపూరిత ప్రకటనలను ఆయన గంభీరంగా విన్నారు.





విప్లవ రహస్యాలు రాబట్టేందుకు నానా తంటాలు పడుతున్న అధికారుల వైపు తిరస్కారంగా చూశారు. తన మాతృదేశ భక్తిని అంత తక్కువగా అంచనా కట్టిన బ్రిటీష్ సైనికాధికారుల నైచ్యాన్ని అసహ్యించుకున్నారు. బ్రిటీషర్లకు తగిన సమాధానమివ్వడానికి ఆయన సిద్ధమయ్యారు.

అతి నీచమైన పద్ధతులకు పాల్పడుతున్న బ్రిటీష్ సైనికాధికారులవైపు చూస్తూ, ఆగ్రహంతో పీర్ అలీ ఇలా అన్నారు.' **..ప్రతి ఒక్కరి జీవితంలో ఒక్కొక్కసారి ప్రాణాలను రక్షించుకోటానికి తెలివిగా ప్రవర్తించాల్సిన అవసరం వస్తుంది. అయితే అన్ని సమయాలలో ప్రాణాలు కాపాడుకోవటమే ప్రధానం కాదు. కొన్ని సమయాలలో ఆశయాల కోసం, మాతృభూమి గౌరవప్రతిష్టల కోసం జీవితాలను పణంగా పెట్టాల్సివస్తుంది. మాతృభూమి కోసం బలికావటం తన భూమి పట్ల గల ప్రేమకు నిదర్శనం అవుతుంది...నా సహచరులను నా కళ్ళ ఎదుటనే ఉరి తీసారు. ఇంకా చాలామందిని ఉరి తీయగలరు. నన్నూ చంపగలరు. అయితే ఒక విషయం గుర్తుంచుకోండి. బలమైన స్వేఛ్ఛా కాంక్షతో, స్వాతంత్ర్యం కోసం రక్తతర్పణలకు సిద్ధమౌతున్న ఈ పుడమి తల్లి బిడ్డలను నిలువరించటం మీకు కాదు కదా, మరే శక్తికీ సాధ్యం కాదు. ఈ రణంలో చిందిన మా నెత్తురు చుక్కల వలన స్వాతంత్ర్య సమరయోధుల శరీరాలలో అగ్ని పుడుతుంది. ఆ అగ్ని జ్వాలల వేడిమిలో మీ ప్రభుత్వం, మీరూ మాడి మసైపోవటం తథ్యం...**' (Ibid, page 21), అంటూ ఆ వీరుడు బ్రిటీష్ పాలకుల భవిష్యత్తును స్పష్టంగా ప్రకటించాడని ఆంగ్లేయ అధికారి విలియం టేలర్ తన గ్రంథంలో పేర్కొన్నాడు.

ఆ సమాధానంతో బ్రిటీష్ సైనిక అధికారులు మండి పడ్డారు. పీర్ అలీని ఉరి తీసేందుకు ఏర్పాట్లు చకచకా జరిగాయి. ఆ ఏర్పాట్లను గమనిస్తున్న పీర్ అలీలో ఏమాత్రం బాధగాని, భయంగాని కన్పించక పోవటం అధికారులను ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఆ సమయంలో పీర్ అలీ ఎలా ఉన్నాడన్న విషయాన్ని, '.. చేతులకు బిగుతైన బేడీలు వేశారు. నెత్తురు కారుతున్నది. తనకై పొంచి చూస్తూన్న మృత్యుదేతను ధిక్కరిస్తూ వీరోచితహాసముతో ఉరికంబము పై నిలబడ్డాడు...' అని వి.డి.సావార్కర్ తన గ్రంథం *'1857 స్వరాజ్య సంగ్రామం '* ( పేజీ 21) లో వివరించాడు.

చివరకు మాతృ భూమిని విముక్తం చేసేందుకు మృత్యువును ప్రేమగా ఆలింగనం చేసుకున్న పీర్ అలీని చాంకీపురాలో 1857 జూలై 7వ తేదిన ఉరితీసారు. ఈ విధంగా అసమాన ధైర్య సాహసాలతో బ్రిటీష్ పాలకులను ఢీకొన్న ' **స్వాతంత్ర్య సంగ్రామ సింహం** ' చరిత్రలో తనదైన ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుని కన్ను మూసింది. ఆ వీరుని మరణం బీహార్ రాష్ట్రంలోని దానపూరులోని విప్లవ విధేయులగు సైనికుల తిరుగుబాటుకు సైగ చేసినట్లయ్యిందని వి.డి సావార్కర్ పేర్కొనడం విశేషం. ◆



## పరాయి పాలనకు చరమగీతం పాడేందుకు ఉద్యమించిన ఉపాధ్యాయుడు

# 11.మౌల్వీ లియాఖత్ అలీ

1857 సిపాయిల తిరుగుబాటును సిపాయిలు ప్రారంభించినప్పటికీ, క్రమక్రమంగా అన్ని వర్గాల ప్రజలు బ్రిటీష్ పాలకుల మీద యుద్ధం ప్రకటించటంతో, ఈ పోరాటం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా ప్రసిద్దిగాంచింది. శ్రీ మంగళ్ పాండే పూరించిన సమర శంఖారావంతో ఊపందుకున్న తిరుగుబాటు భారతదేశం అంతటా వ్యాపించి ప్రముఖ రాజవంశాల ప్రతినిధులు, సైనిక ప్రముఖులు, జమీందారులు తొలి దశలో తిరగబడ్డారు. అనంతరం అభిమానధనులైన ప్రజా నాయకులు రంగ ప్రవేశం చేసారు. ఆ విధంగా కలాలకు శెలవు చెప్పి ఆయుధం చేపట్టి, పోరు సాగించిన ఉపాధ్యాయులలో మౌల్వీ లియాఖత్ అలీ ఒకరు.

ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం అలహాబాద్ జిల్లా చాయిల్ తహసిల్‌లోని ఓ గ్రామంలోని చేనేత కార్మికుల కుటుంబంలో మౌల్వీ లియాఖత్ అలీ జన్మించారు. చిన్నతనంలోనే ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సంపాదించుకుని, విద్యాబోధన చేస్తూ ఉపాధ్యాయుడిగా స్థిరపడ్డారు. మౌల్వీ ధార్మిక మార్గోపదేశం చేస్తూ ప్రజల మన్ననలందుకున్నారు. అలహాబాద్ పరగణాలోని మోహల్లా చౌక్‌లోని సంపన్నురాలు రసూల్ బక్ష్ ఇంట, ఆమె కుమారునికి కొంతకాలం విద్యాబోధన చేసిన మౌల్వీ, భారతీయ సైనికులను పరాయి పాలకులకు వ్యతిరేకంగా కూడ గట్టేందుకు





బ్రిటీష్ సైన్యంలో చేరారు. భారతీయసైనికుల మనస్సుల్లో ప్రభుత్వ వ్యతిరేకతను నూరిపోయటం ప్రారంభించారు. ఆయన ప్రవచనాలు, ప్రయత్నాలు భారతీయ సైనికుల మీద, ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల యువకుల మీద ప్రభావం చూపసాగాయి. మౌల్వీ ప్రయత్నాలను పసికట్టిన అధికారులు ఆయనను సైన్యం నుండి బహిష్కరించారు. ఆ తరువాత మౌల్వీ లియాఖత్ అలీ స్వగ్రామాన్ని చేరుకున్నారు. ఆ గ్రామంలోని ప్రజలకు ధార్మిక మార్గదర్శనం చేస్తూ , ఉపాధ్యాయునిగా సరికొత్త జీవితం ప్రారంభించారు. మహాగావ్‌ను కేంద్రంగా చేసుకుని బ్రిటీష్ వ్యతిరేక ప్రచారాన్ని ప్రారంభించారు. స్వదేశీ పాలనకు పునఃప్రతిష్ట చేయాలనీ, న్యాయమైన హక్కుల సాధన కోసం, ప్రతి ఒక్కరూ ధర్మపోరాటం సాగించాలని ఉద్భోదించారు.

ఆ సమయంలో ఢిల్లీలోని బహుదూర్ షా జఫర్ కేంద్రంగా భారతదేశంలోని పలు ప్రముఖ పట్టణాలలో, గ్రామాలలో రగులుకున్న తిరుగుబాట్లు మౌల్వీ లియాఖత్ అలీని ఉత్తేజితుడ్ని చేసాయి. ఆయన అలహాబాద్ డివిజన్‌లోని పలు ప్రాంతాలలో పర్యటనలు జరిపి బ్రిటీష్ వ్యతిరేకతను ప్రబోధించారు. పరాయి పాలనకు చరమ గీతం పాడాలనీ, స్వదేశీయుల పాలనకు జీవం పోయాలనీ, ఆయన చేసిన ఉత్తేజపూరిత ప్రసంగాలకు సామాన్య ప్రజలే కాకుండా పలు ప్రాంతాల నాయకులు, ప్రముఖులు కూడా ప్రభావితులయ్యారు. బ్రిటీష్ వ్యతిరేకతను పుణికిపుచ్చుకున్న ప్రజలందర్ని ఆయన రంగం మీదకు తెచ్చారు. బ్రిటీష్ పాలకుల మీద సమరశంఖారావం పూరించారు.

ప్రజల పిలుపు మేరకు సమర్ధవంతమైన నాయకత్వం వహించేందుకు మౌల్వీ లియాఖత్ అలీ తిరుగుబాటు రంగం మీద ప్రత్యక్షమయ్యారు. ( "..there came to lead a man..who possesed considerale orgnising powers.." -*The Indian Mutiny Of 1857*, Colonel G.B Malleson, London 1906, page150) భారతీయ సైనికులు, గ్రామీణ ప్రాంతాల ప్రజలు, శిష్యవర్గమైన పలువురు ప్రముఖులు, గ్రామీణ పాలకులు ఆయన వెంట నడిచారు. జూన్ 6వ తేదీన మౌల్వీ తిరుగుబాటు దళాలు అలహాబాద్ పట్టణంలోకి ప్రవేశించాయి. బ్రిటీష్ అధికారులను హతమార్చాయి. పట్టణంలోని బ్రిటీషర్ల తొత్తులు పలాయనం చిత్తగించారు. అలహాబాద్ పట్టణం తిరుగుబాటు దళాల పశమయ్యింది. మౌల్వీని అలహాబాద్ నవాబ్‌గా ప్రజలు ప్రకటించారు. ఢిల్లీ చక్రవర్తి ప్రతినిధిగా లియాఖత్ అలీ పాలనాధికారాన్ని చేపట్టారు. పట్టణంలోని కౌసర్‌బాగ్ (KHUSRU BAGH) కేంద్రంగా చేసుకుని జూన్ 7 వ తేదీ నుండి ఆయన పాలనావ్యవహారాలను ప్రారంభించారు. లక్నో కేంద్రంగా ప్రారంభమైన తిరుగుబాటు ఫలితంగా ఏర్పడిన అస్తవ్యస్థ పరిస్థితులను సరిదిద్దేందుకు, అరాచకాన్ని అణిచివేసి శాంతి భద్రతలను పునఃస్థాపించేందుకు పాలకునిగా మౌల్వీ నడుం కట్టి, పరిస్థితులను ఒక కొలిక్కి తెచ్చారు. పౌర పాలనను పునరుద్ధరించేందుకు

ప్రజల నుండి సూచనలు, సలహాలు స్వీకరించారు. సమర్థవంతమైన పాలన సాగించేందుకు పలు ప్రాంతాలకు అధికారులను నియమించారు. తిరుగుబాటు యోధులు సైఫుల్లా, సుఖ్‌రాయ్, ఖాశిం అలీ ఖాన్, నియామత్ అష్రాఫ్ లను పాలనాధికారులుగా ప్రకటించారు. భాకా ప్రాంతపు జమీందారు ఫజులుల్లా ఖాన్‌ను సైన్యాధిపతిగా నియమించారు. ఏరోజు కా రోజు నాటి పరిపాలనా వ్యవహారాలను, పాలనా పరమైన నిర్ణయాలను ఢిల్లీ చక్రవర్తికి నివేదించసాగారు. మౌల్వీ లియాఖత్ అలీ పరిపాలనా దక్షతను గమనించి అలహాబాద్ డివిజన్‌లోని 24 గ్రామాల ప్రజలు ఆయనను పాలకునిగా అంగీకరించారు. బ్రిటీష్ పాలనతో విసుగు చెందిన అనేక గ్రామాల ప్రజలు, ప్రముఖులు ఆయనకు మద్దతు తెలిపారు. ఆ పరగణాలోని 40 గ్రామాల ప్రజల మన్నన పొంది పాలకునిగా గౌరవాభిమానలందుకున్నారు. ప్రజాబలం సంపాదించుకున్న మౌల్వీ తన పరగణాలో బ్రిటీష్ పాలకుల ఛాయలు కూడా లేకుండా చేసారు. అస్తవ్యస్థమైన పౌరపాలనా వ్యవస్థను చక్కదిద్ది శాంతి భద్రతలను పునః స్థాపించారు.

బ్రిటీషర్ల అధీనంలోనున్న అలహాబాద్ కోట మాత్రం తిరుగుబాటు వీరులకు దక్కలేదు. బ్రిటీష్ సైన్యం, అధికారులు కోటలో ఉడిపోయారు. కోటను స్వాధీనం చేసుకుంటేగాని తిరుగుబాటు సఫలీకృతం కాదని మౌల్వీ భావించారు. ఖుల్దాబాద్ వద్ద సమావేశమైన తిరుగుబాటు వీరులు మౌల్వీ నాయకత్వంలో కోటను పట్టుకోవాలని నిర్ణయించారు. తిరుగుబాటు యోధుల వద్ద రెండు ఫిరంగులు ఉన్నాయి. శతృవును ధైర్యంగా ఎదుర్కొనేందుకు మౌల్వీ సైన్యాన్ని సన్నద్ధం చేసుకుంటున్నంతలో బెనారస్ నుండి బ్రిటీష్ సైనికాధికారి జనరల్ నీల్ (General Neill) జూన్ 11న అలహాబాద్ కోటకు చేరుకున్నాడు. మౌల్వీ ఆలోచనలను పసిగట్టిన జనరల్ నీల్ తక్షణమే కట్టుదిట్టమైన చర్యలు తీసుకున్నాడు. మౌల్వీ కోట మీద దాడి జరపక ముందే తిరుగుబాటు బలగాల మీద ఆతడు దాడి చేసాడు. బ్రిటీష్ సైన్యాలు కుస్‌రూబాగ్‌ను అన్ని వైపుల నుండి చుట్టుముట్టాయి. మౌల్వీ స్వయంగా రణభూమికి కదలి వచ్చారు. భీకర పోరుసాగింది. మౌల్వీని తప్పించుకోవాల్సిందిగా సహచరులు ఒత్తిడి మేరకు జూన్ 17 వ తేదిన మౌల్వీ తప్పించుకున్నారు.

బ్రిటీష్ గూఢాచారుల ప్రయత్నాలను వమ్ము చేస్తూ అలహాబాద్ పరగణా నుండి మౌల్వీ తప్పించుకున్నారు. బ్రిటీష్ సైన్యాన్ని సవాల్ చేసిన ఆయనను అలా విడిచి పెట్టటం ఇష్టంలేక మౌల్వీని పట్టిస్తే 5 వేల రూపాయల నజరానా ముట్టచెబుతామని గవర్నర్ జనరల్ ప్రకటించాడు. ఈ మేరకు గ్రామాధికారులకు ఆజ్ఞలు జారీ అయ్యాయి. బ్రిటీష్ అధికారుల కళ్ళుగప్పి మారు వేషాలతో తప్పించుకుంటూ, అడుగు పెట్టిన ప్రతిచోటా తిరుగుబాటు భావాలను బలోపేతం చేస్తూ, బ్రిటీష్ వ్యతిరేకతను రెచ్చగొడుతూ మౌల్వీ ముందుకు సాగారు.





ఈ యాత్రలో ఆయన సూరత్, అహమ్మద్ నగర్, దక్కన్‌లోని పలు ప్రాంతాలు సందర్శించారు. ఆ సమయంలో ఆయన వివాహం కూడా చేసుకున్నారు. చివరకు కాన్పూర్ చేరుకున్నారు. కాన్పూరు కేంద్రంగా వలసపాలకుల మీద తిరుగుబాటు జెండా ఎగురవేసిన నానాసాహెబ్ సైన్యాలతో చేతులు కలిపారు. ప్రతికూల పరిస్థితులు ఎదురుకావటంతో, కొంత విశ్రాంతి తీసుకుని, బలగాలను సమకూర్చుకుని తిరిగి ప్రతిఘటనకు పూనుకోవాలని భావించిన మౌల్వీ గుజరాత్ రాష్ట్రంలోని సాచిన్ ( SACHIN) పరగణాకు చెందిన నవాబ్ సహకారం ఆశించాడు. ఆశ్రయం కల్పిస్తానన్న నవాబు నమ్మక ద్రోహానికి పాల్పడి, ఆయన ఆచూకిని బ్రిటీష్ గూఢాచారి దళానికి చేరవేయటం వలన, మౌల్వీని తేలిగ్గా అరెస్టు చేయడం బ్రిటీష్ సైనికులకు సాధ్యమైందని *Freedom Movement and Indian Muslims* (పేజీ 122) లో Prof. SANTIMOY ROY పేర్కొన్నారు.

మౌల్వీ లియాఖత్ అలీ మీద రాజద్రోహం, బ్రిటీష్ అధికారులను, సైనికులను హత్యచేసారని, ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టారని బ్రిటీష్ ప్రభుత్వం ఆరోపించింది. ఈ ఆరోపణల మీద బొంబాయిలో విచారణ జరిగింది. ఈ విచారణ సందర్భంగా ఎంతో నిర్భయంగా మాతృభూమి పట్ల తనకున్న ప్రేమ, అభిమానాలను, వలస పాలకుల పట్ల ఉన్న విద్వేషాన్ని స్పష్టంగా ప్రకటించారు. రాజద్రోహం నేరాన్ని ఆపాదించినందుకు తానేమీ చింతించటం లేదన్నారు. అలహాబాద్ పరగణాలోని బ్రిటీష్ అధికారుల దోపిడీ, అరాచకాల నుండి ప్రజలను కాపాడేందుకు ఆయుధం చేపట్టానని, ప్రజలను సమీకరించి తిరగబడ్డానని పేర్కొన్నారు. బ్రిటీష్ పాలన అంతం కావాలన్నది తన లక్ష్యమని, బహుద్దూర్ షా జఫర్‌ను మాత్రమే తాను చక్రవర్తిగా పరిగణిస్తానని మౌల్వీ ప్రకటించారు. బ్రిటీష్ పాలనను అంతం చేయాలన్న లక్ష్యంతోనే పోరుబాట నడిచానన్నారు. ప్రజల తిరుగుబాటుకు నాయకత్వం వహించినందుకు గర్వపడుతున్నానని న్యాయమూర్తి ఎదుట అంగీకరించారు. భారతీయులు మానవతావాదులని, నైతిక విలువలకు అధిక ప్రాధాన్యతనిస్తారని ఆయన వివరిస్తూ, మహిళల పట్ల అత్యంత గౌరవం గలవారైనందున ఆంగ్ల మహిళలకు ఎటువంటి హాని జరగకుండా చూసామన్నారు. స్వదేశీయుల పాలనను పునఃస్థాపించేందుకు తిరగబడిన ప్రజల నాయకునిగా తన ప్రాణాలను బ్రిటీష్ న్యాయస్థానాలు హరించినా ఎటువంటి బాధలేదన్నారు. మాతృభూమి విముక్తి కోసం ఆరంభమైన పోరాటంలో భాగంగా ప్రాణాలు విడవటాన్ని మహత్తర అవకాశంగా భావిస్తానన్నాడు. బ్రిటీషు పాలకులు ఆయనకు ఆజన్మ ద్వీపాంతరవాస శిక్ష విధించి అండమాన్ దీవులకు పంపగా, కొంతకాలం తరువాత మౌల్వీ లియాఖత్ అలీ అండమాన్‌లో ప్రాణాలు విడిచారు. ◆



**మరఫిరంగి మారణకాండలో తునాతునకలైన**

# 12. షహీద్ సుబేదార్ అహమ్మద్

బ్రిటీష్ పాలకుల దాష్టీకానికి వ్యతిరేకంగా, బానిస బంధాల నుండి విముక్తిని కోరుకుంటూ సాగిన మహత్తర పోరాటంలో ప్రాణాలను తృణప్రాయంగా భావించిన వీరులు బ్రిటీష్ పాలకుల వద్ద సైనికులుగా పని చేస్తున్నా, బ్రిటీషర్ల తొత్తులైన స్వదేశీ పాలకుల వద్ద జీవన భృతి నిమిత్తం సైనికులుగా చేరి తమ ప్రాణాలను పణంగా పెట్టి పోరాడుతున్నా, భారతీయ సైనికులను ' దాస్య భావన ' పట్టి పీడిస్తూ ఉంది.

హృదయంలో బడబాగ్నులను దాచుకుని యజమాని ఆదేశాలను తు.చ తప్పక పాటిస్తున్న మాతృదేశముద్దు బిడ్డలకు, 1857లో రగిలిన తిరుగుబాటు మహత్తరమైన అవకాశం కల్పించింది. తాము పుట్టి పెరిగిన గడ్డమీద తెల్లవాడు పాలన చేయటం సుతరాము ఇష్టం లేని సైనికులు భారత దేశంలో ఏ ప్రాంతాన ఉన్నా, ఏ స్థితిలోనున్నా తమతో కలసి వచ్చే సహచర సైనికులతో, పౌరులతో కలసి ఎక్కడికక్కడ ఆనాడు తిరుగుబాటు పతాకాలను ఎగురవేశారు. కొన్ని ప్రాంతాలలో విజయం తమ సొంతం కాక తప్పదు అనే ధీమాతో తిరగబడగా, మరికొన్ని ప్రాంతాలలో తమ బలగాల సంఖ్య దృష్ట్యా పరాజయం తప్పదని స్పష్టంగా తెలిసినా తెగించి తిరగబడ్డారు.

బ్రిటీషర్లపై 1780లోనే తిరుగుబాటు చేసిన చరిత్ర ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని





విశాఖపట్టణానికి ఉంది. అప్పట్లో పరాజయం ఎరుగని స్వదేశీ వీరుడు హైదరాలి బ్రిటీష్ సైన్యాలను వీరోచితంగా ఎదుర్కొంటూ, వలస పాలకులలో కంపరం పుట్టిస్తున్న రోజులవి. ఆయన మీద దాడులకు సైన్యం అవసరమై, రాష్ట్రంలోని మచిలీపట్నం, ఏలూరు, విశాఖపట్నంలలో గల సైనిక పటాలాలను సిద్ధం చేయమని స్థానిక సైనికాధికారులకు ఆదేశాలు వచ్చాయి. అయితే హైదరాలి మీద దాడులకు ఇష్టపడని విశాఖపట్నం సైనికులు అధికారుల ఆదేశాలను ఖాతరు చేయలేదు. ఆనాటి తిరుగుబాటుకు ఇదొక్కటే కారణం కానప్పటికీ, స్వదేశీ భావనలతో అధికారుల ఆజ్ఞలను ఖాతరు చేయక, తిరగబడిన ఘనమైన చరిత్ర విశాఖపట్నం సైనికులకుంది.ఆనాటి తిరుగుబాటును పునరావృతం చేస్తూ, బానిసత్వానికి వ్యతిరేకంగా బ్రిటీషర్లతో పోరాడాలన్నదే లక్ష్యంగా 1857లో స్వదేశీ సైనికులు కదన రంగాన్ని ఎన్నుకున్నారు. ఆ విధంగా రణభూమికి కదలి శత్రువుతో పోరాడుతూ ప్రాణాలర్పించిన మేరు నగధీరులైన వీరులలో తెలుగు బిడ్డడు సుబేదార్ అహమ్మద్ ఒకరు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం కాగానే, ఆ జ్వాలలు వింధ్య పర్వతాలు దాటి తిన్నగా ఆంధ్రప్రదేశ్‌ను తాకాయి. రాష్ట్రంలోని పలు ప్రాంతాల ప్రజలు, సైనికులు బ్రిటీష్ పాలకులపై, వారి తొత్తులుగా వ్యవహరిస్తున్న స్వదేశీ పాలకులపై తిరగబడ్డారు. ఆఖరి రక్తపు బిందుకు శరీరం నుండి వొలికిపోయేంత వరకు ప్రతిఘటించారు. ఒక మహత్తర లక్ష్యం కోసం ప్రాణాలను అర్పించారు.

ఆ సమయంలో విశాఖపట్నంలో ఒక బ్రిటీష్ సైనిక పటాలానికి నాయకత్వం వహిస్తున్నారు సుబేదార్ అహమ్మద్. బ్రిటీష్ ప్రభువులను తమ స్వాములుగా అంగీకరించలేక సతమతమౌతున్న అహమ్మద్, ఉత్తరాది నుండి తిరుగుబాటు వీరుల విజయపరంపరలను తెలుసుకుంటూ ఉత్తేజితుడై, తన పటాలంలోని సహచరులను తిరుగుబాటుకు ప్రేరేపించారు. మాతృదేశ విముక్తి, ఆత్మ గౌరవం కోసం విదేశీ పాలకుల పై తిరగబడమని కోరారు. నాయకుని మాటకు విలువనిచ్చిన దేశభక్తులైన సైనికులు తిరుగుబాటుకు సిద్ధమై ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ బావుటాను వినువీధుల్లో ఎగుర వేశారు. సుబేదార్ అహమ్మద్ నాయకత్వంలో తిరుగుబాటు వీరులు సైనిక ఆయుధాగారాన్ని స్వాధీనం చేసుకున్నారు. బ్రిటీష్ అధికారులకు దిక్కు తోచలేదు. అదనపు బలగాల కోసం పై అధికారులను వేడుకోవటం తప్పనిసరైంది. అహమ్మద్ బలగాల కంటే పలురెట్లు ఎక్కువగా గల అదనపు బలగాలు తిరుగుబాటును క్రూరంగా అణచివేశాయి. తిరుగుబాటు చేసిన సైనికులందర్ని సుబేదార్ అహమ్మద్ కళ్ళ ఎదుటనే అత్యంత కిరాతకంగా కాల్చి చంపాయి. ఆ తరువాత తిరుగుబాటుకు నాయకత్వం వహించిన అహమ్మద్‌ను అంతం చేసిన తీరును గమనిస్తే, బ్రిటీష్ సైనికాధికారులకు సుబేదార్ అహమ్మద్ అంటే ఎంత విద్వేషమో వెల్లడవుతుంది.

అహమ్మద్‌ను తొలుత కాళ్ళుచేతులు కట్టివేశారు. అనంతరం ఫిరంగి గొట్టం ముందు భాగాన గల రంధ్రానికి అడ్డంగా బిగించి కట్టారు. ఫిరంగి గొట్టాన్ని మందుతో బాగా దట్టించారు. ఫిరంగిని పేల్చారు. నిప్పులు కక్కుతూ ఫిరంగి పేలింది. ఫిరంగి గొట్టానికి అడ్డంగా కట్టివేయబడిన సుబేదార్ అహమ్మద్ శరీరం తునాతునకలై పొయింది. ఆయన ప్రాణాలు అనంత వాయువులలో కలసిపోయాయి. ఆయనను అత్యంత రాక్షసంగా చంపి బ్రిటీష్ సైనికాధికారులు తమ కసిని తీర్చుకున్నారు. ఆ అసమాన వీరుని భౌతికకాయం ముక్కలు ముక్కలై ఆప్రాంతమంతా చెల్లాచెదురుగా విసిరి వేయబడింది. కఠిన హృదయాలను కూడా కరిగించగల ఆ దృశ్యంతో బ్రిటీష్ కర్కశమూకలు రాక్షసానందాన్ని పొందాయి. మృతుడి పట్ల కనీస గౌరవం కూడా లేకుండా శరీర భాగాలను అక్కడే వదిలేశాయి.

ఈ దృశ్యాన్ని చూడలేకపోయారు విశాఖ వాసులు. ఏమీ చేయలేని నిస్సహయ స్థితి. మనస్సులోనే ఆ ఆమర వీరునికి శ్రద్ధాంజలి ఘటించారు. సుబేదార్ అహమ్మద్ భౌతికకాయం పడి ఉన్న తీరును చూసి చలించి పోయారు. సాహసించి ఛిన్నాభిన్నామైన అహమ్మద్ శరీరభాగాలను ఒక్కచోట చేర్చారు. విశాఖపట్నంలో ఔరంగజేబుచే నిర్మితమైన ఆలంగీర్ మసీదు వెనుక భాగాన గల ' హజ్రత్ ఇస్‌హాఖ్-మదనీ సమాధి ' కి సమీపాన సుమారు 25 మీటర్ల దూరంలో ఆ వీరుని స్మృతి చిహ్నంగా ఓ మీనార్ కూడా నిర్మితమైంది. ఆ నిర్మాణ స్వరూపం చూసిన స్వర్గీయ మొహమ్మద్ గాలిబ్ ఫిదాయి తన రఫ్‌బుక్ లో కొలతలతో సహా చిత్రించుకున్నారు. ఈ చిత్రాన్ని నోట్సును 1996 మే మాసం 13వ తేదిన తీసుకున్నట్టుగా ఆయన తన డైరీలో రాసుకున్నారు.

ఆ చిత్రం ఇలా ఉంది.



ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ యోధుడు సుబేదార్ అహమ్మద్ గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో జన్మించారని ఆయన మీద పరిశోధన చేసిన ' ఇస్లామిక్ సెంటర్ '(విశాఖపట్నం)



వ్యవస్థాపకులు, ప్రముఖ పాత్రికేయులూ అయిన స్వర్గీయ మొహమ్మద్ గాలిబ్ ఫిదాయి, ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆచార్యులు డాక్టర్ ఇ.వి. గంగాధరంలు సంయుక్తంగా జరిపిన పరిశోధనల వలన తెలుస్తుంది. గాలిబ్ ఫిదాయి, శ్రీ గంగాధరంలు రాసిన వ్యాసాల ద్వారా వివరాలు వెల్లడయ్యే దాకా ఆ వీరుని చరిత్ర అతి కొద్ది మందికి తెలుసు. ఆ సాహస వీరుడి సమాచారాన్ని, జాతి జనుల త్యాగాలను ప్రజల దృష్టికి తీసుకు రావాలన్న ఆరాటంతో వృద్ధులైనప్పటికీ, వ్యయప్రయాసలను లెక్కించక శ్రమించి, అ త్యాగమూర్తిని ప్రజల మనోఫలకం మీద ప్రతిష్టించేందుకు జీవించినంత కాలం సుబేదార్ అహమ్మద్ అమరత్వం పొందిన రోజున పలు కార్యక్రమాలను నిర్వహిస్తూ, పత్రికల ద్వారా పలువురికి ఆ చరిత్రను తెలుపుతూ వచ్చారు. ఈ మేరకు, '..**సుబేదార్ అహమ్మద్ యొక్క షహాదత్ ( హత సాక్ష్యం ) కుల, మత, వర్గ, వైషమ్యాలకు అతీతముగా విశాఖపట్టణం వాసులకు గర్వకారణమే కాక గౌరవ చిహ్నమై యున్నది. యీ మహోన్నతమగు షహాదత్ యొక్క సాదృస్యము ఆంధ్ర రాష్ట్రమందెచ్చటను లేదు. మనం ఆ షహాదత్ గూర్చి యెంతగా గర్వించినను, శ్లాఘించినను కొదువయే..**' అని మహమ్మద్ గాలిబ్ ఫిదాయి రాసుకున్న వాక్యాలు షహీద్ సుబేదార్ అహమ్మద్ విషయంలో అత్యుక్తులు కావు.

స్వర్గీయ మహమ్మద్ గాలిబ్ ఫిదాయి లాంటి పరిశోధకులు కరువు కావటం, ప్రభుత్వాలు పట్టించుకోకపోవటం, ప్రజలు మర్చిపోవటంతో ఆ ఆసమాన పోరాట యోధుడు సుబేదార్ అహమ్మద్ లాంటి పలువురు యోధుల అద్వితీయ త్యాగమయ పోరాట చరిత్రలు మరుగున పడిపోతున్నాయి. ◆



### ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అక్షర యుద్ధం చేసిన పత్రికా సంపాదకుడు

# 13. మౌలానా మొహ్మద్ బాఖర్

## (1780-1857)

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో అగ్నికణాల్లా ఎగిసిపడుతున్న విప్లవకారులకు ఉత్తేజాన్నిస్తూ, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల దాష్టీకాలను తూర్పార పడుతూ, మాతృభూమి విముక్తి కోసం ప్రాణాలను పణంగాపెట్టాల్సిన అవసరాన్ని ప్రజలకు నొక్కిచెప్పడంలో స్వదేశీ పత్రికా రంగం ప్రముఖ పాత్రవహించింది. ఆనాడు ఉర్దూలో ప్రచురితమౌతున్న ప్రతి పత్రిక బ్రిటీషర్లకు వ్యతిరేకంగా విప్లవోద్యమానికి జేజేలు పలికింది. ఆనాటి మహత్తర పోరాటంలో శత్రువు మీద అక్షరాగ్నులు కురిపించిన కలంయోధులలో అగ్రగామి మౌలానా మొహ్మద్ బాఖర్ ( Moulana Mohammad Baqar).

మొఘల్ చక్రవర్తుల కాలంలో రాజ్యంలోని విశేషాలను తెలుసుకొనడానికి ప్రత్యేకంగా వార్తాహరుల నియామకం ఉండింది. ప్రముఖ సంఘటనలను రౌతుల ద్వారా, బృందాల ద్వారా రాబట్టుకునేవారు. ఆ విధంగా లభించే సమాచారం ద్వారా తగు నిర్ణయాలు తీసుకోవటం ఆనాటి రివాజు. ఈ వార్తాహరుల యంత్రాంగాన్నే ఈస్ట్ ఇండియా కంపెనీ ఉపయోగిచుకుంది. కంపెనీ కాలంలో వార్తాహరులు, వార్తాహరుల బృందాలు రెండు వర్గాలయ్యాయి. కంపెనీ ఇచ్చే జీతాల కోసం కొందరు కంపెనీ సేవలో గడిపారు. ఈ వర్గం అన్ని రకాల రుగ్మతలకు అలవాటు పడింది. స్వదేశాభిమానం గల వార్తాహరులు స్వంత పత్రికలు నడిపారు. ఆ విధంగా స్వంత పత్రికలు నడిపినవారిలో అత్యధికులు





పరాయిపాలకుల దౌష్ట్యాన్ని ఎండగడుతూ ప్రజల పక్షం వహించారు. ఆ తరువాతి పరిణామాలలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో ప్రజలను ఉత్తేజపరుస్తూ అక్షరమే ఆయుధంగా విదేశీయుల మీద విరుచుకుపడ్డారు.

ఈ మేరకు ఆనాడు ఢిల్లీ నుండి ప్రచురితమౌతున్న ఉర్దూ పత్రికల సంపాదకులలో విశిష్ట సంపాదకునిగా ఖ్యాతిగడించిన మొహ్మద్ భాఖర్ 1780లో ఢిల్లీలో జన్మించారు. ఆయన తండ్రి మొహ్మద్ అక్బర్. ఢిల్లీకి చెందిన ప్రముఖ ముస్లిం ధార్మిక పండితులలో ఆయనొకరు. మౌలానా మొహ్మద్ బాఖర్ ఆయన ఏకైక సంతానం. కుమారుడ్ని ధార్మిక పండితునిగా తీర్చిదిద్దాలన్న ప్రగాఢ కాంక్షతో చక్కని క్రమశిక్షణతో విద్యాబుద్ధులు చెప్పించారు. చిన్ననాటనే అత్యంత శ్రద్ధతో విద్యాభ్యాసం గావిస్తూ, అన్ని విషయాల పట్ల ఆసక్తి చూపారు. చిన్న నాటనే ఆయనలో స్వతంత్రభావనలు పొటమరించాయి. స్వదేశీయుల బానిసత్వం పట్ల ఆయన కలత చెందటం ప్రారంభించారు. ఆయన అంచెలంచెలుగా ఎదుగుతూ ఆనాటి ప్రసిద్ధ ఢిల్లీ కాలేజీ విద్యార్థి అయ్యారు. ఉన్నత విద్యను పూర్తిచేశాక, ఆయన ఢిల్లీ కళాశాలలో అధ్యాపకునిగా ఇతర పలు అధికార పదవులను నిర్వహించారు. ఈ ఉద్యోగాలేవీ ఆయనను సంతృప్తి పర్చలేకపోయాయి. చిన్ననాటనే ఆయన హృదయంలో నాటుకున్న స్వేచ్ఛా-స్వాతంత్ర్య బీజాలు, స్వజనులు అనుభవిస్తున్న బానిసత్వం, ఆయనను నిలువరించలేకపోయాయి.

మౌలానా బాఖర్ జర్నలిజం వైపు మొగ్గు చూపారు. బ్రిటీషు పాలకుల దుష్ట సంకల్పాన్నీ, అధికారుల దాష్టీకాలనూ ఎండగడ్తూ, ప్రజలకు వాస్తవాలు తెలియచేయటంతో పాటుగా వారిలో చైతన్యాన్ని తీసుకురావాలని ఆయన సంకల్పించారు. ఆ దిశగా రచనలు చేయసాగారు. ప్రజలను ఉత్తేజితుల్ని చేస్తూ స్వతంత్ర జీవనానికి మార్గదర్శకం చేసే సమాచారాన్ని ప్రజలకు మరింత చేరువచేయడానికి ఓ స్వంత పత్రిక ఉండాల్సిన అవసరాన్ని ఆయన గుర్తించారు. ఈ మేరకు 1834లో ఆయన స్వంతంగా ముద్రణాలయాన్ని కొనుగోలుచేశారు. ఆ ముద్రణాలయంలో తన రచనలను, తన భావాలతో ఏకీభవించే ఇతరుల రచనలను ఆయన ప్రచురిస్తూ, ఆయా ఆలోచనలను ప్రజలలోకి ప్రవహింపచేయసాగారు. ఆ క్రమంలో ఆయనలో స్వంత పత్రికను ప్రారంభించాలన్న ఆలోచన పొటమరించింది. 1836లో **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** ( Delhi Urdu Akhbar ) అను ఉర్దూ వారపత్రికను మౌలానా బాఖర్ తన ఇంటిలో ప్రారంభించారు. ఈ పత్రిక కంటే ముందుగా ఆయన మరో ఉర్దూ పత్రిక **జూగ్రాఫియా** ను ప్రారంభించి, ఏ కారణంగానో దాని ముద్రణ ఆపివేసి **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** ను ప్రారంభించారు. ఈ మేరకు ' ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ ' ఢిల్లీలో ప్రారంభమైన తొలి ఉర్దూ పత్రిక అయ్యింది.

ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ పత్రిక విషయపరంగానూ, భాష, శైలి పరంగానూ వైవిధ్యం కలిగి పాఠకులను బాగా ఆకట్టుకుని మంచి ప్రాచుర్యం పొందింది. చక్కని భాషతో సొంపైన పదాలతో వెలువడుతున్న ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ లో ఆనాటి ప్రముఖ కవులు బహుద్దూర్ షా జఫర్, మీర్జా గాలిబ్, హఫీజ్ గులాం రసూల్, మీర్జా మొహమ్మద్ అతీ భక్త్, మీర్జా హైదర్ షికో, మీర్జా జీవన్ భక్త్, మీర్జా నూరుద్దీన్ తదితరులు కవితలు రాశారు. ఈ పత్రికలో ప్రముఖ కవులు పలు విషయాల మీద చర్చలు సాగించారు. ఢిల్లీలో ప్రచురితం అవుతున్నా కూడా పలు ప్రాంతాల సమాచారాన్ని రాబట్టుకుని, ఆ సమాచారాన్ని ప్రచురిస్తూ ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ తనదైన ప్రత్యేకతను చాటుకుంది.

ఈ విధంగా ప్రారంభంలో ఓ సాధారణ సాహిత్య-సమాచార పత్రికగా ప్రజలకు అందుబాటులోకి వచ్చిన ఢిల్లీ ఉర్దూ అఖ్బార్, అచిరకాలంలోనే తన స్వభావాన్ని మార్చుకుంది. ఆంగ్లేయాధికారుల తప్పిదాలను, ఆశ్రితపక్షపాతాన్ని విమర్శిస్తూ వార్తలు ప్రచురిస్తూ వ్యాఖ్యానాలు ఆరంభించింది. స్వదేశీయులకు ఎక్కడ అన్యాయం జరిగినా, మరెక్కడైనా అధికారులు స్థానిక ప్రజలపట్ల అనుచితంగా వ్యవహరించినా మౌల్వీ బాఖర్ ఊరుకునేవారు కారు. ఆ విషయాలను ప్రముఖంగా ప్రచురించి ఆ అధికారుల గుట్టును రట్టు చేయసాగారు. శాంతి భద్రతల విషయంలో అధికారుల వైఫల్యాలను, ప్రజలు ఎదుర్కొంటున్న ఇక్కట్లనూ ఆయన సోదాహరణంగా వివరించసాగారు. అధికారుల అహంకారానికి గురైన ప్రజల పక్షం వహించిన మౌలానా అక్షరాలను ఆయుధాలుగా మలచి పోరాటం సాగించారు. ఢిల్లీ నగరంలో ఆంగ్లేయుల అండదండలతో, తమ కండబలంలో ప్రజల మీద హింస, దోపిడీలకు పాల్పడుతున్న దుర్మదాంధులకు వ్యతిరేకంగా ఎంతో ధైర్యసాహసాలతో విమర్శనాస్త్రాలను సంధించారు. భయమెంరగని మౌలానా బాఖర్ తన ప్రాణాలకు ఏర్పడిన ముప్పును కూడా లెక్కచేయక ఢిల్లీ ఉర్దూ ఆఖ్బార్ ను ప్రజల చేతిలో అణ్వాయుధంగా తీర్చిదిద్దారు.

ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ స్వభావంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా 1857లో తిరుగుబాటు ప్రజ్వరిల్లింది. 1857 మే 10న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం కాగానే, మే 17వ తేదీ నుండి సంగ్రామానికి సంబంధించిన విశేషాలను ' సంగ్రామ విశేషాలు ' రూపంలో ఢిల్లీ, అంబాలా, మీరట్, సహరానన్‌పూర్ లాంటి పలు ప్రదేశాలలో ఆరంభమైన పోరాటాల వివరాలను పాఠకులకు అందించారు. ఈ సంచికలో ఆయన ' రాఖిం ఆసిం ' అను పేరుతో ఆంగ్లేయుల చర్యలను ప్రశిస్తూ, పోరాటయోధుల చర్యలను సమర్ధిస్తూ ఓ సుదీర్ఘ లేఖను ఆయన ప్రకటించారు. పటిష్టమైన సమాచార సేకరణ వ్యవస్థతో ఎప్పటికప్పుడు నూతన సమాచారాన్ని రాబట్టుకుంటూ, ఆయా పరిణామాలను ఆయన తనదైన దృక్పథంతో విశ్లేషించారు. భారతావని అంతటా సాగుతున్న పోరాటాల సమాచారాన్ని సేకరించి





ప్రజలను ఉత్తేజితులను చేసే రీతిలో ప్రచురిస్తూ, తిరుగుబాటుకు మద్దతిచ్చారు. ఆంగ్లేయ సైన్యాలతో తలపడుతున్న ప్రజలను, స్వదేశీ యోధులను శ్లాఘించారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులకు, నేతలకు, తిరుగుబాటును ప్రోత్సహించే కవులు-రచయితలకు ఢిల్లీ ఉర్దూ ఆఖ్బార్ వేదికయ్యింది. బహుద్దూర్ షా జఫర్ కూడా ఆ పత్రిక ద్వారా ప్రజలకు సందేశాలు పంపించారు. సాంప్రదాయ బద్ధమైన రీతికి భిన్నంగా ఈనాడు మనం అనుసరిస్తున్న ' **ఫీచర్స్** ' భాషను చక్కని శైలితో సమాచారాన్ని కూర్చి అందివ్వడంతో పాఠకులు ఆ ఫీచర్స్‌ను పలుమార్లు పఠిస్తూ, మిత్రులకు చదివి విన్పిస్తూ సమాచార ప్రచారం గావించసాగారు. బ్రిటీషర్లు తమ పరాజయాలను, స్వాతంత్ర్య సమరయోధుల విజయాల వివరాలను ప్రజలకు చేరకుండా ఉండేందుకు ఎంత ప్రయత్నించినా ఢిల్లీ ఉర్దూ ఆఖ్బార్ ఆ ప్రయత్నాలను వమ్ము చేస్తుండటంతో ఆంగ్లేయాధికారులు మండిపడసాగారు. బ్రిటీషర్ల పరాజయాలను ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ ప్రచురించటం వలన ప్రజలలో వారి పట్ల భయం పోయి, ఆంగ్లేయులను గడ్డిపోచకుంటే హీనంగా చూడటంతో అహంకారం దెబ్బతిన్న అధికారులు మౌలానాను ప్రథమ శత్రువుగా పరిగణించారు.

ప్రజలు హిందూ-ముస్లిం తేడాలు లేకుండా కలసికట్టుగా విజృంభించినట్టయితే విజయం తథ్యమని ప్రకటిస్తూ ఆయన వ్యాసాలు ప్రజలలో ధైర్యాన్ని నూరిపోసేవి. ప్రజలలో సాహస ప్రవృత్తిని మేల్కొల్పేందుకు పురాణాలనూ, చరిత్రనూ ఉటంకిస్తూ, ఆయా పురాణ పురుషులు, చారిత్రక వ్యక్తుల ధైర్యసాహసాలను ఉదాహరిస్తూ ఢిల్లీ ఉర్దూ ఆఖ్బార్ పుంఖానుపుంఖాలుగా వ్యాసాలు ప్రచురిందించిది. ఈ వ్యాసాలలోని కొన్ని వ్యాఖ్యానాలు ఈ విధంగా ఉండేవి.

'.. **యూరపుకు చెందిన ఈ నీచ జాతికి వ్యతిరేకంగా ఒక తిరుగుబాటు చేద్దాం ! ...మోసపూరితంగా మనతో పనులు చేయించుకుంటున్న ఈ దుష్ట నీచులను అంతమొదిద్దాం. వీరి నికృష్ట పాలన అంతమయ్యేదాకా మనకు నిష్క్రమణ లేదు.... మనపూర్వికుల వీరోచిత లక్షణాలను ఆవాహన చేసుకుని..స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయులను అంతం చేద్దాం,** ( ఆంగ్లేయులను ముప్పుతిప్పలు పెట్టిన మౌలానా మోహ్మద్ బాఖర్, వ్యాసకర్త : షబ్నా, గీటురాయి (వారపత్రిక), 18-7-2003, పేజీ 18) లాంటి వ్యాఖ్యానాలు ప్రజలను ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రేరేపించి, ప్రజలను తిరుగుబాటుకు సన్నద్ధులను చేశాయి.

ఈ రకంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ ఉధృతరూపం దాల్చేందుకు ఢిల్లీ ఉర్దూ ఆఖ్బార్ ఎంతగానో దోహదపడింది. 1857 జూన్ సంచికలో, **వీర సిపాయిల్లారా ! ఇంతకు ముందు రాజరికాల్లో మీ సాహసకృత్యాలు ఇప్పటికి భద్రంగా ఉన్నాయి. మహాభారత**

**కాలంలోని భీముడు, అర్జునుడు మీతో ఉన్నారు. ముస్లింలలో అమీర్ తౌ(త్రై)మూరు, చంఘీస్(జ్) ఖాన్, హలాఖు ఖాన్‌ల గొప్ప సైన్యసంపత్తి జ్ఞప్తికి తెస్తున్నాం...ప్రజలకు వీరంతా మార్గదర్శకులే. ఇదేవిధంగా మన స్వాతంత్ర్య సంగ్రామం కూడా చరిత్రలోలిఖించబడుతుంది. ప్రపంచ వ్యాప్తంగా మన వీరోచిత గాథలు చరిత్రలో శాశ్వితంగా నిలచిపోతాయి. మీ వీరత్వం ముందు ఫిరంగులు ఏపాటివి? స్వాతంత్ర్యసముపార్జన కోసం విజృంభించండి,(** అంగ్లేయులను ముప్పుతిప్పలు పెట్టిన మౌలానా మొహ్మద్ బాఖర్, వ్యాసకర్త : షబ్నా, గీటురాయి (వారపత్రిక),18-7-2003,పేజీ19) అని తిరుగుబాటు యోధులలో స్వేఛ్ఛా-స్వాతంత్ర్యాల కోసం పోరాడాల్సిందిగా మౌలానా బాఖర్ ప్రేరణనిచ్చారు.

మౌలానా బాఖర్ కుమారుడు మౌలానా మొహ్మద్ హుసైన్ ఆజాద్ కూడా ఢిల్లీ ఉర్దూ అక్బార్‌లో రచనలు సాగించారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం గురించి **తారిఖే ఇంక్విలాబ్ ఇబరత్ అఫ్‌జా** శీర్షికతో ఆయన రాసిన కవిత చాలా ప్రసిద్ధి చెందింది. ఈ మేరకు తండ్రీ-కుమారులు కలసి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో కలం చేతబట్టి వలస పాలకుల మీద సిరాగ్ని కురిపించారు. ఈ సందర్భంగా ఆయన **' రిసాల-యే-జిహాద్ '** ( *Risala-i-Jihad*,) అను శీర్షికతో ఓ కరపత్రం ప్రచురించారు. ఆ కరపత్రంలో బ్రిటీష వారిని ఈ దేశం నుండి తరిమి కొట్టాల్సిందిగా ప్రజలకు పిలుపునిచ్చారు. ఈ మహత్తర లక్ష్యాన్ని సాధించాలంటే దేశంలోని హిందువులు-ముస్లింలు ఐక్యంగా శత్రువు మీద యుద్ధం సాగించాలని ఆయన ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ( '...Published apamphlet entitled *Risala-i-Jihad*, in which, he called for a holy war by HIndus and Muslims for the explusion of the British from India.' - *Who's Who of Indian Martyrs 1857*, Dr. P.N.Chopra, Vol.III, 1973, page 95)

చివరకు 1857 సెప్టెంబరు 18న తిరుగుబాటు విఫలమై, ఢిల్లీ తిరిగి ఆంగ్లేయ సైన్యం స్వాధీనంలోకి వచ్చింది. ఢిల్లీని అన్ని వైపుల నుండి ముట్టడించి ఏడు రోజులపాటు భయంకర విధ్వంసం సాగించిన బ్రిటీష సైన్యం తిరుగుబాటుకు సహకరించిన వారినల్లా బంధించి నరకయాతనలు పెట్టి క్రూరాతిక్రూరంగా హత్యలు చేసింది. ఆ సమయంలో ఆంగ్లేయాధికారులకు కొరకరాని కొయ్యగా తయారైన మౌలానా మొహ్మద్ బాఖర్ మీద దృష్టి పడి, ఆయన కోసం అన్వేషణ ప్రారంభమైంది. కొంతకాలానికి ఆయన పట్టుబడ్డారు.

మౌలానా చివరి రోజులకు సంబంధించిన సమాచారం అస్పష్టంగా ఉంది. మౌలానా బాఖర్ కుటుంబీకుల కథనం ప్రకారంగా, 1857 డిశంబరు 14వ తేదీన మౌలానా మహమ్మద్ బాఖర్‌ను ఆంగ్లేయులు అరెస్టు చేసి నిర్భంధంలో ఉంచారు. అనంతరం ఆయనను డిశంబరు 17వ తేదిన ఆంగ్ల సైనికాధికారి మేజర్ హడ్సన్ సమక్షానికి తీసుకొచ్చారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల పట్ల అత్యంత పాశవికంగా వ్యవహరించిన మేజర్ హడ్సన్





ఆ రోజున కొందరు పోరాట వీరులను అత్యంత కిరాతకంగా కాల్చి చంపాడు. మౌలానా అరెస్టు గురించి తెలుసుకున్న బాఖర్ కుమారుడు మౌలానా మొహ్మద్ హుసైన్ తండ్రి చివరి చూపుకొసం తన తండ్రి మిత్రులు కల్నల్ సర్దార్ సింగ్ సహకారంతో ప్రయత్నించి, బాఖర్‌ను నిర్భంధంలో ఉంచిన ప్రాంతానికి చేరుకున్నాడు. ఆ సమయంలో తండ్రి బాఖర్ నమాజు చదువుతున్నాడు. మరణం తథ్యమని తెలిపినా కూడా ఏ మాత్రం ఆందోళన లేకుండా ప్రశాంతంగా భగవంతుడ్ని ప్రార్ధన చేసుకుంటున్న తండ్రిని చూసి ఆయన ఎంతో గర్వించాడు. ప్రార్థన పూర్తిచేసుకున్న మౌలానా బాఖర్ ఎదురుగా మారువేషంలో ఉన్న కుమారుడ్ని పోల్చుకున్నారు. ఒకరికొకరు సలాములు తెలుపుకున్నారు. ఈ చూపే మన చివరి చూపన్న విధంగా మౌలానా బాఖర్ కుమారునికి సంజ్ఞ చేశారు. కొంతసేపు తండ్రి సమక్షంలో గడిపాక తండ్రికి సలాములు తెలుపుతూ, మౌలానా మొహ్మద్ హుసైన్ తిరిగి వచ్చేశారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న ప్రతివారినీ నిరాయుధులను చేసి నిర్ధాక్షిణ్యంగా కాల్చివేయడంలో దుష్ట చరిత్ర గల మేజర్ హడ్సన్, మౌలానా బాఖర్‌ను చిత్రహింసలకు గురిచేసి చివరకు కాల్చివేశాడు. ఆ తరువాత ఆంగ్ల సైనికులు మౌలానా గృహం మీద పడి అందుబాటులో ఉన్న ఢిల్లీ ఉర్దూ అక్బార్ పత్రికలను కాల్చివేశారు. బాఖర్ పత్రికా కార్యాలయంలో విధ్వంసాన్ని సృష్టించారు. ఆయన కుటుంబం అస్తిపాస్తులను దోచుకున్నారు. బాఖర్ కుటుంబానికి నిలువ నీడకూడా లేకుండా చేశారు.

ఈ విధంగా మాతృభూమి విముక్తి కోసం సాగిన సాయుధ పోరాటంలో కలాన్ని ఆయుధంగా చేతపూని అక్షరాగ్నులతో శత్రుసంహారంచేస్తూ ప్రాణాలు వదలిన తొలి పత్రికాసంపాకుడిగా మౌలానా మొహ్మద్ బాఖర్ చిరస్మరణీయులయ్యారు. ( '... It is point out that the first martyr of the Indian media to the cause of Independence was Moulvi Mohammed Baqar, Editor, Delhi Akhbar ' - *Media and Muslims in India since Independence*, Ed. by AU Asif, IOS, New Delhi,1998 page 6). ◆

'... యూరపుకు చెందిన ఈ నీచ జాతికి వ్యతిరేకంగా ఒక తిరుగుబాటు చేద్దాం ! ...మోసపూరితంగా మనతో పనులు చేయించుకుంటున్న ఈ దుష్ట నీచులను అంతమొదిద్దాం. వీరి నికృష్ట పాలన అంతమయ్యేదాకా మనకు నిష్క్రమణ లేదు... మన పూర్వీకుల వీరోచిత లక్షణాలను ఆవాహన చేసుకుని..స్వాతంత్ర్య సంగ్రామంలో అంగ్లేయులను అంతం చేద్దాం.' **– మౌలాన మొహమ్మద్ బాఖర్**



బ్రిటీష్ సైనిక తుపాకి గుండ్లకెదురుగా గుండెను నిల్పిన వీరవనిత

# 14. బేగం అజీజున్

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో రాజులు, రాణులు, సంస్థానాధీశులు, స్వదేశీ సైనికులు,సైనికాధికారులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. ఈ వర్గాలు తమ రాజ్యాలను, సంస్థానాలను కాపాడుకోవాలని, అధికారాన్ని చేజారనివ్వరాదన్న కోరికతో బ్రిటీష్ పాలకుల మీద తిరుగుబాటు చేశారు. ఈ రకమైన కాంక్షలేవీ లేకుండా, కేవలం మాతృభూమి మీదగల ప్రేమాభిమానాలతో ప్రాణాలను తృణప్రాయంగా భావించి, నిస్వార్థంగా తిరుగుబాటులో పాల్గొని ప్రాణాలను బలిచ్చిన సామాన్యులున్నారు. అటువంటి వీరనారీమణులలో ఒకరు బేగం అజీజున్.

1832లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బితూర్‌లో బేగం అజీజున్ జన్మించారు. తండ్రి హసీన్ ఖాన్. తల్లి హమీదా బాను. చిన్ననాటనే ఆమె అమ్మను కోల్పోయారు. అజీజున్ మంచి రూపశి. అందాలరాశి అజీజున్ ఆనాటి ప్రసిద్ధ నర్తకి ఉమ్రావ్‌జాన్ ఆదా బృందంలో చేరారు. మంచి నర్తకిగా ఆమె ఖ్యాతిగాంచారు. నాట్య కళ మీద మంచి అభినివేశాన్ని సాధించి అపారంగా ధనాన్ని సంపాదించారు. ఆంగ్లేయులంటే ఆమెకు విపరీతమైన ద్వేషం. బ్రిటీష్ సైన్యంలో సుబేదారుగా పనిచేస్తున్న షంషుద్దీన్ అను సాహసి ఆమెను ప్రేమించాడు. బ్రిటీష్ సైన్యం నుండి తొలిగి, ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు నానా సాహెబ్ కొలువులో



అతను చేరేంతవరకు అతని ప్రేమను ఆమె అంగీకరించలేదు. ఆ తరువాత ఆమె ప్రియుడు ఆ షంషుద్దీన్ తోపాటుగా ఆమె కూడా కాన్పూరుకు వచ్చిచేరియుండవచ్చని చరిత్రకారులు అభిప్రాయం.

కాన్పూరు పాలకుడు శ్రీనానా సాహెబ్ పీష్వా అంటే అజీజున్‌కు భక్తి-గౌరవం. స్వదేశీ సంస్థానాలను అక్రమంగా ఆక్రమించుకుంటున్న కంపెనీ అధికారులంటే అసహ్యం. పరదేశీయులు సాగిస్తున్న అధర్మాన్ని-అన్యాయాన్ని ఎదుర్కోవాలని ఆమె ప్రగాఢంగా వాంఛించారు. ఆ కోర్కె బలపడే కొద్దీ, **సారంగి మహల్** లోని సంగీత నృత్య వినోదాలను, విలాస జీవితాన్ని వదిలి శ్రీ నానా సాహెబ్ పక్షాన నిలిచి బ్రిటీషర్ల దాష్టీకాలకు అడ్డుకట్టవేయాలని భావించారు. ఆ అవకాశం 1857లో రానే వచ్చింది. 1857 జూన్ 4న కాన్పూరులో తిరుగుబాటు ప్రారంభమైంది. శ్రీ నానాసాహెబ్ బ్రిటీషర్ల మీద జూన్ 7వ తేదీన సమరశంఖం పూరించారు. హిందూ-ముస్లింల తేడా లేకుండా, ధర్మాన్ని-దేశాన్ని రక్షించుకునేందుకు కాన్పూరు ప్రజలంతా ఆయుధాలు చేపట్టాల్సిందిగా ఆయన పిలుపునిచ్చారు. ఈ మేరకు హిందీ-ఉర్దూ భాషలలో ఆయన ప్రకటన విడుదల చేశారు. ఆ పిలుపునందుకున్న అజీజున్ సుఖమయ విలాసవంత జీవితాన్ని వదిలి, పరాయి పాలకుల మీద పోరు సాగించేందుకు శ్రీ నానా సాహెబ్ పక్షంలో చేరారు.

అతిత్వరలో షంషుద్దీన్ సహకారంతో అజీజున్ ఆయుధాలు ఉపయోగించటం, గుర్రపు స్వారి నేర్చుకున్నారు. ఆమె సైనిక దుస్తులు ధరించి రణరంగానికి సిద్ధమయ్యారు. మాతృదేశ భక్తిభావనలు గల యువతులను సమీకరించి, ప్రత్యేక మహిళా సైనిక దళం ఏర్పాటు చేసారు. మహిళా సైనిక దళం ఏర్పాటు చేయటమే కాకుండా, వారికి స్వయంగా చక్కని శిక్షణ గరిపి, ఎటువంటి ఉపద్రవాన్నైనా ఎదుర్కోగలిగేట్టుగా తీర్చిదిద్దారు. తుపాకి పేల్చటం, కత్తి తిప్పటం, గుర్రపు స్వారీ చేయటంలో ప్రత్యేక శిక్షణ కల్పించి సుశిక్షితులైన సైనికులుగా తయారు చేసారు. ప్రజల రక్షణతోపాటు, రాజ్యరక్షణ కోసం తమ ప్రాణాలను పణంగా పెడతామని శపథాలు చేయించి, శత్రువును తునుమాడేందుకు, ఏ క్షణాన్నైనా రణరంగ ప్రవేశం చేయడానికి బలగాలను సిద్ధంగా ఉంచారు. ఈ మేరకు మహిళా సైనిక దళాన్ని స్థాపించిన ప్రప్రథమ మహిళగా బేగం అజీజున్ ను కీర్తిస్తూ "*Nana Saheb Peshwa and the War in Independence*" (ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణలు) అను గ్రంథంలో ప్రముఖ రచయిత శ్రీ ఆనంద స్వరూప్ మిశ్రా పేర్కొన్నారు.

బేగం అజీజున్ సమర్థవంతమైన నాయకత్వంలో మహిళా సైనిక దళాలు పలు కార్యక్రమాల భారాన్ని స్వీకరించి శ్రీ నానా సాహెబ్ పోరాటానికి ఎంతగానో తోడ్పడ్డాయి. ఆమె తన బలగంతో నగరం లోని ప్రతి ఇల్లూ తిరుగుతూ, **' మీ లాంటి యువకుల్లో రక్తం**

**చల్లబడిపోయింది. మీలో పౌరుషం చచ్చిపోయిందా? మీ రక్తం ప్రతీకార జ్వాలతో వేడెక్కుతుందా ? లేదా ? మన మోచేతి నీళ్ళు తాగే కుక్కలు మనపై పెత్తనం చలాయిస్తున్నారు. దానిని మనం మౌనంగా భరిస్తున్నాం. మన వీరత్వం, శౌర్య పరాక్రమాలు ఏమైపోయాయి ?** (*అజ్ఞాత వీర గాథలు*, గోవిందస్వరూప్ సింహాల్, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1999, పేజీ30-31) అని ప్రశ్నిస్తూ యువకుల్లో రోషాగ్నిని ప్రజ్వరిల్లచేసింది. యుద్ధ భయంతో సైన్యంలో చేర నిరాకరించిన పురుషుల చేతులకు స్వయంగా గాజులు తొడిగి, వారిలో పౌరుషం రగిలించి తిరుగుబాటు సైనిక బలగాలను బాగా పెంచగలిగారు. స్వాతంత్ర్య సమరయోధులకు ఆహారం, ఆయుధాలను సమకూర్చి పెట్టటం, నాయకులు, సైనికుల మధ్యన సంధానకర్తల్లా వ్యవహరించటం, బ్రిటీష్ సైనికుల కదలికలు గమనించి ఆ విషయాలను తిరుగుబాటు దళాల నాయకులకు చేరవేయటం తదితర బాధ్యతలను నిర్వహించారు. అజీజున్ దళ సభ్యులతో ప్రతి ఇల్లూ తిరిగి సైనికుల కొరకు బట్టలు, ఆహార పదార్థాలను సేకరించి తెచ్చి తిరుగుబాటు వీరుల అవసరాలను తీర్చుతూ, వారికి ఎటువంటి లోటూ కలుగనివ్వకుండా పలు జాగ్రత్తలు తీసుకున్నారు. ప్రధానంగా రణరంగంలో గాయపడిన సైనికుల చికిత్సకు సంబంధించిన కార్యకలాపాలను నిర్వహించటం పట్ల శ్రద్ధను చూపారు. ప్రాణాలకు తెగించిపోరాడుతున్న వీరులు గాయపడి అనాధలుగా ప్రాణాలు విడవటం పట్ల కలతచెందిన ఆమె క్షతగాత్రులకు ప్రత్యేక శ్రద్ధతో సేవలందించారు.

బేగం అజీజున్ తరుచుగా తన మహిళా సైనిక బలగాలతో పురవీధుల్లో కవాతు చేసి ప్రజలనూ, తిరుగుబాటు వీరులనూ ఉత్సాహపర్చేందుకు కృషి సల్పారు. సంపూర్ణ సైనికాధికారి దుస్తులతో, పలు సైనిక చిహ్నాలను అలంకరించుకుని, తుపాకి ఒకవైపు, ఖడ్గం మరోవైపున ధరించి కవాతులలో పాల్గొనటం ఆమెకు అలవాటు. ఆమె నేతృత్వంలో కవాతు సాగుతున్న బజార్లలో ప్రజలు బారులు తీరి నిలబడి, ఆమె రాకకోసం ఎదురు చూస్తూ, ' నానాసాహెబ్ జిందాబాద్-బేగం అజీజున్ జిందాబాద్ ' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలను చేస్తూ ఆనందాన్ని వ్యక్తం చేసేవారని, 1857 జూన్ 16వ తేదిన శ్రీ నానక్ చంద్ అను వ్యక్తి రాసిపెట్టిన సమాచారాన్ని బట్టి తెలుస్తుంది. ఆమె కృషి, నిస్వార్ధ సేవాతత్పరత, కార్యదక్షత, ప్రగతిశీల ఆలోచనలను, శ్రీ నానా సాహెబ్ పట్ల చూపుతున్న విధేయతను గమనించిన శ్రీ నానా కుడి భుజంగా ఖ్యాతి చెందిన ప్రముఖ తిరుగుబాటు వ్యూహకర్త శ్రీ అజీముల్లా ఖాన్ ఆమె సేవలను ఎంతగానో ప్రశంసించారని శ్రీ చంద్ రాసుకున్నారు. (*Encyclopaedia of Muslim Biography*, Ed. by Nagendra Kr. Singh, APH, 2001, page 585)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం అంతమైన తరువాత ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు తిరుగుబాటులో పాల్గొన్న సంస్థానాధీశులు, సైనికాధికారులు, ప్రజల మీద భయంకరంగా





విరుచుకుపడ్డారు. ఆ సమయంలో అధికారి Col. William తయారు చేసిన తిరుగుబాటు దారుల జాబితాలో అజీజున్ మొదటి స్థానంలో ఉన్నారు. ఆమెకు వ్యతిరేకంగా ప్రముఖ వ్యాపారి శ్రీ జానకీప్రసాద్ సాక్ష్యం పలుకుతూ,ఆమె సదా సైనికాధికారి దుస్తులలో , శ్రీనానా సాహెబ్ కోసం ఆమె మహిళా దళాలు పనిచేశాయని ఆంగ్లేయ న్యాస్థానంలో వివరించాడు.

ఈ విచారణలో భాగంగా, బేగం అజీజున్‌ను ఉన్నత సైనికాధికారి General Havelock ఎదుట హాజరు పర్చారు. ఆమె సాహసకృత్యాల గురించి విన్న ఆ అధికారి, ఆమె రూపురేఖలను చూసి ఆశ్చర్యపోయాడు. మగదుస్తుల నుండి ఆమె బయట పడగానే అమె అందచందాలను చూసి పరవశుడయ్యాడు. ఆ సుకుమార సుందరాంగి రణరంగంలో అరివీర భయంకరంగా వ్యవహరించడాన్ని అతడు నమ్మలేకపోయాడు. ఆమె రూపురేఖలను చూసి సమ్మోహితుడైన అతడు ఆమెను శిక్షంచదలచలేదు. ఆమె అపరాధాన్ని అంగీకరించి, క్షమాపణ వేడుకుంటే క్షమించి విడిచిపెట్టగలనని హామీ ఇచ్చాడు. ఆ ప్రతిపాదనను బేగం అజీజున్ నిర్ద్వందంగా నిరాకరించారు. ఆమె ప్రవర్తన చూసి విస్తుపోయిన ఆ అధికారి చివరకు, ' నీకేం కావాలి? ' అని ప్రశ్నించగా, ' బ్రిటీష్ పాలన అంతం చూడాలనుంది', ( I want to see the end of the British rule, ibid page 586), అని ఘాటుగా సమాధానమిచ్చింది. అ సమాధానంతో ఖంగుతిన్న General Havelock ఆమెను కాల్చివేయాల్సిందిగా ఆదేశాలిచ్చాడు.

ఆ ఆదేశాలను విన్న అజీజున్ చిరునవ్వు చిందించింది. తుపాకి గుండ్లకు ఎదురుగా నిలబడింది. ఆమెకేసి గురిపెట్టబడ్డ తుపాలుకు ఒక్కసారిగా గర్జించాయి. ఆ తుపాకుల్లో నుండి గుళ్ళు బయల్పడి ఆమె సుకుమార శరీరాన్ని ఛేదించుకుని దూసుకపోతుండగా' **నానా సాహెబ్ జిందాబాద్**' అంటూ ఆమె నినదించింది. ఆ సింహనాదంతో ఆంగ్లేయ సైనికులు స్థాణువులయ్యారు. అజీజున్ ప్రాణం అనంతవాయువులలో కలిసిపోయింది.

ఆ యోధురాలి వ్యక్తిత్వాన్ని కించపర్చే విధంగా బ్రిటీషు చరిత్రకారులు అవాకులు చవాకులు పేలారు. ("... The British historians and agents of British imperialism, in order to undo her valiant deeds spread rumours....She was an intelligent and valiant living being whose achievements have been deliberately prevented from being known..." *Encyclopaedia of Muslim Biography* - Edited by Nagendra Kr. Singh, page 584) ఆ తరువాత జరిగిన పరిశోధనలు బ్రిటీషర్ల కుట్రలను బయట పెడుతూ, అజీజున్ త్యాగమయ సాహసోపేత చరిత్రను బయటకు తెచ్చాయి. ఆ నాటి కుట్రల కారుమబ్బులను చీల్చుకుంటూ మధ్యాహ్న మార్తాండుడిలా ఆమె వీరోచిత చరిత్ర వెలుగులు విరచిమ్మడంతో, బేగం అజీజున్ చరిత్ర వెలుగులోకి వచ్చింది. ◆

### ఆకస్మిక దాడులతో బ్రిటీష్ సైనిక దళాలను హడలెత్తించిన

# 15. పచ్చ దుస్తుల మహిళ

భారత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో ప్రథమ స్వాతంత్ర్యపోరాటం మహత్తర ఘట్టం. ఈ పోరాటంలో అసామాన్యులు మాత్రమే కాకుండా సామాన్యులు కూడా ఆయుధాలు చేపట్టి మాతృభూమి రక్షణకు పోరాడారు. ప్రాణాలను అర్పించారు. ఈ అర్పణకు వయస్సుతో నిమిత్తం లేకుండా పోయింది. అందరి లక్ష్యం ఒక్కటే ! పరాయి పాలకుల పెత్తనం నుండి మాతృభూమికి విముక్తి కలిగించటం. అందుకోసం ప్రతిఒక్కరూ కొదమసింగాలై పోరాడారు. ఈ మేరకు శతృవును గడగడలాడిస్తూ పోరాటపథంలో అమరత్వం పొందిన అజ్ఞాత మహిళలు ఎందరో ఉన్నారు.ఆ కోవకు చెందిన ' పచ్చదుస్తుల మహిళ ' గా ఖ్యాతిగాంచిన ఓ వీరనారిమణి చరిత్రపుటలలో అస్పష్టంగా దర్శనమిస్తారు.

ఆమె పేరు ప్రస్తావన లేదు. ఆమె ' పచ్చదుస్తుల మహిళ ' గా మిత్రులచే శత్రువులచే గుర్తించబడింది. ఆమె ఎల్లప్పుడు ఆకు పచ్చరంగు దుస్తులలో కన్పించటంతో ప్రజలతోపాటుగా శతృవులు కూడా ఆమెను 'పచ్చదుస్తులమహిళ'గా పిలుచుకున్నారు. ఆమె ప్రజలను బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడమని పిలుపునిచ్చేది. ఆ పిలుపులో ఉన్న ఆకర్షణ ఫలితంగా ప్రజలు అసంఖ్యాకంగా ఆమెను అనుసరించేవారు.ఆమె వెంట నడిచిన దేశభక్తి ప్రపూరితులైన ప్రజలను తీసుకుని ఆంగ్లేయ సైనిక శిబిరాల మీద దాడులు నిర్వహించేది.ప్రజలలో దేశభక్తి భావనలను





కల్గించి, శత్రువుకు వ్యతిరేకంగా ప్రేరేపించి, ప్రజలను వెంట తీసుకుని, ప్రళయ భీకరంగా గర్జిస్తూ బ్రిటీష్ సైనికుల మీద విరుచుకు పడుతుంది. అద్భుత కౌశల్యంతో కత్తి తిప్పుతూ, గురితప్పకుండా తుపాకి పేల్చుతూ, శతృమూకలను చీల్చి చెండాడిన ఈమె పలుసార్లు శతృస్థావరాల మీద విజయవంతంగా దాడులు నిర్వహించింది. ఆమె అనుచరులు యుద్ధరంగం వదలి వెళ్ళినా ఆమె మాత్రం చెక్కుచెదరని ధైర్యసాహసాలతో శత్రువును ఎదుర్కొని, శత్రువు చేతబడకుండా చాకచక్యంగా తప్పించుకున్న ఘట్టాలున్నాయి. ఆ విధంగా తప్పించుకన్న ఆమె ఎక్కడకు వెడుతుంతో, మళ్ళీ ఆమె ఎక్కడ నుండి వస్తుందో, ఎలా వస్తుందో, ఏం చేస్తుందో శతృగూఢచారులకు కూడా చాలా కాలం అంతుబట్టలేదు.

ఈ మేరకు బ్రిటీష్ సైనికుల మీద, సైనిక స్థావరాల మీద ఆమె చేసిన దాడులు, ఆ దాడుల తీరుతెన్నులను చూసిన అదృష్టవంతులు వివరించిన కథనాలు, బ్రిటీష్ అధికారులు రాసుకున్న అధికార,అనధికార లేఖలు ఆమె సాహసకృత్యాలను వెల్లడిస్తున్నాయి. ఆమె సాహసాన్ని ప్రస్తావిస్తూ, ' *బేగమత్ కి అంశూ* ' అను గ్రంథంలో వివరంగా ఆమె సాహసాలను పేర్కొనట్టు ' *భారత్ కే స్వాతంత్ర్య సంగ్రామం మే ముస్లిం మహిళాఓంకా యోగ్‌దాన్* ' ( హిందీ) అను పుస్తకంలో (పేజీ 44లో) రచయిత్రి, అలీఘర్ ముస్లిం యూనివర్శిటీ అధ్యాపకురాలు డాక్టర్ అబిదా సమీయుద్దీన్ ఈ క్రింది విధంగా ఉటంకిచారు.

**'...ఆ మహిళ అద్వితీయ ధైర్యశాలి. ఆమెకు మృత్యుభయం ఏ మాత్రం లేదు. ఫిరంగి గుండ్లు, తుపాకి గుండ్లు కురుస్తున్నా అత్యంత ధైర్యశాలి అయిన సైనికుడి మల్లే నడిచి వెళ్ళేది. ఆమెను కొన్ని సార్లు నడిచి వస్తూ చూశాం. మరికొన్నిసార్లు గుర్రం మీద స్వారీ చేస్తూ కన్పించేది. ఖడ్గ విన్యాసంలో గానీ, గురి తప్పకుండా తుపాకి పేల్చటంలోగాని ఆమె మంచి నేర్పరి. ఆమె ధైర్యసాహసాలను చూసి ప్రజలలో ఉత్సాహం ద్విగుణీకృతమయ్యేది..'**

ఒకసారి బ్రిటీష్ స్థావరం మీద చేసిన దాడిలో తీవ్రంగా గాయపడింది. గుఱ్ఱం మీద నుండి కిందపడిపోయింది. ఆ సమయాన్ని అదునుగా భావించిన శత్రువు ఆమెను చుట్టుముట్టి బంధించాడు. ఆ వీరనారిని బంధించిన లెఫ్టినెంట్ హడ్సన్ కట్టుదిట్టమైన బందోబస్తుతో అంబాలా సైనిక స్థావరానికి ఆమెను పంపుతూ, ఆమె గురించి, ఆమె కార్యకలాపాలను పేర్కొంటూ, అంబాలా సైనిక స్థావరం డిప్యూటీ కమీషనర్‌కు 1857 జూలై 29వ తేదీన ఒక లేఖ రాసాడు. ఆ లేఖలో, "....నేను మీ వద్దకు ఒక ముస్లిం ముదుసలిని పంపుతున్నాను. ఆమె విచిత్రమైన మహిళ. పచ్చదుస్తులు ధరించి, నగరంలోని ప్రజలను తిరుగుబాటు చేయమని రెచ్చగొట్టడం ఆమె పని. స్వయంగా ఆయుధాలు చేపట్టి, తిరుగుబాటుదారులకు నాయకత్వం వహించి, మన సైనిక స్థావరాల మీద దాడులు చేస్తుంది.

పలుమార్లు మన స్థావరాలపై ధైర్యసాహసాలతో విరుచుకుపడింది. ఆమె ఆయుధం చేపడితే ఐదుగురు సాయుధ పురుషులతో పోరాడగల శక్తిమంతురాలని ఆమె బారిన పడిన మన సిపాయిలు చెబుతున్నారు. ఆమె పట్టుబడిన రోజున, శిక్షణ పొందిన సైనికాధికారిలా నగరంలోని తిరుగుబాటుదారులను కూడేసుకుని, మన స్థావరాల మీద దాడి చేసి పోరాడుతూ తీవ్రంగా గాయపడి పట్టుబడింది. ఆమె కదు ప్రమాదకారి. జాగ్రత్త. " అని పేర్కొన్నాడు.

ఈ లేఖను ఖుర్షీద్ ముస్తఫా రిజ్వీ రాసిన ' జంగ్ యే ఆజాది ' అను గ్రంథంలో ప్రచురించారని, ' భారత్ కే స్వాతంత్ర్య సంగ్రామం మే ముస్లిం మహిళాఓకా యోగదాన్ ' ( హింది) గ్రంథంలో ( పేజీ 45) రచయిత్రి డాక్టర్ ఆబిదా సమీయుద్దీన్ ఉటంకించారు. ఈ లేఖతో పాటుగా పలు హెచ్చరికలు చేస్తూ ఆమెను అంబాలలోని బ్రిటీషు సైనిక స్థావరానికి తరలించారు.

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అత్యంత క్రూరుడిగా అపఖ్యాతిని సొంతం చేసుకున్న లెఫ్టినెంట్ హడ్సన్ లాంటి బ్రిటీష్ సైనికాధికారిని ఆమె అసమాన ధైర్యసాహసాలతో, మాతృదేశం పట్ల ఆమెకున్న గౌరవంతో ఆకట్టుకుంది. అ ప్రభావంతో అమెను ' జోన్ ఆఫ్ ఆర్క్ ' తో ఆంగ్లేయాధికారులు కూడా కీర్తించారు. ఆంగ్లేయాధికారి రాసిన లేఖలోని హెచ్చరికలను, ఆ భాషలోని ఆందోళనా తీవ్రతను బట్టి ' పచ్చదుస్తుల మహిళ ' బ్రిటీష్ సైనికాధికారుల గుండెల్లో ఎంతటి గుబులు పుట్టించిందో అర్థం చేసుకోవచ్చు. ఈ మేరకు అంబాలా సైనిక స్థావరానికి పంపబడిన ఆమె అ తరువాత ఏమైందో తెలియరాలేదు. శతృదళాలలో అంతటి భయోత్పాతం సృష్టించి హడలకొట్టిన ఆ యోధురాలిని కిరాతక శతృవు ఏం చేసి ఉంటాడన్న విషయం ఊహించరానిది ఏమాత్రం కాదు. ◆

## ఝాన్సీ రాణి వెన్నంటి నిలిచిన యోధురాలు

# ' ముందర్ '

స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా సాగిన పోరాటాలలో ఝాన్సీ రాణి అక్ష్మీబాయి వెన్నంటి నడిచి అమరత్వం పొందిన యువతులలో ముందర్ అగ్రగామి. రాణి లక్ష్మిబాయికి అంగరక్షకుల్లా ఇరువురు యువతులు మగవేషాల్లో ఆమె వెన్నంటి ఉండేవారు. ఆ ఇద్దరిలో ఒకరు ముందర్.

ఆమె రాణితోపాటు బ్రిటీష్ సైనికాధికారుల తుపాకి గుళ్ళకు బలయ్యారు. అప్పటి సెంట్రల్ ఇండియా ప్రాంతానికి గవర్నర్ జనరల్ ప్రతినిధి రాబర్ట్ హేమిల్టన్ 1858 అక్టోబర్



30వ తేదీన భారత ప్రభుత్వ కార్యదర్శి ఎడ్‌సన్‌కు రాసిన లేఖలో లక్ష్మీబాయి ఏ విధంగా మరణించిందో పేర్కొన్నాడు. ఆ లేఖలో, రాణి వెన్నంటి నీడలా ఒక ముస్లిం యువతి గుర్రం మీద అనుసరించేదని, కొరాకి సరాయి ప్రాంతంలో రాణితోపాటుగా ఆమెకు తుపాకి గుండ్లు తగిలాయని, ఆ ఇరువురు ఒకేసారి నేలకొరిగారని వివరించాడు. ఈ విషయాన్ని *Eighteen Fifty Seven* గ్రంథంలో Dr. Surendra Nath Sen ఆ వివరణను ('.. The Rane was on horse back, and close to her was the female ( a Mohomaden..) who seems never to have left her side on any occasion, these two were struck by bullets and fell ' (P.295)) ఉటంకించారు.

ఈ లేఖలో ఎక్కడా కూడా ఆ యువతి ఎవరన్న విషయాన్ని ప్రస్తావించని కారణంగా ఆమె అజ్ఞాత యోధురాలుగా మిగిలిపోయింది. భారత ప్రభుత్వం 1973లో ప్రచురించిన *Who's Who of Indian Martyrs* Vol. III లో డాక్టర్ పి.యన్. ఛోప్రా ఝాన్సీ రాణితో పాటుగా పలు పోరాటాలలో పాల్గొన్న ముస్లిం మహిళ గురించిన సంక్షిప్త సమాచారం అందించారు. ('..Fought by the side of Maharani Lakshmi Bai during the battles against the Biristish at Jhansi, Koonch, Kapi and Gwalior. Killed in the battle at Kotah-ki-sarai in Gwalior, where the Rani attained martyrdom.' Page 102) అమె పేరు ముందర్ (Mundar) అని ఆయన పేర్కొన్నారు. ఈ వివరణలను, ఆయా కథనాలకు అన్వయించుకుని చూస్తే, ఆ ఆజ్ఞాత యోధురాలు పేరును **ముందర్** గా భావించవచ్చు.

డాక్టర్ పి.యన్. ఛోప్రా సంపాదకత్వంలోని *Who's Who of Indian Martyrs* Vol. III లో పదకొండు మంది సాహస మహిళల ప్రస్తావన తెస్తూ, ఈ మహిళలను సామూహికంగా ఉరితీశారని రశారు. ఆనాడు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన సంగ్రామంలో మొత్తం మీద 255 మంది యువతులు ఆంగ్ల సైన్యాలతో పోరాడుతూ అమరులయ్యారని డాక్టర్.పి.యన్ ఛోప్రా (పేజీ 65) పేర్కొన్నారు. ◆

> 'భారతదేశ ప్రజల్లారా ! (The People of India) ..మన స్వాతంత్ర్య దినోత్సవం ఉదయించింది. ఇంగ్లీషువారు మోసాలకు పాల్పడవచ్చు. ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులనూ, హిందువులకు వ్యతిరేకంగా ముస్లింలనూ రెచ్చగొడతారు. ముస్లింలారా ! మీరు పవిత్ర ఖురానును గౌరవిస్తున్నట్టయితే, హిందువుల్లారా! మీరు గోమాతను ఆరాధిస్తున్నట్టయితే, మీలోని స్వల్ప విభేదాలను మరచి ధర్మయుద్ధంలో చేతులు కలపండి. ఒకే పతాకం కింద పోరాడండి. మన హిందూస్థాన్ మీద ఆంగ్లేయుల పెత్తనం సృష్టించిన మరకలను మీ రక్తంతో శుభ్రం చేయండి.
> – ఖాన్ బహుదూర్ ఖాన్

## ఝాన్సీ రాణిని తిరుగుబాటుకు పురికొల్పిన వీరుడు

# 16. బక్షీష్ అలీ

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో, అసమాన ధైర్యసాహసాలతో పోరాడి వారిలో ఝాన్సీ లక్ష్మీబాయి, బేగం హజ్రత్ మహల్, తాంతియాతోపే, మౌల్వీ అహమదుల్లా షా, ఖాన్ బహుద్దూర్ ఖాన్, రావు సాహెబ్, నానాసాహెబ్ తదితరులు అగ్రభాగాన కన్పిస్తారు. శత్రువును పరాజయం పాల్జేసి, కొంతకాలమైనా నిలువరించి, స్వతంత్ర పాలనకు నాయకత్వం వహించి చరిత్ర సృష్టించిన ఈ నాయకుల వీరోచిత కృత్యాల వెనుక పలువురి అపూర్వమైన త్యాగాలున్నాయి. ఆ యోధుల ప్రేరణ జవజీవాలై పోరాటానికి ప్రాణం పోశాయి. ఆ విధంగా ఝాన్సీరాణి లక్ష్మీబాయిని పురికొల్పిన యోధులలో ఒకరు బక్షీష్ అలీ.

బ్రిటీష్ గవర్నర్ జనరల్ డల్హౌసీ రాజ్య సంక్రమణ సిద్ధాంతం పేరిట ఝాన్సీ రాజ్యాన్ని కూడా కబళించటానికి ఎత్తులు వేశాడు. ఝాన్సీ సంస్థానాధీశుడు గంగాధరరావు తనకు సంతానం లేకపోవడంతో దామోదరరావును దత్తత తీసుకున్నారు. ఆ దత్తత చెల్లదని డల్హౌసీ అన్నాడు. 1854 మార్చిలో గంగాధర రావు కన్నుమూశాక ఝాన్సీ స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయింది. ఝాన్సీ రాణి లక్ష్మీబాయికి సంవత్సరానికి 60 వేల రూపాయల భరణం మంజూరైంది. అది సరిపోని దుస్థితి. గంగాధర రావు ఖజానాలో ఉన్న ఆరు లక్షల రూపాయలను బ్రిటీష్ కంపెనీ పాలకులు స్వాధీనం చేసుకున్నారు. ఆ సోమ్మును ఇవ్వమని రాణి కోరినా, బ్రిటీషర్లు అంగీకరించలేదు. చివరకు కుమారుడు దామోదరరావు ఉపనయనం





ఖర్చులకు అప్పుగా లక్ష రూపాయలు ఇవ్వమన్నా తెల్ల పాలకులు నిరాకరించారు. గత్యంతరం లేక న్యాయబద్ధమైన తన డిమాండుల సాఫల్యం కోసం ఆమె లండన్‌లోని కంపెనీ ఉన్నత అధికారుల వద్దకు తన ప్రతినిధులను పంపినా ప్రయోజనం లేకపోయింది. రాజవంశీకుల సేవలు చేసుకుని బ్రతుకుతున్న కుంటుబాల పోషణ కూడా సక్రమంగా చూడలేని దుర్భర ఆర్థిక పరిస్థితులు రాణికి ఎదురయ్యాయి. ఆ రాజవంశం వైభవాన్ని కళ్ళారా చూసిన దర్బారులోని స్వదేశీ ప్రముఖులకు, ఆంగ్లేయుల చర్యల వలన దుర్భర ఆర్థిక పరిస్థితులను రాజవంశం ఎదుర్కోవాల్సి రావటం సహజంగా ఆగ్రహాన్ని కలిగించింది.

ఆ సమయంలో లక్ష్మణరావు అను ఆలయ నిర్వాహకుడు 1857 జూన్ 4 వ తేదీన ఆంగ్లేయలకు వ్యతిరేకంగా తొలిసారిగా గొంతు విప్పాడు. ఆనాటికి పలు ప్రాంతాలలో తిరుగుబాటు పతాకాలు రెపరెపలాడుతున్నాయి. అటు బెంగాలు ప్రెసిడెన్సీ ప్రాంతంలో రగులుకున్న తిరుగుబాటు జ్వాలల వార్తల గురించి అమన్ ఖాన్ (Aman Khan) అను సిపాయి ఢిల్లీ నుండి ఝాన్సీకి మోసుకొచ్చాడు. ఆయన తిరుగుబాటు సమాచారాన్ని ఝాన్సీకి తెచ్చిన తరువాత ఝాన్సీలో తిరుగుబాటు ప్రజ్వరిల్లింది. ఈ విషయాన్ని ఆంగ్లేయాధికారి Sir Robert Hamilton పేర్కొన్నాడు. ('..a servant or a relation of some one in in my Regiment ( 12th N.I) brought a chit from Dellhi stating that the whole of the Bengal Presidency had mutinied and as the Regimental Station at Jhansee had not done..' – *Eighteen Fifty Seven*, Surendra Nathsen, Govt. of India Publicatrions, New Delhi, Page 271 ) ఈ సమాచారం తెచ్చిన సిపాయి వీరుడికి ఆ తరువాత మరణశిక్ష విధించారు. ఆ వాతావరణంలో లక్ష్మణరావు కేక పొలికేకగా ఝాన్సీలో మారుమ్రోగింది. ఆ ప్రతిధ్వని కాస్తా 1857 జూన్ 5వ తేదీ నాటికి సాయుధ తిరుగుబాటుగా రూపాంతరం చెందింది. ఆ రోజు మధ్యాహ్నం ఒంటి గంట ప్రాంతంలో ఝాన్సీలో తిరుగుబాటు పతాకం ఎగిరింది.

జూన్ 6వ తేదిన తిరుగుబాటు సంపూర్ణ రూపం తీసుకుంది. స్వదేశీపాలనను కోరుకున్న సిపాయిటూ, రాణి పాలన కోరుకుంటున్న ప్రజలు ఏకమయ్యారు. ఆయుధాగారాన్ని స్వాధీనం చేసుకున్నారు. ఖజానాను సొంత చేసుకున్నారు. ఈఅవకాశం కోసం ఎదురు చూస్తున్న జైలు దరోగా బక్షీష్ అలీ స్వదేశీ వీరులకు స్వాగతం పలికారు. ఆయన జైలు ద్వారాలు తెరచి ఖైదీలను విడుదల చేశారు. ( ' On the 6th, however Bakshish Ali, the jail Darogah joined the Mutiny with his guards and the sepoys ' - Ibid, page. 272) **'..ఝాన్సీ రాజవంశానికి జరిగిన అవమానం, కంపెనీ దొరల దుర్మార్గం బక్షీష్ అలీ నిర్ణయానికి కారణమైంది..'**. రాజ వంశం పట్ల అక్రమంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయ అధికారుల మీద దాడులు చేసి పలువుర్ని హతమార్చారు. ఈ భయంకర పరిణామాలకు ఆంగ్లేయ

అధికారులు అదిరిపడ్డారు. ఆంగ్లేయ కుటుంబాలు తమ ప్రాణాలను అరచేత పట్టుకుని రాణి శరణుజొచ్చాయి. ఆ కుటుంబాల రక్షణకు రాణి తన వ్యక్తిగత సిబ్బందిని నియమించింది. ప్రజల, సైనికుల ఆగ్రహం ముందు లక్ష్మీబాయి కల్పించిన రక్షణ ఏ మాత్రం ఉపయోగపడలేదు. ఈ దాడులలో ఆంగ్లేయుల కుంటుంబాలు కూడా బలయ్యాయి. ఈ సందర్భంగా కంపెనీ అనుకూల సిపాయిలకు, తిరుగుబాటు సిపాయిలకూ మధ్యన పోరాటం జరిగింది. ఆ పోరాటంలో బక్షీష్ అలీ క్రియాశీలక పాత్రను పోషించారు.

ఒకవైపున పోరాటంలో పాల్గొంటూనే, మరొకవైపున బక్షీష్ ఆలీ అంత:పురం చేరి రాణిని కలిశారు. బ్రిటీషర్ల దుశ్చర్యలకు, రాజ వంశం పట్ల అవమాన కరంగా వ్యవహరించిన తీరుకు ప్రతిగా తిరుగుబాటుకు నాయకత్వం వహించమని లక్ష్మిబాయిని జూన్ 8వ తేదిన విజ్ఞప్తి చేశాడు. ( It is repoted that Bukhshish Alli, the Duroga of the Jhansee Jail asking the Ranee whether she would fight, or not, with the English Forces, was informed by Ranee that she would not ; but will return all the districts under her to the British officers when they come to Jhansi, - *Eighteen Fifty Seven*, Surendra Nath Sen, Govt. of India publications,1957, page 283 ). ఈ మేరకు తిరుగబాటు నాయకులు, సైనికులు ఎంతగా ప్రార్థించినా, తొలుత రాణి సానుకూలంగా స్పందించ లేదు. ( Ibid Page 364 to 366 ) బ్రిటీషర్ల శక్తి ముందు స్వదేశీ సిపాయిల శక్తి నిలువజాలదని ఆమె భావించారు. ఇంటా బయటా పలు సమస్యలతో సతమతమౌతున్న రాణి ఆ సమయంలో ఆంగ్లేయులతో కయ్యానికి ఇష్టపడలేదు. బక్షీష్ అలీ లాంటి నాయకులు తిరుగుబాటుకు సారథ్యం వహించేలా రాణిని ఒప్పించాలని చాలా కృషిచేశారు. పరాయి పాలకులతో పోరాడాల్సిన పరిస్థితులు ఆమెను ఒకవైపు చుట్టుముట్టగా, మరొక వైపున ఝాన్సీకి మహారాజుగా తనను ప్రకటించుకుంటూ దివంగత ఝాన్సీ రాజు గంగాధర రావు మేనల్లుడు సదాశివరావు లాంటి కొందరు రాజవంశీకులు పుట్టుకు రాసాగారు.

ప్రారంభంలో తిరుగుబాటు సైనికులు, నాయకుల విజ్ఞప్తులను ఏ మాత్రం ఖాతరు చేయని రాణి, చివరకు తిరుగుబాటు సైనికుల బలవంతం మీద, రాజవంశంలో తలెత్తిన సమస్యల ఫలితంగా తిరుగుబాటుకు నాయకత్వం వహించేందుకు సంసిద్ధత వ్యక్తం చేసింది. ( ' She did not respond, though all her personal guards and retainers went over to the rebels. Only when the seopys threatned to kill her, if she did not join, did she finally give the rebels 1,000 men and two heavy guns.' - *The Mutiny of 1857: Heroism admist Contradictions* by Mr. Cheryl Kanekar taken from The voice of People Awakening, Feb1998 issue, page 7-8) చివరకు జూన్ 6వ తేదీన, ఝాన్సీ రాణి సైనికులు తిరుగుబాటు వీరులతో కలసిపోయారు.





ఈ విషయం ఆశ్చర్యకరం అన్పించినా, ఆనాటి బ్రిటీష్ డిప్యూటీ కలక్టర్ యఫ్. డి. గోర్డన్ కు ఆమె రాసిన లేఖ ఈ విషయాన్ని స్పష్టం చేస్తుంది. ఆమె కమీషనర్ డబ్లూ. సి. స్మిత్‌కు జూన్ 12 మరియు 14 తేదీలలో లేఖలు రాసారు. అ లేఖలలో తిరుగుబాటు సైనికుల ఒత్తిడి వలన మాత్రమే తాను తిరుగుబాటుదారులతో చేయి కలపాల్సి వచ్చిందని వివరించారు. ఆమె మధ్య భారతంలోని బ్రిటీష్ గవర్నర్ జనరల్ ప్రతినిధికి 1858 జనవరిలో రాసిన ఒక లేఖలో, '..these short sighted individuals *(the rebels*) seem unmindful of the British supermacy and do their best to ruin myself and the whole country...' ( *The Mutiny of 1857: Heroism admist Contradictions* by Mr. Cheryl Kanekar from The voice of People Awakening, Feb1998 issue, page 8, taken from the deposition of Sheik Hinggun Hookaburdar, 6 March 1858. quoted by Tapthi Ray, The Politics of a Popular Uprising-Bundelkhand in 1857, Oxford University Press 1994), అని వివరణ ఇచ్చారని తెలుస్తుంది.

చివరకు ఝాన్సీ రాణి లక్ష్మీ బాయి వెయ్యి మంది సైనికులను, రెండు ఫిరంగులను, తిరుగుబాటు సైనికుల వెంట పంపారు. ఆ తరువాత తిరుగుబాటు సైనికుల సాహసం వలన జూన్ 6 న ఝాన్సీ విముక్తమైంది. ఆంగ్లేయాధికారులంతా ఝాన్సీ వదలి ఫరారయ్యారు. తిరుగుబాటు యోధులకు చిక్కిన వారంతా హతమయ్యారు.'..7వ తేదీన ఝాన్సీకి చెందిన రసాల్దార్ కలాఖాన్, తాశీల్దార్ మహ్మద్ హుస్సేన్ తదితర వీర సైనికులు దాడికి నేతృత్వం వహించి ఝాన్సీ దుర్గము పై స్వేఛ్ఛా పతాకనెగురవేశారు.' (*1857 స్వరాజ్య సంగ్రామం*, వినాయక దామోదర సావర్కార్)

ఝాన్సీ రాణి లక్ష్మీ బాయి నేతృత్వంలో ఝాన్సీలో రగులుకున్న తిరుగుబాటును అణచివేసేందుకు బ్రిటీషర్లు సమాయత్తం కాసాగారు. ఈ భయానక వాతావరణంలో ఝాన్సీ సైనికులు, నగర ప్రముఖులు అన్ని విధాల సిద్దమాయ్యరు. రాణి కోసం మరణాన్ని స్వీకరించడానికి ముందుకు వచ్చారు. ఆ విధంగా ముందుకు వచ్చిన నాయకులలో బక్షీష్ అలీ లాంటి యోధులు అగ్రస్థానంలో ఉన్నారు.

1858 మార్చి 22 వ తేదీన ఝాన్సీ మీద ఆంగ్లేయుల దాడి జరిగింది. ఆ దాడిని సహచరులతో కలసి బక్షీష్ అలీ ఎదుర్కొన్నారు. ఆ తరువాత వరుసగా పలు పోరాటాలు జరిగాయి. అనితర సాధ్యమైన ధైర్యసాహసాలను ప్రదర్శించిన ఝాన్సీ రాణి లక్ష్మిబాయి యుద్ధరంగంలో ప్రాణాలు విడిచింది. ఆ యోధురాలికి అండదండలుగా నిలచిన బక్షీష్ అలీ కూడా అమెతోపాటు రణభూమిలో కన్నుమూసి ఉండవచ్చు. ఆ యోధుడి జీవితం ఎలా ముగిసిందన్నది చరిత్రకు అందకుండా పోయింది. ◆

## బహుద్దూర్ షా జఫర్‌కు బాసటగా నిలిచిన ఫర్రూఖాబాద్ నవాబు

# 17. అహమ్మద్ ఆలీ ఖాన్

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం గత చరిత్రకు భిన్నంగా సాగింది. స్వదేశీ సిపాయిలు మీరట్‌లో పూరించిన సమర శంఖారావం మాతృభూమిని తెల్లపాలకుల ఆక్రమణల నుండి విముక్తం చేయాలనుకున్న ప్రతి ఒక్కరినీ మేల్కొనేట్టు చేసింది. తిరుగుబాటును పట్టించుకోని వారు, తిరుగుబాటులో పాల్గొనని వారూ లేకపోలేదు. తిరుగుబాటు పిలుపు అందగానే తిరుగుబాటు పరిణామాలను పరిగణలోనికి తీసుకోకుండా విముక్తి పోరాటంలో పాల్గొన్న త్యాగధనులుండగా, పరదేశీయుల పాలనను స్వస్తి చెప్పగలగటంలో గల సాధ్యాసాధ్యాలను, లాభనష్టాలను బేరీజు వేసుకుని పోరాటానికి దూరంగా ఉండిపోయిన స్వార్ధపరులూ ఉన్నారు. ప్రముఖ చరిత్రకారుడు Dr. Tarachand తన గ్రంథం *History of Freedom Movement in India*, Vol. 2 , page 100 లో ఈవిషయాన్ని ప్రస్తావిస్తూ, '...some of them professed allegiance, but made excuses or restrained from direct action, because, according to their calculations, the chances of success of the rebellion were small, while in the event of failure there was the certainty of ruin .', అన్నారు.

ఆ పరిణామాలను ఏమాత్రం ఖాతరు చేయకుండా తిరుగుబాటు పిలుపును అందుకుని కదనరంగానికి కదలిన స్వదేశీపాలకులలో ఫర్రూఖాబాద్ నవాబు అహమ్మద్





ఆలీఖాన్ ఒకరు. ప్రస్తుత హార్యానాలోని ఫర్రూఖాబాద్‌లో 1823లో ఆయన జన్మించారు. తండ్రి పేరు యాకూబ్ అలీ ఖాన్. 1850లో అహమ్మద్ అలీ ఖాన్ ఫర్రూఖాబాద్ సింహాసనం అధిష్టించారు.

స్వతంత్ర ప్రతిపత్తిని దోచేసిన ఆంగ్లేయుల పట్ల ఆయనలో విద్వేషం నివురుకప్పిన నిప్పులా రగల సాగింది. రోజురోజుకు బలం పుంజుకుంటూ, స్వదేశీ పాలకుల స్వతంత్రతను కాజేస్తున్న బ్రిటీష్ పాలకుల రాజ్య విస్తరణ చర్యలు ఆయనలో ఆగ్రహావేశాలు కలిగించాయి. అదను కోసం ఎదురు చూస్తున్న ఆయనకు 1857 నాటి తిరుగుబాటు బంగారం లాంటి అవకాశాన్ని తెచ్చి పెట్టింది. ఆయన నాయత్వంలో ఫర్రూఖాబాద్‌లోని ప్రజలు, స్వదేశీ సైనికులు ఆంగ్లేయుల మీద తిరగబడ్డారు. ఆంగ్లేయులను తరిమివేసి ఫర్రూఖాబాద్‌ను స్వతంత్ర ప్రతిపత్తిగల రాజ్యంగా ప్రకటించారు.

ఆంగ్లేయ అధికారుల ఆజ్ఞలను త్రోసి రాజంటూ, ఆయుధాలు చేతపట్టి మీరట్ నుండి ఢిల్లీ వరకు సాగిన తిరుగుబాటు యోధుల మహాప్రస్థానం తరువాత ఉత్పన్నమయ్యే పరిణామాల గురించి ఆయన క్షణమైనా ఆలోచన చేయలేదు. స్వతంత్ర భారతదేశానికి బహుద్దూర్‌షా జఫర్‌ను చక్రవర్తిగా ప్రకటించగానే, ఆయన రాజభక్తిని ప్రకటించారు. ఈ మేరకు చక్రవర్తికి రాసిన లేఖలో, **' అన్ని దేశాల రాజుల, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ప్రజల గౌరవ మర్యాదలు పొందుతున్న చక్రవర్తులకు అభివాదం... భగవంతుడు ప్రభువులను మళ్ళీ అఖండ భారత దేశానికి అధినేతగా చేశాడు...ప్రభువుల రాజ్యం సుఖశాంతులతో నిండి ఉండాలని ప్రార్థిస్తూన్నాను'.** ( జ్ఞాపకం చేసుకోండి ఎప్పుడైనా..అమర వీరుల ఉత్తరాలు, అనువాదంః జె.లక్ష్మిరెడ్డి, భారత ప్రభుత్వ ప్రచురణలు 1998, పేజీ16) అని అహమ్మద్ అలీ ఖాన్ ఎంతో సంతోషాన్ని వ్యక్తం చేశారు.

ఆ తరువాత చక్రవర్తి పక్షాన ఆంగ్లేయులతో సాగిన పలు పోరాటాలలో అహమ్మద్ అలీ ఖాన్ పాల్గొన్నారు. బ్రిటీషర్ల ఆక్రమణలో ఉన్న పలు ప్రాంతాలను విముక్తం చేసేందుకు తన సైనికులను ముందుకు నడిపించారు. బ్రిటీషర్ల ఆధిపత్యంలో నున్న బొరా అను ప్రాంతాన్ని ఆంగ్లేయుల పెత్తనం నుండి విముక్తం చేసేందుకు తన సైన్యాన్ని పంపారు. బ్రిటీష్ ఆధిపత్యానికి గండికొట్టి స్వదేశీయుల పాలనను సుస్థిరం చేసి, మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ నాయకత్వాన్ని పటిష్టం చేయాలన్నది ఆయన దృఢ సంకల్పం. ఆ లక్ష్యాన్ని సాధించేందుకు తన శక్తి యుక్తులను వెచ్చించారు. ఈ మేరకు ఇతర ప్రాంతాలలో గల తిరుగుబాటు యోధులకు సహాయ సహకారాలు అందించారు. చక్రవర్తి కోరగానే స్పందిస్తూ, ఆయుధాలను, సైనికులను, ఖాద్య సామాగ్రిని నవాబు అలీఖాన్ ఢిల్లీకి సరఫరా చేశారు.

1857 సెప్టెంబరు 2వ తేదీన రాసిన లేఖ ద్వారా ఆనాటి పరిస్థితులు, చక్రవర్తికి

ఆయన అందించిన సహకారం, తిరుగుబాటులో ఆయన నిర్వహించిన పాత్రను ఈ లేఖ స్పష్టమవుతుంది. ఈ లేఖలో, **'..సార్వభౌముల ఆజ్ఞ అందగానే ఈ సేవకుడు తుపాకులు సరఫరా చేయడం పూర్తి చేశాడు. ప్రభువుల ప్రతిష్ట, బలదర్పాలు చిరస్థాయిగా నిలచి ఉండాలని కోరుకుంటున్నాను. మన సైన్యాల చేతుల్లో సార్వభౌముల శత్రువులు నిరంతరం మసికావాలని, ప్రభువుల రాజ్యమూ, ఖ్యాతి, చిరస్థాయిగా నిలచి ఉండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. ఏలినవారి ప్రజలను, తదితర మద్దతుదారులనూ సంరక్షించేందుకు, ప్రభువుల సైన్యాన్ని శస్త్ర సన్నద్ధంగా నిలచి ఉంచేందుకు, ఇక్కడ కూడా తుపాకుల అవసరం ఎక్కువగా కన్పిస్తోంది. అందుచేత ఎక్కువ సంఖ్యలో తుపాకులు పంపడం వీలుపడటం లేదు. అయినా, సకల ప్రయత్నాలూ చేసి ఎన్ని సేకరించగలిగానో, వాటినన్నింటినీ ఇబ్రహీం అలీ ఖాన్ ద్వారా పంపుతున్నాను. ఇంతేకాకుండా నేను ఫర్రూఖ్ నగర్‌లోని కుమ్మరి వాళ్ళందరికీ వాళ్ళు తయారు చేసిన తుపాకులు చక్రవర్తిగారి సైన్యానికి తప్ప ఇంకెవ్వరికీ అమ్మరాదని, తుపాకులు తయారు అయినప్పుడల్లా వాటిని వెంటవెంటనే చక్రవర్తి సైన్యాలకు తరలించవలసిందిగా అదేశాలు జారీ చేశాను.. ప్రభువుల రాజ్యంలో సుఖశాంతులు నెలకొనాలని ప్రార్థిస్తున్నాను....".** ( *జ్ఞాపకం చేసుకొండి ఎప్పుడైనా...అమర వీరుల ఉత్తరాలు,* అనువాదం ః జె.లక్ష్మిరెడ్డి, భారత ప్రభుత్వ ప్రచురణలు, 1898, పేజీ 16) అని పేర్కొన్నారు.

1857 సెప్టెంబరు మాసంలో తిరుకుబాటు విఫలమైంది. ఆంగ్లేయులు ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకున్నారు. ఈ వాతావరణం స్వదేశీపాలకులను, ప్రజలను తీవ్ర నిరాశకు గురి చేసింది. ఆరు మాసాలపాటు ఫర్రూఖాబాద్‌లో అడుగు పెట్టడానికి సాహసించలేక పోయిన ఆంగ్లేయులకు, ఢిల్లీ పరిణామాలు ఎనలేని ధైర్యాన్ని తెచ్చి పెట్టాయి. చక్రవర్తికి అన్ని విధాల సహాయసహకారాలు అందించి, బ్రిటీష్ ఆధిపత్యాన్నీ, అధికారులనూ గడ్డిపోచ క్రింద తీసిపారేసిన అహమ్మద్ అలీఖాన్ పని పట్టాలని బ్రిటీషర్లు నిర్ణయించుకున్నారు. భారీ సంఖ్యలో సైన్యాలను సమీకరించుకుని, ఫర్రూఖాబాద్‌లో ప్రవేశించాలని కవాతులు నిర్వహిస్తూ ముందుకు సాగారు. పట్టణంలోకి చొచ్చుకుని వస్తున్న బ్రిటీష్ సైనికులను ఫర్రూఖాబాద్ యోధులు ఎదుర్కొన్నారు. ఇరుపక్షాల మధ్య మూడు రోజుల పాటు రాత్రింబవళ్ళు భీకర పోరాటం జరిగింది.

ఒకవైపు పోరు సాగుతుండగా ఢిల్లీ నుండి చక్రవర్తి పరాజయం వార్తలు ఫర్రూఖాబాద్ దర్బారుకు అందాయి. భారత దేశంలోని తిరుగుబాటు యోధులదంరికి పెద్ద దిక్కుగా నిలచిన మెగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ పట్టుబడ్డారని వచ్చిన సమాచారం అందింది. ఈ సమాచారం అటు నవాబునూ, ఇటు నవాబు సైనికుల ఆత్మస్థైర్యాన్నీ దారుణంగా దెబ్బ తీసింది. నవాబు సైన్యాలలో ఈ పరిస్థితి వ్యతిరేక పరిణామాలకు దారి





తీసింది. ఈ పోరులో ఆంగ్లేయ సైనికులదే పై చేయి అయ్యింది. ఫర్రూఖాబాద్ సేనలు దెబ్బతినటంతో బ్రిటీష్ సేనలు నగరంలోకి దూసుకు వచ్చాయి. శత్రు సైన్యం నగరం మీద పడింది. నగరాన్ని పూర్తిగా స్వాధీనంలోకి తీసుకున్న కంపెనీ సైన్యం అత్యాచారాలకు, దోపిడీలకు,అకృత్యాలకు పాల్పడింది. దోపిడీలను సాగించింది.

ఆ సమయంలో ఢిల్లీలో చక్రవర్తి లొంగిపోవటం, ఆయన మీద విచారణకు ఆదేశాలు జారీకావటం లాంటి సమాచారం అందుకున్న అహమ్మద్ అలీ ఖాన్‌కు మరొక మార్గం లేకుండా పోయింది. పర్రూఖాబాద్ ప్రజానీకం పాట్లు గమనించిన ఆయన, సన్నిహితుల సలహా మీద బ్రిటీషర్లతో సంప్రదింపులు జరిపారు. ప్రధానంగా ప్రజలు, మాతృదేశం కోసం ప్రాణాలకు తెగించిన నిలచిన సైనికులు అవస్థలు పడరాదన్న భావన కలిగి, లొంగిపోటానికి నిర్ణయించుకున్నారు. ఈ మేరకు 1857 నవంబరు 3వ తేదిన అంగ్ల సైనికాధికారులు అహమ్మద్ అలీ ఖాన్‌ను, నిర్బంధంలోకి తీసుకున్నారు. ఈ సందర్భంగా సాగిన చర్చలలో చేసిన వాగ్దానాలకు భిన్నంగా, ఆయనకు బేడీలు వేసి ఫర్రూఖ్‌నగర్ రహదారుల వెంట నడిపించారు. ఈ దృశ్యాన్ని చూస్తూ ఫర్రూఖాబాద్ ప్రజలు కన్నీళ్ళు పెట్టుకున్నారు. ఆయనను ఢిల్లీకి తీసుకువెళ్ళారు. ఢిల్లీలో కూడా ప్రధాన రహదారుల వెంట నడిపించి ఆఅయనను మానసికంగా క్షోభకు గురిచేశారు. ఢిల్లీ చేరాక ఆయన మీద ఆరోపణలు చేసి ప్రారంభమైన విచారణ, ఓ నాటకంగా సాగింది. ఈ సందర్భంగా కనీస మర్యాదలు కూడా పాటించకుండా నవాబును పలు విధాల అవమానించారు.

1858 జనవరి 12 నుండి విచారణ ప్రారంభమైంది. ఆయనను ఎర్రకోట లోని ఒక చిన్న గదిలో బంధించి పెట్టారు. ఆ గదికి సమీపాన ఉన్న మరొక ఇరుకు గదిలోనే మొగల్ పాదుషా బహుదూర్ షా జఫర్‌ను బంధించి ఉంచారు. ఎర్రకోట నుండి విచారణ జరుగుతున్న కచేరికి ఆయనను ప్రతి రోజు నడిపించుకుని వెళ్ళటం జరిగింది. ఆయనకు భారీ పహారాలో సదా బేడీలు వేసి ఉంచారు. ఈ విచారణ 11 రోజులు సాగింది.

చివరకు ఊహించిన విధంగానే ఆయనను నేరస్థుడిగా తేల్చారు. తిరుగుబాటుకు నాయకత్వం వహించినందున ఉరిశిక్ష విధిస్తూ 1858 జనవరి 23న తీర్పు వెలుపడింది. ఆ తీర్పు ప్రకారం 24వ తేదీన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుడు అహమ్మద్ అలీఖాన్‌ను ఢిల్లీలోని చాందనీ చౌక్‌లో ప్రస్తుతం ఫౌన్‌టెన్ ఉన్న ప్రాంతంలో ఉరి తీసారు. ఆ తరువాత అంత్యక్రియలను కూడా జరుపకుండా ఆయన భౌతిక కాయాన్ని ఎర్రకోట కందకంలోకి విసిరిపారేసి, ఆ తిరుగుబాటు నాయకుని పట్ల తమలోనున్న భయంకర విద్వేషాన్ని బ్రిటీషర్లు వెల్లడి చేసుకున్నారు. ◆



### బ్రిటీష్ సైన్యాలను పలుమార్లు మట్టి కరిపించిన మహాబలుడు

# 18. మౌల్వీ అహ్మదుల్లా ఖాన్

పరదేశీయులైన బ్రిటీషర్ల పై కత్తిగట్టి శత్రువును పలుమార్లు మట్టికరిపించి అరివీర భయంకరుడిగా ఖ్యాతిగాంచిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుడు మౌల్వీ అహ్మదులా ఖాన్. ఆయన తండ్రి ముహమ్మద్ అలీ ఖాన్, ప్రస్తుతం చెన్నయ్‌గా పిలువబడుతున్న ఒకనాటి చెన్నపట్నం నవాబు. మౌల్వీ అహ్మదుల్లా అసలు పేరు సయ్యద్ అహ్మద్ అలీ ఖాన్. ఆయనను జియావుద్దీన్ అని కూడా పిలవటం కద్దు. ' దిలావర్ జంగ్ ' అను బిరుదు కూడా ఉంది. మౌల్వీ అహ్మదుల్లా చెన్నపట్నంలో 1787-88 సంవత్సరంలో జన్మించాడు. ఓ రాజకుమారుడి స్థాయిలో ఆనాటి ప్రముఖ పండితుల ద్వారా ఆయన విద్యాభ్యాసం సాగింది. అత్యంత మేథాసంపన్నుడుగా చిన్నతనంలోనే ప్రశంసలందుకున్న ఆయన ధార్మిక-లౌకిక విద్యలో సాధించిన విద్వత్తు ఫలితంగా ' మౌల్వీ ' గా ప్రసిద్ధి చెందారు. స్వదేశీ భాషలలోనే కాకుండా ఆంగ్లభాషా పరిజ్ఞానాన్ని ఆయన సంతరించుకున్నారు. చదువులోనే కాకుండా యుద్ధవిద్యలలో కూడా ఆయనకు చక్కని శిక్షణ లభించింది.

మౌల్వీ అహమ్మదుల్లా నైజాం నవాబు ఆహ్వానం మేరకు ఓ వివాహ కార్యక్రమంలో పాల్గొనేందుకు హైదరాబాదుకు వచ్చారు. ఆ సందర్భంగా ఓ తిరుగుబాటుదారుడ్ని లొంగదీసుకోవడం కోసం జరిగిన పోరులో ఆయన చూపిన ప్రావీణ్యత ప్రశంసలందుకుంది.





నిజాం సంస్థానంలో గల బ్రిటీష్ సైనికాధికారులు మౌల్వీని ఇంగ్లాండు పంపాల్సిందిగా సూచిస్తూ, ఆ మేరకు ఆహ్వానాన్ని అందించారు. ఆయన ఇంగ్లాండు నుండి తిరుగు ప్రయాణంలో మక్కా మదీనాలను సందర్శించుకుని ఇరాక్, ఇరాన్, తదితర ప్రాంతాలను పర్యటించి స్వదేశం చేరుకున్నారు.

స్వదేశం తిరిగి వచ్చిన మౌల్వీ అహ్మదుల్లా ఖాన్ 'సూఫీ' సిద్ధాంతాల పట్ల ఆకర్షితులయ్యారు. ఖాద్రి సంప్రదాయానికి చెందిన సయ్యద్ ఫుర్‌ఖాన్ అలీ షా (Saiyid Furqan Ali Sha)కు ఆయన శిష్యులయ్యారు. గురు ఆజ్ఞ మేరకు ఆయన గ్వాలియర్ ప్రాంతంలో సూఫీ భక్తి తత్త్వాన్ని ప్రచారం చేందుకు సిద్ధమయ్యారు. ఆ సమయంలోనే బానిసత్వానికి వ్యతిరేకంగా, విదేశీ శక్తుల పెత్తనాన్ని అంతం చేసేందుకు ' పోరు ' సాగించమని సూఫీ సాధువులు ప్రబోధించారు. ఆ పిలుపునందుకున్న ఆయన తన జీవితాన్ని పూర్తిగా పరాయిపాలకుల మీద ధర్మ యుద్ధానికి అంకితం చేశారు. గురువుల ఆదేశాల మేరకు ఉత్తర భారతంలోని పలు ప్రాంతాలను పర్యటించారు. ధర్మయుద్ధానికి సిద్ధం కావాల్సిందిగా ప్రజలను ప్రేరేపిస్తూ ప్రసంగాలు చేశారు. ఆ ప్రసంగాలలోని తీవ్రతను గమనించిన బ్రిటీష్ పాలకులు ఆయన కార్యకలాపాల మీద కన్నెర్రచేసారు. పర్యటనలో భాగంగా ఓసారి ఆయన ఆగ్రాలో ఉండగా ఆయన చేస్తున్న ప్రసంగాల ఆధారంగా, ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధానికి ప్రజలను రెచ్చగొడుతున్నాడని ఆంగ్లేయాధికారులు ప్రభుత్వానికి నివేదికలు పంపారు. ( '..he is a derwesh only in name, actually he is a prince and is preparing the masses to wage a war against the government..' - The Profile of Saintly Rebel- Moulvi Ahamadullah Shah by Syed Jaheer Hussain Jafri, Social Scientist Vol.26, No.1- 4, Jan- Apr. 1998, page 39).

1856 నవంబరులో ఆయన ఉత్తర ప్రదేశ్‌లోని అవధ్ చేరుకున్నారు. ఈ విషయాన్ని ' తిల్సిం' ( TILISM ) అను ఉర్దూ వారపత్రిక వెల్లడించింది. ఈ పత్రికను ఫిరంగి మహల్‌కు చెందిన మౌల్వీ మొహ్మద్ యాకూబ్ అన్సారి సంపాదకత్వం వహిస్తున్నారు. మౌల్వీ ఆనాడు అవధ్ రాజధాని లక్నోలో ప్రజలను ప్రభావితం చేస్తూ చేసిన ప్రసంగాల ధోరణిని ప్రస్తావిస్తూ, 1857 జనవరి 30తేది నాటి **తిల్సిం** సంచికలో '..Ahamedullah shah...is very fearless in saying whatever he wishes to say and to large crowds is always there...although he is unable to do anything, orally he always pleads for jehad..' అని పేర్కొందని The Profile of Saintly Rebel - Moulvi Ahamadullah Shah వ్యాసకర్త Syed Jaheer Hussain Jafri పేజీ 42లో ఉటంకించారు.

బ్రిటీషర్ల తరిమివేత కోసం సాగించాల్సిన ధర్మయుద్ధం కోసం ప్రజలను సంసిద్ధులను గావించేందుకు **జమైతుల్ ఉల్మా** అను సంస్థను ఆగ్రా కేంద్రంగా మౌల్వీ

ప్రారంభించారు. లక్ష్యసాధనలో ప్రాణాలను తృణప్రాయంగా అర్పించటానికి సిద్ధంగా ఉన్న యువకులను సమీకరించారు. భారతదేశంలోని రాజ్యాలను, సంస్థానాలను ఏ విధంగా ' గుటకాయ స్వాహా ' చేస్తున్నదీ వివరించి, బ్రిటీషర్ల రాజ్యవిస్తరణ కాంక్ష పట్ల యువతలో వ్యతిరేకతను పెంచసాగారు. మౌల్వీ ఉద్బోధనల వలన ఎదురయ్యే ప్రమాదాన్ని పసికట్టిన పాలకులు ఆయనను బహిష్కరించారు.

ఆగ్రా నుండి ఫైజాబాద్ చేరుకున్న మౌల్వీ బ్రిటీషర్లపై తిరుగులేని పోరాటాన్ని ప్రకటించారు. బ్రిటీషు పోలీసులు ఆయనను ప్రమాదకర వ్యక్తిగా పరిగణించారు. బ్రిటీషర్ల నుండి పొంచియున్న ప్రమాదాన్ని ఓ కంట కనిపెడుతూనే సమర్థుడైన పాలకుడనిపించుకున్నారు. ' ఖలీఫతుల్లా ' పేరుతో నాణాలను ముద్రించారు. మౌల్వీ ప్రయత్నాలను ఆదిలోనే తుంచివేయకపోతే ప్రమాదమని భయపడ్డ బ్రిటీషర్లు ఆయనను మరోమారు ఆ ప్రాంతం నుండి బహిష్కరించారు. గమ్యం, మార్గాన్ని సుస్పష్టంగా నిర్దేశించుకున్న ఆయన ఎక్కడున్నా తన గడ్డ మీద నుంచి తెల్లపాలకులను తరిమి కొట్టేందుకు తనదైన రీతిలో ప్రయత్నాలను చేసుకుపోసాగారు. చిట్టచివరకు అతి కష్టం మీద ఆయనను బ్రిటీషర్లు బంధించారు. ఆయనను నగరంలోని భారీ భద్రత గల జైలులో ఉంచారు. ప్రజలను రాజద్రోహానికి పాల్పడాల్సిందిగా పురికొల్పుతున్నాడన్న నేరాలను ఆపాదించి, విచారణ తంతు జరిపి మౌల్వీకి మరణ దండన విధించారు. '..he seemed too dangerous a character to be kept in the city jail..', అంటూ ఆయనకు విధించిన శిక్షను అమలుపర్చేందుకు ఫైజాబాద్ జైలుకు తరలించారు.

ఆ సమయంలో బ్రిటీషర్లకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా 1857 నాటి పోరాటాలు ప్రారంభమయ్యాయి. ఈ పోరాటాల సమాహారమే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా ఖ్యాతి గాంచింది. ప్రజలు, సైనికులు, రాజులు, రాణులు, సంస్థానాధీశులు ప్రాణాలకు తెగించి పోరు సాగిస్తున్నారు. భారతీయుల హృదయాలు అగ్నిగుండంలా మండిపోతున్నాయి. ప్రతి ఒక్కరూ మాతృభూమి విముక్తికి కంకణబద్ధులై ఉన్నారు. ఆ పోరాటంలో భాగంగా తిరగబడిన ఫైజాబాద్ ప్రజలు, సిపాయిలు కలసి జైలు మీద దాడి చేసి, 1857 జూన్ 8వ తేదీన మౌల్వీ అహ్మదుల్లా షాను, ఇతర దేశభక్తులను విడిపించుకొని పోయారు.

బందిఖానా నుండి బయటపడిన ఆయన ఆంగ్లేయుల మీద తిరుగులేని పోరాటాన్ని ప్రకటించి, బ్రిటీష్ బలగాలతో భయంకరమైన నాలుగు యుద్ధాలు చేసి విజయాలు సాధించారు. లక్నోకు 10 కిలోమీటర్ల దూరాన గల చిన్‌హట్ వద్ద బ్రిటీష్ సైన్యాలను చుట్టుముట్టి, ప్రసిద్ధి చెందిన లక్నో రెసిడెన్సీని 82 రోజులపాటు నిర్బంధించారు. రోహిల్ ఖండ్ పోరాటం ద్వారా పలు ప్రాంతాలను స్వాధీనంలోకి తెచ్చుకున్నారు. ఆ తరువాత





షాజాన్‌పూర్ వద్ద మరోసారి మౌల్వీ బలగాలు బ్రిటీష్ సైన్యాలను తరిమి తరిమి కొట్టాయి.

ఆ సమయంలో అవధ్ రాణి బేగం హజరత్ మహల్, బ్రిటీషర్ల కుయుక్తులను చిత్తు చేస్తూ పోరాటం చేస్తుంది. పలువురు స్వదేశీపాలకులు, ప్రజలు, ఆమెకు తోడుగా నిలిచారు. లక్నో పరిసర ప్రాంతాలలో ఎక్కడ చూసినా ఉత్సాహభరిత తిరుగుబాటు వాతావారణం నెలకొంది. ఆ సమయంలో బ్రిటీష్ సైన్యాలను ఎదుర్కొనేందుకు మౌల్వీ బలగాలు కూడా అవధ్ బయలు దేరాయి. అవధ్ చేరుకోగానే ప్రజలకు తగిన రక్షణ కల్పించేందుకు మౌల్వీ సిద్ధమయ్యారు. బ్రిటిష్ అధికారులనూ వారి తాబేదార్లనూ మూకుమ్మడిగా తరిమి కొట్టడం వలన ఆ ప్రాంతంలో తాత్కాలికంగా పాలనావ్యవస్థ అస్తవ్యస్థమై ఉంది. విద్రోహులు పొంచి ఉన్నారు. ఆ సమయంలో మౌల్వీ నగర ప్రవేశం చేయటం, స్వతంత్రించి కొన్ని నిర్ణయాలను తీసుకొవటంతో, తొలిదశలో బేగం హజరత్ హహాల్ అనుచరులకూ ఆయనకూ మధ్యన కొన్ని అపార్థాలకు అవకాశం కలిగింది. ఆ అపోహలను దూరం చేస్తూ, నగరంలోని పరిస్థితులను చక్కబెట్టేందుకు పలు ప్రాంతాలలో చౌకీలను ఏర్పాటు చేసి మౌల్వీ రక్షణ వ్యవస్థను పటిష్టం చేసారు. బ్రిటీషర్ల ఎత్తులను ఎప్పటికప్పుడు కనిపెడుతూ 3 మాసాలపాటు మౌల్వీ అవధ్‌లోనే ఉండిపోయారు. బ్రిటీషు సైన్యాలను ఎదుర్కొంటున్న బేగం హజరత్ మహల్‌కు సహాయ సహకారాలను అందించారు. చివరకు పరాజయాల పరంపరతో మండిపోతున్న బ్రిటీష్ అధికారులు మూకుమ్మడిగా దాడి చేయగా, గత్యంతరం లేని పరిస్థితులలో, బేగంతో పాటుగా మౌల్వీ కూడా బ్రిటీషర్లకు చిక్కకుండా తప్పించుకున్నారు.

మౌల్వీ పరాక్రమాన్ని పలుమార్లు చవిచూసి ఉన్న బ్రిటీషు సైన్యాధికారులు ఆయనను ఎలాగైనా అంతం చేయాలని పగబట్టారు. మౌల్వీని పట్టిచ్చినవారికి , లేదా ఆయన శిరస్సును తెచ్చి ఇచ్చిన వారికి 50,000 రూపాయగల భారీ నగదు బహుమతిని, ఇతర ఉన్నత పదవులను బ్రిటీష్ పాలకులు అధికారికంగా ప్రకటించారు. ( '..The revolutionary forces under him (*Mouli Ahamadulla Shah)* inflicted such heavy losses on the British that they declared an award of Rs.50,000, for his capture, dead or alive..' - *Freedom Movement and Indian Muslims* by Santimoy Ray, PPH, New Delhi, 1983, page 21*)* ఆ రోజుల్లో ఒక వ్యక్తి తలకు 50 వేల రూపాయల భారీ బహుమతి ప్రకటించాల్సినంత అవసరం బ్రిటీష్ పాలకులకు కలిగిందంటే, వలస పాలకులకు మౌల్వీ ఎంతటి కొరకరాని కొయ్యగా తయారయ్యారో అర్థం చేసుకోవచ్చు.

మౌల్వీ అహమ్మదుల్లా షా పోరుబాటలో భాగంగా లక్నో నుండి రోహిల్ ఖండ్ వెళ్ళారు. ఆయన ఎక్కడ ఉంటే అక్కడ అపజయాలను బ్రిటీష్ సైన్యాలు చవిచూస్తున్నాయి. అప్రతిహతంగా ముందుకు సాగుతున్న మౌల్వీని నిరోధించటం బ్రిటీషు సైనికాధికారులకు అసాధ్యమైంది. చివరకు తమకు అలవాటైన ' విభజించి పాలించు ' ఆయుధాన్ని మౌల్వీ

మీద ప్రయోగించారు. బ్రిటీషర్ల కరుణా కటాక్షాల కోసం పడిగాపులుకాచే ' విభీషణ మనస్కులైన ' స్వదేశీ పాలకులను ఆకర్షించారు. పదవులు, భారీ బహుమతుల ఆశ చూపారు. అరివీర భయంకరుడు మౌల్వీ ఆట కట్టించేందుకు ధైర్యం నూరి పోశారు. ఆయనను బంధించాలని కుట్రలు పన్నారు. పథకాలు రూపొందించారు. మరోవైపు ప్రజల నుండి, ప్రజాదరణ నుండి మౌల్వీని దూరం చేయాలన్న లక్ష్యంతో ఆయనను దుర్మార్గుడిగా చిత్రీకరిస్తూ, అసత్యాలను ప్రచారంలో పెట్టారు. ఆయన సచ్చరిత్రకు మరకలు పట్టించే ప్రయత్నం చేశారు.

ఆ అభూత కల్పనలను, చరిత్ర వక్రీకరణలను, అవాస్తవ ప్రచారాలను ప్రజలు నమ్మలేదు. ఆనాడు ప్రజలు ఏమాత్రం నమ్మని అసత్యాలను, ఆ తరువాత బ్రిటీష్ పాలకులు విసిరేసిన బిచ్చపు మెతుకుల మీద ఆధారపడి చరిత్ర రాసిన కొందరు, ఉద్దేశ్యపూర్వకంగా ఆ సత్యాలను అక్షర సత్యాలుగా రాసి, ప్రచారం చేసి మౌల్వీ వ్యక్తిత్వంపై బురద చల్లే ప్రయత్నం చేసారు. నిప్పులాంటి నిజాలు ఏనాటికైనా బహిర్గతం కాక మానవు. మౌల్వీ గురించి రాసిన రాతల్లో అసత్యం తప్ప సత్యం ఏమాత్రం లేని విషయాన్ని ఆంగ్లేయాధికారులు స్వయంగా వ్యక్తంచేసిన వాఖ్యలు స్పష్టం చేస్తూన్నాయి.

బ్రిటీష్ సైనికాధికారి General Holems తన *The Sepoy War* అను గ్రంథంలో మౌల్వీ అహమ్మదుల్లా షా గురించి రాస్తూ,' ..The Moulvi was a true patriot. He had not stained his sword with assassination. He had connived at no murders; he has fought manfully, honourably and stubbornly in the battle field against the stranger who had seized his country, and his memory is entitled to the respect of the brave and true-hearted of all nations...' (*Muslims In India* , S.Abul Hasan Ali Nadvi, 1980,Page107) అన్నాడు. ఆ ఆంగ్లేయుడు అంతటితో ఆగలేదు. ఆ గ్రంథంలోనే మరొక చోట '... A man fitted both his sprit and his capacity to suport a great cause and to command a great army. This was Ahamadullah, the Moulivi of Fyzabad.." ( Quoted by S.Abul Hasan Ali Nadvi in his *Muslims In India*, Page 107 ), అంటూ మౌల్వీ శక్తి సామర్థ్యాలను వివరించాడు. బ్రిటీష్ చరిత్ర కారుడు సర్ థామస్ సీటన్ ' అతనొక సమర్థుడైన గొప్ప వ్యక్తి...అకుంఠిత దీక్ష,అసమాన ధైర్యసాహసాలు గల తిరుగుబాటు నాయకులలో అగ్రశ్రేణికి చెందిన వాడు ', అన్నాడు. (Sir Thomas Seaton..described him '...great abilities, of undaunted courage, of stern determinationand by far the best solders among the rebles..' -*The Indian Mutiny of 1857* , Colonel G.B. Malleson, London, 1906, Page17 ). మౌల్వీ అహమ్మదుల్లా షాతో పలు పోరాటాలు చేసిన కల్నల్ జి.ఎ.మాల్సన్, (G.A Malleson) మౌల్వీ చర్యలను సమర్థిస్తూ, '..తన దేశాన్ని ఆక్రమించుకుని ధ్వంసం చేస్తున్న వాళ్ళకు వ్యతిరేకంగా,కుట్రపన్ని, యుద్ధం చేసి,స్వాతంత్ర్యం





సంపాదించుకోవడం దేశభక్తి అయితే తప్పకుండా మౌల్వీ గొప్ప దేశభక్తుడు... ఆయన అమాయకుల ప్రాణాలు తీయలేదు....తన దేశాన్ని వశంచేసుకున్న విదేశీయుల మీద గౌరవప్రదమైన యుద్ధం చేశాడు. వీరుడుగా, నీతిమంతుడుగా గుర్తించబడిన ఆయన అన్ని దేశాలు గౌరవించదగిన యోధుడు..', అని ప్రశంసించాడు. ( ' If a patriot is a man who plots and fights for independence, wrongfully destroyed, of his native country, then the Mouli was a true patriot...he had fought manfully, honourably and stubbornly in the battle field against the strangers, who had seized his country, and his memory is entitled to the respect of the brave and the true-hearted of all nations'. ( ibid ) ఈ విధంగా మౌల్వీ అకుంఠిత దీక్షను, అద్వితీయ శక్తిసామర్థ్యాలను బ్రిటీష్ సైనికాధికారులు, చరిత్రకారులు స్వయంగా సాక్ష్యాత్కరింపజేసారు.

బలమైన శత్రువును విడివిడిగా పోరాడుతూ తరిమివేయటం దుస్సాధ్యమని గ్రహించి మౌల్వీ తనతో కలసి వచ్చే స్వదేశీపాలకులను ఏకం చేసే ప్రయత్నాలలో భాగంగా షాజహాన్‌పూర్ జిల్లాలోని పోవెన్ (POWAIN) రాజు జగన్నాథ సింహాతో చర్చలు జరిపేందుకు వెళ్ళారు. ఈ సందర్భంగా, **' రాజా ప్రక్కనే ఉన్న అతడి సోదరుడు మౌల్వీ పై గురిచూసి కాల్పులు జరిపాడు. ఆ దుర్మార్గుని హస్తాలలో మౌల్వీ హతుడైపోయాడు. ఆ పిరికిపందలు ..మౌల్వీ శిరస్సు ఖండించి, దాని పై గుడ్డ కప్పుకొని చేరువనే 13 మైళ్ళ దూరాన ఉన్న బ్రిటీషు ఠాణా-షాజహాన్‌పూరుకు తీసుకువెళ్ళారు..రక్తం ఓడుతున్న ఆ పవిత్ర శిరాన్ని ఆ నీచులు ఆంగ్లేయుల ముందు కానుకగా ఉంచి వారి పాదాల చెంత మోకరిల్లారు..నీచమైన దేశద్రోహానికి తలపడిన ఆ పోవెన్ పశువుకు 50 వేల రూపాయల పారితోషికం లభించింది!'** (*1857* స్వరాజ్య సంగ్రామం, వినాయకరావు దామోదర్ సావార్కర్, అనువాదం : విజయ, నవయుగ భారతి ప్రచురణలు, హైదరాబాదు, 2001, పేజీ156).

అరివీర భయంకరుడుగా ఖ్యాతిగాంచిన మౌల్వీ అహమ్మదుల్లా షా ఫైజాబాది మరణ వార్తను ఖచ్చితంగా ధృవపర్చుకున్నాక, **' ఉత్తర భారత దేశంలో బలిష్టమైన శత్రువును'** ( '..The most formidable enemy of the British in Northern India..' - HISTORY OF THE INDIAN MUTINY, General Holems, Page 539 ) అంతం చేసామని బ్రిటీష్ పాలకులు ఆనందపడ్డారు. ఈ మేరకు శత్రువు చేత కూడా అసమాన పోరాట యోధుడిగా ప్రశంసలను అందుకున్న మౌల్వీ అహమ్మదుల్లా షా చరిత్రలో తనదైన ప్రత్యేక ముద్ర వేసుకుని 1858 జూన్ 15న, ఈ గడ్డను తన రక్తంతో పునీతంచేసి అమరుడయ్యాడు. ◆

> '..నా మాతృభూమి విముక్తి కోసం ఏనాడయితే నేను పోరాట దీక్ష చేపట్టానో, ఆనాడే నా ప్రాణం మీద తీపిని వదలుకున్నాను..మన శత్రువులలో ఒకరిని నేను అంతం చేశాను..నేను నా కర్తవ్యాన్ని నిర్వహించాను..నా పవిత్ర కార్యంలో భగవంతుని వద్ద మీరంతా నాకు సాక్ష్యం. **-మహమ్మద్ షేర్ అలీ**

### తెల్లదొరలపై తిరుగుబాటులో ప్రాణాలను పణంగా పెట్టిన వీరుడు

# 19. పఠాన్ తుర్రేబాజ్ ఖాన్

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ జ్వాలలు ఉత్తర భారతదేశంలో రగిలినప్పటికీ, అవి అక్కడికే పరిమితం కాలేదు. భానిస బంధనాల నుండి మాతృ భూమిని విముక్తం గావించాలని ప్రజానీకంలో పెల్లుబికిన బలమైన కాంక్షకు జాతి, మతం, కులం, భాషలు, ఆచార సాంప్రదాయాలు, ప్రాంతాలు అడ్డుగోడల కాలేకపోయాయి. ఆయా ప్రాంతాలలోని బ్రిటీషర్ల తొత్తులైన రాజులు, నవాబులు, సంస్ధానాధీశులు కూడా తిరుగుబాటును నిలువరించలేక పోయారు. ఉప్పెనలా ఉవ్వెత్తున ఎగిరిన తిరుగుబాటును నిలువరించటం ఎవరి తరం కాలేదు. ఉరి కొయ్యలు, చెరసాలలు కూడా స్వేచ్ఛాపిపాసువులను ఆపలేక పోయాయి.

ఆధునిక ఆయుధాలు కలిగి, అపారమైన సైనిక బలగాలున్న బ్రిటీష్ పాలకులను ఎదుర్కొవటం మృత్యువును వాటేసుకోవడమేనని స్పష్టంగా తెలుసు. పోరుబాటలో మరణం తధ్యమన్న చేదు నిజం తెలిసి కూడా పరాయిపాలకులను తరిమి కొట్టేందుకు నడుంకట్టారు. ఆయుధం చేతపట్టి కదన రంగాన అరివీర భయంకరులై పోరాడి అమరులయ్యారు. ఆ కోవకు చెందిన వీరులలో పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ ( Pathan Turrebaz Khan) ఒకరు.

పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ పరాక్రమాలకు పెట్టింది పేరైన రొహిల్లా సైనిక పటాలానికి





చెందిన నాయకుడు. ప్రఖ్యాతి చెందిన అరబ్బులు, రొహిల్లాలు గల సైనిక దళానికి నాయకత్వం వహించిన తుర్రేబాజ్ ఖాన్, హైదరాబాద్ నివాసి పఠాన్ రుస్తుం ఖాన్ కుమారుడు. ఆయన బ్రిటీష్ సైన్యంలో జమేదారుగా పనిచేశారు.

భారత దేశమంతటా తిరుగుబాటు బావుటాలు ఆకాశవీధుల్లో రెపరెలాడుతున్న రోజులవి. ఆ రోజుల్లో ధార్మిక పెద్దలు కూడా బ్రిటీష్ పాలకుల నుండి మాతృగడ్డను విముక్తి చేయమని యవతీ యువకులను, భారతీయ సైనికులను, స్వదేశీ పాలకులను ప్రోత్సహిస్తున్న వాతావరణం. ఆ సమయంలో బానిసత్వం నుండి విముక్తికై పోరాడమని మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ తుర్రేబాజ్ ఖాన్‌కు ఉద్బోధించారు. ఆ ధార్మిక పెద్దల ప్రభావంతో ఫిరంగీలను హతమార్చమంటూ, హైదరాబాద్ నగరంలోని గోడల మీద ప్రకటనలు వెలువడ్డాయి.

ఆ వాతావరణానికి ప్రభావితులైన కొందరు బ్రిటీషు అధికారులను కాల్చివేశారు. ఈ విషయమై మాట్లాడేందుకు నిజాం అనుమతి కోరిన రొహిల్లాలను ఆయన బ్రిటీష్ అధికారులకు అప్పగించాడు. ఈ చర్యకు ఆగ్రహించిన మౌల్వీలు పోరుకు పిలుపు నిచ్చారు. ఆ పిలుపును అందుకున్న ఫఠాన్ తుర్రేబాజ్ ఖాన్ మౌల్వీ అలావుద్ధీన్ సహకారంతో బ్రిటీష్ ఆధిపత్యానికి నిలయమైన 'హైదరాబాద్ రెసిడెన్సీ' మీద 5 వందల మంది సాహసికులతో 1857 జూలై 17న దాడి చేసారు. ఈ దాడిలో పలువురు సహచరులను కోల్పోయిన ఖాన్, బ్రిటీష్-నిజాం బలగాలకు 1857 జూలై 22న పట్టుబడ్డాడు. తిరుగుబాటుకు నాయకత్వం వహించి ప్రజలను రెచ్చగొడుతున్నాడన్న నేరారోపణ మీద ఆయనకు ద్వీపాంతరవాస శిక్షను విధించి, ఆయన యావదాస్తిని బ్రిటీష్ పాలకులు స్వాధీనం చేసుకున్నారు. ఆయనను బందిఖానాలో నిర్బంధించారు.

బ్రిటీష్ పాలకులు విధించిన ఆ శిక్ష అమలు జరిగేలోగా సాహసవంతుడైన ఖాన్ తనకు కాపలాగా పెట్టిన సెంట్రీలలో కూడా మాత్రుభూమి పట్ల గౌరవాభిమానాలను ప్రోదిచేసి 1859 జనవరి 18వ తేదిన జైలు నుండి చాకచక్యంగా తప్పించుకున్నారు. ఆయన తప్పించుకునే సరికి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా ఖ్యాతిగాంచిన తిరుగుబాట్లను బ్రిటీష్ పాలకులు అణచివేసారు. అయినప్పటికీ తిరుగుబాటు నాటి స్ఫూర్తిని గుండెల నిండా నింపుకుని ఖాన్ పోరు కొనసాగించేందుకు ఆయత్తమయ్యాడు. అది పసికట్టిన నిజాం ప్రభుత్వం తుర్రేబాజ్ ఖాన్‌ను సజీవంగా గానీ నిర్జీవంగా గానీ పట్టితెచ్చిన వారికి 5వేల రూపాయల నగదు ఇస్తామని 1859 జనవరి 19వ తేదిన ప్రకటించింది ( ' A reward of Rs.5000/- was proclaimed by the Nizam's Government on 19-1-1859 for his arrest ' - *Who's Who of Freedom Struggle In Andhra Pradesh*, Vol. 1, Ed. Dr.Sarojini Regani, AP govt. Publications, 1978, page 535). ఆనాటి కాలంలో ఐదు వేల రూపాయలు చాలా విలువైన నగదు నజరానా. ఆయన తలకు అంతటి ఖరీదు కట్టారంటే,



ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల స్మారకార్థం ప్రభుత్వం హైదరాబాదు నగరం లోని కోఠి బస్టాండు వద్ద ఏర్పాటు చేసిన చక్కని స్మారక స్థూపం.

పాలకులకు ఆయన ఎంతటి సింహ స్వప్నమయ్యాడో ఊహించ వచ్చు. ఈ ప్రకటనతో అప్రమత్తుడై రహస్యంగా ప్రజలలో తిరుగుతూ, బ్రిటీష్ సేనలపై దాడులకు మళ్ళీ ఆయన ప్రయత్నాలు చేయసాగారు. ఖైదు నుండి తప్పించుకున్న ఖాన్‌ను ఎలాగైనా అంతం చేయాలన్న పట్టుదలతో బ్రిటీషు సైన్యాలు–నిజాం సేనలు నిఘాను తీవ్రతరం చేసాయి. నిజాం నవాబు ప్రకటించిన నగదు బహుమతికి ఆశపడిన కుర్‌బాన్ అలీ అను నమ్మకద్రోహి తుర్రేబాజ్ ఖాన్ ఆచూకిని బహిర్గతం చేశాడు. 1859 జనవరి 24న, మెదక్ జిల్లా పరిసర ప్రాంతాలలో తూఫ్రాన్ అను గ్రామం వద్ద తుర్రేబాజ్ ఉన్నాడని బ్రిటీష్ బలగాలకు తెలిసింది. ఆ సమాచారం మేరకు బ్రిటీష్ దళాలు ఆ ప్రాంతం మీద విరుచుకు పడ్డారు.

ఆధునిక ఆయుధాలతో చీమలదండు వలె వచ్చిపడుతున్న ఆంగ్లేయ–నిజాం సైనికులను నిలువరించటం తుర్రేబాజ్ ఖాన్‌కు అసాధ్యమైంది. గతంలో చిట్టెలుకలా సైనికబలగాల కళ్ళల్లో మన్నుకొట్టి తప్పించుకున్న ఆయనకు ఈసారి అది సాధ్యం కాలేదు. బ్రిటీష్ సైనికులు ఆయనను చుట్టుముట్టి నిరాయుధుడ్ని చేసి బంధించారు. ఆ నిర్బంధం నుండి కూడా ఆయన తప్పించుకునేందుకు ప్రయత్నిస్తున్న తరుణంలో జరిగిన పెనుగులాటలో సైనికులు ఖాన్‌ను కాల్చి చంపారు. (Apprehended by British a week later and





shot dead while he was resissting capture. - *Who's Who of Indian Martyrs* Vol. 3, Edited by P.N Chopra, page 148 ).

చివరి వరకు బ్రిటీషు–నిజాం సైన్యాలతో పోరాటం సాగిస్తూ, నిర్బంధాన్ని అవమానంగా పరిగణించిన ఆ వీరుడు తప్పించుకుపోటానికి యత్నిస్తూ శత్రువు తుపాకి గుండ్లకు ఎరయ్యాడు. ఆ యోధుని మృత దేహాన్ని బ్రిటీసు సైన్యాలు హైదరాబాదుకు తరలించాయి. బ్రిటీషు సైనిక గుడారాలలో భయోత్పాతం సృష్టించిన ఆ వీరుని భౌతికకాయంతో కూడా ఆంగ్లేయులు, ఆ పరాయి పాలకుల తొత్తులు చాలా కిరాతకంగా వ్యవహరించారు. భౌతిక కాయాన్ని సంకెళ్ళతో కట్టేసి హైదరాబాద్ నగరంలో **ప్రస్తుతం సుల్తాన్ బజారు పోలీసు స్టేషన్ ఉన్న చోట బహిరంగంగా వేలాడదీసారు**. ఆ భయంకరమైన దృశ్యాన్ని చూసిన వారెవ్వరూ కూడా భవిష్యత్తులో తిరుగుబాటుకు సాహసించకూడదని పాలకులు ఆనాడు కలలుగంటూ తమలోని క్రౌర్యాన్ని వెల్లడించుకున్నారు. ( His dead body was tied with chains and hung in the public place at Hyderabad as a waring to the rebels , ibid,page 148 ).

ఆనాడు పరాయిపాలకులు కన్న కలలను కల్లలు చేస్తూ, పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ లాంటి స్వాతంత్ర్య సంగ్రామ యోధుల వారసత్వాన్ని స్వీకరించిన ప్రజలు, ఆంగ్లేయ మూకలను ఇండియా నుండి చివరకు తరిమిగొట్టి ఆ నాటి త్యాగధనుల ఆకాంక్షలను నిజంచేశారు.

ఈ క్రమంలో ఆనాడు పఠాన్ తుర్రేబాజ్ ఖాన్,మౌల్వీ అల్లావుద్దీన్ తదితర యోధుల సాహసోపేత నాయకత్వంలో బ్రిటీషు రెసిడెన్సీ భవంతి మీద దాడి సంఘటనలకు గుర్తుగా, ఆ నాటి వీరయోధుల స్మారకార్థం, హైదరాబాదు నగరం నడి బొడ్డున గల కోఠిలోని సిటీ బస్టాండు వద్ద (అది ఆనాటి రెసిడెన్సీ ప్రాంతం) స్వతంత్ర ప్రభుత్వం ఓ స్మారక స్థూపాన్ని నిర్మించింది. ఓ గ్రానైట్ స్తంభం, దాని నాలుగు దిశలా పహరాకాస్తున్నట్టుగా ఉన్న నాలుగు ఏనుగుల శిలా విగ్రహాలతో, ఒక స్మారక చిహ్నం ఏర్పాటయ్యింది.

ఆనాటి మహాయోధుల ధైర్య సాహసాలకూ, మాతృభూమి పట్ల వారికి గల గౌరవాభిమానాలకూ, త్యాగనిరతికి ప్రతీకగా నిలిచిన ఆ స్మారక స్థూపం హైదరాబాదు నగరం నడిబొడ్డున ఉందన్న విషయాన్ని కనిపెట్టలేని పరిస్థితులు ఆ స్థూపం వద్ద ఉన్నాయి. ఆ స్థూపం చుట్టూతా వ్యాపారులు, తోపుడు బండ్లతో చుట్టుముట్టడం, కొందరు అందులో వంటకాలు కూడా ప్రారంభించి ఫాస్ట్ ఫుడ్‌లు తయారు చేస్తూ దానిని వంట–వ్యాపార ప్రాంతంగా తయారు చేశారు. ఆ కారణంగా ప్రథమ స్వాతంత్ర్య సమరయోధుల స్మారక స్థూపం ఉనికి మరుగున పడిపోయింది. ప్రతి రోజు కోఠి సిటీ బస్టాండుకు వచ్చే వేలాది నగరవాసులకు కూడా ప్రథమ స్వాతంత్ర్యసమర యోధులను స్మరించుకునేందుకు మనం ఏర్పాటు చేసుకున్న స్మారక స్థూపం అక్కడ ఉందని తెలియని దుస్థితి. ◆



ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామయోధుల మహాసేనాని

# 20. మహమ్మద్ భక్త్ ఖాన్

ప్రథమ స్వాతంత్ర్య సమరోజ్జ్వల దీప్తి మంగళ పాండే పూరించిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ శంఖారావంతో రగులుకున్న తిరుగుబాటు, పలు ప్రాంతాలలో సాగుతున్నా, తిరుగుబాటు యోధుల దృష్టి ఢిల్లీ మీదనే ఉంది. తిరుగుబాటులో పాల్గొన్న పలువురు సంస్థానాధీశులు, స్వదేశీపాలకులు, నాయకులు మొఘల్ చక్రవర్తి బహద్దూర్ షా జఫర్ నాయకత్వాన్ని అంగీకరించారు. పలు ప్రాంతాలను కంపెనీ పాలన నుండి విముక్తం చేస్తూ, ప్రళయ ఘోషతో ముందుకు సాగిన తిరుగుబాటు వీరులు, భారత దేశానికి గుండెకాయ అయినటువంటి ఢిల్లీని చేరుకుని, వలస పాలకుల పట్టునుండి ఢిల్లీని తప్పించి స్వదేశీ పాలనను పునరుద్ధరించేందుకు నడుంకట్టారు.

ఆ సమయంలో ప్రవాహంలా తరలి వచ్చిన తిరుగుబాటు యోధులకు, ప్రజలకు నాయకత్వం వహించి, బ్రిటీష్ సైనిక బలగాలను ఎదుర్కొనగల రణరంగధీరుడైన సేనాని కావాల్సి వచ్చింది. పరిపాలనా వ్యవహారాలను చక్కదిద్దగల కార్యదక్షుడు, బ్రిటీషర్లతో చేతులు కలిపిన విద్రోహుల నడుం విరగొట్టే సత్తాగల సాహసి అవసరమయ్యారు. ఆ బృహత్తరమైన బాధ్యతలను స్వీకరించేందుకు ముందుకు వచ్చారు ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ యోధుల మహాసేనాని మహమ్మద్ భక్త్‌ఖాన్.



ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అయోధ్యలోని సుల్తాన్‌పూర్‌లో మహమ్మద్ భక్త్‌ఖాన్ జన్మించాడు. తండ్రి పేరు అహమ్మదుల్లా ఖాన్. భక్త్‌ఖాన్ యుక్త వయస్సులో బ్రిటీష్‌సైన్యంలో చేరాడు. అసమాన ధైర్యసాహసాలను ప్రదర్శిస్తూ, బ్రిటీష్ శతఘ్నిదళంలో ' సుబేదార్ ' అయ్యాడు. మొదటి ఆఫ్ఘాన్ యుద్ధంలో ఆయన పాల్గొన్నాడు. బ్రిటీష్ యుద్ధశాస్త్రాన్ని, ఎత్తులు పైఎత్తులను అధ్యయనం చేశాడు. ఆయుధాలను వినియోగంలో, యుద్ధవ్యూహ రచనలో నైపుణ్యాన్ని సంపాదించాడు. బ్రిటీష్ సైన్యంలోని శతఘ్ని దళంలో 40 సంవత్సరాల సుదీర్ఘ అనుభవాన్ని సొంతం చేసుకున్నాడు. బ్రిటీషర్ల సైన్యంలో పనిచేస్తున్నా, వలసపాలకుల కర్కశపాదాల క్రింద నలిగిపోతున్న మాతృభూమి దుస్థితిని చూసి కలవరపడ్డారు. ఏం జరుగుతున్నా ఆగ్రహంతో రగిలిపోవటం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయత. నిరాశజనకమైన వాతావరణంలో గడుపుతున్న ఆయనలోని మరొక బలశాలి అవకాశం కోసం నిరీక్షిస్తున్నాడు.

ఆ అవకాశం 1857లో రానే వచ్చింది. ఆ సమయంలో ఆయన బరేలిలో ఉన్నాడు. తిరుగుబాటు పిలుపును అందుకున్నా మహమ్మద్ భక్తఖాన్ తిరుగుబాటు బావుటాను రెపరెపలాడించాడు. ఉత్తర ప్రదేశ్‌లోని షాహజహాన్‌పూరు వెళ్ళి అక్కడ సైన్యాన్ని సమకూర్చుకుని బరెల్లి (Bareilly) చేరుకున్నాడు. ఆయన నాయకత్వంలో బరెల్లీలో తిరుగుబాటు యోధులు భారీ మొత్తంలో ప్రభుత్వ ఖజానాను స్వాధీనం చేసుకున్నారు. ఒకవైపున తగినంత సైన్యాన్ని మరొక వైపున అవసరమైనంత ధనాన్ని సమకూర్చుకున్న భక్త్ ఖాన్ ఢిల్లీకి బయలు దేరాడు.

మహమ్మద్ భక్తఖాన్ ఢిల్లీ చేరుకునేసరికి అక్కడ ఏర్పడిన పరిస్థితుల వలన సమర్థుడైన సేనానాయకుడి కోసం చక్రవర్తి బహదూర్ షా జఫర్ ఎదురు చూస్తున్నాడు. ఆ తరుణంలో భక్త్ ఖాన్ ఢిల్లీ చేరుకోవటం, బ్రిటీషర్ల మీద యుద్ధానికి సంసిద్ధత వ్యక్తం చేయటం, అతని వెంట తగినంత ధనాన్ని తీసుకు రావటంతో, చక్రవర్తి సైన్యాలతో పాటుగా తిరుగుబాటు సేనలకు కూడా సర్వ సేనానిగా ఆయనను బహదూర్ షా జఫర్ నియమించారు. ఢిల్లీ నగర సంరక్షణ బాధ్యతలు అప్పగిస్తూ ఏది మంచిదనుకుంటే అది చేయాల్సిందిగా కోరుతూ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ఆయనకు అధికారాలు సంక్రమిపచేశాడు. ఈ విషయాన్ని రచయిత Christopher Hibbert, తన గ్రంథం *The Great Mutiny*(275 పేజీ) లో, ' You have full authority. Do whatever seems good unto you. ' అని పేర్కొన్నట్టుగా ఉటంకించారు.

సర్వసైన్యాధిపతిగా బాధ్యతలను స్వీకరించగానే, స్వదేశీ బలగాలకు చెల్లించాల్సిన జీతం బకాయిలను చెల్లించటమే కాకుండా ఆరు మాసాల అదనపు జీతాన్ని కూడా బట్వాడా చేసి, భక్త్‌ఖాన్ సైనికుల అభిమానాన్ని సంపాదించుకున్నాడు. ఆతరువాత ఢిల్లీలో పరిస్థితులను

చక్కదిద్దేందుకు నడుం కట్టారు. ప్రజలను పీడించటం, దోచుకునేందుకు ప్రయత్నిస్తే క్రూరంగా వ్యవహరించాల్సి వస్తుందని ప్రకటించాడు. ప్రజలపై ఎటువంటి దాష్టీకాలకూ పాల్పడరాదని, ఆజ్ఞలకు వ్యతిరేకంగా ప్రవర్తించినా, దొంగతనాలకు, దోపిడీలకు పాల్పడినా చేతులు నరికి వేస్తామని, నేరస్థుల పట్ల కఠినంగా వ్యవహరిస్తామని అన్నాడు. అక్రమాలు జరగకుండా చూడాల్సిన బాధ్యతలను ' కొత్వాల్ ' కు అప్పగించారు. నగరంలో జరగరానిది ఎక్కడైనా జరిగితే ఆ ప్రాంతపు కొత్వాల్‌ను ఉరితీయటం జరుగుతుందని హెచ్చరించాడు. ఈ పరిస్థితులను ఆసరాగా వ్యాపారవర్గాలు, సంపన్నులు అక్రమార్జనలకు పాల్పడి, సామాన్య ప్రజలను ఇక్కట్ల పాల్జేస్తే క్షమించేది లేదన్నాడు. బ్రిటీషర్లకు ఎటువంటి సహాయ సహకారాలు అందించరాదన్నాడు. శత్రువుకు సహాయ పడినవారు ఎంతటివారైనా కఠినంగా వ్యవహరించక తప్పదన్నాడు. సైనికులు, ప్రజలు రాచ మర్యాదలను సక్రమంగా పాటించాలన్నారు. ఈ మేరకు నగరంలో ఏర్పడిన ప్రత్యేక పరిస్థితులను మహమ్మద్ భక్త్ ఖాన్ అదుపులోకి తెచ్చాడు. 1857 మే మాసంలో తిరుగుబాటు దళాలు నగరంలోకి ప్రవేశించగానే, ఆ ముసుగులో ప్రజలను పీడిచటం, దోచుకోవడం ప్రారంభించిన సంఘవిద్రోహక శక్తుల స్వైరవిహారానికి ఆయన అడ్డుకట్ట వేశారు.

అటు సైన్యంలోనూ, ఇటు ప్రజలలోను క్రమశిక్షణ సాధించాక, నగరంలోని వ్యవహారాలను చక్కదిద్దాక భక్త్‌ఖాన్ తన దృష్టిని పరిపాలన వైపు సారించాడు. తిరుగుబాటు దళాల నాయకులతో సంప్రదింపులు జరిపి పలు ప్రజాస్వామిక పద్ధతులకు శ్రీకారం చుట్టాడు. పరిపాలనను చక్కదిద్ది, మెరుగు పర్చేందుకు ప్రత్యేకంగా ' మహాపరిపాలనా మండలి ' ని ఏర్పరిచాడు. ఈ మండలి అటు పౌర, ఇటు సైనిక వ్యవహారాలకు సంబంధించిన విషయాలను చర్చించి నిర్ణయాలను చేస్తుంది. న్యాయస్థానంలా తీర్పులిస్తుంది. ఈ పరిపాలనా మండలి పని తీరుకోసం 12 ప్రధాన మార్గదర్శక సూత్రాలతో ఒక విధాన నిర్ణయపత్రాన్ని తయారు చేశారు. ఆ పత్రంలోని సూత్రాలన్నీ ప్రజాస్వామిక సిద్ధాంతం ఆధారంగా తయారుచేశారు. అత్యధికుల అభిప్రాయాన్ని గౌరవించటం, ఆ నిర్ణయాల అనుసారంగా కార్యక్రమాలను సాగించటం ప్రధానమని భావించారు. సమావేశాలకు సభ్యుల కోరం, సభ్యుల హాజరు, ఇతరుల హాజరుపై నిషేధం, సభ్యుల ప్రతిపాదనలు, ఆ ప్రతిపాదనలు ప్రవేశ పెట్టేముందు మరొక సభ్యుని సమర్థన, ప్రతిపాదిత అంశం పై ప్రతిపాదకుని ప్రసంగం, ఆ తరువాత చర్చ, సభ్యులు ప్రసంగిస్తున్నప్పుడు ఎవ్వరూ ఆటంకపరచరాదన్న నిబంధన లాంటి కీలక అంశాలను ఆ విధాన నిర్ణయ పత్రంలో వివరంగా పేర్కొన్నారు. చిరకు ఈ పాలనా మండలిలోని సభ్యులు కూడా తమ చర్యలకు బాధ్యత వహించాలని నిర్ణయమైంది. అవినీతికి అక్రమాలకూ పాల్పడితే మండలిలో చర్చించి, నిందితునికి సమాధానం చెప్పుకునే అవకాశం





కల్పించి ఆ తరువాత తగిన చర్యలు తీసుకోవాలని విధాన నిర్ణయపత్రం పేర్కొనటం విశేషం, ఈ వ్యవస్థ గురించి *Indian Muslims* గ్రంథంలోని పేజీ 426-429 వరకు ఆ గ్రంథ రచయిత M. Mujeeb చాలా విస్తారంగా వివరించారు. ఆధునిక భారత దేశ చరిత్రలో ప్రప్రథమంగా ప్రజాస్వామిక రాజ్యాంగ విధానాన్ని రూపొందించటం జరిగిందని M. Mujeeb తిరుగుబాటు యోధులు ప్రతిపాదించిన వ్యవస్థను ప్రశంసించారు. ( ' First instance in the history of Modern India, when Democratic Constitutional proceedure is devised..'page 429 ). భక్త్‌ఖాన్, ఆయన అనుచరులు ప్రజాస్వామిక పద్ధతులలో పరిస్థితులను చక్కదిద్దేందుకు యత్నించినా, ఈ వ్యవస్థ అసమర్ధులైన రాజకుమారులు, పిరికి పందలు, విద్రోహుల కారణంగా విఫలమైందని M. Mujeeb ఆ గ్రంథంలో ఆవేదన వ్యక్తం చేశారు. ( ' Bhakth Khan and his comrades, who sought to obtain control of premeture and unplanned milailarty uprising did have in them the makings of just and democratic rulers and organizers and it was tragic indeed that their cause was ruined by dissolute and incompetent princes, and by cowards and traitors. ' page 429 ).

అటు సర్వ సైన్యాధిపతిగా, ఇటు ప్రధాన పౌర పాలానాధికారిగా మహమ్మద్ భక్త్ ఖాన్ బాధ్యతలు నిర్వహించాడు. పలు ప్రాంతాల నుండి విచ్చేసిన తిరుగుబాటు నేతలతో కూడి సాగుతున్న స్వతంత్ర్య పాలనకు, వ్యక్తుల మధ్యన భేదాభిప్రాయాలు, స్వార్థం అంటరాదన్న ముందు చూపుతో చక్కని రాజనీతిజ్ఞతను ప్రదర్శించాడు. ప్రతికూల పరిస్థితులలో నాయకత్వ బాధ్యతలను చేపట్టిన భక్త్‌ఖాన్ ఎంతో విజ్ఞత చూపాడు. అటు సైనికుల, ఇటు ప్రజల అభిమాన్ని పొందేందుకు ఆయన చేసిన కృషి కొంత మేరకు ఫలించింది.

ఒకవైపున స్థానిక పరిపాలనా వ్యవస్థను చక్కదిద్దేందుకు, అంతఃపురంలో సాగుతున్న కుట్రలను పసిగట్టి తుదముట్టిస్తూ, బయట నుండి శత్రువు దాడినీ, ఎత్తులను-జిత్తులనూ తెలుసుకుంటూ ప్రతివ్యూహాలను పన్నటం లాంటి క్లిష్ట పరిస్థితులను చక్కదిద్దేందుకు ఆయన తీసుకున్న కఠిన చర్యలు రుచించని వారూ లేకపోలేదు. రాజవంశీకులమన్న అహంకారం, లాభాలు కోల్పోతున్నామన్న బాధ, తమ ఎత్తులు సాగటం లేదని వ్యధ చెందుతున్న స్వార్థపర శక్తులు ఆయనకు వ్యతిరేకంగా వ్యవహరించటం ప్రారంభించారు ఆ క్లిష్ట పరిస్థితులను వినియోగించుకుని లాభాలను రాబట్టాలనుకున్న వ్యాపార వర్గాలు ఆయన మీద విరుచుకు పడ్డాయి. ఆరోపణలను కుమ్మరించాయి.

ఢిల్లీలో బ్రిటీషర్ల మీద సాధించిన విజయంతో సరిపెట్టుకుని స్థిమిత పడితే లాభం లేదని భక్త్ ఖాన్ భావించాడు. ఢిల్లీ పరిసర ప్రాంతాలలో గల ఇతర సంస్థానాధీశులకు అండగా ఆయా ప్రాంతాలలో కూడా బ్రిటీషర్ల పెత్తనాన్ని అంతం చేయాలని ఆయన

ఆలోచించాడు. ఈ లోగా రాకుమారులు, రాజకుటుంబీకులు, వాణిజ్య ప్రముఖులు భక్త్‌ఖాన్ మీద పితూరిలు చెప్పటం మరింత తీవ్రతరం చేశారు. పర్యవసానంగా, ఢిల్లీలో ఏర్పడుతున్న అవాంఛనీయ పరిస్థితులను అర్థం చేసుకున్న మహమ్మద్ భక్త్ ఖాన్ స్వచ్ఛందంగా సర్వసైన్యాధిపతి స్థానం నుండి తప్పుకున్నారు.

ఈలోగా బ్రిటీష్ పాలకులు తమ బలగాలను మరింతగా సమీకరించుకున్నారు. తిరుగుబాటు దళాలను తరిమికొట్టి ఢిల్లీని స్వాధీనం చేసుకునేందుకు సమాయత్తం కాసాగారు. ఢిల్లీని చుట్టుముట్టి దాడులు ప్రారంభించారు. బ్రిటీషర్ల వ్యూహాలు తెలిసిన భక్త్ ఖాన్ ఆ దాడులను తిప్పికొట్టడంలో ప్రధాన పాత్ర వహించారు. కదన రంగంలో శౌర్యప్రతాపాలను చూపారు. చివరకు పరాజయం తప్పదని తేలిపోయింది. ఆ సమయంలో చక్రవర్తిని కలిసి బలగాలతో సహా అయోధ్యకు తప్పించుకోవాల్సిందిగా భక్త్‌ఖాన్ కోరారు. బిడ్డడు జీవన్ భక్త్‌ను చక్రవర్తి చేయాలన్న తీవ్రమైన కాంక్షతో ఆంగ్లేయులతో చేతులు కలిపి మంతనాలు జరుపుతున్న బహుద్దూర్ షా జఫర్ భార్య జీనత్ మహల్, బ్రిటీషర్ల తొత్తుగా మారిన రాజవైద్యుడు హకీం హస్సానుల్లాఖాన్ తదితరుల ఉపదేశాలను విశ్వసించిన చక్రవర్తికి సాహసోపేతమైన భక్త్‌ఖాన్ సలహాలు రుచించలేదు. చక్రవర్తి అనుసరిస్తున్న డోలాయమాన పరిస్థితుల వలన ఉత్పన్నమగు ప్రమాదకర పరిణామాలను గమనించిన భక్త్‌ఖాన్ దేశంలోని ఇతర ప్రాంతాలలో బ్రిటీషర్లతో పోరాడుతున్న స్వదేశీపాలకులు, ప్రజలతో కలసి యుద్ధం చేసేందుకు తన సహచరులతో అయోధ్యకు తప్పించుకున్నాడు.

ఆయన అవధ్ చేరుకుని, లక్నోలో సాగుతున్న తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న బేగం హజరత్ మహల్ సైన్యానికి సహకారం అందించాడు. చివరకు అన్నివిధాల బలసంపన్నుడైన శత్రువుదే పైచేయి కావటంతో, పరాజయం ముంచుకు వస్తున్న పరిస్థితులను పసికట్టిన బేగం హజరత్ మహల్ తదితర తిరుగుబాటు యోధులతో కలసి లక్నో కదనరంగం నుండి నేపాల్ పర్వత ప్రాంతాలలోకి ఆయన తప్పించుకున్నాడు.
బ్రిటీష్ పాలకుల మిత్రుడైన నేపాల్ రాజు జంగ్ బహుదూర్, తలదాచుకునేందుకు వచ్చిన భక్త్‌ఖాన్ లాంటి వీరపుత్రులకు కనీస సహకారం కూడా అందించలేదు.

ఆ ప్రతికూల పరిస్థితులలో కూడా బ్రిటీష్ సేనలతో పోరాడుతూ, ఊపిరి ఉన్నంత వరకు ప్రథమస్వాతంత్ర్యసంగ్రామంలో ప్రముఖ పాత్రను వహించాడు. ('..Bhakth Khan played a leading part in the upheaval of 1857-58 ', *Indian Muslims*, M. Mujeeb, 1995, page 399 ) ఊపిరి ఉన్నంత వరకు ఈస్ట్ ఇండియా పాలకుల పట్ల శతృత్వం వహించిన మహాయోధుడు మహ్మద్ భక్త్ ఖాన్ 1859 మే 13వ తేదీన ఆంగ్లేయులతో పోరాడుతూ, కదనరంగంలో నేలకొరిగారు. ప్రథమ స్వాతంత్ర్య సమరంలో







**( ఢిల్లీలోని మహాపరిపాలనా మండలి తమారు చేసిన రాజ్యాంగంలోని ప్రథమ పేజీ.**
**ఈ రాజ్యాంగం మొత్తం 5 పేజీలు ఉంది.**
( Constitution of the Mutiny Court at Delhi )

చూపిన ధైర్యసాహసాలతో శత్రువు చేత కూడా భక్త్ ఖాన్ శభాష్ అన్పించుకున్నాడు. ఆయనలోని ధైర్యసాహసాలను, గుణగణాలను ప్రస్తుతిస్తూ '... A man of commanding personality...' ( *The Great Mutiny*, Christopher Hibbert, Penguin Books1978, page 275) అనీ ' A most intelligent character..' , ( ibid, page 275 ) అనీ ఆంగ్లేయ సైనికాధికారులు తమ రచనలలో, డైరీలలో మహమ్మద్ భక్త్ ఖాన్ గురించి పేర్కొనటం గమనార్హం. ◆



## తిరుగుబాటు వీరులను ఉత్తరాలతో ఉత్తేజపరచిన యుక్తిపరుడు

# 21. అజీముల్లా ఖాన్

స్వదేశీ పాలకులు, సంస్థానాధీశులు, బ్రిటీష్ పాలకులపై మండిపడుతున్న రోజులవి. తెల్ల పాలకుల రాజ్య విస్తరణకాంక్షకు స్వదేశీ పాలకుల రాజ్యాధికారం నేలకూలుతున్న రాజకీయ వాతావరణమది. మాతృభూమిపై అపారమైన ప్రేమాభిమానాలు ఉన్నా కూడా తగినంత బలం లేక, మరో మార్గం కానరాక గుండెలు పిండే బాధతో బ్రిటీష్ ఆధిపత్యాన్ని అంగీకరించినా, తెల్లదొరల దురంతాలకు వ్యతిరేకంగా ఎదురు తిరిగే అవకాశం కోసం పుట్టిన గడ్డ పట్ల గౌరవాభిమానాలు గల బిడ్డలు ఎదురుచూస్తున్న రోజులవి. ఆ రోజులలో శక్తి కంటే యుక్తి ఫలితాలనిస్తుంది. ఆ వాతావరణంలో ఆంగ్లేయ మేధావులకు ఏ మాత్రం తీసిపోని యుక్తిపరులలో ఒకరుగా ఖ్యాతిగాంచారు అజీముల్లా. ( ' Another outstanding Figure was the great poitician Azeemullah Khan, who acted as a vakeel of Nana Saheb ...' - *Freedom Movement and Indian Muslims*, Santimoy Ray, PPH,1983, page. 22 )

అజీముల్లా 1834లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో జన్మించారు. తల్లి ఆయాగా పనిచేసే అనాథ శరణాలయంలో బాల్యం గడిచింది. ' మొదటి రోజుల్లో ఒక ఆంగ్లేయుని ఇంట పని వాడిగా చేరి పొట్టగడుపుకోవాల్సినంతటి పేదరికం అతనిది. అట్టి దీన స్థితితోకూడా అతని హృదయం మహత్తరకాంక్షాజ్వాల మండుచునే ఉండేది. తాను పనిచేస్తూన్న ఉద్యోగాన్ని





విదేశీ భాషలు నేర్చుకొనడానికి వినిమోగించుకున్నాడు. అచిర కాలంలో ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు ధారాళంగా మాట్లాడటం అలవాటు చేసుకున్నాడు. ఈ మాత్రం భాషా జ్ఞానం కల్గిన తరువాత ఈ ఫిరంగి సేవకు తిలోదకాలిచ్చి కాన్పూరు విద్యాలయంలో విద్యార్థిగా చేరాడు. తన అసాధారణ శక్తిసామర్థ్యాల వల్ల అదే విద్యాలయం అధ్యాపకుడయ్యాడు. అక్కడ ప్రభుత్వ పాఠశాలలో పనిచేస్తుండగానే నానా సాహెబ్ అతని ఖ్యాతిని గురించి విన్నాడు. బ్రహ్మావర్తపు దర్బారుకు అతడు పరిచయమయ్యాడు.' (*1857 స్వరాజ్య సంగ్రామం*, వినాయకరావు దామోదర్ సావార్కర్, అనువాదంః విజయ, నవయుగ భారతి ప్రచురణలు, హైదరాబాదు,2001 పేజీ 23). అజీముల్లా చక్కని అందగాడు మాత్రమే కాక అందర్ని ఆకర్షించగల చిరునవ్వు ముఖం, మధురమైన సంభాషణ, ప్రతిభావంతమైన వాక్చాతుర్యం సొంతం చేసుకున్నాడు. అజీముల్లాలోని ఈ విశేష గుణగణాలను, ఆయన మేథాసంపత్తిని గమనించిన స్వాతంత్ర్యసమరయోధుడు నానా సాహెబ్ ఆయనను తన వకీలుగా బాధ్యతలు నిర్వహించేందుకు ఆహ్వానించాడు. అజీములా వకీలుగా నానా పక్షాన వాదించేందుకు ఇంగ్లాండు వెళ్ళాడు.

ఆ సమయంలో అందరిలో ఒకరిగా మెలుగుతూ, కులీన వర్గాలు, సంపన్న ప్రముఖులతో పరిచయాలు పెంచుకున్నాడు. వస్త్రధారణలో భారతీయ రాకుమారుడిగా కన్పించే అజీముల్లా ఖాన్ అందగాడు,మాటకారి కూడా కావటంతో,ఆయన పట్ల అకర్షితులైన ఇంగ్లాండు మహిళలు ఆయనకు అసంఖ్యాకంగా ప్రేమలేఖలు రాసారు. ఈ విషయాన్ని మరింతగా వివరిస్తూ, కాన్పూరు పతనం తరువాత జరిగిన సోదాలలో బితూరులో గల నానాసాహెబ్ భవంతిలో లండన్‌లోని పలువురు యవతులు రాసిన లేఖలు బల్పడ్డాయని *The Great Mutiny* (Page 412) గ్రంథంలో రచయిత Christopher Hibbert పేర్కొన్నాడు. అజీముల్లా ఖాన్ వ్యవహారాలు ఎంత దూరం వెళ్ళాయంటే ఇండియాలో నివశిస్తున్న బ్రిటీషర్లలో చర్చనీయాంశం అయ్యాయి.

అజీముల్లా ఇంగ్లాండు వెళ్ళి నానా సాహెబ్ కేసును వాదిస్తూ రెండు సంవత్సరాలు గడిపారు. ఈ సందర్భంగా బ్రిటీషర్ల రాజకీయాలను, ప్రవర్తనను, వ్యవహారసరళిని గమనించాడు. ఆయన నానాసాహెబ్ కేసును ఎంత గొప్పగా వాదించినా ఫలితం లేదని తెలుసుకున్నాక అజీముల్లా ఇండియాకు తిరిగి పయనమయ్యాడు. ఆయన నేరుగా ఇండియాకు రాకుండా భవిషత్తును దృష్టిలో పెట్టుకుని పలు దేశాలను పర్యటిస్తూ ఇండియా చేరుకునేలా ప్రయాణం ఏర్పాటు చేసుకున్నాడు. ఆ ఏర్పాట్ల ప్రకారంగా ముందు మాల్టా చేరుకున్నప్పుడు, ఆంగ్లో–ఫ్రెంచి సైన్యాలను రష్యా సైన్యాలు మాల్టా వద్ద పరాజయం పాల్జేయడం తెలుసుకున్నాడు. ఈ విషయాన్ని ప్రముఖ పత్రికా రచయిత విలియం హోవార్డు రస్సెల్ ప్రస్తావిస్తూ, **ఫ్రెంచి**

**వారిని, ఆంగ్లేయులను కలిపి పరాజితులను చేసిన రష్యన్ రుస్తుంలను చూసే కోరికతో అజీముల్లా క్రిమియాకు వెళ్ళాడు. రష్యన్ శతఘ్నులు పని చేస్తూండగా సురక్షిత స్థలాలలో ఉండి ఆయన చూసాడు,** ( '...those great Roostums, the Russians, who have beaten the French and English together...' - Who 's who of Indian Martyrs Vol.3, page 13 ) అని అన్నాడు. రష్యా సైనిక పాటవాన్ని పరిశీలించేందుకు తన ప్రయాణ దిశను మార్చుకుని కానిస్టాంటునోపుల్‌కు వెళ్ళాడు. ఫ్రాన్స్, క్రిమియాలను సందర్శించారు. ఆయా దేశాల రాజకీయాలను, యుద్ధప్రక్రియలను, నాయకుల ఎత్తులు, పై ఎత్తుల తీరుతెన్నులను క్షుణ్ణంగా పరిశీలించి, అధ్యయనం చేశాడు. ఆ దేశాల ప్రజానీకం స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల పట్ల వ్యక్తంచేసిన అభిప్రాయాలు, ఆకాంక్షలు, ఆయా లక్ష్యాల సాధన కోసం వారు సాగించిన పోరాటాలు అజీముల్లాలో దాగి ఉన్న స్వతంత్ర-స్వేచ్ఛాయుత ఆలోచనలకు మరింతగా పదునుపెట్టాయి. స్వదేశానికి రాకుండానే తెల్లపాలకులను వెళ్ళగొట్టేందుకు ప్రయత్నాలు ప్రారంభించాడు. బ్రిటీష్ పాలకుల పాలనాధికారానికి చరమగీతం పాడేందుకు సహకరించే పలు దేశాలతో, అయా దేశాల అధినేతలతో రహస్య సంబంధాలను ఏర్పాటు చేసుకున్నాడు.

భారతదేశం తిరిగి వచ్చాక శ్రీ నానాసాహెబ్‌తో కలసి తన అలోచనలను పంచుకుని తన ప్రయత్నాలను ముమ్మరం చేశాడు. ' సింహ నేత్రాల్లా తీక్షణమైన జ్వాలలు గ్రక్కుతున్న నానా సాహెబ్ నేత్రాలు అజీముల్లా ఆగమనంతో మరింత చింతనిప్పుల్లా జ్వాలలు గ్రక్కనారంభించాయి ' (1857 స్వరాజ్య సంగ్రామం, వినాయకరావు దామోదర్ సావార్కర్, పేజీ38). బ్రిటీషర్లపై తిరబడాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతూ స్వదేశీ పాలకులకు లేఖలు రాసాడు. ఆ సమయంలో ప్రథమ స్వాతంత్ర్యపోరాట బావుటాలు పలు ప్రాంతాలలో ఎగర సాగాయి. శ్రీ నానాసాహెబ్ ఆంగ్లేయుల మీద బహిరంగంగా తిరగబడ్డారు. ఆ సమయంలో నానా సాహెబ్ తన సైన్యంతో ఢిల్లీకి తరలి వెళ్ళాలని అలోచిస్తున్నాడు. ఆయన అలోచనల వలన ఉపయోగం ఉండదని అజీముల్లా గ్రహించాడు. అప్పటికల్లా నానా సాహెబ్ తన బలగాలతో ఢిల్లీ దారి పట్టాడు. ఆ సమయంలో ఢిల్లీలో నానా సాహెబ్ అందరిలో ఒక్కరిగా మాత్రమే మెలగాల్సి వస్తుందని, స్వస్థలమైన కాన్పూరులో ఉండి ఆంగ్లేయుల మీద యుద్ధం ప్రకటిస్తే ఎంతో మేలు జరుగుతుందిన భావించిన అజీముల్లా, ఈ మేరకు నానాకు నచ్చచెప్పగలిగారు. అజీముల్లా సలహా మీద నానా తన ఢిల్లీ యాత్రను విరమించుకున్నాడు.

అజీముల్లా నానా సాహెబ్ ప్రతినిధిగా తిరుగుబాటుకు వ్యూహరచన చేశాడు. నానా ప్రతినిధిగా తిరగబడిన స్వదేశీపాలకులను కూడగట్టేందుకు ప్రయత్నాలు ప్రారంభించారు. అజీముల్లాను సంప్రదించనిదే నానా సాహెబ్ ముఖ్యమైన నిర్ణయమూ





తీసుకునేవాడు కాదు ( 1857 స్వరాజ్య సంగ్రామం పేజీ 23). ఈ సందర్భంగా ఇతర ప్రాంతాల సైనిక నేతలకు, ప్రత్యేకించి బ్రిటిష్ సైన్యంలోని భారతీయ సైనికులకు ఆయన ఉత్తరాలు రాసాడు. ఈ లేఖలలో ఆనాటి రాజకీయాలను వివరిస్తూ, స్వదేశీ పాలకులంతా ఎందువల్ల ఐక్యంగా ఆంగ్లేయుల మీద ధ్వజం ఎత్తాలో వివరించాడు. ఇంగ్లాండు తదితర ప్రాంతాల పర్యటనల సందర్భంగా తాను సంపాదించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి, రహస్య సంకేతాలతో ప్రత్యేక లేఖలను తయారు చేసిన పంపాడు. ఆ లేఖలు శత్రువు చేతబడినా ఉద్యమానికి, ఉద్యమకారులకు నష్టం కలుగకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నాడు. ఉత్తేజపూరితమైన ఆ ఉత్తరాలు **' భారతీయ రాకుమారుడి లేఖలు '** గా ప్రచురితమై విఖ్యాతిగాంచాయి. అజీముల్లా రెండవ శ్రీబాజీ రావు, శ్రీ నానాసాహెబ్ దర్బారులోని రోజువారి వ్యవహారాలను కూడా ప్రత్యేక డైరీలుగా రాసారు. ఆనాటి రాజకీయ వాతావారణంతో పాటుగా, ప్రజల జీవితాల గురించి తెలుసుకోవటానికి ఆయన రాసిన డైరీలు, లేఖలు చరిత్రకారులకు ఆ తరువాత ఎంతగానో ఉపయోగపడ్డాయి.

1857 నాటి పోరాట కాలంలో ప్రజలలో దేశభక్తి భావనలను పెంపొందించేందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు **' పయామే అజాది '** అను పత్రికను హిందీ, ఉర్దూ భాషల్లో అజీముల్లా ఖాన్ స్వయంగా ప్రచురించారు. మరాఠి భాషలో కూడా ఆ పత్రికను నడిపేందుకు ప్రయత్నాలు జరిగాయి. ఆ పత్రికలో **'..భారతీయ హిందువులారా, ముస్లింలారా లేవండి. సోదరులారా లేవండి. దైవం మనిషికి ఎన్నో వనరులను ఇచ్చాడు. అందులో విలువైనది స్వాతంత్ర్యం..'** అంటూ మొగల్ చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ ప్రజలకు ఇచ్చిన పిలుపును ప్రచురించాడు. మాతృ దేశాన్ని కీర్తిస్తూ, బానిస బంధనాల నుండి విముక్తి కోసం పోరుబాట నడవమంటూ ప్రబోధ గీతం ఈ పత్రికలో ప్రచురితమైంది. ఉర్దూ భాషలో ప్రచురితమైన ఆ గీతం ఇలా సాగింది.

**' హమ్ హైం ఇస్‌కే మాలిక్**
**హిందూస్థాన్ హమారా !**
**పాక్ వతన్ హై ఖౌమ్‌కా జన్నత్‌సేభి ప్యారా**
**యే హై హమారీ మిల్కియత్,**
**హిందూస్థాన్ హమారా !**
**ఇస్‌కీ సలామియత్‌సే రోషన్ హై జగ్‌సారా**
**కితనా ఖదీమ్, కితనా నయీమ్**
**సబ్ దునియాం సే న్యారాకరతీ హై**
**జర్‌ఖేజ్ జిసే**

**గంగా జమునాకే ధారా !**
**ఊపర్ బర్ఫీలీ పర్వత్ పహరెదార్ హమారా !**
**నీచే సాహల్‌పర్ బజ్‌తా, సాగర్ నక్కారా**
**ఆయా ఫిరంగీ దూర్‌సే ఐసా మంతర్ మారా !**
**లూటా దోనో హాతోఁ సే**
**ప్యారా వతన్ హమారా !**
**ఆజ్ షహీదోఁ నే తుమ్‌కో**
**అహెలే వతన్ లల్‌కారా !**
**తోడో గులామీకే జంజీరేఁ, బరసావో అఁగారా !**
**హిందూ, ముసల్మాన్, సిఖ్ హమారా**
**భాయీ భాయీ ప్యారా**
**యే హై ఆజాదికా ఝుండా,**
**ఇసే సలామ్ హమారా ! '.**

( 'భారత పత్రికల్లో ముస్లింల పాత్ర', వ్యాసకర్త : ముక్తార్, *గీటురాయి* వారపత్రిక, హైదరాబాదు, 25-04-2003 నాటి సంచిక, పేజీ 23. )

ఓ పథకం ప్రకారంగా నానాసాహెబ్ సాగించిన తీర్థయాత్రలలో ఆయన ఆంతరంగికుడిగా అజీముల్లా ఆయన వెంట వెళ్ళారు. ఈ పర్యటనలో గ్రాండ్ ట్రంక్ రోడ్డుకు సమీపాన ఉన్న బ్రిటీషు వారి సైనిక స్థావరాలను ఆయన క్షుణ్ణంగా పరిశీలించాడు. అందుకు తగ్గట్టుగా పథకాలను రూపొందించుకున్నాడు. ఆనాడు పలు ప్రాంతాల నుండి ఢిల్లీ చేరుకుంటున్న స్వదేశీ పాలకులు, తిరుగుబాటుదారుల్లా కాకుండా స్వస్థలమైన కాన్పూరులో ఉంటూ, బ్రిటీషు పాలకులను తుదముట్టించాల్సిందిగా నానాసాహెబ్‌కు సూచించాడు. (' As a Chief advisor of Nana Saheb he advised him to lead the rebels from Kanpur instead of going to Delhi ' - *Freedom Fighters of Indian Mutiny 1857*, M.P.Srivasthava, Allahabad, 1997 ) ఆ ప్రకారంగా చరిత్ర ప్రసిద్ధి చెందిన **కాన్పూరు తిరుగుబాటు**కు అజీముల్లా పథక రచన చేసారు. ఆయన స్వయంగా నానాసాహెబ్ వెంట ఉండి తిరుగుబాటును పథకం ప్రకారంగా నడిపించారు.

ఈ తిరుగుబాటుకు టర్కీ, ఈజిప్టు అధినేతల సహకారాన్ని కోరుతూ చారిత్రాత్మక లేఖలు రాసారు. బ్రిటీషర్ల అధికారాన్ని అంతమొందించాలంటే హిందూ-ముస్లింల ఐక్యత అత్యవసరం అన్నాడు. మతం విధించే పరిమితులకు, ఆచార సంప్రదాయాల ఆంక్షలకు అతీతంగా హిందూ-ముస్లిం ఐక్యత సాధించేందుకు అవిశ్రాంతంగా శ్రమించాడు. ఈ





సందర్భంగా ఆయన మతానికి అంతగా ప్రాముఖ్యతనివ్వలేదు. ఉమ్మడి శత్రువు మీద ఐక్యపోరాటాల అవసరాన్ని గుర్తించిన అజీముల్లా ప్రముఖ పాత్రికేయుడు William Howard Russel ను కలసి మాట్లాడుతూ ' I am not such a fool as to belive in these foolish things. I am of no religion.. ' అన్నాడని *Eighteen Fifty Seven* (Page126) అను గ్రంథంలో రచయిత Surenda Nath Sen పేర్కొన్నాడు.

**1857 విప్లవానికి సంబంధించి గుర్తుంచుకోవాల్సిన వ్యక్తి అజీముల్లా ఖాన్. స్వాతంత్ర్య సమరానికి రూపకల్పన చేసిన కొద్దిమంది మేధావులలో ఈయన ఒక ముఖ్యుడు. విప్లవము యొక్క వివిధ దశలలో రూపొందించిన వివిధ పథకాలలో అజీముల్లా ఖాన్ పాత్ర ప్రత్యేకంగా గమనించదగినట్టిది.** (*1857 స్వరాజ్య సంగ్రామం*, వినాయకరావు దామోదర్ సావార్కర్, పేజీ23).

ఆ పోరాటకాలంలో మతాల కంటే, మాతృదేశం పట్ల ప్రేమాభిమానాలు ఎక్కువగా వ్యక్తం అయ్యాయి. ప్రజలు, సైనికులు, సైనికాధికారులు మతాలతో ప్రసక్తి లేకుండా తిరుగబడి, స్వదేశీపాలకులకు సంపూర్ణ సహకారం అందించారు. కాన్పూరు యోధుడు నానా సాహెబ్‌కు బేగం అజీజున్ లాంటి వీర నారిమణి పలు రంగాలలో తోడ్పాటు అందిస్తూ, వీరమరణం పొందగా, మహమ్మద్ అలీ ఖాన్ (మన్నె నవాబు) నానా శతఘ్ని దళానికి అధిపతిగా వ్యవహరించి ఆంగ్లేయ మూకలతో పోరాటం చేస్తూ రణభూమిలో అమరుడయ్యాడు.

నానా సాహెబ్‌తో పాటు తిరుగుబాటులో పాల్గొనటమే కాక, తిరుగుబాటు నేతలైన బేగం హజరత్ మహల్, మౌల్వీ అహ్మదుల్లాఖాన్, ఝాన్సీలక్ష్మీబాయి, షహజాదా ఫిరోజ్‌షా, తాంతియాతోపేలకు అజీముల్లా ఖాన్ సహకరించాడు. తిరుగుబాటు పరాజయం అంచుకు చేరుకునేసరికి నానా సాహెబ్‌తో పాటుగా అయన కూడా నేపాల్ అడవుల్లోకి వెళ్ళిపోయారు. బలగాలను సమకూర్చుకొని తిరిగి దాడులను ప్రారంభించాలని కదనరంగం నుండి తప్పించుకున్న తిరుగుబాటు నేతలతోపాటుగా అజీముల్లా కూడా ఆశించారు. ఈ మేరకు పథక రచనలు చేశారు. అంగబలం, ఆర్థిక బలం తగినంతగా లేకపోవటం రణభూమిలో శతృవుది పైచేయికావటంతో ఆయన ఎత్తులు ఆచరణకు నోచుకోలేదు. ఆయన ఆకాంక్షల సాధనకు నేపాల్ రాజు జంగ్ బహాదూర్ సహకరించలేదు.

చివరకు ప్రతికూల పరిస్థితులలో బలగాలను సమకూర్చుకునే ప్రయత్నంలో అష్టకష్టాలు పడుతూ, నేపాల్ పర్వత సానువుల్లోని భుట్‌వాల్ (Bhutwal) అను ప్రాంతంలో అజీముల్లా ఖాన్ 1859 అక్టోబరు మాసంలో కన్నుమూశారు. ◆



### బ్రిటీష్‌పాలక వర్గాల సింహస్వప్నం

# 22. దూదు మియా

ఆంగ్లేయులు బెంగాల్‌లో తమ పునాదులను ఏర్పాటు చేసుకున్నారు. అక్కడి నుండి దోపిడి ప్రయోగాలు ఆరంభించారు. ఆధిపత్యం సాగించారు. ఆనాడు అవిభక్త బెంగాల్, బీహార్ తదితర ప్రాంతాలలో సాగుతున్న అంతులేని దోపిడీని ప్రజలు సహించలేక పోయారు. పాలకవర్గాలపై పోరుకు సిద్దపడ్డారు. ఈ మేరకు పోరాటాలను ప్రారంభించిన ముస్లిం నాయకులు, తొలి దశలో ఇస్లాం నిర్దేశించిన మార్గాన ప్రజలను నడిపించాలన్న లక్ష్యంతో ఉద్యమించారు. ఆ తరువాత ముఖ్యంగా రెండవ తరం నాయకులు, ఆనాటి సమకాలీన, ఆర్థిక రాజకీయ పరిస్థితులను అర్థం చేసుకుని, తమ ప్రాంతాలలోని అన్ని వర్గాల ప్రజలను కలుపుకుని ఐక్య పోరాటాలు సాగించారు. ఆ పోరాటాలకు ప్రాణం పోసిన ద్వితీయ తరం యోధులలో దూదు మియా ఒకరు.

భారతదేశ స్వాతంత్ర్యసమరోజ్జ్వల చరిత్రలో సుస్థిర స్థానం సంపాదించి, ఉద్యమకారులకు స్ఫూర్తిదాయకంగా నిలచిన ఫరాజీ ఉద్యమానికి హాజీ షరీయతుల్లా అంకుర్పాణ చేయగా, ఆ ఉద్యమాన్ని వలసపాలకులకు వ్యతిరేకంగా దిశా నిర్దేశం చేసిన దూదు మియా హాజీ షరియతుల్లా ఇంట 1819 లో జన్మించారు. ఆయన అసలు పేరు ముహమ్మద్ మోసిన్. '**దూదు మియా**' గా ఆయనను ప్రజలు పిలుచుకున్నారు. తండ్రిని మించిన





తనయునిగా ఖ్యాతిగాంచారు. ఫరాజీలను బ్రిటీషర్లకూ వారి తొత్తులకూ వ్యతిరేకంగా పోరుబాటన నడిపించి, భారత స్వాతంత్ర్యసంగ్రామంలో ప్రత్యేక స్థానం సంపాదించి పెట్టారు.

తండ్రి షరియతుల్లా బాటన నడవాలనుకున్న దూదుమియా చిన్ననాటనే అప్పటికే ఆంగ్లేయుల మీద, జమీందారు మీద ధ్వజమెత్తిన ప్రజానాయకులు టిటూ మీర్ లాంటి యోధులను కలుసుకున్నారు. ఆయా పోరాట బాటలను అవగాహన చేసుకున్నారు. ఆ సాయుధపోరుబాటలో సాగేముందు ఆయన మక్కా వెళ్ళి హజ్ చేసి వచ్చారు. ఆ పర్యటనలో ధార్మిక చింతనతో పాటుగా సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల పట్ల అవగాహన సంతరించుకున్నారు. అప్పటికి ఆయన వయస్సు 20 సంవత్సరాలు.

దూదుమియా ఫరాజీ ఉద్యమ నాయకత్వం స్వీకరించే సరికి, ఫరాజీలు కేవలం ధార్మిక అంశాలనే కాకుండా ప్రజల మీద సాగుతున్న దోపిడి-అణిచివేతలను ఎదుర్కొనేందుకు సమాయత్తం అవుతున్నారు. ఆ పరిస్థితులలో నాయకత్వం చేపట్టిన దూదుమియా కార్యదక్షత, చక్కని ఉద్యమ నిర్మాణ కౌశల్యం ప్రదర్శించి తండ్రిని మించిన తనయుడిగా ఖ్యాతిగాంచారు. హాజీ షరియతుల్లా ప్రధానంగా ధార్మిక సామాజిక విషయాల మీద దృష్టి సారించగా, దూదుమియా సమకాలీన ఆర్థిక, రాజకీయ పరిస్థితుల మీద తన దృష్టి కేంద్రీకరించారు. పరుగులు పెడుతున్న ఫరాజీ ఉద్యమాన్ని తీర్చిదిద్ది మలుపు తిప్పారు. ఈ విషయాన్ని ప్రముఖ బెంగాలి రచయిత S.P.RAY తన గ్రంధం *History of Peasant Revolt in India*, Vol I page 293 లో, ' Under Dudu Mia political and economical programme was combined. It brought a qulitative changes in the character of the movement', అని అన్నారని *Freedom Movement and Indian Muslims (*page 9) లో రచయిత Santimoy Ray ఉటంకించారు. దూదుమియా ఫరాజీలను సమరశీల కార్యకర్తలుగా తీర్చిదిద్దారు. జమీందారులకు, వడ్డీవ్యాపారులకు, ప్లాంటర్లకు, మహాజనులకు వ్యతిరేకంగా పోరాటాలను సాగించేందుకు పటిష్టమైన ప్రత్యేక బలగాల వ్యవస్థలు రూపొందించారు. ఈ ప్రజావ్యతిరేక శక్తులకు అండగా నిలుస్తున్న బ్రిటీష్ ప్రభుత్వాన్ని ఎదుర్కోడానికి ఫరాజీలను సాయుధ పోరాటవీరులుగా తీర్చిదిద్దారు.

ఆనాడు తూర్పు బెంగాల్ లో జమీందారులు, కంపెనీ అధికారులు, ఇండిగో ప్లాంటర్లు (నీలి మందు తయారిదారులైన అంగ్లేయులు) గ్రామీణ పేద రైతాంగంమీద, ప్రజల మీద సాగిస్తున్న దోపిడి, అణిచివేత చర్యలను గమనించి, ఆ సమస్యలను వివరిస్తూ, ప్రభుత్వానికి లేఖలు రాయటం ఆరంభించారు. ఈ మేరకు 1850 జనవరి 1వ తేదీన రాసిన లేఖలో ఆయన పేర్కొన్న విషయాలను పరిశీలిస్తే ఆనాడు ప్రజలు పడుతున్న కష్ట నష్టాలను, ప్రధానంగా రైతుల ఇష్టాయిస్టాలకు వ్యతిరేకంగా ప్లాంటర్లు సాగిస్తున అక్రమ

పెత్తనం తదితర పరిస్థితుల మీద దూదుమియా ఆలోచనలు, అభిప్రాయాలు మనకు స్పష్టంగా అర్థం అవుతాయి. ఆయన రాసిన లేఖలో, **ముస్లింలు తమ జీవన విధానం, ఆచార, సాంప్రదాయాల విషయంలో దిగజారి పోయారు. విగ్రహాలను ఆరాధిస్తున్నారు. పూర్వీకుల పేరిట బలులను ఇస్తున్నారు. ముస్లింలు పరిశుద్ద ఇస్లాం జీవన విధానం నుండి తొలగి దొంగతనాలు, దోపిడీలను వృత్తిగా చేసుకున్నారు. కష్ట నష్టాలకు గురవుతూ, ఆస్తిపాస్తులను పోగొట్టుకుని, ఫౌజ్‌దారి కోర్టుల (క్రిమినల్ కోర్టులు) పాలవుతున్నారు.** ఈ విపత్కర పరిస్థితుల నుండి ప్రజలను విముక్తం చేయడానికి తన తండ్రి ఉద్యమించగా, అదే బాటన తాను కూడా నడుస్తున్నానని దూదుమియా ఈ లేఖలలో వివరించారు. **ఇస్లాం చూపిన మార్గం నుండి తప్పుకుని, అల్లాహ్ ఆదేశలను విస్మరించి, మార్గభ్రష్టులైన ప్రజలను ఇస్లాం మార్గాన నడిపించేందుకు తాము పూనుకున్నామని,** ఆయన పేర్కొన్నారు.

గ్రామీణుల వ్యవహారాలలో జమీందారుల జోక్యం, రైతాంగం మీద సాగిస్తున్న జులుంను నిరసిస్తూ, **అటు హిందూ జమీందారులు గాని, ఇటు ముస్లిం జమీందారులు గాని, రైతుల మధ్యన తలెత్తిన వివాదాలలో, తమను తాము న్యాయాధికారులుగా ప్రకటించుకుని, అనవసరంగా జోక్యం చేసుకుంటూ రైతులకు శిక్షలు, జరిమానాలు విధిస్తున్నారని, ఆ జరిమానాలు చెల్లించటంలో ఆలస్యమైతే అందుకు శిక్షగా రైతును తీవ్రంగా హింసిస్తున్నార**ని ఆయన పేర్కొన్నారు. ప్రభుత్వ పాత్రను జమీందారులు నిర్వహించటం ఏంటని ప్రభుత్వాన్ని నిగ్గతీస్తూ, ఈ పద్ధతి అటు ప్రభుత్వ చట్టాలకు, ఇటు భగవంతుని ఆదేశాలకు విరుద్ధమని ఆయన తీవ్రంగా విమర్శించారు.

ప్రజల మీద జమీందారులు, ప్లాంటర్లు సాగిస్తున్న ఆర్థిక దోపిడీ, సాంఘీక పెత్తనం మీద దృష్టి సారిస్తూ, **జమీందారులు, కంపెనీ పాలకులు, అధికారులు సాగిస్తున్న అక్రమ వసూళ్ళను ప్రశ్నించారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారంగా నిర్ణయించబడిన పన్నును ఇతర మొత్తాలను మాత్రమే జమీందారులు వసూలు చేయాల్సి ఉంది. అందుకు భిన్నంగా జమీందారులు, అధికారులు తమ వినోదాలకు, విలాసాలకు అవసరమయ్యే దబ్బును ప్రజల నుండి బలవంతంగా వసూలు చేస్తున్నారు. ముస్లిమేతరుల పండగలు-పబ్బాల నిర్వహణకు భారీ మొత్తాలను ముస్లింల నుండి వసూలు చేయటం ప్రారంభించారు. ప్రభుత్వం విధించిన పన్నులు చెల్లించడానికి, ఆర్థిక ఇక్కట్లల్లో కూడా అతి కష్టంగా, సిద్ధపడిన రైతులు, అక్రమ చెల్లింపులను మాత్రం నిరాకరించారు. అలా నిరాకరించిన రైతులను జమీందారులు హింసలకు గురిచేస్తున్నార**ని ఆయన పేర్కొన్నారు. ఈ చర్యల మీద విచారణ జరిపించాల్సిందిగా తొలిదశలో కంపెనీ అధికారులను దూదు మియా కోరారు. **అక్రమంగా పన్ను వసూళ్ళను రైతులు వ్యతిరేకించటంతో జమీందారులు తమ అనుయాయుల ద్వారా





తప్పుడు కేసులు పెట్టించి వేధిస్తున్నారని అందువల్ల ఫౌజ్‌దారి కోర్టులలో అధిక సంఖ్యలలో రైతుల మీద కేసులు నమోదు అవుతున్నాయి** అని ఆయన ఆగ్రహం వ్యక్తం చేసారు. ఈ చర్యల వలన పేద రైతులు, ఇతర గ్రామీణులు వ్యయ ప్రయాసలకు గురవుతున్నారన్నారు.

ఈ పరిస్థితుల నేపథ్యంలో దూదు మియా ప్రజలకు అండగా నిలిచారు. ఆయన నాయకత్వంలో ఫరాజీలు జమీందారుల అక్రమాలను ధైర్యంగా వ్యతిరేకించారు. ఫరాజీల పోరాట పటిమను, న్యాయం పక్షాన నిలిచే సద్గుణాలను గమనించిన ప్రజలు, రైతులు, ఇతర బాధితులు అక్రమ పన్నులను చెల్లించ నిరాకరించారు. అణిగి మణిగి పడి ఉండే రైతులు తమ ఆదేశాలను ఖాతరు చేయకపోవటం, పన్నులను, విరాళాలను చెల్లించమని ఖరాఖండిగా చెప్పటంతో జమీందారులలో ఆగ్రహం కట్టలు తెంచుకుంది. రాక్షసత్వం పురివిప్పింది. గ్రామీణులు, ఫరాజీల మీద కిరాతక చర్యలకు పాల్పడ్డారు. ఈ పరిస్థితులలో గ్రామీణులు, రైతులకు, ప్రజలకు తిరుగబడటం తప్ప మరో మార్గం లేకుండా పోయింది. జమీందారులు, బ్రిటీష్ అధికారుల పట్ల ఫరాజీలు, గ్రామీణ పేదల ఆగ్రహం కట్టలు తెంచుకుని తిరుగుబాటు రూపుదిద్దుకుంది. ఆ తిరుగాబాటుకు దూదుమియా సమరశీల నాయకత్వం వహించారు.

ఆ లక్ష్యసాధన కోసం దూదుమియా, ఫరాజీ ఉద్యమాన్ని మార్గం మళ్ళించారు. జమీందారుల ఆర్థిక దోపిడి, బ్రిటీషర్ల అణిచివేత నుండి విముక్తి కోసం పోరుకు సిద్ధంకమ్మని ప్రజలకు పిలుపు నిచ్చారు. బాధితులకు ఆయన ఆపద్బాంధవునిలా కన్పించాడు. ప్రజలలో గౌరవాభిమానాలు సంపాదించుకున్న ఆయన సమరశీల ఆలోచనలతో బాధితులకు మరింత చేరువయ్యారు. ఆయన సారథ్యంలో ఫరాజీలు, ప్రజలు సంఘటితమై, ఎటువంటి శక్తులనైనా, ఏ పరిస్థితులనైనా ఎదుర్కోగల ఆత్మస్థైర్యంతో, అంగబలం, ఆయుధబలం, ఆర్థిక శక్తిని సమకూర్చుకున్నారు. జమీందారుల, బ్రిటీష్ అధికారుల అరాచకాలను ఏ మాత్రం సాగనివ్వమని దూదుమియా నాయకత్వంలో ఫరాజీలు, ప్రజలు ప్రతినపూనారు.

1839లో దూదుమియా ఫరాజీ ఉద్యమ నాయకత్వం చేపట్టిన రోజుననే తన సమరశీలతను చాటుకున్నారు. ఆ రోజున ఫరాజీలు, ప్రజలు ఆయుధాలు చేతబట్టి, ఆయన నాయకత్వం పట్ల తమ గౌరవాన్నీ, అంగీకారాన్నీ ప్రకటించారు. ఆయన నాయకత్వంలో షిబిచూర్ పోలీసు స్టేషన్ మీద దాడిచేసారు. ఫరాజీల ధాటికి తట్టుకోలేక బ్రిటీష్ పోలీసు అధికారులు ప్రాణభయంతో పారిపోయారు. పోలీసు స్టేషన్‌ను ధ్వంసం చేసిన ఫరాజీలు పరిసరాలలో రైతులను పీడించిన ధనికులు, మహజనుల మీద దాడులు చేసారు. ఈ దాడులు మతాలకు అతీతంగా జరిగాయి. ఈ తిరుగుబాటు స్వభావం మీద ఫరీద్‌పూర్ మేజిస్ట్రేట్ నివేదిక పంపుతూ ఫరాజీల తిరుగుబాటు 1831లో వహాబీలు జరిపిన **బరాసత్**

రైతాంగ తిరుగుబాటును పోలి ఉన్నదన్నాడు. ఆనాడు బరాసత్ తిరుగుబాటు విజయంతో తిరుగులేని శక్తిగా ఆవిర్భవించిన వహాబీల మాదిరిగానే ఫరాజీలకు సిబ్బూర్ విజయంతో తిరుగులేకుండా పోయింది.

శతృవు శక్తిసామర్థ్యాలను అంచనా వేసుకున్న దూదుమియా ఫరాజీ ఉద్యమ వ్యవస్థను పటిష్టం చేసారు. ఉద్యమ కార్యక్రమాలను ఒక నిర్దిష్ట పద్ధతి ప్రకారంగా అమలు చేసేందుకు పూనుకున్నారు. ఫరాజీల ప్రాబల్యం ఉన్న గ్రామాలలో, పట్టణాలలో దూదుమియా ప్రజాస్వామ్య రీతిలో పంచాయితీల వ్యవస్థను ఏర్పాటు చేసారు. ఫరాజీల పలుకుబడి గల ప్రాంతాలలో ప్రభుత్వ అధికారుల కంటే, దూదుమియా ఆదేశాలు ఖచ్చితంగా అమలు కావటం గమనించిన చరిత్రకారులు ఆ వ్యవస్థను " state with in the state " గా పరిగణించారు. శతృవు మీద దాడి జరపడానికి ప్రత్యేక బలగాలను, శతృవు కదలికలను ఎప్పటికప్పుడు చేరవేయడానికి పటిష్టమైన గూఢచారి వ్యవస్థను నిర్మించారు. ఈ చర్యల మూలంగా తూర్పు బెంగాల్ ప్రాంతంలో దూదుమియా అనుచరులు 80 వేల మంది ఉన్నారని ప్రభుత్వ రికార్డులు వెల్లడించగా, ఫరాజీల మీద సాగిన వివిధ కేసులలోని ప్రభుత్వ సాక్షులు పలు జిల్లాలలో ఫరాజీలు రెండు నుండి రెండున్నర లక్షలకు పైగా ఉంటారని, దూదుమియా పిలుపునిస్తే క్షణాలలో హాజరుకావడానికి 50 వేల మంది సిద్ధంగా ఉంటారని తెలిపారు. ఈ కార్యక్రమాలను దూదుమియా ఫరీద్‌పూర్‌ను కేంద్రంగా చేసుకుని నడిపారు. దూదు మియా ఆజ్ఞలు భగవంతుని ఆజ్ఞలతో సమానంగా ఫరాజీలు భావించారు. ఆయన బాటలో అమరత్వం లభిస్తుందని విశ్వసించారు. ఈ విషయాన్ని అప్పటి కంపెనీ అధికారులు ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలో ఈ విధంగా పేర్కొన్నారు.

"..The Farazis held Dudhu Miyan to be their temporal as well as spriritual ruler. They obeyed his commands inplicitly. They belived that any person, slain while executing his orders, would enjoy the rewards of martyrdom as surely as if he had fallen in battle for the faith of Islam. " ( Letter from superintendent of police, Lower Province to Govenment of Bengal, Judl. Progs., 25 October 1848, qutoed by Mr. Narahari Kaviraj in his *Wahabi And Farazi Rebels of Bengal*, Page 81)

అక్రమ వసూళ్ళను వ్యతిరేకిస్తున్న, జమీందార్ల, బ్రిటీష్ అధికారుల దోపిడికి, పెత్తనానికి వ్యతిరేకంగా పోరుబాటన నడుస్తున్న, రైతులకు ఇండిగో ప్లాంటర్లు ( నీలిమందు ఫ్యాక్టరీల యజమానులు) రూపంలో మరొక సమస్య వచ్చి పడింది. గ్రామీణ రైతులను, రైతుల భూములను తమ గుప్పెట బిగించుకుని తమ ఇష్టానుసారంగా నీలి మందు పంటను పండించాలని, తాము నిర్దేశించిన విధంగా రైతులు నడుచుకోవాలని, కాదూ కూడదంటే ఆ భూములలో పండే పంటలో ప్రధాన భాగం తమకు సంక్రమింపచేయాలని ప్లాంటర్లు రైతులను





పీడించసాగారు. ప్లాంటర్ల పెత్తనాన్ని సవాల్ చేస్తూ, ఫరాజీలు రైతుల పక్షాన నిలబడటంతో ఇండిగో ప్లాంటర్లు ఫరాజీల మీద కక్షబూనారు. ఫరాజీలను ప్రథమ శతృవులుగా పరిగణించారు. తూర్పు బెంగాల్ ప్రాంతంలో ఫరాజీలు ప్రముఖ ప్లాంటర్ డన్‌లప్ (DUNLOP) చర్యలను వ్యతిరేకించారు. రైతులు తనను వ్యతిరేకించే స్థాయికి ఎదగటం అహంకారి డన్‌లప్ జీర్ణంచేసుకోలేక పోయాడు. అధికార వర్గంలో గల పలుకుబడిని ఉపయోగించుకుని ఫరాజీల మీద, దూదు మియా మీద పలు క్రిమినల్ కేసులను నమోదు చేయించాడు. ఆధారాలు లేక ఆ కేసులన్నింటినీ న్యాయస్థానాలు కొట్టివేశాయి.

చివరకు ప్లాంటర్ డన్‌లప్ తన అనుయాయుల చేత దూదుమియా ఇంటిమీద దాడి చేయించి విధ్వంసం సృష్టించాడు. దుండగులు ఆయన ఇంటిని పూర్తిగా దోచుకున్నారు. ఈ చర్యల పట్ల మండిపడిన ఫరాజీలు ఆగ్రహావేశాలతో ప్లాంటర్ల మీద విరుచుకు పడ్డారు. ఈ దాడులలో పలువురి ప్రాణాలు పోయాయి. ఫరాజీల మీద, దూదుమియా మీద పలు కేసులు నమోదయ్యాయి. ఆయన మీద చేసిన ఆరోపణలను రుజువు చేయలేకపోవటంతో కేసులను కొట్టివేసారు. 1857 ప్రారంభంలో డన్‌లప్ అనుచరవర్గం సరికొత్త ఆరోపణలతో ఆయనను మరోసారి అరెస్టు చేయించింది. ఈ కేసులో ఆయనకు 14 సంవత్సరాల శిక్షను విధింప చేసారు. ఈ తీర్పు మీద ఫరాజీలు అప్పీల్ చేసుకోగా ఉన్నత న్యాయస్థానం ఆ కేసును కొట్టివేసింది. ఆ సమయంలో ప్రథమ స్వాతంత్ర్య సమర జ్వాలలు దేశమంతటా విస్తరిస్తున్నందున, మళ్ళీ ఆయనను నిర్బంధించారు. మరోకేసు బనాయించారు. ఆ విధంగా దూదుమియాను జైలు గోడల మధ్యన ఒకటిన్నర సంవత్సరం పాటు బంధించి ఉంచారు. ఆయనను అరెస్టు చేసి ఉంచినా, ఫరాజీలు మాత్రం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో తమదైన పాత్రను నిర్వహించారు.

స్వాతంత్ర్యసమరం ముగిశాక జైలు నుండి విడుదలైన దూదుమియా ప్రస్తుత బంగ్లాదేశ్ రాజధాని ఢాకాను స్థిరనివాసం చేసుకున్నారు. ఫరాజీల ధార్మిక లౌకిక సిద్ధాంతాలను పరిపుష్టం చేయడంలో ఆయన విజయం సాధించారు. దూదు మియా సాధించిన విజయాలకు సంకేతాలుగా ఈ నాటికి ఈ తూర్పుబెంగాల్ ప్రాంతాలలో ఫరాజీ సాంప్రదాయాలను పాటించే జనావళి దర్శనమిస్తారు. ఆ జనుల హృదయాలలో ఈనాటికి దూదుమియా నిలచిపోయి ఉన్నారంటే, ఆయన సాగించిన పోరాటం ప్రజల హృదయాలలో ఎంతటి స్థానం సంపాదించుకుందో అర్థంకాగలదు.

ప్రముఖ చరిత్రకారుడు డాక్టర్ తారాచంద్ **ఫిరంగీల పాలనను తుడిచిపెట్టాలని.. జీవితాంతం శ్రమించిన పోరాటయోధుడు**, అని కీర్తించిన పోరాటయోధుడు దూదు మియా 1860 లో అస్తమించారు. ◆



**హిందూ-ముస్లిం ఐక్యతాస్త్రంతో బ్రిటీష్ ముష్కరులను మట్టికరిపించిన**

# 23. ఖాన్ బహదూర్ ఖాన్

పరాయి పాలకులకు వ్యతిరేకంగా ఉద్యమించిన ప్రజల ఐక్యతకు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రబల సాక్ష్యం. సామాన్య పౌరుడి నుండి రాజులు, రాణులు, సంస్థానాధీశులు, తిరుగబడిన సిపాయిలు చూపిన ఐక్యత అపూర్వం. ఈ ఐక్యతను విచ్ఛినం గావించనిదే తమ పాలనకు మనుగడలేదని గ్రహించిన పాలకులు భారత దేశంలోని ప్రధాన సాంఘీక జనశ్రేణులైన హిందూ-ముస్లింలను మతం పేర వేరుచేయటానికి ఎత్తులను, కుయుక్తులను యధ్ఛేగా సాగించారు. బ్రిటీష్ పాలకులు ఎంతవరకు వెళ్ళారంటే ముస్లింల పాలనకంటే బ్రిటీష్ పాలన కడుమెరుగైనదన్న మానసిక భావన హిందూ జనసముదాయాలలో కలుగ జేసేందుకు చరిత్రను వక్రీకరించి రాసేందుకు పూనుకున్నారు. గత పాలకులకు వ్యతిరేకంగా చరిత్రను తిరగ రాయించుకున్నారు. చిత్రణకు గురైన చరిత్రకు బహుళ ప్రచారం కల్పించారు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ ఆంగ్ల రచయిత J.S. Grewal తన పుస్తకం *Muslim Rule in India : The Assessment of British Historian* (Oxford University Press,1970) లో '..British administrators, scholars, historians and missionaries all became seriously involved in making the people to believe that British rule was better than the medival Muslim Rule.' అన్నాడు.

మాతృభూమిని పరాయి పాలకుల కబంధహస్తాల నుండి విముక్తం చేసేందుకు





తిరుగుబాటు శంఖారావం పూరించి, పోరాడి విజయం సాధించి, చరిత్రలో సుస్థిర స్థానాన్ని సొంతం చేసుకున్న స్వదేశీ పాలకులలో రోహిల్‌ఖండ్ నేత ఖాన్ బహదూర్ ఖాన్‌ది ప్రత్యేక స్థానం. బ్రిటీష్ పాలకుల పెత్తనం, ఆధిపత్యాన్ని పూర్తిగా రూపుమాపి, తమ గడ్డ మీద ఆంగ్లేయ అధికారుల జాడ లేకుండా చేసిన ఘనత ఆయనకు దక్కుతుంది. ఈ రకమైన పోరుబాటులో అవధ్ రాణి బేగం హజరత్ మహల్ 14మాసాల పాటు బ్రిటీషర్లను ఎదిరించి నిలువరించగా, యువకుడైన ఫరూకాబాద్ నవాబు తఫజుల్ హుస్సేన్ సరత్ జంగ్ స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించి ఓ ఏడాదిపాటు పాలించారు. ఆ బాటలో ఖాన్ బహదూర్ ఖాన్ పదకొండు మాసాల పాటు స్వేచ్ఛగా స్వదేశీపాలన గావించారు.

సమర్ధుడైన తిరుగుబాటు నేతగా చరిత్ర సృష్టించిన ఖాన్ తాత హాఫీజ్ రహమత్ ఖాన్. ఖాన్ బహదూర్ ఖాన్ 1781లో జన్మించారు. ప్రథమ స్వాతంత్ర్య జ్వాలలు దేశభక్తులైన స్వదేశీ పాలకులను, ప్రజలను ఉత్తేజితులను చేసి, **స్వతంత్రపాలన** అను ఏకైక లక్ష్యంతో అందరినీ ఐక్యంచేస్తున్న సమయంలో 70 సంవత్సరాల వయస్సుడైన ఖాన్ బ్రిటీషర్లు కల్పించిన అధికార పదవిని వదులుకొని రణరంగ ప్రవేశం చేశారు.

రోహిల్‌ఖండ్ రాజధాని బరేలిలో 1857 మే 31 తేదీన ఖాన్ బహదూర్ ఖాన్ తిరుగబాటు బావుటాను ఎగురవేశారు. రొహిల్ ఖండ్‌లోని ప్రజానీకమంతా ఏకమై ఖాన్ నాయకత్వంలో స్వతంత్ర పాలనకు ప్రాణ ప్రతిష్ట చేసి తెల్లదొరలను మట్టికరిపించారు. ఈ సందర్భంగా రోహిల్ ఖండ్ ప్రజలను ఉద్దేశించి ఆయన చేసిన ప్రసంగంలో ప్రజలను ఆకట్టుకుంది. ఓ రాజరిక వ్యవవస్థకు ప్రతినిథి అయిన ఖాన్ బహుద్దూర్ ఖాన్ ప్రజలను **భారతదేశ ప్రజల్లారా !** ( ' The people of India ' ) అని సంబోధించటం విశేషం. భారత దేశంలోని ప్రధాన సాంఘీక సముదాయాలైన హిందూ-ముస్లిం సోదరులనుద్దేశించి మాట్లాడుతూ, మన పవిత్ర స్వాతంత్ర్య దినోత్సవం ఉదయించింది. ఇంగ్లీషు వారు మోసాలకు పాల్పడవచ్చు. ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులనూ, హిందువులకు వ్యతిరేకంగా ముస్లింలనూ రెచ్చగొడతారు. ముస్లింలారా ! మీరు పవిత్ర ఖురానును గౌరవిస్తున్నట్టయితే, హిందువుల్లారా! మీరు గోమాతను ఆరాధిస్తున్నట్టయితే, మీలోని స్వల్ప విభేదాలను మరచి ధర్మయుద్ధంలో చేతులు కలపండి. ఒకే పతాకం కింద పోరాడండి. మన హిందూస్థాన్ మీద ఆంగ్లేయుల పెత్తనం సృష్టించిన మరకలను మీ రక్తంతో శుభ్రం చేయండి' అని ఉద్భోధించారు. ( '...The auspicious day of our freedom has dawned..the English will again resort to deceit. They will try their hardest to incite the Hindus against the Mussalmans and vice-versa...Mussalmans, if you revere the holy Quran, and Hindus, if you venerate the cow-mother, sink your petty diffrences and join hands in this holy war..Fight under one flag

and with the free flow of your blood, wash away the stigma of the English domination over Hindostan.. ' ( From ' *How India lost her Freedom ' (Popular Prakashan*) authored by Pandith Sunder lal, quoted in the eassy titled The Mutiny of 1857 : Herosim Admist Contradictions, written by Cherly Kanekar, Publisehd in the magazine The Voice of People Awakening, Feb. 1998 issue , Page 7 )

స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలకు ప్రతీక అయినటువంటి ఆకుపచ్చ జెండా రోహిల్ ఖండ్‌లో రెపరెపలాడటం చూసి ఆంగ్లేయులు అదిరిపడ్డారు. బ్రిటీషు సైనిక స్థావరాలలోని సైనికులు తిరగబడటంతో ఆంగ్లేయాధికారులు పారిపోయారు. శతఘ్నదళానికి చెందిన సుబేదార్ భక్త్ ఖాన్ తిరుగుబాటుకు మార్గదర్శకత్వం చేశారు. మాతృదేశాభిమానులైన రోహిల్లా ప్రజానీకం జాతి, మత విభేధం లేకుండా ఎకగ్రీవంగా ఖాన్ బహుద్దూర్ ఖాన్‌ను తమ పాలకునిగా అంగీకరించారు. ఆ సమయంలో ప్రజా సముదాయం సమక్షాన నిజాతీపరుడిగా ఖ్యాతిగాంచిన శోభారాం ప్రధానమంత్రిగా, బ్రిటీష్ సైన్యంలో నున్న స్వదేశీ సైనికులచే తిరుగుబాటు చేయించిన భక్త్ ఖాన్ సేనానిగా బాధ్యతలు స్వీకరించారు. ఈ త్రయం ఎంతో దూరదృష్టితో, చక్కని అవగాహనతో, అద్వితీయ ధైర్యసాహసాలతో రోహిల్‌ఖండ్ ప్రజల హృదయాలను చూరగొన్నారు.

చివరి మొగల్ పాదుషా బహదూర్ షా జఫర్ ప్రతినిధిగా తనను తాను ప్రకటించుకుని ఖాన్ బహుదూర్ జాతీయభావాలను గౌరవించారు. ఆయన 40,000 మంది పోరాట వీరులైన రాజపుత్ర, పఠాన్ యువకులతో ఎర్పడిన సైన్యాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఖాన్ సాబ్ తిరుగుబాటును ప్రకటించటించగానే సైనికులు, ప్రజలు ఏకమై, బ్రిటీష్ పాలకుల తాబేదార్లను, అధికారులను, ఉద్యోగులను, రోహిల్లా నుండి వెళ్లగొట్టారు. రోహిల్లా ఖండ్‌లో ఎక్కుడా ఆంగ్లేయులకు నిలువ నీడ లేకుండా పోయింది. స్వదేశీ పాలన ప్రారంభమైంది. ఖాన్ బహదూర్ ఖాన్‌ను, నాయకుల నాయకుడిగా (**సర్దార్ ఉల్ సదరత్**) ప్రజలు ప్రకటించి గౌరవించారు. స్వతంత్ర పాలకునిగా బాధ్యతలు స్వీకరించిన తక్షణమే తనదైన శైలిలో ఖాన్ పరిపాలను ప్రారంభించారు.

ఆయన ముందుగా హిందూ, ముస్లింల ఐక్యత కోసం పలు చర్యలు చేపట్టారు. ప్రజానీకం మత మనోభావాలను గౌరవిస్తూ ముస్లింల పర్వదినాన హిందూ సోదరుల మనోభావాలను గౌరవిస్తూ, గోవులను ఖుర్బాని ఇవ్వటాన్ని నిషేధించారు. హిందూ-ముస్లిం ప్రజానీకంలో స్నేహం, సామరస్యం పటిష్టం చేసేందుకు చాలా కృషి చేశారు. అందుకు అనుగుణంగా రోహిల్ ఖండ్ ప్రధాన మంత్రిగా ఖాన్ బహూద్దూర్ ఖాన్‌చే నియమితులైన శోభారాం నడుచుకోవటం, తగిన చర్యలు తీసుకోవటంతో ఆయా మతస్థుల మధ్యన చాలా చక్కని-చిక్కని స్నేహ సంబంధాలు ఏర్పడ్డాయి.





ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామాన్ని ప్రారంభించింది, తిరుగుబాటుకు చోదకశక్తిగా నిలిచింది ముస్లింలన్న భావనతోనున్న పాలకవర్గాలు, ప్రజానీకంలో మత విభేదాలను సృష్టించి, స్నేహ సంబంధాలను విచ్ఛినం చేసి, తమ మనుగడకు ఎటువంటి ముప్పులేకుండా చూసుకోవాలనుకున్నాయి. స్వదేశీ పాలకుల తిరుగుబాటును దారుణంగా అణిచి వేసేందుకు కూడా ఈ ఎత్తు ఉపయోగిస్తుందనుకున్నాయి. హిందువులను మభ్యపెట్టి, ముస్లింలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టి, డబ్బుతో ప్రజల దేశభక్తిని కొనేందుకు, భారీగా డబ్బు సంచులను తెప్పించాయి. ఈ మేరకు రోహిల్ ఖండ్‌లో డబ్బు సంచుల ద్వారా హిందూ సోదరులకు లంచాలు ఇచ్చి, అర్థిక సౌకర్యాల ఆశ చూపించి ఆకట్టుకుని, ప్రజలను మతం పేరిట చీల్చి అనైక్యత సృష్టించేందుకు ఆంగ్లేయాధికారి జేమ్స్ ఔట్రాం (James Outram ) విఫలయత్నం చేశాడు. ఆ పాపిష్టి సొమ్ము మా ఐక్యత ముందు దిగదుడుపు అని ప్రజలు తిరస్కరించారు. ఈ పాపిష్టి డబ్బు కోసం మా ఐక్యతను బలిచేసేది లేదని చాలా స్పష్టం ప్రకటించారు. తమ ముంగిళ్ళలోకి తరలి వచ్చిన డబ్బు సంచులను రోహిల్ ఖండ్ ప్రజానీకం తిరగ్గొట్టారు. చివరకు కంపెనీ ఖజానా నుండి దిగుమతి చేసిన సొమ్మును తిరిగి ఖజానాకు పంపించాల్సి వచ్చింది. ఈ విషయాన్ని T. R Metcalf తన *The Aftermath of Revolt* ( page 299 ) గ్రంథంలో ' Sir James Outram (1803-63) failed to raise Hindus in Rohilkhand against the regime of Khan Bahadur, Khan and had to return money granted for the purpose unspent to the treasury.' , అని పేర్కొన్నాడు. మా మతాలు వేరైనా మా మాతృభూమి ఒక్కటే, మా మార్గం ఒక్కటే, మా లక్ష్యం ఒక్కటేననుకున్న రొహిల్లా ప్రజలు, మతం పేరిట మనుషుల్ని చీల్చి పబ్బం గడుపుకోవాలనుకున్న బ్రిటీష్ పాలకుల ఎత్తులను త్రిప్పికొట్టారు.

స్వతంత్ర రాజ్యం స్థాపించుకున్న ఖాన్, ప్రజాబలంతో పలుమార్లు బ్రిటీషర్ల దాడులను తిప్పికొట్టారు. తమ సైనిక బలగాలు తక్కువ కావటం, కంపెనీ బలగాలు భారీ సంఖ్యతో చుట్టుముట్టడం వలన యుద్ధతంత్ర నిఫుణుడైన ఖాన్ తన సైనికులకు స్పష్టమైన గెరిల్లా పోరాట పద్ధతులను సూచించారు. *The Great Mutiny of India 1857* (Page 374) అను గ్రంథంలో ఆంగ్ల రచయిత Christopher Hibbert ఈ విషయాన్ని, '..Do not attempt to meet the regular colums of the infidels because they are superior to you in discipline and organisation, and have big guns. But watch their movements, guard all the ghauts on the rivers, intercept their communications; stop their supplies, cut up their daks and post; keep constatantly hanging about their camps; give them no rest..' అని ప్రస్తావించాడు.

బరేలి రాజధానిగా రోహిల్ స్వతంత్ర్య రాజ్యాన్ని పటిష్టం చేసుకున్నాక, పరిసర

పట్టణాలలో కూడా కంపెనీ పెత్తనాన్ని తుదముట్టడించాలని ఖాన్ బహదూర్ ఖాన్ అభిలషించారు. ఆయన అభిమతానికి అనుగుణంగా ఫిల్‌బిత్, షాజహాన్‌పూరు, భదాయూ, వరన్ తదితర పట్టణాల నుండి బ్రిటీష్ సైన్యాలను తరిమివేయడానికి ప్రధాన మంత్రి శోభారాం పథకరచన గావించారు. ఆ వ్యూహాన్ని అమలు జరిపేందుకు సేనాపతి భక్త్‌ఖాన్ కృషి ప్రారంభించారు. అంతేకాదు తిరుగుబాటు విఫలమై ఢిల్లీ పాదుషా బహద్దూర్‌షా జఫర్ అయోమయ దశలో ఉన్నప్పుడు, ప్రస్తుతం మనం ఒక యుద్ధంలో మాత్రమే ఓడిపోయాం, రేపు మరో యుద్ధంలో విజయం సాధించవచ్చు, మీరు బరేలీకి బయలుదేరండి, అవధ్‌కు వెళ్ళండి అంటూ బక్త్ ఖాన్ సలహా ఇచ్చారు. ఆ సలహా చెవికెక్కని పాదుషా విధిలేని పరిస్థితులలో ఆంగ్లేయులకు లొంగిపోయారు. చక్రవర్తి జఫర్ లొంగిపోయినా, ఆయన ప్రతినిధిగా పాలన చేసిన ఖాన్ బహదూర్ ఖాన్ స్వతంత్రపాలకునిగా మరికొంతకాలం మనుగడ సాగించాడు.

ఈ విధంగా రోహిల్ ఖండ్ స్వతంత్ర రాజ్యాన్ని ఢిల్లీ చక్రవర్తికి ఆశ్రయం కల్పించగల స్థాయిలో ఖాన్ బహదూర్ ఖాన్ పటిష్టంగా రూపొందించటం బ్రిటీష్ పాలకులకు మింగుడు పడలేదు. ఆ స్వతంత్ర రాజ్యాన్ని అంతం చేసేందుకు ప్రత్యేకంగా బ్రిటీష్ సైనిక ఉన్నతాధికారి సర్ కొలిన్ క్యాంఫ్‌బెల్‌ను రప్పించి, ఆ బాధ్యతలను అప్పగించారు. ఆ ఆదేశాలందుకున్న క్యాంఫ్‌బెల్ తన సహచరుడైన బ్రిగేడియర్ వాల్ పోల్ నాయకత్వంలో భారీ సైన్యాన్ని బరేలీ మీద దాడికి పంపాడు. ఆ దాడిని రొహిల్లా ప్రజలు, సైనికులు వీరోచితంగా తిప్పికొట్టారు. రొహిల్లా సైనికులను మట్టి కరిపిస్తానంటూ గొప్పలు చెప్పిన ఆ ఆంగ్లేయ అధికారి పరాజయంతో నవ్వులపాలయ్యాడు. అప్పుడు ఇక లాభంలేదని క్యాంఫ్ బెల్ స్వయంగా రంగంలోకి దిగాడు. అపార సైనిక బలగాలతో బయలుదేరి బరేలిని అన్నివైపుల నుండి చుట్టు ముట్టాడు. సుశిక్షుతులైన ప్రత్యేక సైనిక దళాలు, అపార ఆయుధసామగ్రితో విరుచుకు పడిన కంపెనీ బలగాలతో ఖాన్ చివరి నిమిషం వరకు పోరాడారు. అపరిమిత బ్రిటీష్ బలగాల ముందు పరిమిత బరేలి బలగాలు నిలువలేని పరిస్థితులు ఎదురయ్యాయి. బ్రిటీష్ సైన్యాలు అన్నివైపుల నుండి చొచ్చుకు వస్తూ రొహిల్లా సైనిక దళాలను నేపాల్ పర్వతపానుపుల వైపుగా తరమసాగాయి. ఆ సమయంలో తప్పించుకుని తిరిగి యుద్ధానికి సిద్ధం కావచ్చునని ఖాన్ అనుయాయులు ప్రధానంగా ప్రధాన మంత్రి శోభారాం ఆయనకు సలహా ఇచ్చారు. ఆ సలహా ఖాన్‌కు నచ్చలేదు. ఆయన విజయమో వీర స్వర్గమో తేల్చుకుందామనుకున్నాడు. చివరకు అనుయాయుల ఒత్తిడి మీద ప్రధాన అనుచరులతో, కొద్దిపాటి సైన్యంతో ఖాన్ 1858 మే 5వతేదిన బరేలీ నుండి నేపాల్ అడవుల్లోకి వెళ్లిపోయారు.

ఈ విధంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంతో భాగం పంచుకుని స్వతంత్ర





రాజ్యాలను స్థాపించి, గత్యంతరం లేని పరిస్థితులలో నేపాల్ పర్వత ప్రాంతాలలోకి ప్రవేశించిన బేగం హజతర్ మహల్, షాహజాదా ఫిరోజ్ షా, ఫరూకాబాద్ నబాబు తఫజుల్ హుస్సేన్ ఖాన్, నానా సాహెబ్, అజీముల్లా ఖాన్, తాంతియాతోపే తదితర ప్రముఖ నాయకులు కూడా తమ తమ అనుచరులతో, సేనలతో చేరుకున్నారు. ఈ నేతలంతా తమ శక్తియుక్తులను కూడదీసుకుని మళ్ళీ పోరాటం సాగించాలని ఆశించారు. దురదృష్టవశాత్తు నేపాల్ పాలకుడు జంగ్ బహుద్దూర్ సహకారం వారికి లభించలేదు. ఆ అడవుల్లో అంతుచిక్కని రీతిలో నేతలకు, సైనికులకు మలేరియా వ్యాధిసోకటంతో భారీ ప్రాణనష్టం జరిగింది. బ్రతికి బట్టగట్టగలిగివవారు శారీరక శక్తి ఉడికిపోయి నిస్సహాయులయ్యారు. ఆ కారణంగా ఆ నాయకుల కలలు కలలుగానే మిగిలి పోయాయి. ఖాన్ బహుద్దూర్ ఖాన్‌కు నేపాల్ పాలకుడు తోడ్పాటు ఇవ్వవకపోవటమే కాక, విశ్వాసఘాతుకానికి పాల్పడ్డాడు. ఆ రోహిల్లా నేతను బ్రిటీషర్లకు అప్పగించాడు.

భారత గడ్డ మీద తమకు ఎదురులేదని విర్రవీగుతున్న బ్రిటీష్ సైనిక దళాలను పలుమార్లు మట్టికరిపించిన ఖాన్ బహదూర్ ఖాన్ మీద కసితోరగిలి పోతున్న వలస పాలకులు, విచారణ తంతును జరిపి ఖాన్‌కు, ఆయనతోపాటుగా తిరుగుబాటులో పాల్గొన్న 243 మందికి ఉరిశిక్షను విధించారు. ఆ శిక్షలను బరేలీ లోని బ్రిటీష్ కమీషనర్ పాత కార్యాలయం ఆవరణలో గల పెద్ద మర్రి చెట్టువద్ద నిర్వహించారు. ప్రజలను, రోహిల్ ఖండ్ వీరులను, 1860 మార్చి 20 వ తేదీన ఆ చెట్టు కొమ్మలకు సామూహికంగా ఉరి తీసారు. ( ' A large number of his followers were also executed by hanging' ' - *Who's Who of Indian Martyrs*, Vol.3, page 74) చెట్టుకొమ్మలను ఉరికంబాలుగా ఉపయోగించటంతో, ఉరితీతల తరువాత చాలా కాలం ఆమర వీరుల మృతదేహాలు చెట్టు కొమ్మల నుండి తొలగించలేదు. ఆ యోధుల భౌతికకాయాలు అలాగే ఆ చెట్టు కొమ్మలకు చుట్టుకుపోయి, ఆకులు, కొమ్మలు ఏవీ కన్పించకుండా పోయాయని ఆంగ్లేయాధికారులు తమ నివేదికలలో పేర్కొన్నారంటే, ఆనాటి వాతావరణం ఎంత భయానకంగా ఉండిఉంటుంతో ఊహించవచ్చు.

ఆ విధంగా ప్రజలను ఐక్యం చేసి, వలస పాలకులను మట్టికరిపించి, రోహిల్‌ఖండ్ స్వతంత్రతను 11 మాసాల పాటు పరిరక్షించిన ప్రజానాయకుడు ఖాన్ బహదూర్ ఖాన్ చివరి సారిగా తన సహచరులందరితో కలసి మాతృభూమికి సలాం చెబుతూ, 1860 మార్చి 20తేదీన ఈ లోకం నుండి నిష్క్రమించారు. ◆

## అసమాన ధైర్యసాహసాలతో శత్రువును సైతం అబ్బురపరచిన

# 24. పఠాన్ సలాబత్ ఖాన్

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న వీరులు అసమాన ధైర్యసాహసాలతో గణుతికెక్కారు. ప్రపంచ చరిత్రలోనే మహోజ్వల ఘట్టంగా భాసించిన భారత స్వాతంత్ర్య ఉద్యమంలో చిరస్మరణీయమైన పాత్రను నిర్వహించిన సమర యోధులు ఆ తరువాత సాగిన మహత్తర ఉద్యమానికి స్ఫూర్తిదాయకమైన పునాది వేశారు. ఆనాడు అద్వితీయమైన త్యాగాలతో రక్తతర్పణకు సిద్ధపడిన భూమిపుత్రులలో పఠాన్ సలాబత్ ఖాన్ ఒకరు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని మొరాదాబాద్ జిల్లా సంభాల్ లోని ఒక సామాన్య కుటుంబంలో పఠాన్ సలాబత్ ఖాన్ 1831లో జన్మించాడు. తండ్రి పేరు పఠాన్ అబ్దుల్లా ఖాన్. చిన్ననాటి నుండే ధైర్యసాహసాలను ప్రదర్శిస్తూ గ్రామస్తుల మనసులు దోచుకున్న సలాబత్ కోటా రాజ్యంలో సైనికుడి ఉద్యోగంలో చేరారు.

1857 మే 11వ తేదీన భారతదేశంలో తిరుగుబాటు జ్వాలలు ఎగసిపడ్డాయి. ఆ జ్వాలల ప్రభావం ఉత్తరప్రదేశ్ ప్రాంతంలో మరింత తీవ్రంగా ఉంది. ఆ సమయంలో సలాబత్ ఖాన్ కోటా సైన్యంలోని గోవర్ధన్ పటాలంలో ఉన్నారు. ఆ దళానికి సాదుల్ ఖాన్ నాయకుడు. కోటా సైనిక దళం బ్రిటీష్ ప్రభుత్వపు రాజకీయ ప్రతినిధి మేజర్ బర్టన్ ( MAJOR BURTON) నివాస గృహంపై దాడి చేయటంతో తిరుగుబాటు బావుటాను





ఎగురవేసింది. ఈ దాడి అక్టోబరు 15, 1857న ప్రారంభమైంది. తిరుగుబాటు వీరుల తాకిడికి తట్టుకోలేకపోయిన బ్రిటీష్ ప్రతినిధి బ్రతుకు జీవుడా అంటూ, తన నివాసంలో దాక్కున్నాడు. బంగ్లా నుండి అతనిని బయటకు రప్పించేందుకు శతవిధాల ప్రయత్నించి, చివరకు ఆ ఇంటిని చుట్టుముట్టి తగులబెట్టారు. ప్రాణభయం చేత ఆ ఆంగ్లేయుడు ఎంతకూ బయటకు రాలేదు. బర్టన్ దాక్కొన్న ప్రదేశానికి చేరుకోవటం తప్ప, అతను బయటకు వచ్చే మార్గం కన్పించలేదు. ఆయుధాలతో కాచుకుని కూర్చున్న ఆంగ్లేయుడ్ని ఎదుర్కొని, బంధించిన దారికి తీసుకురావటం ప్రమాదకరం కావటంతో అంతా అలోచనలో పడ్డారు.

ఆ సమయంలో పఠాన్ సలాబత్ ఖాన్ ముందుకు వచ్చారు. ఒక నిచ్చెన ద్వారా తిన్నగా ఇంటిపై కప్పు మీదకు చేరుకుని, అకస్మాత్తుగా బర్టన్ ఎదుట నిలిచారు. ఒంటరిగా ఖాన్ తన ఎదుటకు రావటంతో, బర్టన్ తేరుకొని ఖాన్ పై దాడి చేసాడు. ఆ దాడి నుండి తప్పించుకున్న ఖాన్ అధికారితో ద్వంద యుద్ధం చేసి అతడ్ని లొంగదీసుకున్నాడు. ఈలోగా బంగ్లాలోకి ప్రవేశించిన సైనికులు బర్టన్ మీద దాడి చేసి అతనిని అంతం చేశారు. ఈ సందర్భంగా సలాబత్ ఖాన్ చూపిన తెగువ, సాహసానికి తిరుగుబాటు దళానికి నాయకత్వం వహించిన లాలా జై దయాల్ భట్నాగర్ ఎంతో సంతసించి, ఆయన శౌర్యప్రతాపాలకు గౌరవ చిహ్నంగా ప్రత్యేక జ్ఞాపికను బహూకరించారు.

1858 మార్చిలో మేజర్-జనరల్ రాబర్ట్స్ నాయకత్వంలో బ్రిటీష్ సైనిక దళాలు కోట సంస్థానాన్ని తిరిగి స్వాధీనం చేసుకున్నాయి. ఆ సమయంలో తిరుగుబాటు దళాలతోపాటుగా తప్పించుకుని సలాబత్ ఖాన్ గ్వాలియర్ వెళ్ళారు. గ్వాలియర్ సంస్థాన ప్రాంతంలో బ్రిటీష్ దళాలతో ఝబియా పట్టాన్ (JHABIA PATTAN) అను చోట తిరుగుబాటు దళాలు జరిపిన పోరాటంలో పాల్గొన్నారు. ఢిల్లీలో తిరుగుబాటు విఫలం కావటంలో గ్వాలియర్ సంస్థానంలో కూడా తిరుగుబాటు యోధులకు పరాజయం తప్పలేదు.

ఆ పోరాటం తరువాత సలాబత్ ఖాన్ ఆంగ్లేయుల నిఘా నుండి తప్పించుకుని, లక్నో గుండా నేపాల్ పర్వత ప్రాంతాలలోకి వెళ్ళిపోయారు. ఆ అడవుల్లో రెండు సంవత్సరాలు గడిచాయి. నేపాల్ అటవీ ప్రాంతంలో ప్రతికూల పరిస్థితులు ఎదురుకావటం వలన రెండేళ్ళ తరువాత ప్రవాసం నుండి బయటపడి, తాడో పేడో తేల్చుకునేందుకు తిరిగి కోటాకు వస్తుండగా బ్రిటీష్ సైనికుల కంటబడ్డారు. ఆయనను శత్రుసేనలు చుట్టుముట్టి అరెస్టు చేశాయి. ఆవిధంగా శత్రువు చేత చిక్కిన పఠాన్ సలాబత్ ఖాన్ మీద పలు నేరారోపణలు చేసి, విచారణ తంతు జరిపించి, 1861 ఆగస్టు 10వ తేదీన మరణదండన ప్రకటించారు. ఆ మేరకు 1861 అక్టోబరు 23న కోటలోని బ్రిటీషు అధికార ప్రతినిధి నివాసం ఎదుట ప్రజల సమక్షంలో బహిరంగంగా సలాబత్ ఖాన్‌ను ఉరితీసారు. ◆



**ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల ఐక్యతకు ప్రతిరూపం**

# 25. బహదూర్ షా జఫర్

భారతీయులలో ఆంగ్లేయుల పట్ల పెల్లుబికిన ఆగ్రహానికి ప్రతీక ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం. ఆ సమరంలో సామాన్యుడి నుండి స్వదేశీ పాలకుల వరకు ఏకోన్ముఖంగా ముందుకు సాగారు. ఈ పోరులో పాల్గొన్న యోధుల లక్ష్యాలలో తారతమ్యం ఉన్నా, జాతి, మత, కుల, ప్రాంతీయ విభేదాలు అత్యల్పమైనవిగా భావించి ప్రధాన శత్రువులైన బ్రిటీషర్ల మీద తమ ఆగ్రహావేశాలను, అస్త్రశస్త్రాలను ఎక్కుపెట్టారు. ఈ సంగ్రామ ఫలితాలు ఎలా ఉన్నా, భవిష్యత్తు తరాలను ఉత్తేజితుల్ని చేసి పరాయి పాలకులను తరిమికొట్టి స్వదేశాన్ని విముక్తం చేసేందుకు ఆ తరువాత సుదీర్ఘకాలం సాగిన ఉద్యమానికి ఊపిరియ్యింది.
ఆ మహత్తర చారిత్రాత్మక పోరాటానికి నాయకత్వం వహించిన ఖ్యాతిని సొంతం చేసుకుని, భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని పదిలం చేసుకున్నాడు బహదూర్ షా జఫర్.

బ్రిటీషర్ల గుండెల్లో భయోత్పాతాన్ని కలిగించి, ఇంగ్లాండులోని పాలకవర్గాలను బెంబేలెత్తించిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆయన పాత్రను సకారాత్మక-నకారాత్మక దృక్కోణాల నుండి చరిత్ర మనకు దర్శింపచేసినా, ఆ నేత స్మరణ లేని స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర ఊహించలేనంతగా స్థిర ముద్రవేసుకున్న బహదూర్ షా జఫర్ మొఘల్ చక్రవర్తులలో





చివరివాడు. ఆయన అసలు పేరు అబుల్ ముజఫర్ సిరాజుద్దీన్ ముహమ్మద్ బహద్దూర్ షా. ఆయన కలం పేరు **జఫర్** కావటంతో, ఆయన పూర్తి పేరు స్థానంలో ' బహద్దూర్ షా జఫర్ ' పేరుతో ఆయన గణుతికెక్కారు. మొఘల్ చక్రవర్తుల వరుసలోని 14వ చక్రవర్తి రెండవ అక్బర్ షా, రాజపుత్ర వంశానికి చెందిన ఆయన భార్య లాల్‌బాయిలకు 1775 అక్టోబరు 24వ తేదిన బహదూర్ షా జఫర్ జన్మించారు.

బహదూర్ షా జఫర్ ఉర్దూ, పర్షియన్, అరబ్బీ భాషలలో చక్కని శిక్షణ పొందారు. ఆయనకు ప్రధానంగా సాహిత్యం-కళల మీద మక్కువ. ఆనాటి ప్రముఖ పర్షియన్ కవి-పండితోత్తములు ఇబ్రహీం జఖ్ ( Ibrahim Zauq), అసదుల్లా ఖాన్ గాలిబ్ ( Asad Ullah Khan Ghalib) లాంటి వారివద్ద శిక్షణ గరిపారు. ఆయన కవిత్వంలో మనోభావాలు చాలా సున్నితంగా వ్యక్తం కావటం మాత్రమే కాకుండా, సంగీత ప్రాధాన్యతను కలిగి ఉండి పండితుల, సంగీత కళాకారుల మన్ననలు పొందాయి. చివరకు బ్రిటీషు వారి బందీగా రంగూనులో గడిపిన (1858-1862) సందర్భంగా ఆయన రాసిన కవిత్వం ఆయనకు ఖ్యాతినార్జించి పెట్టింది. ఈ కవితలలో మొఘలుల అధికారం పరులపాలై, నామమాత్రపు చక్రవర్తులుగా మిగిలిపోయారన్న బాధ వ్యక్తంకావటమే కాక, ప్రజల మనోభావాలకు కూడా తగిన స్థానం కల్పించింది. ఆయన దస్తూరి చాలా అందంగా అకర్షణీయం ఉండి, ఆనాట అక్షర శిల్పులలో (Calligraphist) అత్యుత్తమ అక్షరశిల్పిగా బహదూర్ షా జఫర్ ప్రఖ్యాతిగాంచారు. చక్రవర్తుల బిడ్డల సహజ అలవాట్లకు భిన్నంగా మద్యపానం, ధూమపానానికి కడుదూరంగా ఉండిన జఫర్ మంచి భోజన ప్రియులు.

బహదూర్ షా జఫర్ పలు వివాహాలు చేసుకున్నారు. ఆ క్రమంలో 1840లో వివాహమాడిన జీనత్ మహల్ ఆయన ప్రియమైన భార్య. బహదూర్ షా జఫర్ నిర్ణయాల మీద అధిక ప్రభావం చూపి, చివరి వరకు ఆయన వెంట ఉన్న ఆమె ప్రథమ స్వాతంత్ర సంగ్రామ సమయంలో తనదైన పాత్ర నిర్వహించింది. అగ్రజులకు క్రమానుగతంగా దక్కాల్సిన ' **మొఘల్ చక్రవర్తి** ' పదవిని క్రమం తప్పించి తన కుమారుడు జవాన్ భక్త్‌కు సంక్రమింపచేయ సంకల్పించి, 1857 నాటి సంగ్రామంలో బ్రిటీషు వారితో చేతులు కలిపిందన్న ఆరోపణలనూ, అపకీర్తినీ జీనత్ మహల్ మూటగట్టుకుంది.

బహదూర్ షా జఫర్ చిన్నతనంలో విద్యాభ్యాసంతోపాటుగా యుద్ధ విద్యలలో కూడా మంచి తర్ఫీదుపొందారు. గుర్రపు స్వారీ, కత్తి తిప్పటం, తుపాకి కాల్చటంలో నేర్పరయ్యారు. ఆయుధాల ప్రయోగంలో సుశిక్షితులయ్యారు. ఈ విద్యలలో ఉత్తమ ప్రతిభను చూపారు. ప్రధానంగా గుర్రపు స్వారీలో సాటిలేని మేటిగా ఖ్యాతిగడించారు. బహదూర్ షా జఫర్ తాత, 13వ మొఘల్ చక్రవర్తి షా ఆలం బెంగాలు ' **దివాని** ' ని 1765లో ఈస్ట్

ఇండియా కంపెనీపరం చేసి, ఆ క్రమంలో నామమాత్రపు అధికారాలతో మిగిలిపోవటం వలన జఫర్ లాంటి యోడికి యుద్ధకళా కౌశల్యాన్ని ప్రదర్శించే అవకాశం లేకుండా పోయింది.

1765 నుండి పన్నులు వసూలు చేసిపెట్టే స్థానం నుండి ఆంగ్లేయులు పరిపాలనను చేపట్టే స్థానానికి చేరుకుని దాదాపు ఇండియా అంతా ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలన క్రిందకు వచ్చినా, చక్రవర్తి పట్ల ప్రజలలో ఉన్న గౌరవాభిమానాల దృష్ట్యా, మొగల్ సామ్రాజ్యాన్ని నేరుగా తమ సామ్రాజ్యంలో భాగంగా మార్చుకోలేదు. ఈ విషయంలో ఆంగ్లేయులు కడు వ్యూహాత్మకంగా వ్యవహరించారు. కంపెనీ అధికారులు తమను చక్రవర్తి ప్రతినిధులుగా ప్రకటించుకున్నారు. మొఘల్ చక్రవర్తికి వంగి వంగి సలాములు చేస్తూ,పలు రకాల నజరానాలు



**మొఘల్ చక్రవర్తి షా ఆలం ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన రాబర్ట్ క్లయివుకు 1765లో బెంగాలు పరగణాలో పన్నులు వసూలుకు అధికారాలిస్తూ ' దివాని ' ని ప్రసాదిస్తున్న దృశ్యం.**

సమర్పించుకుంటూ, చక్రవర్తి పేరు మీద తమ ఇష్టానుసారంగా అధికారాలు చలాయించారు. ఆ కారణంగా పరాయి పాలకులు తమ మీద పెత్తనం చేస్తున్నారన్న విషయం జనబాహుళ్యం జ్ఞానానికి అందలేదు. చక్రవర్తుల పాలన నామమాత్రంగా మారిందన్న వాస్తవం సామాన్య ప్రజలకు శతాబ్దం వరకు తెలిసిరాలేదు. చక్రవర్తి స్థానాన్ని బలహీనపర్చే వ్యూహంతో కంపెనీ పాలకులు చేపట్టిన పలు విధానాలలో భాగంగా మొఘలుల సామంత రాజులను ప్రోత్సహించి స్వతంత్ర్య రాజ్యాలను ప్రకటింపచేశారు. ఆ ప్రయత్నాలలో భాగంగా తొలుత హైదరాబాదు నవాబు మీద కూడా వల విసిరినా నిజాం చిక్కుకోలేదు. ఆ తరువాత ఆంగ్లేయ మాయాజాలంలో చిక్కుకున్న అవధ్ నవాబు స్వతంత్రం ప్రకటించాడు.ఈ కుయుక్తులలో భాగంగా చక్రవర్తి గౌరవప్రతిష్టలకు భంగం కలిగించే పలు చర్యలకు ఆంగ్లేయులు యధేచ్ఛగా





పాల్పడటం ఆరంభించారు.

చక్రవర్తి పదవి నామమాత్రం కావటం, రాజ్యపాలన, పరిపాలనా వ్యవహారాలను పర్యవేక్షించే రాజరికపు పనులు లుప్తంకావటం వలన బహదూర్ షా జఫర్ సంగీత–సాహిత్యల మీద ఎక్కువ శ్రద్ధ చూపసాగారు. చక్రవర్తి అనుభవిస్తున్న విశేషాధికారాలు, రాజచరిక వైభవప్రాభవాలను హరించివేసేందుకు ఆంగ్లేయాధికారులు ప్రయత్నించ సాగారు. చక్రవర్తిని సామాన్య పౌరుని స్థాయికి దిగజార్చాలని దుష్ట బుద్ధితో ఎత్తులు వేశారు. ఆయన చేస్తున్న వ్యయం మీద విచారణలు నిర్వహించారు. రాజవంశం స్వాధీనంలోన్ని ' కొట్ ఖాశిం ' పరగణాను చక్రవర్తి అభీష్టానికి వ్యతిరేకంగా స్వాధీనం చేసుకున్నారు. చక్రవర్తి జన్మదినం నాడు సంస్థానాధీశులు, రాజాలు, బ్రిటీషు గవర్నర్ జనరల్ సాంద్రాయకంగా సమర్పించుకునే నజరానాలు రద్దు చేశారు. దర్బారులోని ప్రముఖులకు ' ఖిలాత్స ' (Khilats) మరియు ప్రత్యేక దుస్తులతో ( Robes of Honour ) గౌరవించే చక్రవర్తి సాంప్రదాయక అధికారాన్ని హరించారు. ' దివాన్–యే–ఖాస్ ' లోని వెండి సింహాసనాన్ని గిడ్డంగిలో దాచేశారు. చక్రవర్తి ప్రజలకు దర్శనమిచ్చే ' దివాన్–యే–ఆమ్ ' ను మూసేశారు. అంతఃపురంలో జరుతున్న వ్యవహారాల మీద నిఘా ఉంచి, ప్రతి చిన్న విషయాన్ని తెలియచేసేందుకు ఓ అధికారిని నియమించారు. ఈ అధికారే కాకుండా గూఢచర్యం నిమిత్తం ఆంగ్లేయుల పడేసే ఎంగిలి మెతుకులను ఆశించే స్వదేశీయులను రహాస్యంగా నియమించారు.

చక్రవర్తిగా తన వారసుడ్ని ప్రకటించే అధికారాన్ని రద్దు చేసేందుకు, చక్రవర్తి పరివారాన్ని ఎర్రకోట నుండి కుతుబ్ (Qutub) కు తరలించేందుకు Lord Ellenborough ఎత్తులు వేశాడు. బహదూర్ షా తరువాత తమకు ఇష్టమైన వారిని సింహాసనం మీద కూర్చోబెడతామని డల్హౌసీ ప్రకటించాడు. బహుద్దూర్ షా పెద్ద కుమారుడు ఫక్రుద్దీన్ కు సింహాసనం ఆశ చూపించి అతని చేత ఎర్రకోటను ఖాళీ చేస్తాననీ, రాజరికపు అన్ని విశేష సౌకర్యాలనూ పరిత్యజిస్తానని రాయించుకున్నారు. ఆ రాకుమారుడు 1856లో మరణించాక, చిన్న భార్య జీనత్ మహల్ కుమారుడు జవాన్ భక్త్‌ను తన వారసుడుగా ప్రకటించినప్పటికీ, ఆయన సిఫారస్సును ఖాతరు చేయకుండా, రాజ వంశానికి సంబంధించిన ప్రత్యేక అధికారాలను అన్నిటినీ వదులుకుంటున్నట్టు రాజకుమారుడు మిర్జా ఖాయిష్ చేత బ్యాండ్ రాయించుకుని, అతనిని చక్రవర్తిగా ప్రకటించేందుకు ఆంగ్లేయులు అంగీకరించారు. మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ స్థాయిని దించి ' **చక్రవర్తి** ' అని కాకుండా ' **రాజు** ' అని పిలవాలని ప్రకటిస్తూ, బహదూర్ షా సవారి వస్తున్నప్పుడు సాంప్రదాయకంగా పాటిస్తున్న గౌరవమర్యాదలను ఆంగ్లేయాధికారులు చూపాల్సిన అవసరం లేదని డల్హౌసీ ప్రకటించాడు. చక్రవర్తి బహదూర్ షా స్వయంగా రాణి జీనత్ మహల్ అంతఃపురానికి పలుమార్లు రావటం,

ఎక్కువ సేపు గడపటం వలన చక్రవర్తి స్థాయి దిగజారుతుందన్న చౌకబారు అరోపణ మీద ఓ వీదులూడ్చే సామాన్య వ్యక్తి చేత స్థానిక ఠానాలో ఫిర్యాదు చేయించి, చక్రవర్తి వ్యక్తిత్వం మీద బురద చల్లించే చౌకబారు ప్రయత్నం కూడా చేయించారు.

ఒక పద్ధతి ప్రకారంగా సాగుతున్న అప్రతిష్ఠాత్మక దాడిని బహదూర్ షా జఫర్ గమనిస్తూ ఉన్నారు. కంపెనీ ప్రసాదించే సాంవత్సరిక భరణం మీద మర్యాదపూర్వకంగా గడుపుకు వస్తున్న 84 సంవత్సరాల వృద్ధ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ఏమీ చేయలేకున్నా, తన ఆగ్రహాన్నీ, అసంతృప్తినీ అవకాశం దొరికినప్పుడల్లా వ్యక్తం చేయసాగారు. చక్రవర్తిగా తన రాజవంశ వైభవాన్ని కొల్పోవడానికి ఇష్టపడక, If I am the son of my father, I shall do what my father had done. I wll accept no conditions imposed by the British ( *FREEDOM FIGHTERS OF INDIAN MUTINY 1857*, M.P Srivastava, 1997, Page 125) అని ప్రకటించారు. చక్రవర్తిగా అన్ని సౌకర్యాలు అనుభవిస్తూన్నా వాస్తవ పరిస్థితిని గుర్తించి, తాను కంపెనీ పాలకుల చేతుల్లో ( Qaid - i - Farang) బందీనన్న విషయాన్ని ఆయన కవితల్లో వ్యక్తం చేశారు.

ప్రజల పక్షం వహించాల్సి వచ్చినప్పుడల్లా బహదూర్ షా జఫర్ ఆ అవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నారు. ఢిల్లీ నగరంలో పారిశుద్ధ్యం కాపాడడానికంటూ, పశువులను నగరం వెలుపలకు తరలించాలని అధికారులు ఆదేశించారు. పశువుల యజమానులు చక్రవర్తి వద్దకు వచ్చి తమ గోడు విన్పించుకున్నారు. ' మా ప్రజలు నివశించే చోటున మేము నివసిస్తాం. ప్రజల అసౌకర్యాన్ని మేమూ పంచుకుంటాం ' అని ప్రకటించి తన నివాసాన్ని నగరం వెలుపల ఏర్పాటు చేయాల్సిందిగా ఆయన కోరారు. ఆ నిర్ణయంతో ఖంగుతిన్న కంపెనీ పాలకులు తమ ఆదేశాలను విరమించుకున్నారు. ఈ రకంగా ఆంగ్లేయుల అనాలోచిత నిర్ణయాల వలన ఇబ్బందులను ఎదుర్కొన్న శ్రామికులు మరోసారి చక్రవర్తి వద్దకు రాగా, ఆంగ్లేయుల ఆదేశాల మీద ఆగ్రహిస్తూ, '..I warn you not to harass my subjects by uprooting them from their homes. Do not force them to leave the city as long as I am here', (*FREEDOM FIGHTERS OF INDIAN MUTINY 1857*, M.P Srivastava) అని హెచ్చరించారు.

స్వంత సమస్యల మూలంగా, ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల మూలంగా ఆంగ్లేయాధికారులకూ చక్రవర్తి బహదూర్ షా జఫర్‌కూ మధ్యన ప్రచ్ఛన్న కలహం సాగుతోంది. ఆ కలహం కాస్తా 1857 మే 11వ తేది సోమవారంనాడు సమరంగా రూపాంతరం చెందింది. కంపెనీ పాలకుల చర్యలకు ఆగ్రహించిన మీరట్‌లోని సైనికులు మే 10వ తేదిన తిరగబడి, అక్కడ నుండి ఢిల్లీకి బయలు దేరి 11వ తేదీన తెల్లవారు ఝామున





పడవల వంతెన సహాయంతో జమునా నదిని దాటి ఢిల్లీ ఎర్రకోటలోకి ప్రవేశించారు.

ఈ మేరకు నగర ప్రవేశం చేసిన తిరుగుబాటు యోధులు అడ్డు వచ్చిన ఆంగ్లేయుల పనిపడుతూ, చక్రవర్తి వద్దకు వెళ్ళి, తమకు నాయకత్వం వహించి ఆంగ్లేయులను పొలిమేర దాటించాల్సిందిగా కోరారు. ఈ పరిణామాన్ని ఊహించని బహదూర్ షా ఆశ్చర్యపోతూ, ' నేను ఫకీరును. నా వద్ద ఖజానా కాని సైన్యం గాని లేదు. అవసరమైతే నా ప్రాణం అంత ఖరీదైనదిగా భావించను. నేను ఏం చేగయలను' అన్నారు. అందుకు సమాధానంగా, ' మేమున్నాం..జీతాలు తరువాతి సంగతి. మీ ఆశీస్సులు చాలు. స్వతంత్ర భారత దేశానికి షాదుషాగా మిమ్మల్ని స్వీకరిస్తున్నాం. నాయకత్వం వహించండి. ఆంగ్లేయులను తరిమివేద్దాం', అని ఎర్రకోట చేరుకున్న యోధులు ప్రకటించారు. చివరకు అతి సునాయాసంగా ఢిల్లీని స్వాధీనం చేసుకోవడంలో కృతకృత్యులయ్యారు.

చివరకు తిరుగుబాటుకు నాయకత్వం వహించడానికి బహుద్దూర్ షా సంసిద్ధులయ్యారు. 1857 మే 12వ తేదీన దర్బారు నిర్వహించి, చక్రవర్తి హోదాలో పలు నియామకాలు చేశారు. మహా పరిపాలనా వ్యవహార మండలిని ఏర్పాటు చేశారు. హిందూ-ముస్లింలను తేడా లేకుండా, విధేయత-సమర్థలను బట్టి పలువురికి బాధ్యతలను అప్పగించారు. బ్రిటీషర్లను పాలద్రోలమని సైనికులకు ఆదేశాలిచ్చారు. ఆంగ్లేయులకు సహకరించవద్దని ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ఈ ప్రకటనతో దేశంలోని తిరుగుబాటు యోధులు, ప్రజలు ఆనందభరితులయ్యారు. ఢిల్లీ తిరుగుబాటు యోధులకు కూడలిగా తయారు కాగా, బహదూషా జఫర్ అందరికి తిరుగులేని చక్రవర్తి అయ్యారు. స్వతంత్ర ప్రకటించుకున్న యోధులంతా తమను తాము చక్రవర్తికి ప్రతినిధులుగా ప్రకటించుకుంటూ, తమ ప్రాంతాలలో పరిస్థితులు చక్కబడగానే ఢిల్లీకి రాసాగారు. ఈ విధంగా ఢిల్లీ వచ్చి చేరిన సైనికులు ఢిల్లీ పరిసర ప్రాంతాలలోనున్న బ్రిటీషు బలగాల మీద దాడులు జరిపి విజయాలు సాధించటంతో సంగ్రామ యోధులలో ఆత్మవిశ్వాసం ఇనుమడించింది.

ఆంగ్లేయులు ఈ పరిస్థితుల గూర్చి తర్జనభర్జన పడసాగారు. ఇండియా లోని సంస్థానాధీశులంతా ఈ సమరంలో భాగస్వాములు కాలేదు. మొఘలుల మీద ఉన్న ద్వేషంతో సిక్కు సైనికులు ఆంగ్లేయులకు అండగా నిలిచారు. గూర్ఖాలు విధేయులయ్యారు. ఈ అవకాశాన్ని వినిమోగించుకుని తిరుగుబాటును అణిచివేయాలని బ్రిటీషర్లు అనుకున్నారు. ఇండియాలోని తిరుగుబాటు యోధులందరికి ఢిల్లీ ఆశాజనక కేంద్రంగా మారినందున, ముందుగా ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు బలగాల మోహరింపు సాగింది.

శత్రువు సంచయం అలా ఉండగా తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న బహుద్దూర్ షా జఫర్ పరిస్థితి మరోలా తయారైంది. ఆర్థిక ఇబ్బందులు చుట్టుముట్టాయి.

దురాశాపరులు, ద్రోహుల వలన నగరంలో అశాంతి ప్రబల సాగింది. ఆ సమయంలో బరేలి నుండి ఖజానాతో, బలగాలతో యుద్ధవిద్యలలో అనుభవజ్ఞులైన భక్త్‌ఖాన్ వచ్చాడు. ఆయనను స్వాతంత్ర్యసంగ్రామ సైన్యానికి సర్వసైన్యాధిపతిగా నియమించారు. ఆ అవకాశాన్ని భక్త్‌ఖాన్ సద్వినియోగం చేసుకుని, నగరంలోని పరిస్థితులను చక్కదిద్దటమే కాకుండా పరిపాలనా విధానాలను మెరుగు పర్చాడు.

ఢిల్లీని తమ పట్టునుండి జారిపోనివ్వరాదని తిరుగుబాటు యోధులు, ఏ విధంగానైనా ఢిల్లీని పునరాక్రమించుకోవాలని ఆంగ్లేయాధికారులు ఎత్తులు పై ఎత్తులు వేస్తూ పోరాటాలు సాగిస్తున్నారు. ఈ విధంగా మే 11తేదీ నాటి నుండి సెప్టెంబరు 14 వరకు దాదాపు 72 పోరాటాలు సాగాయి. ఈ పోరాటాలలో, మతాలకు అతీతంగా హిందూ-ముస్లింలు భుజం భుజం కలిపి ఉమ్మడి లక్ష్యంకోసం ప్రాణాలర్పించడానికి సిద్ధపడుతున్నట్లు ఆంగ్ల అధికారులుకు అర్దమైంది. ఈ ఐక్యతను విచ్ఛిన్నం చేయాలనుకున్నారు. ఆ సమయంలో బక్రీదు పండుగ వచ్చింది. ఈ పండుగ సందర్భంగా ముస్లింలు గోవులను ఖుర్బాని ఇస్తారు కనుక ఈ అవకాశాన్ని వినియోగించుకుని హిందువులను రెచ్చగొట్టి కలహాలు సృష్టించి, పబ్బం గడుపుకోవాలనుకున్నారు. ఈ విషయాన్ని పసిగట్టిన పాదుషా జఫర్ తగిన చర్యలు తీసుకున్నాడు.'..పండగ సందర్భంగా నగరంలో గోవులను ఖుర్బాని ఇవ్వరాదు. మహమ్మదీయుడెవరైనా గోవధచేసినా, గోవధచేయడానికి సహకరించినా, అటువంటి వారిని ఫిరంగి గొట్టానికి కట్టి పేల్చివేయటం జరుగుతుంది ' అని హెచ్చరిస్తూ ఆజ్ఞలు జారీచేశారు. ఈద్గా దగ్గర గొర్రెను ఖుర్బాని ఇచ్చి ఆయన అందరికి మార్గదర్శకయ్యారు. ఈ నిర్ణయంతో ఆంగ్లేయులు ఆశించినట్టుగా హిందువులు-ముస్లింల మధ్యన విద్వేషాలు ప్రజ్వరిల్ల లేదు. ఈ విషయాన్ని, ఆంగ్ల అధికారి కీనిత్ యంగ్ ( Keith Young) ప్రస్తావిస్తూ 'మా ఆశలు అడియాశలయ్యాయి' అన్నాడు. (' Our hopes of a ground row in the city yesterday at the Eed Festival have not, apparently fulfilled ', *Eighteen Fifty Seven*, Surendra Nath Sen, Page 93) తిరుగుబాటు సమయంలో ప్రయోజనాలను ఆశించి మాత్రమే కాకుండా, ఈ రెండు జనసముదాయాల మధ్య సామరస్యాన్ని ఆకాంక్షిస్తూ, ఢిల్లీ నగరంలోని హిందు-ముస్లింలంతా కలసి ప్రతి ఏడాది నిర్వహించు సంత ' ఫూల్ వాలోంకి సైర్ ' (Phoolwalon-ki-sair) ను ఆయన ప్రారంభించారు.

ఢిల్లీని నుండి ఆంగ్లేయుల తరిమివేత తరువాత, ఢిల్లీ బయట పలు ప్రాంతాలలో సాగుతున్న తిరుగుబాట్లను గమనించిన బహుద్దూర్ షా జఫర్, ఆ యోధులందర్నీ ఢిల్లీకి రమ్మని ఆహ్వానించాడు. ఆంగ్లేయులను పూర్తిగా పరాజితులను చేసేందుకు ఈ పోరాటంలో తమతో కలసి రావాల్సిందిగా కోరుతూ పాటియాలా, బల్లభ్‌ఘర్, బహదూర్‌ఘర్, జైపూరు,





ఉదయపూరు, అల్వార్ ( Patiala, Ballubhagarh, Bahaduragarh, Jaipur, Udiapur, Alwar) రాజాలకు ఝజ్జర్ (Jhajjar) నవాబును చక్రవర్తి లేఖలు రాశారు. మొఘలులు అంటే మండి పడుతున్న శిక్కు మతానికి చెందిన జైసల్‌మీర్ సంస్థానాధీశుడు రంజిత్ సింగ్, జమ్మూ పాలకుడు రాజా గులాబ్ సింగ్‌లను కూడా ఆయన ఆహ్వానించారు. రాజ్యపాలనను స్వదేశీపాలకుల సమాఖ్య పరంచేయడానికి కూడా ఆయన సంసిద్దత వ్యక్తం చేశారు.'.. We want you to form a confederacy of states. Should you all combine for the purpose we would willingly transfer the power and office to your hand..' అని పాదూషా లేఖలు రాశాడని ఆంగ్ల అధికారి Metcalfe పేర్కొన్నాడు.

1857 సెప్టెంబరు మాసం వచ్చేసింది. ఢిల్లీ పోరాటం చివరి దశకు చేరుకుంది. ఆంగ్లేయాధికారులు తమ బలగాలన్నిటిని పోగుచేసుకుని ఢిల్లీ మీద విరుచుకుపడ్డారు. ఆ భీషణ పోరాటంలో సమన్వయం కుదరని, ఆయుధబలం సరిపోని తిరుగుబాటు యోధుల ముంగిట పరాజయం తచ్చాడసాగింది. ఆ సమయంలో చక్రవర్తి స్వయంగా ఆంగ్ల సేనల మీద దాడి జరిపేందుకు నగరం వెలుపలకు వస్తున్నారని ప్రచారం సాగింది. ఆ ప్రచారంతో ఉత్సాహభరితులైన ప్రజలు, సైనికులు అందిన ఆయుధాన్ని తీసుకుని చక్రవర్తి నాయకత్వంలో ఆంగ్ల సైన్యాల మీద దాడికి బయలుదేరారు. దురదృష్టవశాత్తు కొందరు బ్రిటీషర్ల తొత్తులు చక్రవర్తిని ఆ ప్రయత్నం నుండి విరమింపచేశారు. ఈ చర్యతో హతాశులైన ప్రజలు, కొందరు సైనికులు నగరం వదలి వెళ్ళిపోయారు. ఆ రాత్రి ఆంగ్ల బలగాల దాడి భయంకర రూపం దాల్చింది. తిరుగుబాటు యోధులు ప్రాణాలకు తెగించి సాగించిన పోరు ఆంగ్లేయుల ఆయుధ సంపత్తి వలన విఫలమైంది. ఆంగ్లేయ సైన్యాలు ఢిల్లీ రక్షణ వలయాన్ని ఛేదించుకుని సెప్టెంబరు 14వ తేదీన ఎర్రకోటలోకి చొచ్చుకు వచ్చాయి. చివరకు 19వ తేదీన ఎర్రకోట ఆంగ్లేయు వశమైంది.

చక్రవర్తిని క్షేమంగా నగరం నుంచి తరలిస్తే, ఢిల్లీ వెలుపల సాగుతున్న పోరాటాలకు ప్రాణం పోయవచ్చని భావించాడు సేనానాయకుడు భక్త్‌ఖాన్. హజరత్ మహల్ నాయకత్వంలో సాగుతున్న స్వతంత్ర పాలనను చక్రవర్తికి దృష్టికి తెస్తూ, ఢిల్లీ నుండి లక్నో వెళ్ళి పోరాటాన్ని సాగించేందుకు ప్రయత్నిద్దామని సలహ ఇచ్చాడు. ( '..Bhaktha Khan, represented to the King that his only way of safety lay in flight; he begged him to accompany the sipahi army, which still remained intact, and renew the war in the open country.' *The Indian Mutiny of 1857*, G.B.Malleson, Page 309) ఈ సాహసోపేతమైన సలహా 84 ఏండ్ల చక్రవర్తికి రుచించలేదు. రాజకుమారుడు జవాన్ భక్త్ ఖాన్‌ను చక్రవర్తిగా చేయాలన్న దురాశతో ఆంగ్లేయులకు అనుకూలంగా వ్యవహరిస్తున్న రాణి జీనత్ మహల్, అంతరంగికుడు అషాముల్లా ఖాన్‌ల సలహా మేరకు,

సిపాయిలను వెళ్ళిపోనిచ్చి చక్రవర్తి పరివారంతో సహా సెప్టంబరు 20వ తేదిన హుమాయూన్ సమాధి భవనం వద్ద తలదాచుకున్నాడు.

చక్రవర్తి, రాజకుమారులను పట్టుకుంటే గాని పరిపూర్ణ విజయం లభించినట్టు కాదుకనుక ఆంగ్లఅధికారులు, ప్రధానంగా హడ్సన్ ( Captain Hodson) తన బలగాలతో జఫర్ జాడకోసం ప్రయత్నిస్తుండగా ఆంగ్ల ఉద్యోగి, ద్రోహి మౌల్వీ రజబ్ అలీ ఆ రహస్యం కాస్త బట్టబయలు చేశాడు. ఆఘమేఘాల మీద హుమాయూన్ సమాధి చేరుకుని, చక్రవర్తి, ఆయన పరివారంలోని సభ్యుల ప్రాణాలకు ఎటువంటి హాని తలపెట్టమని భరోసా కల్పించి, బహుద్దూర్ షా జఫర్‌ను 1857 సెప్టంబరు 21వ తేదిన నిర్బంధించి, ఢిల్లీకి తీసుకొచ్చి పాడుపడిన భవనంలో ఉంచారు. చక్రవర్తి పట్ల అమానుషంగా వ్యవహరించారు. ఆయన తప్పించుకోడానికి ప్రయత్నిస్తే నిర్దాక్షిణ్యంగా కాల్చివేయమని ఆజ్ఞలు జారీ అయ్యాయి.

శత్రుశేషం ఉండరాదనుకున్నారు ఆంగ్లేయాధికారులు. ప్రధానంగా కెప్టన్ హడ్సన్ (Captain Hodson) మొఘల్ రాజవంశాన్ని దుంపనాశనం చేయాలనుకున్నాడు. చక్రవర్తి వారసులు హుమాయూన్ సమాధి భవనంలో ఉన్నారని తెలిసి బలగాలతో తరలివెళ్లి మిర్జా అబూబకర్, మిర్జా మొఘుల్, మిర్జా ఖిజర్ సుల్తాన్‌లను నిర్బంధంలోకి తీసుకున్నాడు. ఎడ్ల బండి మీద ముగ్గురు రాకుమారులను ఢిల్లీకి తరలిస్తూ, ఢిల్లీ గేటు వద్ద ఆగి, ప్రజలు ఆయుధాలతో వెంట వస్తున్నారన్న నెపంతో, రాజకుమారులను బండి నుండి దించి, దుస్తులను తొలిగించి, Hodson స్వయంగా కాల్పులు జరిపి రాజకుమారులను బలితీసుకున్నాడు. ఈ చర్యతో ప్రజలు భయపడిపోయారు. ఎర్రకోటలో కూడా రాజవంశానికి సంబంధించిన ఏ ఒక్కరినీ వదలకుండా అంతం చేశారు. ఆ హత్యాకాండ సమయంలో రాకుమారుడు ఫిరోజ్ షా ఢిల్లీలో లేడు. మాండిసోర్ నుండి అతను విప్లవ శంఖారావం పూరించి పోరాడుతున్నాడు.

ఈ విధంగా ఆంగ్లేయుల ఆగ్రహానికి బలైన ప్రజలు, రాజవంశీకుల మృతదేహాలు రోజుల తరబడి అంత్యక్రియలకు నోచుకోలేదు. రాజ వంశీకులను తుడిచిపెట్టాక, ఆంగ్ల సైనికులు యదేచ్ఛగా ఢిల్లీ నగరాన్ని దోచుకున్నారు. ప్రజల మీద భయంకర దమనకాండ సాగించారు. నగరాన్ని రక్తపుటేరులో ముంచెత్తారు. పసిపిల్లలు, వృద్ధులు, మహిళలు అను తేడా లేకుండా కన్పించిన వారినల్లా కన్పించిన చోట తుపాకులకు ఎరచేశారు. ప్రజల మాన ప్రాణాలతో ఆటలాడుకున్నారు. రహదారులలో, భవనాలలో, బావుల్లో, నదిలో, ప్రతిచోటా మృత కళేబరాలను చూసిన ఆంగ్లేయాధికారులు విస్తుపోయారు.

ఈ దుశ్చర్యలను గాంచిన ప్రముఖ కవి గాలిబ్ '..ఇక్కడ ఎటు చూసినా నా కళ్ళ ముందు రక్త సముద్రం కన్పిస్తుంది...మానవ కళేబరాలతో జమునా నది నిండిపోయింది. ఆ భయంకర దృశ్యాలను చూసి గుండె బద్దలైన మహిళలు ఆత్మహత్యలకు పాల్పడ్డారు.





అందుకు సాక్ష్యంగా కుచాచలాం లోని బావి నిండా మృతకాయాలు...ఎంత మందిని ఉరితీశారో ఆ భగవంతుడికి తెలియాలి..'. అని వ్యథచెందాడు. ఆనాటి భయంకర దృశ్యాలను, ఆంగ్ల సైనికులు, ప్రైజ్ ఏజెంట్లను నియమించి అధికారులు ప్రజల ఆస్తిపాస్తులను దోచుకున్న తీరును ఆంగ్ల సైనికాధికారులు Collenel G.B Malleson, Captain Charles Jhon Griffiths, Christopher Hibbert లు రాసిన గ్రంథాలలో చాలా వివరంగా పేర్కొన్నారు.

ఈ పరిస్థితి ఇలా ఉండగా చక్రవర్తి పరిస్థితి కడు దైన్యంగా మారింది. ఆయనను చూడ్డానికి ఎవరు వచ్చినా ' రాజు పలకరింపుగా చూసేవాడు తప్ప మాటలాడేవాడు కాదని, చలనం చేని మనిషిలా దీర్ఘాలోచనలో మునిగి కన్పించేవాడని ' Captain Charles Jhon Griffiths తన గ్రంథం *A Narrative of the seige of Delhi ,1857* లో వర్ణించాడు. చక్రవర్తి జఫర్ మీద ఆంగ్ల సైనికాధికారులు పలు నేరారోపణలు చేశారు. సంగ్రామానికి నాయకత్వం వహించినందున, ఆ పరిణామాలన్నిటికీ భాద్యునిగా చేశారు. 1858 జనవరి 27 నుండి మార్చి 9వ తేదీ వరకు ఏకపక్షంగా విచారించి, బహుద్దూర్ షా జఫర్‌ను దోషిగా నిర్ణయించారు. అండమాన్ దీవులకు పంపించాలని తొలుత భావించినా, చివరకు రంగూన్‌కు పంపేందుకు నిర్ణయించారు. 1858 అక్టోబరు మాసంలో కలకత్తాకు పంపి అటు నుండి 1858 డిసెంబరు 4వ తేదీన రంగూన్‌కు పంపారు. రంగూన్ నిర్బంధంలో అతి సాధారణ జీవితాన్ని గడుపుతూ కవిత్వం మీద దృష్టి నిలిపారు.

బహదూర్ షా జఫర్ నాయకత్వంలో సాగిన ఈ ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఆంగ్లేయులను భీతావహులను చేసింది. ప్రపంచంలోని ఏ శక్తి కూడా తమను రక్షించలేదన్నంతగా వారు భయపడిపోయారు. ( '..no power on earth could have saved us from total annihilation...' - *A Narrative of the seige of Delhi ,1857* , Charles John Griffiths, London, 1910, page 35). ఈ సందర్భంగా హిందూ-ముస్లింల మధ్యన వ్యక్తమైన ఐక్యత ఆంగ్ల అధికారును ఆశ్చర్యానికి లోనుచేసింది. ఈ విషయాన్ని Charles John Griffiths తన గ్రంథంలో, '.. When Hindoo and Mohammedan, restraining the bitter animosity of their rival creeds, united together in the attemmpt to drive out of their common country that race which for one hundred years.. '. పేర్కొన్నాడు. భారత దేశంలోని తిరుగుబాటు శక్తుల ఐక్యతకు కేంద్ర బిందువుగా నిలచిన చక్రవర్తి, ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం నాయకుడు బహదూషా జఫర్ రంగూన్ జైలులో చివరి రోజులు అత్యంత దుర్భరంగా గడిపారు. చివరి క్షణం వరకు మాతృభూమిని తలచుకుంటూ,' జఫర్ నీ వెంతటి దురదృష్టంతుడివిరా! నువ్వెంతగానో ప్రేమించిన మాతృభూమిలో నీ సమాధి కోసం రెండు గజాల చోటుకుకూడా నీవు నోచుకోలేదు ' అని వాపోతూ, 1862 నవంబరు 7వ తేదీన కన్నుమూశారు. ◆

## బ్రిటీష్ సైనికాధికారులను బెంబేలెత్తించిన వ్యూహరచనాపరుడు

# 26. మున్షీ జకీయుద్దీన్ అహ్మామద్

పరాయి పాలకులను తరిమి కొట్టేందుకు పోరాటం సాగించిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వీరులు ఉమ్మడి లక్ష్యంతో యుద్ధ నినాదం చేశారు తప్ప ఉమ్మడి వ్యూహాన్ని రూపొందించుకోలేక పోయారు. బ్రిటీష్ వ్యతిరేక జ్వాలలు ఆకాశం అంటేంతగా ఎగిసిపడినా ఉమ్మడి వ్యూహం లేని కారణంగా చల్లబడిపోయాయి. శత్రువును పరాజయం పాల్జేసేందుకు దూరదృష్టితో పకడ్బందీ పథకాలను కొందరు రూపొందించినా, ఆ పథకాల గుట్టు కాస్తా ఇంటి దొంగల వలనే రట్టుకావటంతో శత్రువుది పైచేయి అయ్యింది. ఈ మేరకు బ్రిటీషర్లను మట్టికరిపించేందుకు ఉమ్మడి రణతంత్రాన్ని ఆశించి, ఆ దిశగా వ్యూహాలను రూపొందించిన సమరయోధులలో మున్షీ జకీయుద్దీన్ అహమ్మద్ ప్రముఖులు.

మున్షీ జకీయుద్దీన్ అహమ్మద్ బీహారు రాష్ట్రంలోని భాగల్‌పూర్ నగరానికి దక్షిణ భాగాన గల జాంగావ్ ( JAMGAON ) లో జన్మించారు. ఆయన పూర్వీకులు 14వ శతాబ్దంలో బీహర్ వచ్చి జాంగావ్‌లో స్థిరపడినట్టు ఈనాటికీ భద్రపరచిన వంశావళి చరిత్ర ద్వారా విదితమౌతుంది. పలు ఉన్నత పదవులను అలంకరించిన ఆయన పూర్వీకులు కులీన మేథోవర్గంగా ఖ్యాతి గడించారు. ఆయన తండ్రి హజరత్ ముఫ్తీ ఇస్మాయిల్ ధార్మిక,లౌకిక శాస్త్ర గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి పండితోత్తముడిగా పేర్గాంచారు. ఆయన





మేధాసంపత్తిని గుర్తించిన ఢిల్లీ చక్రవర్తి భాగల్‌పూర్, మంగేరి (MONGHYR) జిల్లాలకు ఆయనను ప్రధాన ముఫ్తీ మరియు ఖాజీగా నియమించారు. ఆ ప్రాంతపు ప్రజానీకంలో సంపాదించిన ప్రేమాభిమానాలకు చిహ్నంగా, హజరత్ ఇస్మాయిల్ మరణానంతరం కట్టించిన దర్గా ఈ నాటికి హిందూ-ముస్లిం భక్తులకు పుణ్యక్షేత్రంగా వెలుగొందుతుంది. ప్రతి సంవత్సరం షాబాన్ మాసం 14వ తేదీన అక్కడ 'ఉర్సు' (గంధోత్సవం) జరుగుతుంది.

ఆ మహనీయుని బిడ్డడైన జకీయుద్దీన్ తండ్రి మార్గదర్శకత్వంలో ప్రముఖ విద్యావేత్త షేక్ మహమ్మద్ హాషిం వద్ద విద్యాభ్యాసం చేశారు. ఆ సమయంలో ఢిల్లీకి చెందిన ప్రముఖ ధార్మిక పండితుడు, వలసపాలకులను నిరంతరం వ్యతిరేకించి, యుద్ధం ప్రకటించిన షా వలియుల్లా కుమారుడు షా అబ్దుల్ అజీజ్ వద్ద కూడా ఆయన కొంతకాలం గడిపారు. పలు ప్రాంతాలలో పలువురు పండితుల వద్ద విద్యార్జన చేసి ప్రముఖ పండితుడిగా తయారయ్యారు. తండ్రికి తగిన బిడ్డగా రుజువు చేసుకున్న ఆయనను ఢిల్లీ పాదుషా బహూద్దూర్ షా జఫర్ బుందేల్ ఖండ్‌కు తన దూతగా పంపారు. ఆ విధంగా పలు బాధ్యతలు నిర్వహించిన ఆయన చివరకు తన స్వస్థలం చేరుకున్నారు.

స్వగ్రామం రాగానే జకీయుద్దీన్ న్యాయవాద వృత్తిని చేపట్టి, ప్రముఖ న్యాయవాదిగా ఖ్యాతిగడించారు. అపారంగా సంపాదిస్తున్న ఆయన ప్రజోపయోగ కార్యక్రమాల పై తన సంపాదనను ఖర్చు చేశారు. గ్రామంలో ఓ మసీదును నిర్మించారు. ప్రజలకు నీటి ఎద్దడిని తొలగించేందుకు ఓ చెరువుకు కూడా ఆయన తవ్వించారు. పూర్వీకుల మార్గంలో హిందూ-ముస్లిం అను తారతమ్యాలు లేకుండా అయన అందరినీ గౌరవించారు. ఆదరించారు. తండ్రి ఇస్మాయిల్ లాగా అందరికీ ఆత్మబంధువయ్యారు.

పలు భాషలలో పాండిత్యాన్ని సంపాదించుకున్న జకీయుద్దీన్ పర్షియన్ భాషలో చాలా కవిత్వం రాశారు. ఆయన రాసిన కవిత్వంలో కూడా పరాయి పాలకుల పట్ల ద్వేషం స్పష్టంగా వ్యక్తంచేశారు. ఒక పర్షియన్ కవితలో ఫిరంగీయులను హతం చేయమని, తరిమివేమమని ప్రజలను కోరారని డాక్టర్ కె.కె దత్తా సంకలనం చేసిన Regional Records Survey Committe,1959-60 ( Bihar ) పేర్కొంది. ఆనాడు ఆయన రాసిన కవితలు ఈనాటికి కూడా ఆయన వంశజుల వద్ద ఉన్నాయని ప్రముఖ చరిత్రకారులు Prof. M K A Siddique, Prof. Santimoy Ray సంయుక్తంగా జకీయుద్దీన్ గురించి రాసిన ఓ వ్యాసంలో పేర్కొన్నారు. ఈ కవితలోని ప్రతిపాదం మెదటి అక్షరాలను కలిపితే ఆయన పేరు, రెండవ అక్షరాలన్నీ కలిపితే ఆంగ్లేయులను సంహరించరండి (Qatil-i-Firangian or Killing of English) అను అర్థం పలుకుతుందని ఆ వ్యాసం వివరించింది. ఈ రికార్డులు ఆనాటి సంఘటనల వివరాలను, మున్షీకి సంబంధించిన పలు వ్యక్తిగత,

తిరుగుబాటు సంబంధిత విశేషాలను వెల్లడిచేశాయి. మున్షీ జకీయుద్దీన్ రాసిన గ్రంథాలు గాని, లేఖలు గాని, న్యాయవాదిగా న్యాయస్థానానికి సమర్పించే పత్రాలు కాని భాషాపరంగా ప్రత్యేకంగా ఉండేవి. ఆయన శైలి, భాష అద్వితీయం కావటంతో ఆయన రచనలు చదవగానే చప్పున గుర్తుపట్టేంత సులభంగా ఉండటం విశిష్టత. ఈ విశేషాంశాలే 1857 నాటి తిరుగుబాటు సమయంలో ఆయన రూపొందించిన తిరుగుబాటు పథకానికి సంబంధించి, సహచరులకు రాసిన రహస్య లేఖల గుట్టును రట్టు చేశాయి.

మున్షీ జకీయుద్దీన్ ప్రతిభను గమనించిన ఖరగ్‌పూర్ సంస్థానాధీశుడు రాజా రహమత్ అలీ ఆయనను తనవద్ద ప్రధాన దివాన్‌గా బాధ్యతలు చేపట్టమని ఆహ్వానించారు. మున్షీ ఎక్కడ ఉన్నా వలస పాలకులను, ఆంగ్లేయ అధికారులను ఏ మాత్రం ఉపేక్షించేవారు కారు. ఒకసారి రాజా రహమత్ అలీని సందర్శించేందుకు వచ్చిన జిల్లా మేజిస్ట్రేటు అయినటువంటి బ్రిటీష్ అధికారికి అనుమతివ్వకుండా తిప్పి పంపించివేశారు. ఈ విధంగా వలసపాలకుల పట్ల వ్యతిరేకతను వ్యక్తంచేస్తూ, ఆ శక్తులను తరిమి కొట్టాలన్న కోరికను ధైర్యంతో వెల్లడించే మున్షీ జకీయుద్దీన్ చుట్టూతా అభిమానధనులైన హిందూ-ముస్లిం యువకులు, ప్రజలు పెద్ద సంఖ్యలో చేరారు. ఈ విషయాన్ని బ్రిటీష్ అధికారులు పసిగట్టినా, జకీయుద్దీన్ ఏ మాత్రం తొందరపడకుండా పకడ్బందీగా వ్యవహరించటం వలన, ప్రజలలో ఆయనకున్న పేరు ప్రఖ్యాతుల వలన ఆయన మీద ఏ చర్యా తీసుకోలేదు. ఈ వాతావరణాన్ని అనుకూలంగా మలుచుకుని జకీయుద్దీన్ ఢిల్లీ, పాట్నా, ముషీరాబాద్, ఢాకా, తదితర నగరాలలోని ప్రముఖులతో సంప్రదింపులు జరుపసాగారు. వయస్సుతోపాటుగా ఆయనలో నివురుగప్పిన నిప్పులా దాగిఉన్న బ్రిటీష్ వ్యతిరేకతకూడా వటవృక్షంలా పెరగసాగింది. పరిస్థితుల మీద చక్కని అవగాహన, దూర దృష్టిగల ఆయన అదను కోసం ఎదురు చూడసాగారు.

1857లో ఆయన ఆశించిన సమర భేరి మ్రోగింది. బ్రిటీషర్ల మీద తిరగబడమనీ, బానిస బంధాల నుండి విముక్తి కోసం సమరశంఖం పూరించమనీ ఢిల్లీ పాదుషా నుండి వర్తమానం వచ్చింది. ఆ సమయంలో జకీయుద్దీన్ వయస్సు 60 సంవత్సరాలు. ఆ వయస్సులో కూడా యవకునిలా ఉత్తేజితులయ్యారు. చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ పిలుపునందుకుని తక్షణమే కార్యరంగంలోకి దిగారు. శత్రువు బలాబలాలను అంచనా వేసుకున్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల మీద తిరుగుబాటు అంటే అషామాషి వ్యవహారం కాదుకానీ అసాధ్యం ఏమాత్రం కాదనుకున్నారు. ప్రజల ఆగ్రహం నుండి అక్కడక్కడ పుట్టుకొచ్చే తిరుగుబాట్ల వలన దుష్పరిణామాలు ఎదుర్కోవాల్సి వస్తుంది తప్ప సాధించగలిగింది ఏమీ ఉండదని ఆయన పరిస్థితులను విశ్లేషించుకున్నారు. ఈ విధంగా సాగే పోరాటాల వలన పోరుకు





సిద్ధపడే స్వదేశీ బలగాలకు రక్షణ ఉండదని, శత్రువు అపారమైన బలగాలతో విరుచుకు పడి భారీ నష్టం కలిగించగలడని అంచనాకు వచ్చారు. శత్రుబలగాల మీద అన్ని ప్రాంతాల నుండి, ఒక్కసారిగా దాడి జరిగితే తప్ప ఆంగ్లేయుల మీద విజయం సిద్ధించదని ఆయన బలంగా విశ్వసించారు.

ప్రజలలో దేశభక్తి భావాలను ప్రేరేపించి, అనుకూల వాతావరణాన్ని సృష్టించుకోవాలని జకీయుద్దీన్ భావించారు. ఆ మేరకు తనకు పరిచయం ఉన్న అన్ని ప్రాంతాల ప్రముఖ యోధులందరికి వర్తమానం పంపి, ఆయా ప్రాంతాలలో ఓ నిర్ణీత సమయాన తిరుగుబాటు చేయాలనీ, అలా చేసినట్టయితే, శత్రువు బలగాల వికేంద్రీకరణ జరుగుతుంది కనుక తిరుగుబాటుకు అనుకూల ఫలితాలు లభించగలవనీ భావించారు. ఈ మేరకు పథకాన్ని రూపొందించి, ఆ పథకాన్ని వివరిస్తూ మిత్రుల కోసం లేఖలు తయారు చేశారు. ఆ లేఖలను ఆయా వ్యక్తులకు అందించేందుకు ప్రత్యేక ఏర్పాట్లు చేశారు.

ఒక వైపు వ్యూహరచన చేస్తూ, తను ప్రారంభించాల్సిన తిరుగుబాటు కోసం బలగాలను సమకూర్చుకోవడం ప్రారంభించారు. ఆయన కుటుంబానికి ఉన్న పేరు ప్రతిష్టలు, స్వయంగా జకీయుద్దీన్ వ్యక్తం చేస్తున్న బ్రిటీష్ వ్యతిరేకత, ఆయన అద్భుత మేధ, శక్తి సామర్థ్యాలతో ప్రజలలో సంపాదించుకున్న పలుకుబడులను పెట్టుబడిగా పెట్టి, మాతృభూమి కోసం ప్రాణాలను తృణప్రాయంగా త్యాగం చేయగల యువకులను సమీకరించారు. ఈ మేరకు 14 వందల మంది హిందూ-ముస్లిం యోధులను సమకూర్చుకున్నారు. ఈ బలగాలకు అవసరమగు ఆయుధాల కోసం, తగిన ఏర్పాట్ల కోసం తన యావత్తు సంపదను మంచినీళ్ళ ప్రాయంగా వ్యయం చేశారు.

ఈ విధంగా తిరుగుబాటుకు పథకరచన చేసిన జకీయుద్దీన్ 1857 ఆగస్టు 3వ తేదిన ఆంగ్లేయుల మీద విరుచుకుపడడానికి మూహూర్తం నిర్ణయించారు. ఆ రోజు ' **ఈదుల్ జుహా** '. అది సమాజ సంక్షేమం కోసం, ఉమ్మడి ప్రయోజనాల కోసం మానవుడు ఎంతటి త్యాగానికైనా సిద్ధం కావాలని మహత్తర సందేశమిచ్చే ' **బక్రీదు పండగ** ' రోజు. ఈ మేరకు నిర్ణీత తేదీన, నిర్దిష్ట సమయానికి అన్ని ప్రాంతాలలో తిరుగుబాటు జ్వాలలను మండించాలని జకీయుద్దీన్ పిలుపునిచ్చారు. తిరుగుబాటులో పాల్గొనేందుకు ఆయన మిత్రులు పాట్నాకు చెందిన నాజిర్ ఫౌజ్‌దారి అలీ హుసైన్ ఖాన్, మంగేరికి (MONGHYR) చెందిన ప్రముఖ వ్యాపారస్థుడు హాజీ అహమ్మద్ పూర్తి మద్దతు తెలిపారు. జకీయుద్దీన్ రూపొందించిన పథకం వివరాల లేఖను ఇతర మిత్రులకు పంపించే బాధ్యతను హాజీ అహమ్మద్ స్వీకరించారు.

ఆ మేరకు రెండు రూపాయలను ఇస్తానని ఆశ చూపించి ఓ లేఖను నాజిర్

ఫౌజ్‌దారి అలీ హూసైన్ ఖాన్ కు చేరవేయమని ఒక స్థానికుడ్ని కోరారు. ఆనాడు పరిస్థితులు అల్లకల్లోంగా ఉండటంతో ఆ పని చేయడానికి స్థానికుడు నిరాకరించాడు. అందుకు ఆగ్రహించిన అలీ హూసైన్ ఖాన్ స్థానికుడ్ని బెదిరించాడు. ఆ బెందిరిపుతో కినుక వహించిన ఆ వ్యక్తి ఆ విషయాన్ని బహిర్గతం చేశాడు అది కాస్తా ఆ నోట ఈ నోట పడి అంతటా ప్రాకింది. ఈ విషయాన్ని తెలుసుకున్న స్థానిక క్రైస్తవుడొకడు తిన్నగా ఓ ఆంగ్లేయాధికారి చెవిన వేశాడు.

ఆ అధికారి నిఘా ఉంచి, పోస్టు బాక్సులో పడిన మున్షీ అహమ్మద్ రాసిన లేఖను హస్తగతం చేసుకున్నాడు. తిరుగుబాటు పథకం బహిర్గతం కాగానే అంగ్లేయాధికారులు అతి రహస్యంగా వ్యవహరించి లేఖాంశాలను, ఆ లేఖల భాష, శైలిని విశ్లేషించారు. పుట్టిన గడ్డ విముక్తి కోసం ప్రాణాలను పణంగా పెట్టేందుకు ప్రతిఒక్కరిని ప్రేరేపించే విధంగా ఉన్న ఆ లేఖలను విశ్లేషించిన అధికారులు, జకీయుద్దీన్ మాత్రమే ఈ విధంగా ఉత్తేజపూరిత భాషలో రాయగల సమర్ధుడనే నిర్ణయానికి వచ్చారు. ఆ విధంగా నిర్ణయించగానే చడీచప్పిడి లేకుండా బలగాలతో దాడిచేసి జకీయుద్దీన్‌ను, ఆయన సహచరులను అరెస్టు చేశారు. ఈ అరెస్టుల మూలంగా బ్రిటీషర్ల గుండెల్లో రైళ్ళను పరిగెత్తించగల సామర్ధ్యం కల్గిన తిరుగుబాటు దారుణంగా విఫలమైంది.

ఈ విషయాలను ఆనాటి "Friend of India ", "Hindu Patriot", " Baghawat-e-Hind " లాంటి ప్రతికలు, Regional Records Survey Committe,( Bihar ) లాంటి నివేదికలు వివరంగా ప్రచురించాయి. ఈ వివరాలు Prof. M K A Siddique ఆధ్వర్యంలో ఏర్పడిన Munshi Zakiuddin Ahamed Memorial Celebration Committee ప్రచురించిన " *Celebrations of Munshi Zakiuddin Ahamed and India's First War Of Independence in 1857* " అను Souvenir (14-5-1990) వెల్లడించింది.

జకీయుద్దీన్ దూరదృష్టిని ఉటంకిస్తూ, తిరుగుబాటు విఫలం కాకున్నట్టయితే తలెత్తే భయంకర పరిణామాలను ప్రస్తావిస్తూ ఆ పత్రికలు, రికార్డులు భయాందోళనలను వ్యక్తంచేశాయంటే మున్షీ అహమ్మద్ పథకం ఎంత పటిష్టంగా ఉండిందో ఊహించవచ్చు. ఈ విషయాన్ని కలకత్తాకు చెందిన " English Man " అను పత్రిక తన 1857 జూలై 17 తేదీనాటి సంచికలో ఓ ఆంగ్లేయాధికారి మాటలను ఉటంకిస్తూ, **ఒకవేళ వృద్ధ వకీల్‌ను కనుక తన పథకం ప్రకారంగా ముందుకు సాగనిచ్చియున్నట్టయితే అతను ఈ ప్రాంతంలో భయోత్పాతం సృష్టించి ఉండేవాడు అనటంలో ఏ మాత్రం సందేహంలేదు,** అని పేర్కొంది.

ప్రజాదరణ, ప్రాణాలొడ్డి పోరాడగల యోధులకు స్ఫూర్తి ప్రదాత అయినటువంటి మున్షీ జకీయుద్దీన్ అహమ్మద్, ఆయన సహచరుల అరెస్టులు అంత తేలికగా సాధ్యంకాలేదు. ఈ పరిణామాల సందర్భంగా జరిగిన పోరాటాలలో Sir N. Lesli అను సైనికాధికారి





తిరుగబాటు వీరుల కత్తి వాదరకు బలయ్యాడు. భాగల్‌పూరు, మంగేరిలలో తీవ్ర అశాంతి ప్రబలింది. మున్షీ అహమ్మద్ రగిలించిన దేశభక్తి ప్రపూరితమైన అగ్ని యువకులలో రగులసాగింది. ప్రజలు ఆయుధాలు చేపట్టి ప్రాణాలకు తెగించి తిరుగబడ్డారు. ఆ అలజడిని అణిచివేసేందుకు అదనపు సైనిక బలగాలు కదలి వచ్చాయి. ఈ పోరులో ఆంగ్లేయాధికారి కమాండర్ Lt. Cooper, భాగల్‌పూరు సహాయ కమీషనర్‌లు కూడా హతమయ్యారు. ఆ సందర్భంగా ఆంగ్లేయాధికారులకు ప్రాణాలు అరచేతపెట్టుకుని వివిధ ప్రాంతాలలో దాక్కోవాల్సిన దుర్గతి పట్టింది. భగల్‌పూరు జిల్లా ఆంగ్లేయ అధికారుల అదుపు తప్పింది. ఆ సమయంలో అనుకోని విధంగా అక్కడకు చేరుకున్న అదనపు సైనిక బలగాలు ప్రజల మీద దాడులు చేసి భయానకంగా వ్యవహరించి పరిస్థితిని అదుపులోకి తీసుకరావటంతో సమరయోధుల ప్రయత్నాలు విఫలమయ్యాయి.

జకీయుద్దీన్ అహమ్మద్‌ను అరెస్టు చేసి భాగల్‌పూరు జిల్లా కమీషనర్ కార్యాలయానికి తరలించారు. ఆయన మీద ఒక సంవత్సరంపాటు విచారణ సాగింది. చివరకు ఆయనకు ఉరిశిక్ష విధిస్తూ తీర్పును ప్రకటించారు. ఆ తీర్పు ప్రకారంగా ఉరిశిక్ష అమలు జరిగేలోపుగా, బ్రిటీష్ రాణి విక్టోరియా చేసిన ప్రకటన నేపథ్యంలో ఉరిశిక్ష రద్దుచేసి ఆయనను విడుదల చేశారు. ఆ విధంగా విడుదలైన మున్షీ జకీయుద్దీన్ అహమ్మద్ ఆంగ్లేయుల విధానాలను, పాలనా పద్ధతులను వ్యతిరేకిస్తూనే గడిపారు.

ఆ క్రమంలో స్వతంత్ర భారతాన్ని ఆకాంక్షిస్తూ, 1872లో కన్నుమూసేంతవరకు బ్రిటీష్ వ్యతిరేకంగా ప్రజలలో చైతన్యం కలుగజేస్తూ ఆయన ముందుకు సాగారు. జకీయుద్దీన్ అహమ్మద్ చివరి శ్వాస విడిచాక ఆయన భౌతికాయాన్ని జాంగావ్‌లో ఆయన స్వయంగా నిర్మించుకున్న మసీదు ఆవరణలో ఖననం చేశారని, ఆ సందర్భంగా జరిగిన అంతిమయాత్రలో హిందూ-ముస్లింలన్న తేడా లేకుండా ప్రజలు తండోపతండాలుగా పాల్గొని, తమ నేతకు శ్రద్ధాంజలి ఘటించారని Prof. M K A Siddique, Prof. Santimoy Ray లు Munshi Zakiuddin Ahamed Memorial Celebration Committee ఆధ్వర్యంలో ప్రచురించిన " *Celebrations of Munshi Zakiuddin Ahamed and India's First War Of Independence in 1857* " అను Souvenir (14-5-1990) లో వివరించారు. ◆

> 'హిందూ-ముస్లింలకు ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, ధనం అను నాలుగు అంశాలు ప్రధానం. ఈ అంశాలను కేవలం స్వదేశీ పాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు. కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. ఆత్మగౌరవాన్ని మంట కలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు...హిందూ-ముస్లిం పౌరులను హెచ్చరిస్తున్నాం. ఆత్మగౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంతంగా జీవితం సాగించాలంటే స్వదేశీపాలన కోసం శతృవులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. మాతృదేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములు కండి. **-బేగం హజరత్ మహల్.**



బ్రిటీష్ సైనిక బలగాలను సవాల్ చేసి పోరాడి నిలిచిన వీరనారీమణి

# 27. బేగం హజరత్ మహల్

మాతృభూమికోసం ప్రాణాలను పణంగా పెట్టి, బ్రిటీష్ సైనిక బలగాలతో తలపడిన రాణులు స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అరుదుగా కన్పిస్తారు. ఆ అరుదైన ఆడపడుచులలో అగ్రగణ్యురాలు బేగం హజరత్ మహల్. ప్రథమ స్వాతంత్ర్యోద్యమం తొలిదశలో ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో రాజీబేరాలు కుదుర్చుకునే ప్రయత్నాలు చేసి, అవి విఫలమై చివరకు గత్యంతరం లేక యుద్ధంలో పాల్గొన్న రాణుల్లా కాకుండా, ఆది నుండి కంపెనీ పాలకులను శత్రువులుగా పరిగణించి, మాతృదేశ పరిరక్షణార్థం, ప్రజల ఆత్మగౌరవం కోసం ఆయుధం పట్టక తప్పదని ప్రకటించి, అత్యంత ధైర్య సాహసాలతో రణభూమికి నడిచిన వీరనారీమణి బేగం హజరత్ మహల్.

ఆమె ఉత్తర భారతదేశంలోని అత్యంత సంపన్నవంతమైన అవధ్ రాజ్యం అధినేత నవాబ్ వాజిద్ అలీషా భార్య. అమె చిన్ననాటి విషయాలు చాలావరకు తెలియవు. గ్రంథస్థం చేయబడిన వివరాలు కూడా పరస్పరవిరుద్ధంగా ఉన్నాయి. ఆమె స్వస్థలం మాత్రం ఫైజాబాద్. ఆమే పేరు ఇఫ్తికారున్నీసా బేగం. అమె అందచందాలకు ఆకర్షితుడైన నవాబు వాజిద్ అలీ షా ఆమెను తన అంతఃపురంలోకి రప్పించుకుని **సుగంధ కన్య** అని బిరుదు ఇచ్చాడు. ఆమెను ఇఫ్తికారున్నీసా ఖానం సాహెబా అని కూడా పిలుచుకున్నాడు. ఆమెను వివాహం





చేసుకున్నాక ఆమె బేగం హజరత్ మహల్ అయ్యింది. ఆమెకు మిర్జా బిర్జిస్ ఖదీర్ బహదూర్ అను కుమారుడు కలిగాడు.

అవధ్ రాజ్యం రాజధాని లక్నో. అది మొగల్ రాజ్యంలో ఒక భాగం కాగా, ఆ ప్రభువుల బలాధికృత క్షీణిస్తున్న సమయంలో స్వతంత్ర్య రాజ్యంగా ప్రకటితమైంది. 1801లో అవధ్ రాజు నవాబ్ సాదత్ ఆలీ బ్రిటీష్ పాలకులతో సంధి చేసుకుని, రాజ్యాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీకి అప్పగించాడు. అధికారం ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులది కాగా, నవాబు నామమాత్రమయ్యాడు. ఆ అవధ్ రాజ్యానికి చివరి నవాబు వాజిద్ ఆలీషా 1847లో సింహాసనం అధిష్టించాడు. ఆ సంవత్సరం గవర్నర్ జనరల్‌గా లార్డ్ డల్హౌసీ భారతదేశం విచ్చేసాడు. రాజ్య విస్తరణ కాంక్షతో ఒక్కొక్క రాజ్యాన్ని అక్రమంగా ఆక్రమించుకుంటున్న అతని చూపు సంపన్నవంతమైన అవధ్ మీద పడింది. ఈ మేరకు గవర్నర్ జనరల్ లక్నోలోని ఒక బ్రిటీష్ అధికారి ద్వారా లొంగుబాటు పత్రాన్ని నవాబ్ వాజిద్ ఆలిషాకు పంపి, ఆ పత్రం మీద సంతకం చేయమని ఆదేశించాడు. ఆ విధంగా సంతకం చేయనట్టయితే కంపెనీ సేనలు అవధ్ రాజ్యంతో పాటుగా అంతఃపురాన్ని కూడా స్వాధీనం చేసుకోగలమని బెదిరంచాడు. ఆ బెదిరింపులకు భయపడిన నవాబు అవధ్‌ను కంపెనీపరం చేయడానికి సిద్ధపడ్డాడు.

ఆ సమయంలో భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో అవధ్ పతాకాన్ని వినువీధుల్లో ఎగరవేసిన శ్రీమతి బేగం హజరత్ మహల్ రంగప్రవేశం చేసింది. ఆ పత్రం మీద సంతకాలు చేయడమంటే అవధ్ రాజ్యాన్ని పూర్తిగా కంపెనీకి దాసోహం చేయటమేనని భావించిన ఆమె గవర్నర్ జనరల్ ఆదేశాలను నిరసించింది. ఈ పరిణామాలతో ఆగ్రహించిన కంపెనీపాలకులు నవాబ్ వాజిద్ అలీషాను 1856 ఫిబ్రవరి 13వ తేదిన నిర్బంధంలోకి తీసుకుని, మార్చి 13న కలకత్తా పంపారు. ఆ పరిణామాలకు భయపడిన నవాబు పరివారంలో అత్యధికులు నవాబుతో పాటుగా కలకత్తా వెళ్ళిపోయారు. బేగం హజరత్ మహల్, మరి కొందరు మాత్రం, స్వంత గడ్డను పరుల పరం చేసి వెళ్ళటం ఇష్టంలేక లక్నోలోని కౌసర్ బాగ్‌లో ఉండిపోయారు.

ఆంగ్లేయుల ఈ చర్య వలన ప్రజలలో అసంతృప్తి రగులుకుంది. అవధ్ చుట్టు పక్కలగల స్వదేశీ పాలకులు కంపెనీ పాలకుల దుశ్చర్యల పట్ల తీవ్రంగా స్పందించారు ఆగ్రహంతో కుతకుతలాడుతున్న హృదయాలతో ఆంగ్లేయుల చర్యల పట్ల మండిపడసాగారు. ఆ సమయంలో ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఆరంభమైంది. కంపెనీ చర్యల పట్ల తీవ్రంగా ఆగ్రహావేశాలను వ్యక్తం చేస్తున్న అవధ్‌లోని ప్రజలు, సైనికులు, స్వదేశీ పాలన

కోసం కంపెనీ పాలకుల ఆధిపత్యాన్ని నిరాకరిస్తూ తిరుగుబాటు ప్రకటించారు. 1857 మే 31న లక్నోలోని ఛావనీలో తిరుగుబాటు ఫిరంగులు పేలాయి. ఆంగ్లేయాధికారులను, ఆ కంపెనీ తొత్తులను లక్నో నుండి, అవధ్ రాజ్యంలోని ఇతర ప్రాంతాల నుండీ తరిమివేశారు. అవధ్‌లోని ప్రధాన ప్రాంతాలు తిరుగుబాటు వీరుల ఆధిపత్యంలోకి వచ్చాయి.

ఈ సందర్భంగా 1857 జూన్ 30న చిన్హట్ వద్ద కంపెనీ బలగాలతో జరిగిన పోరాటంలో తిరుగుబాటు వీరులకు లభించిన విజయం ఇటు ప్రజలలో,అటు తిరుగుబాటుకు సన్నద్ధమౌతున్న స్వదేశీపాలకులలో, సైనికులలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. ఆ ఉత్సాహంతో తిరుగుబాటు యోధులు మరింతగా రెచ్చిపోయారు. స్వతంత్ర రాజ్యాన్ని ప్రకటించారు.ఆ సమయంలో పాలకుని పేరుతో ఓ పతాకం క్రింద సమకూడి ఆంగ్లేయుల మీద పోరాడటానికి పాలకుడి అవసరం వచ్చింది. నవాబు వంశస్థుల కోసం అన్వేషణ ప్రారంభమైంది. బ్రిటీష్ పాలకులంటే ఏర్పడిన భయంతో, లక్నోలో ఉంటున్న నవాబు భార్యలు కొందరు తమ బిడ్డలకూ, కలకత్తాలో ఉన్న భర్త బంధువులకూ ప్రమాదం సంభవించగలదని భయపడి కంపెనీ పాలకుల ఆగ్రహానికి తమను బలి చేయవద్దంటూ ప్రాధేయపడ్డారు. ఆ క్లిష్ట సమయంలో బేగం హజరత్ మహల్ చారిత్రక పాత్ర నిర్వహించేందుకు ముందుకొచ్చారు. పదకొండు సంవత్సరాల తన బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను నవాబుగా ప్రకటించేందుకు అంగీకరించారు. ఈ విషయం మీద కూడా పర్సర విరుద్ధ కథనాలున్నాయి. ఈ కథనాలు ఎలాగున్నా ఆ తరువాత బేగం హజరత్ మహల్ నిర్వహించిన పాత్ర, ప్రదర్శించిన ధైర్యసాహసాలు, బుద్ధికుశలత, ఆమె త్యాగనిరతి, ఆత్మబలిదానం ఆ కట్టుకథలను పటాపంచలు చేసి, చరిత్రలో అమెకు ప్రత్యేకస్థానం సంతరించి పెట్టాయి.

ఆ సమయంలో అవధ్ రాజ్యంలోని ఫైజాబాద్‌లో కంపెనీ పాలకుల బందీగా నున్న మౌల్వీ అహమ్మదుల్లా షాను, తిరుగుబాటు వీరులు విడుదల చేసి ఆయనను నాయకునిగా స్వీకరించారు. మౌల్వీ తన బలగాలతో లక్నో చేరుకుని కంపెనీ పాలకులను ఎదుర్కొన్నాడు. ఆ సందర్భంగా బేగం హజరత్ మహల్ బ్రిటీషు పాలకులకు వ్యతిరేకంగా మరింత చొరవ తీసుకున్నారు. ఆ కారణంగా తిరుగుబాటు మరింత ప్రజ్వరిల్లింది. పది రోజుల్లో లక్నో అంతా పూర్తిగా తిరుగుబాటు సేనలపరమైంది. ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల ఆనవాళ్ళు కూడా కన్పించకుండా పోయాయి.

బేగం హజరత్ మహల్ తన బిడ్డ బిర్జిస్ ఖదీర్‌ను 1857 జూలై 5న అవధ్ నవాబుగా ప్రకటించారు. ఆ నిర్ణయాన్ని పలువురు ప్రముఖులు బలపర్చారు. తిరుగుబాటు యోధులలో ఆనందం వెల్లివిరిసింది. బిర్జిస్ ఖదీర్ పేరిట బేగం హజరత్ మహల్ పాలన





ప్రారంభమైంది. ఆమె అధికారపగ్గాలను చేపట్టగానే పాలనా పరమైన చర్యలను చేపట్టారు. అన్ని సాంఘిక జనసముదాయాలకు పాలనాధికారంలో భాగం కలించే విధంగా, సమిష్టి నిర్ణయాలకు అనుకూలంగా పాలనా వ్యవస్థను రూపొందించారు. బహిర్గత శత్రువును ఎదుర్కోడానికి ప్రాణాలు పణంగా పెట్టే సైనికులకు అధిక ప్రాధాన్యత కల్పించారు. స్వదేశీ పాలకులు, నమ్మకస్థులైన సైనికాధికారులకు, తిరుగుబాటు వీరులకు, స్వదేశీ భక్తులకు ప్రతిభా సామర్థ్యాల ఆధారంగా పలు విభాగాల బాధ్యతలను అప్పగించారు. మతం, కులం, ప్రాంతాల ప్రసక్తి లేకుండా, పౌర-సైనికాధికార ప్రముఖులైన ముమ్మూఖాన్, మహారాజ బాలకృష్ణ, బాబూ పూర్ణచంద్, మున్షీ గులాం హజరత్, మహమ్మద్ ఇబ్రహీం ఖాన్, రాజా లాలా సింహ్, రాణా జిజియా లాల్, రాజా మాన్‌సింగ్, రాజా దేశిబక్ష్ సింగ్, రాజా బేణిప్రసాద్ లాంటి వారితో ఉన్నతస్థాయి కమిటీని ఏర్పాటు చేసారు. ఈ కమిటీ ప్రతి రోజు సమావేశమయ్యేది. ప్రతి అంశాన్నీ కమిటీ సభ్యుల ఎదుట పెట్టి, చర్చించి ప్రజాస్వామ్యబద్ధంగా నిర్ణయాలు తీసుకుని వాటి అమలును బేగం పర్యవేక్షించారు. రాజరికపు రోజుల్లో ఆ విధంగా వ్యవహరించటం బేగం హజరత్ మహల్ బుద్ధికుశలతకు నిదర్శనం. అవద్ నవాబు బిర్జిస్ ఖధీర్ పేరిట ప్రకటనలు వెలువడ్డాయి. ఆంగ్లేయుల పాలన అంతమైందని ఆ ప్రకటనలు స్పష్టం చేశాయి.

ఆమె ఎటువంటి ప్రగతిశీల, సామరస్యపూర్వక విధానాలు చేపట్టినా, ఆమె శక్తిసామర్థ్యాల పట్ల విశ్వాసం కలుగని స్వదేశీపాలకులు, జమిందారులు ఆమె నాయకత్వాన్ని తొలుత స్వీకరింలేదు. అవధ్ అంతటా అస్తవ్యస్థ పరిస్థితి, క్రమశిక్షణారాహిత్యం, వ్యక్తిగత స్వార్థంతో కంపెనీ పాలకులవైపు మొగ్గు చూపుతున్న విద్రోహుల బెడద, బేగం శక్తి సామర్థ్యాలను శంకించే జమిందారుల, స్వదేశీ పాలకుల, అధికారుల సమస్యలు ఒకవైపు, అవమాన భారంతో రగిలిపోతున్న కంపెనీ పాలకుల కుయుక్తులు మరొకవైపు బేగం హజరత్ మహల్‌ను చుట్టుముట్టాయి. అయినా ఆమె అధైర్యపడలేదు. ప్రజలను ఆకట్టుకుంటూ, స్వదేశీ పాలకులకు, తాలూకాదారులకు పలు రాయితీలు ప్రకటించారు. అంగ్లేయాధికారి జనరల్ హ్యావ్‌లాక్ తనకు లభించిన రెండు విజయాల తరువాత కూడా అవధ్ నుండి నిష్క్రమించటంతో బేగం శక్తిసామర్థ్యాల మీద నమ్మకం కుదిరిన స్వదేశీ పాలకులు, జమిందారులు తిన్నగా బేగం నాయకత్వం స్వీకరించి, నజరానాలు సమర్పించుకోవటం ప్రారంభించారు.

ఈ అనుకూల వాతావరణంలో ప్రజల అవసరాలను తీర్చుతూ, శతృవు దాడుల నుండి ప్రజలను కాపాడేందుకు లక్నో కోటను పటిష్ట పర్చే కార్యక్రమాలను చేపట్టారు. ఆమె స్వయంగా తన లక్షలాది రూపాయలను వ్యయంచేసి కోటగోడలను పునరుద్దరించారు.

బేగం హజరత్ మహల్ స్వంగా ఏనుగునెక్కి ఆయా ప్రదేశాలకు చేరుకుని స్వయంగా పర్యవేక్షించటంతో ప్రజలు-సైనికులు ఉత్సాహభరితులయ్యేవారు. అవధ్‌లోని ప్రజలనుద్దేశించి బిర్జిస్ ఖదిర్ పేరిట బేగం హజరత్ మహల్ ఒక ప్రకటన విడుదల చేసారు. ఆ ప్రకటనలో ' **హిందూ-ముస్లింలకు ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, ధనం అను నాలుగు అంశాలు ప్రధానం. ఈ అంశాలను కేవలం స్వదేశీ పాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు. కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. ఆత్మగౌరవాన్ని మంటకలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు... హిందూ-ముస్లిం పౌరులనుహెచ్చరిస్తున్నాం. ఆత్మగౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీపాలన కోసం శతృవులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో భర్తీకండి..మాతృదేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములవ్వండి. శతృవుకు సహకరించకండి. ఆశ్రయం ఇవ్వకండి..**', అంటూ బేగం హజరత్ మహల్ ప్రజలకు పిలుపునిచ్చారు.ఆ పిలుపుతో ఉత్తేజితులైన ప్రజలు,సైనికాధికారులు, అంతవరకు ఆమెకు దూరంగా ఉన్న స్వదేశీ పాలకులు, అధికారులు బేగం పతాకం నీడన చేరుకున్నారు.

పరిస్థితులు అనుకూలించి ప్రశాంత వాతావరణం ఏర్పడటంతో, అవధ్ ఆర్థిక పరిస్థితులను చక్కదిద్దేందుకు బేగం నడుం కట్టారు. పలు ప్రాంతాల నుండి లక్నో వస్తున్న తిరుగుబాటు యోధులకు, వేలాది సైనికులకు ఆమె ఆశ్రయం కల్పించారు. ప్రముఖ తిరుగుబాటు నాయకులు నానా సాహెబ్ పీష్వా, జనరల్ బక్త్‌ఖాన్ రోహిల్లా, రాజకుమారుడు ఫిరోజ్ షా తమ భారీ సైనిక బలగాలతో లక్నో చేరుకుంటున్నారు. ఈ నేతలందరికీ, వారి పరివారం, సైన్యాలకు వసతి సమకూర్చటం బేగంకు కడు భారంగా మారింది. ఈ పరిస్థితుల వలన ఖజనా మీద అధిక భారమైంది. చివరకు ఖజానా ఖాళీ అయ్యింది. అమె వ్యక్తిగత సంపద కూడా ఖర్చయిపోయింది. గత్యంతరం లేని పరిస్థితులలో ధనికులు, కులీన సంపన్న వర్గాల మీద ' **యుద్ధపన్ను** ' అంటూ ప్రత్యేక పన్ను విధించింది. ఈ నిర్ణయానకి సహజంగా మిశ్రమ స్పందన లభించింది. ఆ విధంగా సమకూరిన ధనం కూడా సరిపోక పోవడంతో ఆమె అధికారులు కొందరు తిరుగుబాటు వ్యతిరేక శక్తులుగా వ్యవహరిస్తున్న సంపన్నుల నుండి బలవంతంగా ధనసంపదలు వసూలు చేయసాగారు. ఆనాటి క్లిష్ట పరిస్థితులలో కూడా బేగం హజరత్ మహల్ ఎంతో బుద్ధికుశలతతో వ్యవహారాలను చక్కదిద్దుకుంటూ, ఆంగ్లేయులను ఎదుర్కొనేందుకు సన్నద్ధురాలు కాసాగింది. ఈ మేరకు 1,80,000 మంది సైనికులను సమకూర్చుకున్నారు. బ్రిటీషు బలగాలతో ఢీ అంటే ఢీ అనడానికి సిద్ధమయ్యారు.

ఈ పరిస్థితులను గమనించిన బ్రిటీష్ అధికారి విలియం రస్సెల్, '..**బేగం మాతో అప్రకటిత యుద్ధం ప్రారంభించింది... ఈ రాణులు, బేగంల శ్లాఘనీయ, శక్తివంత చరిత్రలను**





**గమనించాక, అంత:పురంలో, పర్దాల చాటున ఉంటూ కూడ ఎంతటి శక్తియుక్తులు సంతరించుకోగలరో తెలుసుకున్నాం..**' అని వ్యాఖ్యానించాడు., మరో చరిత్రకారుడు H. Beveridge బేగం హజరత్ మహల్ ,'**..తిరుగుబాటుకు ఆత్మలాంటిది'**.అన్ని ప్రస్తుతించాడు.( She was rightly the **soul of the insurrection**, *A Comprehensive History of India*, H. Beveridge, 1887 Ed. Vol.III, Page 842. Qyoted by Mr. Srivasthava in his book *Freedom Fighters of Indian Mutiny 1857* , page105) ప్రముఖ చరిత్రకారుడు Mr. Abdul HarimSharar, ఆమె పర్దానషీ మహిళ కానునట్టయితే మిగతా పురుషుల కంతే గొప్ప పోరాటయోధురాలుగా ఖ్యాతి గడించేది..', ( '.. had the Begum not been a purdahnashin, she would have made a better commander in chief than many a man in her army.',Mr. Srivasthava in his book *Freedom Fighters of Indin Mutiny 1857*,page105) అని వ్యాఖ్యానించాడు.

అవధ్‌లో పరిస్థితులు కొంతమేరకు మెరుగు పడ్డాక బేగం హజరత్ మహల్ తన రాజకీయ కుశలతను చూపనారంభించారు. బ్రిటీషర్లతో మిలాఖత్ అయిన నేపాల్ పాలకుడు జంగ్ బహదూర్‌ను తనవైపుకు తిప్పుకునేందుకు పాచికలను కదిలించారు. ఆయనకు కంపెనీ పాలకులు ఆశపెట్టిన దానికంటే, ఎక్కువ భూభాగాన్ని ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నామంటూ వర్తమానం పంపారు. అవధ్ ఇరుగుపొరుగు స్వదేశీ పాలకులకు రానున్న గడ్డు పరిస్థితుల పట్ల హెచ్చరికలు చేస్తూ, అవసరాన్ని బట్టి ప్రతి అవకాశాన్నీ అనుకూలంగా మలుచుకుంటూ, మంత్రాంగం నడుపుతూ, బేగం హజరత్ మహల్ కంపెనీ పాలకులకు ముచ్చెమటలు పట్టించింది. ఆనాటికి ఢిల్లీ ఆంగ్లేయుల వశమైంది. చక్రవర్తి బహదూర్ షా జఫర్ లొంగిపోయారు. అటువంటి పరిస్థితులలో కూడా కంపెనీ అధికారులకు కంటిమీద కునుకు లేకుండా చేసిందామె!

ఈ మేరకు బేగం హజరత్ మహల్ సుమారు 10 మాసాల పాటు ప్రత్యక్షంగా పాలన చేసారు. ఆంగ్లేయులు ఇంకా అలంబాగ్ లోని రెసిడెన్సీలో ఉండటం, ఆ రెసిడెన్సీ నుండి బయటపడి లక్నోను స్వాధీనం చేసుకోడానికి కంపెనీ అధికారులు వేస్తున్న ఎత్తులను గమనించిన ఆమె రెసిడెన్సీ మీద దాడికి తన సైనికులను పురికొల్పారు. 1857 డిసెంబరు 22వ తేదిన సైనిక యోధుల సమావేశం ఏర్పాటు చేసింది. అ సమావేశంలో ఉత్తేజపూరితంగా ప్రసంగిస్తూ, ' ఎందుకీ నిరీక్షణ..శతృవుతో తలపడేందుకు భయపడుతున్నారా?.. బ్రిటీషర్లు అదనపు సైన్యాలను రప్పించేంత వరకు మీరు కూర్చోని కాలం వెళ్లబుచ్చుతారా ? ముందుకు సాగండి. మీరు పోరాడుతారా ? లేదా ? చెప్పండి. పోరుబాటన నడువలేమంటే నేను ఆంగ్లేయులతో మంతనాలు జరుపుతాను. నా ప్రాణాలను కాపాడుకుంటాను. ఏ విషయం చెప్పండి ? ' అంటూ సైనికుల, సైన్యాధిపతులను ఆమె నిలదీసింది. ఈ సందర్భంగా

తూటాల్లా ఆమె సైనికుల మీద ప్రయోగించిన మాటలు తిరుగుబాటు యోధులలో ఆత్మ బలిదానానికి సన్నద్ధులను చేసి, పోరుకు ప్రేరేపించాయి.

బ్రిటీష్ రెసిడెన్సీని బేగం సేనలు చుట్టుముట్టాయి. విజయమో, వీర స్వర్గమో అంటూ పోరాటం ప్రారంభించాయి. ఈ పోరాట సమయంలో బేగం అపూర్వ ధైర్య సాహసాలను ప్రదర్శించారు. బిడ్డడు బిర్జిష్ ఖదీర్‌ను వెంట పెట్టుకుని ఏనుగు మీద ఆమె స్వయంగా రణభూమికి విచ్చేసారు. (Hazrath Mahal, riding on an elephant, encouraged her army by her presence on the field of battle, *History of Freedom Movement in India*, Dr. Tara Chand, Page 85) ప్రాణాలొడ్డి పోరాడుతున్న సైనికులను, ప్రజలను తన ప్రసంగాలతో ఉత్తేజితపర్చారు. భయంకరంగా పోరాటం సాగింది. లక్నో కమీషనర్‌గా పనిచేసిన బ్రిటీష్ అధికారి హెన్రీ లారెన్స్, **ఎక్కడా కూడా ఇంతకుమించిన శౌర్యప్రతాపాలు మేము చూడలేదు**, అంటూ బేగం నాయకత్వంలో సాగిన పోరాటాలను ప్రశంసించాడు. ఈ పోరులో పలువురు కంపెనీ అధికారులు మృత్యువాత పడ్డారు. అయితే రెసిడెన్సీ మాత్రం తిరుగుబాటు యోధుల వశం కాలేదు.

ఆ సమయంలో ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికాధికారుల నుండి సంధి ప్రస్తావన వచ్చింది. తిరుగుబాటుదారులకు క్షమాబిక్ష ప్రసాదిస్తామనీ, బేగంకు ప్రతి మాసం 25వేల రూపాయల పెన్షన్ ఇస్తామనీ, అందుకుగాను బేగం అవధ్ మీద తన అధికారాన్ని పూర్తిగా వదులుకోవాలనీ కంపెనీ అధికారులు ప్రతిపాదించారు. ఆ ప్రస్తావన పట్ల బేగం మండిపడ్డారు. నా గడ్డ మీద మరొకరి పెత్తనమా? అంటూ ప్రాణాలు పోయినా సరే శతృవుకు లొంగేది లేదన్నారు. బిడ్డడు బిర్జిస్ ఖదీర్ న్యాయమైన హక్కులను, తన వెంట నడిచిన స్వదేశీపాలకులను, ప్రజలను ప్రధానంగా స్వదేశీయుల ఆకాంక్షలను కంపెనీ బలగాల దయాదాక్షిణ్యాలకు వదిలిపెట్టలేనంటూ, ఆ ప్రతిపాదనలను తిరస్కరించారు. నా ప్రాణం మీది తీపితో న్యాయమైన హక్కులను వదులుకునేది లేదని బేగం స్పష్టం చేశారు.

భారతదేశ వ్యాపితంగా పలుప్రాంతాలలో ఆరంభమైన తిరుగుబాట్లను అణచివేసిన, బ్రిటీష్ సైన్యాలు,సేనాధిపతులు లక్నో మీద దృష్టి సారించారు. లక్నోను వీలయినంత త్వరగా పట్టుకోవలసిందిగా అధికారులకు లార్డ్ కానింగ్ నుండి ఆదేశాలందాయి. 1858 మార్చి 3-4 తేదీలలో బ్రిటీష్ సైన్యాధిపతి కోలిన్ భారీ సైనిక బలగాలతో లక్నోను చుట్టుముట్టాడు. ఆయనకు తోడుగా నేపాల్ ప్రభువు జంగ్ బహదూర్ తన బలగాలతో మార్చి 11వ తేదీన ఆంగ్లేయాధికారులతో కలిశాడు. లక్నోలోని బేగం హజరత్ మహల్ నివాసం కైసర్‌బాగ్ మీద ఫిరంగులు, తుపాకులు గుండ్ల వర్షం కురిపించసాగాయి. బేగం ప్రమాదంలో పడిందని గ్రహించని సహచరులు ఆమె అక్కడ నుండి రక్షిత స్థలానికి వెళ్ళవలసిందని సూచించారు.





ఆమె అక్కడ నుండి మరోచోటుకు వెడితే ఆంగ్లేయులకు విజయం లభించినట్టు కాగలదని భావించిన ఆమె పెనుముప్పు ముంచుకు వచ్చేంత వరకు అక్కడ నుండి కదలలేదు. చివరకు మార్చి 16వ తేదిన ఆమె లక్నో నుండి తప్పుకున్నారు.

ఆ తరువాత బేగం హజరత్ మహల్ పలు ప్రాంతాలు తిరుగుతూ అనేకచోట్ల శతృవును ఎదుర్కొంటూ, మరికొన్ని చోట్ల మిత్రుల ఆతిధ్యం పొందుతూ, బ్రిటీషర్ల దాడుల నుండి తప్పించుకుంటూ ముందుకు సాగారు. ఆ సమయంలో కుట్ర పూరితంగా విద్రోహులు మౌల్వీ అహమదుల్లా షాను బలితీసుకున్నారు. ఈ వార్త ఆమెను బాధించింది. అవధ్‌లోని పలు ప్రాంతాలలో స్వదేశీ యోధులు సాగిస్తున్న పోరాటాలలో అపజయాలు చవిచూడాల్సిన పరిస్థితులు ఎదురవుతున్నాయి. ఆమె సహచరులు రాజా బేనిమాధవ్ సింగ్ తదితరుల పరాజయాలు బేగంను బాగా కృంగదీశాయి. ఈ వాతావరణంలో బేగం హజరత్ మహల్ తన పరివారంతోపాటుగా అక్కడ కొన్నాళ్ళు, ఇక్కడ కొన్నాళ్ళు తలదాచుకుంటూ గడుపసాగారు. బేగం పరివారాన్ని వెంటాడుతున్న కంపెనీ బలగాల మూలంగా ఆమె తలదాచుకున్న చోటల్లా కంపెనీ సైన్యాలు బీభత్సం సృష్టించసాగాయి.

ఈ విధంగా బేగం హజరత్ మహల్ ప్రవాసంలో ఉన్నప్పుడు 1858 నవంబర్ 1వ తేదీన విక్టోరియా మహారాణి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను రద్దుచేసి, పాలనాధికారాన్ని స్వయంగా స్వీకరించారు. ఈ సందర్భంగా ఆమె ' విక్టోరియా రాణి ప్రకటన ' గా ప్రాచుర్యం పొందిన ప్రకటన చేసారు. అందులో స్వదేశీ పాలకులకు, ప్రజలకు ఆమె పలు హామీలు కుమ్మరించారు. పలు ఆకర్షణీయమైన ఆశలను చూపెట్టారు. తిరుగుబాటు వీరులకు, నేతలకు క్షమాభిక్ష ప్రసాదిస్తానన్నారు. తిరుగుబాటులో పాల్గొన్న స్వదేశీ పాలకులను, ప్రజలను ఆ ప్రకటన కొంతలో కొంతగా ఆకర్షించింది. బేగంను వదలి పెట్టి విక్టోరియా రాణి ప్రసాదించే క్షమాభిక్షతో తమ ప్రాణాలు కాపాడుకోవాలనుకున్న కొందరు సహచరులు, పాలకులు, కులీనులు, జమీందారులు, అధికారులు తిన్నగా తిరుగుబాటు మార్గం నుండి తప్పుకోసాగారు. ఈ పరిణామాలు బేగంను కలవరపరిచాయి.

ఆ పరిస్థితులలో ప్రజలలో, సహచరులో ఆత్మవిశ్వాసం కలిగించేందుకు, బేగం హజరత్ మహల్ విక్టోరియా ప్రకటనకు ధీటుగా 1858 డిసెంబర్ 31తేదీన మరో చారిత్రాత్మక ప్రకటనను బిర్జిస్ ఖదీర్ పేరిట విడుదల చేసారు. సామ్రాజ్యవాద కాంక్ష కలిగిన బ్రిటన్, స్వదేశీ సంస్థానాలను ఎలా ఆక్రమించుకుందీ, స్వదేశీ పాలకులను ఎలా మోసగించిందీ, స్వదేశీ పాలకులతో పలు ఒప్పందాలు చేసుకుని వాటిని నిస్సిగ్గుగా ఎలా ఉల్లంఘించిందీ, ప్రజల మత విశ్వాసాల మీద, ఆచార సంప్రదాయాల మీదా ఎటువంటి

దాడులు నిర్వహిస్తున్నది సవివరంగా పేర్కొన్నారు. స్వదేశీ పాలకుల మీద ఆ పరాయి పాలకులు ఎంతటి దారుణాలకు ఒడిగట్టిందీ ఆ ప్రకటనలో వివరించారు. ఆంగ్లేయులు అపరాధాన్ని క్షమించినట్టు కలలో కూడా ఎవ్వరూ చూడలేదు ( .. no one has ever seen in a dream that the English forgave an offence ) అంటూ లొంగుబాటుకు సిద్దమౌతున్న యోధులను హెచ్చరించింది. స్వదేశీ ఆత్మాభిమానాన్ని ఏవిధంగా దెబ్బగొట్టిందీ, స్వదేశీయుల మతధర్మాలను ఏవిధంగా కించపర్చిందీ, మత మనోభావాలను ఏ విధంగా అవమానపర్చిందీ, తిరుగుబాటుకు భయపడి తిరగబడ్డ సైనికులనూ, నేతలనూ మాలిమి చేసుకునేందుకు ఎలాంటి ఆశలు చూపిందీ, గతంలో అలా స్వదేశీ పాలకుల మీద ఎంతటి అఘాయిత్యాలకు పాల్పడిందీ ఈ సుదీర్ఘమైన చారిత్రాత్మక ప్రకటన సాక్ష్యాధారాలతో సహా వివరించింది. చివరకు మా ప్రజలు మాదేశాన్ని కోరుతున్నప్పుడు ఆమె మాదేశాన్ని మాకెందుకు వదలిపెట్టదూ? ( ..Why does her Majesty not restore our country to us. when our people want it..) అని సూటిగా ప్రశ్నించింది. ఈ విక్టోరియా రాణి మభ్యపెట్టు మాటలను నమ్మవద్దనీ, మోస పోవదనీ ఆమె ప్రజలకు, స్వదేశీ పాలకులకు విజ్ఞప్తి చేశారు. మాతృభూమి నుండి పరాయిపాలకుల పెత్తనాన్ని రూపుమాపేందుకు కంకణబద్ధులై అంతా కదలాలని ఆమె ప్రజలను కోరారు.

ఈ పరిస్థితులు ఇలా ఉండగా, అంగ్లేయాధికారులు లక్నో తిరుగబాటును క్రూరంగా అణిచివేయడానికి, తిరుగుబాటు నాయుకులను తుదముట్టించేందుకు పలు పథకాలు రచించసాగారు. అన్ని వైపుల నుండి తిరుగుబాటు సైన్యాలను తరుముతూ, వారంతా నేపాల్ దిశగా సాగిపోయేందుకు అనుకూలతను పథకం ప్రకారం సృష్టించారు. లక్నో నుండి తప్పుకున్న తరువాత బేగం హజరత్ మహల్ కూడా మిగతా యెధులతో పాటుగా మరో మార్గం లేక నేపాల్ దిశగా సాగాల్సి వచ్చింది. ఆమె రక్షణ కూడా ప్రమాదంలో పడింది. ప్రాణాలకు ముప్పు ఏర్పడింది. ఆ క్లిష్ట పరిస్థితులలో బ్రతికుండగా తాను గాని, మరణించాక తన శవం గాని కంపెనీ పాలకుల చేతుల్లో పడరాదని నిర్ణయించుకున్న బేగం శ్రీ నానా సాహెబ్ తదితన తిరుగుబాటు నేతలతో కలిసి అడవుల్లోకి వెళ్ళిపోయారు. అక్కడ కూడా ఆమెకు ప్రమాదం తప్పలేదు. ప్రమాదాల నుండి తప్పించుకుంటూ రాత్రి, పగలూ అని లేకుండా ఆమె గడపాల్సి వచ్చింది. ఆ సమయంలో కూడా ఆంగ్లేయల నుండి లొంగుబాటు ప్రతిపాదనలు వచ్చాయి. సుఖవంతమైన జీవితం గడపడానికి కావాల్సిన అన్ని ఏర్పాట్లు కల్పిస్తామని బ్రిటీషు అధికారులు ఆశలు కల్పించినా, స్వతంత్ర జీవనాన్ని, మాతృభూమిని వదలుకొనడానికి ఇష్టపడని ఆమె ఆంగ్లేయుల ప్రతిపాదనలను తిరస్కరించారు. చివరకు





నేపాల్ రాజ్యంలోనికి ప్రవేశించిన ఆమెకు నేపాల్ పాలకుడు జంగ్ బహుద్దూర్ సహకారించక పోగా నేపాల్ అడవులు వదిలి వెళ్ళిపోవాల్సిందిగా ఆదేశించాడు. అనివార్య పరిస్థితులలో ప్రమాదకర వాతావరణాన్ని ఎదుర్కొంటూ బేగం హజరత్ మహల్, బిర్జిస్ ఖదీర్ నేపాల్ అడవుల్లో సంచరించాల్సి వచ్చింది. ఈ సందర్భంగా ఒక వేళ పోరాడి నేలకొరిగే అవకాశం లభించకుంటే, అత్మార్పణ చేసుకునేందుకు బేగం ఎల్లప్పుడు విషంతో కూడిన పాత్రను తనవెంట ఉంచుకుని తన ప్రయత్నాలను సాగించింది.

ఆ సమయంలో నేపాల్ అడవుల్లోకి బేగం హజరత్ మహల్ ఛాయా చిత్రం గీసేందుకు వచ్చిన ఒక బ్రిటీష్ చిత్రకారుని ద్వారా, ఆమెకు భారీ నజరానా అందజేస్తామని ఆశ చూపుతూ బ్రిటీష్ పాలకులు లొంగదీసుకునేందుకు విఫల ప్రయత్నం చేశారు. ప్రతికూల పరిస్థితులను తట్టుకుంటూ సాగుతుండగా, ఆమె వెంట నడిచి వచ్చిన యోధులు ఒక్కొక్కరే ఆ కారడవుల్లో-మంచు కొండల్లో మృత్యువువాత పడసాగారు. కాలం గడిచేకొద్ది సంపదతోపాటుగా, సహచరులూ తరిగి పోవటంతో ఒంటరిగా మిగిలిన అసమాన పోరాటయోధురాలు, అతి నిస్సహాయ పరిస్థితులలో సామాన్య జీవితం గడుపుతూ, ఆ మంచు కొండల శిఖరాల మీద రెపరెపలాడుతున్న అవధ్ రాజ్యం ఛత్ర ఛాయలో 1874 ఏప్రిల్ మాసంలో తుది శ్వాస వదిలారు. ఆమె భౌతిక కాయాన్ని ఖాట్మండూలో స్వయంగా నిర్మించుకున్న ఇమాంబారాలో సమాధి చేశారు.

ఆ ఇమాంబారా శిథిలమైపోయింది. ప్రస్తుతం తమె స్మృతి చిహ్నంగా సమాధి మాత్రమే మిగిలింది. ఆ సమాధి నూటపాతికేళ్ళుగా అక్కడ ఉన్నా దానిని పట్టించుకున్నవారు లేకపోయారు. 1957 ప్రథమ స్వాతంత్ర్య శతాబ్ది ఉత్సవాల సందర్భంగా, ఆమె సమాధికి ఏర్పడిన దుస్థితి గురించి ఆమె వంశజుడు మీర్జా ఆజం ఖదీర్ ఆనాటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ దృష్టికి తెచ్చారు. ఆ మహాయోధురాలి సృతిగా మిగిలి ఉన్న అమె సమాధి నిర్లక్ష్యానికి గురికావడం తెలుసుకున్న నెహ్రూ తన బాధను వ్యక్తం చేస్తూ తగిన శ్రద్ద తీసుకుంటానని హమీ ఇచ్చాడు. ఆ సమాధిని ఫోటోలు తీయించి, వాటిని అజం ఖదిర్‌కు పంపారు. ఆ ఫోటోలను పంపిచటంతోపాటుగా, నేపాల్‌లోని భారత రాయబార కార్యాలయం ఆ సమాధి సంరక్షణ బాధ్యతను తీసుకుంటుందని హామీ కూడా ఇచ్చారు. ఆ హామీలు అమలుకు నోచుకోలేదు సరికదా ఆ సంవత్సరం ఉత్తర ప్రదేశ్‌లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఉత్సవాలలో ఆ మహాయోధ బేగం హజరత్ మహల్ సాహసోపేత జీవితం గురించి కనీసం ప్రస్తావన కూడా చేయకపోవటం విచారకరం. ◆



ప్రజల అండదండలతో కంపెనీ సేనలను నిలువరించిన పోరాట యోధుడు

# 28. తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొన్న పలువురు సంస్థానాధీశులు, రాజులు, జన్మభూమి పట్ల భక్తిప్రపత్తులను వ్యక్తంచేసే ప్రజల, విశ్వాస పాత్రులైన సైనికుల అండదండలతో ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల దుడుకుతనాన్ని నిలువరించగలిగారు. సామ్రాజ్యవాద కాంక్షతో రగిలిపోతున్న పరాయి పాలకులను ఎదిరించి, తమ సరిహద్దులు దాటించారు. ఈ మేరకు శత్రువును తరిమికొట్టి స్వపరిపాలనను ప్రతిష్టించిన యోధులు, యోధురాండ్రు గణనీయంగా ఉన్నా, ప్రథమస్వాతంత్ర్యసమరం విఫలం కావటంతో, ఆ స్వదేశీపాలకులంతా ఉరిశిక్ష, దేశబహిష్కారం లాంటి శిక్షలకు గురయ్యారు. ఆ కారణంగా ఆ యోధుల చరిత్రలకు తగినంత ప్రాధాన్యత లభించలేదు. ఆ విధంగా పరాయి పాలకులను ఎదిరించి, నిలబడి, కలబడి తమ భూభాగం నుండి తరిమికొట్టిన యోధులలో ప్రముఖులు తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్.

1857కు ముందు రెండు శతాబ్దాలుగా ఫరూఖాబాదు స్వతంత్ర రాజ్యంగా వెలుగొందింది. ఆ రాజ్యానికి పాలకుడు తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు దేశంలోని ఒక్కొక్క స్వదేశీపాలకుడ్ని లొంగదీసుకుంటూ, తమ ఆధిపత్యాన్ని అన్ని ప్రాంతాలకు విస్తరింపచేసుకుంటున్నారు. ఫరూకాబాదును కూడా పాదాక్రాంతం





చేసుకోవాలన్న కాంక్షతో నగరాన్ని ఆక్రమించుకుని, నవాబుకు పెన్షన్ ప్రకటించారు.

అది 1857వ సంవత్సరం. ఈస్ట్ ఇండియా పాలకులకు వ్యతిరేకంగా తిరుగుబాటు జ్వాలలు ఉవ్వెత్తున ఎగిసిపడుతున్నాయి. ఒక్కొక్క సంస్థానం కంపెనీ పాలకుల పెత్తనం నుండి బయటపడి స్వతంత్రతను ప్రకటించుకుంటున్నాయి. ఆ ఉత్తేజపూరిత వాతావరణం హుస్సేన్ సరత్ జంగ్‌లో ఉత్సాహాన్ని నింపింది. ఫరూఖాబాదును స్వతంత్రం చేయాలన్న ఆయన సంకల్పానికి ప్రజలు అండగా నిలిచారు. స్వదేశీ సైనికులు, కత్తి పట్టగల ప్రతి యువకుడు ముందుకు వచ్చి, ఫరూఖాబాద్ కోట మీద స్వతంత్ర పతాక ఎగరాలన్నాడు. అందుకు ఆంగ్లేయులతో యుద్ధం చేయడానికి నవాబు సిద్ధమయ్యాడు.

ఈ సందర్భంగా ప్రజల పట్టుదలను గమనించడానికి , **నాకు సింహాసనం మీద మోజు లేదు. భగవంతుని మీద భక్తిగలవాడను. సన్యాసం స్వీకరించి అల్లా సేవలో తరిస్తూ జీవితం చాలిస్తే చాలనుకుంటున్నాను**, అన్నాడు. ఆ మాటకు ప్రజలు, సైనికులు, సైనికాధికారులు ముందుకు వచ్చి, మీ నాయకత్వంలో ప్రాణాలు అర్పించేందుకు సిద్ధంగా ఉన్నాం ఆజ్ఞాపించండి ప్రభూ ఆజ్ఞాపించండి అన్నారు. ఆ సమయంలో కంపెనీ సైన్యంలో పనిచేసిన స్వదేశీసైనికులు కొందరు తుపాకులు పేల్చుతూ నవాబు వద్దకు వచ్చి, హూజూర్ మీరు మా నవాబు! మేము ఆంగ్ల సైన్యంలో ఉద్యోగాలకు స్వస్తిచెప్పి మీవద్దకు వచ్చాం. మీ సేవకు సిద్ధంగా ఉన్నాం, అని ప్రకటించారు.

**మీ వినతిని స్వీకరించేందుకు నేను సిద్ధంగా ఉన్నాను.** మీరు వెనుకడుగు వేయరని నాకు హామీ ఇవ్వాలి. ఒకసారి నేను నిర్ణయం తీసుకున్నాక వెనుకడుగు వేయను. మిమ్మల్ని వెకకడుగు వేయనివ్వను. చెప్పండి, మీకు ఆమోదమేనా ? అని గంభీర స్వరంతో తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్ ప్రశ్నించారు. మీ షరతులు మాకు అంగీకారమే అంటూ దిక్కులు పిక్కటిల్లేల్లా ప్రజలు, సైనికులు నినదించారు. ఆ నినాదంలో ఫరూఖాబాదు సైనిక మైదానంలో నగారా మోగింది. నిన్నటి వరకు మీరు ఆంగ్లేయుల ఉద్యోగులు. నేటి నుండి మీరు ఢిల్లీ చక్రవర్తి బహదూర్ షా జఫర్ సైనికులు. ఆయన ఆదేశాలు తు.చ తప్పకుండా పాటించండి. దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడండి అని తఫ్‌జుల్ హూస్సేన్ సరత్ జంగ్ సైనికులు, ప్రజలకు ప్రబోధించారు. ఈనాటి నుండి ఆంగ్లేయుల రాజ్యం ముగిసింది. ఢిల్లీ పాదుషా ప్రతినిధిగా నేను పాలన చేస్తాను అని ఆయన ప్రకటించారు. ఆ క్షణం నుండి ఫరూఖాబాదు సంస్థానం కాస్తా స్వతంత్ర్య రాజ్యంగా ప్రకటితమైంది. కంపెనీ అధికారుల తరిమివేత ఆరంభమైంది. ఆంగ్లేయాధికారులు, ఉద్యోగులు ఫతేఘడ్ కోటలో దాక్కొన్నారు.

ప్రజల మద్దతుతో ఫతేఘడ్ కోటను స్వాధీనం చేసుకునేందుకు తఫ్‌జుల్ హూస్సేన్ నడుం కట్టారు. ఆయుధాలు చేత పట్టి శత్రువు మీద లంఘించేందుకు సిద్ధంగా ఉన్న

సైనికులను పరికిస్తూ, పది ఫిరంగులు తెచ్చి ఫతేఘడ్ కోటకు అభిముఖంగా ఉంచి, కోట మీద దాడి చేయమని సైనికులను ఆజ్ఞాపించారు. సైనిక దళాలకు నాయకత్వం వహిస్తూన్న గంగా సింగ్, దుబేలకు ప్రత్యేక సూచనలు చేశారు. స్వతంత్ర ఫరూఖాబాద్ సైన్యం మరుసటి రోజున దాడికి సిద్ధమైంది. ఆ యోధులకు అగ్రభాగాన నిలచి కోటకు అభిముఖంగా హుస్సేన్ సరత్ జంగ్ ముందుకు కదిలారు. ఈ సందర్భంగా ఆయన చూపిన ధైర్యసాహసాలు సైనికులలో నూతనోత్సాహానికి కారణమయ్యాయి. నవాబుకు జేజేలు పలుకుతూ కోట మీదకు సైన్యాలు విజృంభించాయి. ఈ దాడి 5 రోజులపాటు సాగింది. చివరకు పతేఘడ్ స్వతంత్ర సేనల వశమయ్యింది. కంపెనీ పాలకులు, అధికారుల ఆనవాళ్ళుకూడా లేకుండా ఫతేఘడ్ నుండి తరిమి కొట్టారు. ఆ క్రమంలో స్వదేశీసేనలకు పలు విజయాలు సొంతమయ్యాయి. ఫరూఖాబాద్ స్వతంత్రమైంది. ఢిల్లీ పాదుషా ప్రతినిధిగా నవాబు తఫజుల్ హుస్సేన్ సరత్ జంగ్ ఒక ఏడాది పాలన సాగింది.

ఈ పరిణామాలు కంపెనీ పాలకులకు మింగుడుపడలేదు. పరాజయం పాలై పరుగులెత్తటం కాకుండా ఫతేఘడ్‌ను స్వాధీనం చేసుకోలేక పోయినందుకు ఫోర్టు విలియంలో ఉన్న ఆంగ్లేయాధికారులు ఆగ్రహంతో రగిలి పోసాగారు. ఇండియా అంతటా తిరుగుబాటు జరుగుతున్న కారణంగా భారీగా సైన్యాలను తరలించలేక పోయిన అధికారులు, తిరుగుబాటు తగ్గుముఖం పట్టాక ఫరూఖాబాద్ మీద దృష్టి సారించారు. ప్రతీకారం తీర్చుకునేందుకు భారీ బలగాలతో ఆంగ్లేయ సైన్యాలు ఫరూఖాబాద్‌ను మూడు దిశల నుండి ముట్టడించాయి. నవాబు హుస్సేన్ సరత్ జంగ్ తన బలగాలతో వీరోచితంగా పోరాడినప్పటికీ ప్రతికూల ఫలితాలు తప్పలేదు. స్వతంత్ర సైన్యాలు తరిగిపోతుండగా, శత్రు సైన్యాలు మిడతల దండులా వచ్చిపడసాగాయి. ఓటమి తప్పని పరిస్థితి రావటం, శతృసైన్యాల వలయం నుండి బయటపడే అవకాశాలు మృగ్యం కావటంతో, ఇంకా పోరాడి తనవెంట కదలి వచ్చిన ప్రజలనూ, సైన్యానికీ ముప్పు తెచ్చిపెట్టడం హుస్సేన్ సరత్ జంగ్‌కు ఇష్టంలేక పోయింది. ఆ సమయంలో ఆయన సహచరులు, సైనికదళ నాయకులు ఆయనను లొంగిపొమ్మని సలహా ఇచ్చారు. నా క్షేమం కోసం జన్మభూమి గౌరవాన్ని మంటకలపటం ఇష్టం లేదని ఆయన ప్రకటించారు.

హుస్సేన్ సరత్ జంగ్ రణభూమి నుండి చాకచక్యంగా తప్పించుకుని బరేలి దిశగా పయనమయ్యారు. మార్గమధ్యంలో ఆయన స్వాతంత్ర్యసమరయోధుడు తాంతియా తోపేను కలిశాడు. ఆంగ్లేయులను ఎదిరించడంలో నవాబు హుస్సేన్ సరత్ జంగ్ చూపిన సాహసాన్ని, శౌర్యాన్నీ ప్రశంసించాడు. ఆయన మాటలు విన్న నవాబు గద్గద స్వరంతో ఎంతటి శౌర్యమున్నా ఏమి లాభం, నాలుగు దిక్కుల నుండి శత్రువు ముట్టడించి తరుముకు వస్తూన్నాడు, మనవాళ్లంతా హతమవుతున్నారు. లొంగిపోతున్నారు. నన్నూ లొంగిపొమ్మంటున్నారు. నా



సహచరులు, సైనికులు చాలా వరకు అంతమయ్యారు అని తాంతియాతోపేతో అన్నారు. ఆ పరిస్థితులలో మళ్ళీ అంగ్లేయులతో యుద్ధానికి సిద్ధమయ్యేందుకు, ప్రస్తుతానికి నేపాల్ సరిహద్దుల్లో ప్రవేశించుదామని తాంతియా తోపే సూచించాడు. ఆ విషయం అలోచిస్తూండగా, నవాబును వెంబడిస్తూన్న ఆంగ్లేయాధికారులో ఒకడైన కెప్టన్ బైరో నవాబు వద్దకు వచ్చి, మరింత ప్రాణ నష్టం జరుగకుండా సంధిచేసుకోమని నచ్చచెబుతూ ప్రయత్నాలు సాగించాడు. చివరకు సహచరుల ఒత్తిడి మీద ఆంగ్లేయులతో సంధికి సరత్ జంగ్ సిద్ధమయ్యారు.

కుటిల నీతికి మారు పేరైన ఆంగ్లేయులు సంధి షరతులను కాదంటూ, హుస్సేన్ సరత్ జంగ్ మీద తీవ్రమైన నేరాలను మోపుతూ విచారణ జరిపి దేశబహిష్కార శిక్షను విధించారు. ఈ శిక్ష విషయం ప్రజలకు తెలిస్తే ప్రజలు ఆగ్రహంతో తిరుగుబాటు చేస్తారన్న భయంతో శిక్ష విషయాన్ని రహస్యంగా ఉంచారు. నవాబును పిలిచి 24 నాలుగు గంటల్లో దేశం విడిచి వెళ్ళాలని ఆదేశించారు. ఆవిధంగా 24 గంటల సమయం విధింపు ఏమిటని నవాబు ప్రశ్నించగా, భహిష్కరణ వార్త ప్రజలకు తెలియకూడదనీ, తెలిస్తే తిరగబడగలరనీ అధికారులు చెప్పారు. ( *అజ్ఞాత వీర గాథలు* , గోవిందస్వరూప్, భారత ప్రభుత్వ ప్రచురణలు, 1999, పేజీ 8) ఈ మాటలను బట్టి ఆయన ప్రజలలో ఎంతటి ప్రేమాభిమానాలను సంపాదించుకున్నాడో అర్థం చేసుకోవచ్చు. బహ్కిరణ శిక్ష విన్పించి ఆయనను ఎక్కడకు వెడతారని ప్రశ్నించగా, మక్కా లేదా కర్బాలాకు వెడతానని సమాధానం ఇచ్చారు.

ఆ మీదట ఆయనను బొంబాయికి తరలించారు. అంతకు ముందు నవాబు భార్యాపిల్లలతో మాట్లాడాలన్న కోర్కెను వ్యక్తం చేసినా, ఆలస్యం జరిగితే ఏ అవాంతరం ముంచుకు వస్తుందోనన్న భయంతో పిల్లలతో మాత్రమే కొద్ది నిమిషాల పాటు మాట్లాడేందుకు అనుమతించారు. ఏ మైదానం నుండి కంపెనీ పాలకులను తరిమివేయమని రణనినాదం చేశారో, ఆ మైదానంలో బిడ్డలను కలుసుకున్నాడు. అనంతరం ఆయనను 1859 మే 20న మక్కాకు తరలించారు. ఈ మేరకు 31 సంవత్సరాల వయస్సుడైన తఫజుల్ హుస్సేన్ సరత్ జంగ్ కుటుంబాన్ని విడిచి, జన్మభూమి నుండి శాశ్వత బహిష్కారానికి గురయ్యాడు.

నవాబు దేశ బహిష్కరణ వార్తను పాలకులుఎంత రహస్యంగా ఉంచాలనుకున్నా అది కాస్తా బయటకు పొక్కనే పొక్కింది. ప్రజలు ఆగ్రహం వ్యక్తం చేశారు. ఆ ఆగ్రహన్ని చవిచూడాల్సి వస్తుందన్న భయంతో శిక్ష విషయాన్ని దాచి పెట్టిన ఆంగ్లేయాధికారులు గత్యంతరం లేక శిక్ష విషయాన్ని ప్రకటించారు. ఆ వార్తను 1859 జూన్ 20వ తేదిన పత్రికలు ప్రచురించాయి. ఈ వార్త ప్రజలకు పూర్తిగా తెలిసే లోపు తఫజుల్ హుస్సేన్ సరత్ జంగ్‌ను ఇండియా ఆవలకు తరలించి ఆంగ్లేయాధికారులు ఊపిరి పీల్చుకున్నారు. ఆ తరువాత ఆ స్వాతంత్ర్యసమరయోధుడు ఏమయ్యాడన్న విషయం తెలియరాలేదు. ◆

## పరదేశీయుల ఆధిపత్యాన్ని అడుగడుగునా ఎదుర్కొన్న రాకుమారుడు

# 29. షాహ్‌జాదా ఫిరోజ్ షా

బ్రిటీషర్ల వశమైన మాతృభూమిని విముక్తం చేసేందుకు సాగిన సుదీర్ఘ స్వాతంత్ర్య పోరాటం తొలిదశలో సామాన్యుల నుండి సంస్థానాధీశులు, రాజుల నుండి రాజకుమారుల వరకు పాల్గొన్నారు. ఆక్రమణదారుడు అన్ని రకాలుగా బలవంతుడు కావటం వలన నిస్సహాయ పరిస్థితులలో కొందరు కొంతకాలం మౌనాన్ని ఆశ్రయించక తప్పలేదు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోరుకున్న ప్రజలు, తెల్లవారి పెత్తందారీతనాన్ని అంగీకరించని స్వదేశీపాలకులు, అదును చూసి తిరగబడేందుకు ఎదురు చూడసాగారు. ఆ విధంగా ఎదురుచూస్తున్న ప్రజలకు, స్వదేశీ పాలక వర్గాలకు, మీరట్‌లో సింహనాదం చేసి ఢిల్లీకి నడిచిన స్వదేశీ సైనికుల చర్యలు ఉత్తేజాన్నిచ్చాయి. ఆ రకమైన ఉత్తేజాన్ని అందిపుచ్చుకుని పరాయి పాలకులను పాలద్రోలాలని, ఆంగ్లేయుల ఆధిపత్యానికి చరమగీతం పాడాలని, సుఖమయమైన జీవితాన్ని త్యజించి, తన కంఠంలో ఊపిరి ఉన్నంతవరకు బ్రిటీర్లతో పోరాడి భారత స్వాతంత్ర్యపోరాట చరిత్రలో నూతన అధ్యాయాన్ని సృష్టించాడు మొఘల్ రాజకుమారుడు ఫిరోజ్ షా.

మొఘల్ పాదుషా షా ఆలం మనుమడైన మీర్జా నిజాం భక్త్ కుమారుడు ఫిరోజ్ షా. ఆయన 1832 లో ఢిల్లీలో జన్మించారు. ఢిల్లీ చక్రవర్తి అక్బర్ షాకు ప్రత్యక్ష సంబంధీకుడు. ఆయన 1855 మే మాసంలో తల్లితో కలసి మక్కాకు వెళ్ళారు. మక్కాలో రెండు సంవత్సరాలు



గడిపి, 1857 మే మాసంలో తిరిగి ఇండియా వచ్చారు. బొంబాయి రేవులో అడుగు పెట్టారు. ఆయన స్వదేశం వచ్చేసరికి 1857 మే రెండవ వారంలో ప్రారంభమైన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ నినాదం భారతావని అంతటా ప్రతిధ్వనిస్తోంది. బ్రిటీషు బలగాల మీద సాహసోపేతంగా కలబడుతున్న తిరుగుబాటు వీరుల పదఘట్టనలు, తిరుగుబాటు నినాదాలు ఆయనకు విన్పించాయి.

ప్రజ్వరిల్లుతున్న ఆ తిరుగుబాటును మరింత ముమ్మరం గావించి బ్రిటీషర్లను తరిమి వేయాలని ఫిరోజ్ షా నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయం మేరకు 1857 జూన్ మాసంలో గ్వాలియర్ సంస్థానంలోని మాండిసోర్‌ను తిరుగుబాటు కేంద్రం చేసుకుని పోరుకు సిద్ధమయ్యారు. బ్రిటీషర్ల తొత్తు అయినటువంటి గ్వాలియర్ సంస్థానాధీశునికి ఫిరోజ్‌షా చర్యలు కంపరం కలిగించాయి. ఆంగ్లేయుల పట్ల తమకున్న ప్రభుభక్తి చాటుకునేందుకు, మాండిసోర్ వదలి వెళ్ళాల్సిందిగా సంస్థానాధీశుడు ఆయనను హెచ్చరించాడు. ఫిరోజ్‌షా నగరం బయట మకాం చేశారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా, తిరుగుబాటును ప్రోత్సహిస్తూ ప్రబోధం ప్రారంభించారు. ఈ కార్యక్రమాల నిర్వహణకు ప్రత్యేక సంస్థను ప్రారంభించారు. ఫిరోజ్ షా ప్రసంగాలు ప్రజలను ఆకర్షించాయి. మాతృభూమి కోసం ప్రాణాలు త్యాగం చేసేందుకు ప్రజలు,యువకులు,సైనికులు మొత్తం మీద18వేల మంది ముందుకు వచ్చారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వీరులు తొలిదశలో సాధించిన విజయాలు ఫిరోజ్ షా అనుచరులను ఉత్సాహపరిచాయి. బ్రిటీషర్ల మీద తిరుగుబాటుకు చిహ్నంగా 1857 ఆగస్టు 26వ తేదీన అందిన ఆయుధాలను చేతబూని ఫిరోజ్ షా నాయకత్వంలో ప్రజలు దాడిచేసి, మాండిసోర్‌ను స్వాధీనం చేసుకున్నారు. బ్రిటీష్ అధికారులను నిర్బంధించారు. ప్రజలు ఫిరోజ్ షాను రాజుగా ప్రకటించుకున్నారు. బలవంతుడైన శత్రువును పరాజితుడ్ని చేయాలంటే స్వదేశీపాలకులలో ఐకమత్యం అవసరాన్ని ఆయన గుర్తించాడు. అందువలన స్వతంత్ర రాజ్యాధినేతగా చుట్టుపక్కల గల రాజులను తనతో కలసి రావాలని కోరుతూ వర్తమానాలు పంపారు. ఆర్థిక ఇబ్బందులు ఉన్నప్పటికీ, చక్కని నిర్వహణా సామర్థ్యంతో అతి స్వల్ప కాలంలోనే మంచి సైన్యాన్ని సమకూర్చుకున్నారు. ఈ మేరకు ఆనాడు ప్రారంభమైన ఫిరోజ్ షా పోరాటం రెండు సంవత్సరాల పాటు అవిచ్ఛిన్నంగా సాగింది. విజయాలు–పరాజయాల పరంపరతో తలవంచని ఆ మొఘల్ యోధుడు ఊపిరి ఉన్నంత వరకు పోరు బాటను వీడలేదు.

పరాయి పాలకులను తరిమివేసి స్వతంత్ర పాలనను ఏర్పాటు చేసుకున్న స్వదేశీ పాలకులకు సహాయంగా ఫిరోజ్ షా ముందుకు వచ్చారు. తిరుగుబాటు బాటన సాగుతున్న కాన్పూరు, లక్నో, తదితర ప్రాంతాల తిరుగుబాటు నేతలకు సహకారం అందించేందుకు

సిద్ధమయ్యారు. తిరుగుబాటు నేతలంతా కలసి సమైక్య శక్తిగా మాత్రమే ఆంగ్లేయ సైన్యాన్ని ఎదుర్కోగలరని భావించారు. బ్రిటీష్ పాలకులు, సైనిక బలగాల మీద మీద కత్తిగట్టారు. సామాన్య ఆంగ్లేయులు తమకు శత్రువులు కాదన్నారు. ఈ మేరకు 1858 ఫిబ్రవరిలో ఆయన ఒక ప్రకటన చేశారు. అమాయక ఆంగ్లేయులను, స్త్రీలను, పిల్లలను చంపొద్దన్నారు. అమాయకులను చంపటం వలన ప్రధాన లక్ష్యసాధన ఆలశ్యం కాగలదన్నారు. నాయకుల ఆదేశాలు లేకుండా, ఇష్టానురీతిగా సాగుతున్న దాడుల వల్ల ఫలితం ఉండదని హెచ్చరించారు. ధర్మ పోరాటానికి సిద్ధం కావాల్సిందిగా పిలుపు నిచ్చారు.

ప్రజల బలంతో, స్వంత సైనికుల సాహసం ఫలితంగా జిరాన్ వద్ద బ్రిటీష్ సైన్యాలను ఆయన మట్టి కరిపించారు. ఆ తరువాత నీముచ్ కోటను దిగ్బంధించారు. ఆ సందర్భంగా ఆంగ్లేయులు తమ బలగాలను సమకూర్చుకుని మాండిసోర్‌ను తిరిగి స్వాధీనం చేసుకునేందుకు దాడి చేశారు. బ్రిటీష్ సైన్యాలను గురాడియా వద్ద ఫిరోజ్ షా ఎదిరించారు. ఆంగ్లేయుల అపార బలగాల ఎదుట నిలవటం కష్టమైపోయింది. శత్రు సైన్యాల కన్నుగప్పి ఫిరోజ్ షా తన బలగాలతో సహా యుద్ధభూమి నుండి తప్పుకున్నారు.

అనంతరం ఢిల్లీ వెళ్లి అక్కడ ఆంగ్ల సైన్యాలతో జరుగుతున్న పోరాటంలో పాల్గొనాలని భావించి, సహచరులతో సహా ఢిల్లీకి పయనమయ్యారు. మార్గమధ్యంలోనే ఢిల్లీ తిరిగి ఆంగ్లేయుల స్వాధీనమైందన్న సమాచారం అందటంతో హతాశులయ్యారు. ఢిల్లీ ప్రయాణం మానుకుని ఆగ్రా వైపుగా సాగి చివరకు రోహిల్‌ఖండ్ చేరుకున్నారు. అక్కడ ఖాన్ బహద్దూర్ ఖాన్ నాయకత్వంలో జరుగుతున్న పోరాటానికి తోడ్పడ్డారు. మీర్‌గాంచ్‌ను స్వాధీనం చేసుకున్నారు. రోహిల్‌ఖండ్ నుండి షాజహాన్‌పూర్ వెళ్ళి మౌల్వీ అహమ్మదుల్లా షా సైన్యంతో కలసి ఆంగ్లేయుల మీద పోరు సాగించారు. బ్రిటీషర్ల మీద స్వదేశీయులు ఎక్కడ తిరుగబడితే అక్కడికల్లా షాహజాదా ఫిరోజ్ షా ప్రత్యక్షమయ్యారు.ఆంగ్లేయుల తరిమివేత ప్రధాన లక్ష్యం కనుక తిరుగుబాటు నాయకులందరికీ ఆయన సహకారం అందించారు. లక్నో, రోహిల్ ఖండ్‌లు ఆంగ్లేయ సైన్యాల వశమైన తరువాత ఫిరోజ్‌షా మరోవైపుగా తన పయనం సాగించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడుతున్న నేతలు తాంతియా తోపే, రావు సాహెబ్‌లను కలిసారు. ఆ నేతల సైన్యాలతో కలసి బ్రిటీష్ సైన్యాల మీద పలు దాడులు జరిపారు. ఆ ఐక్య సైన్యాలు పలు విజయాలను సాధించాయి. రానొడ్, దానసా, షికాం, ఇంద్రాఘర్ ప్రాంతాల మీద విజయవంతంగా దాడులు చేసి కంపెనీ బలగాలను తరిమి కొట్టారు.

1859 జనవరి 14న జైపూర్ సమీపాన తిరుగుబాటు వీరులకూ, ఆంగ్లేయ సైన్యాలకూ మధ్య పోరాటం జరిగింది. సంపూర్ణ శక్తి యుక్తులను కూడ గట్టుకుని పోరాటం





సాగించారు. భయంకరంగా సాగిన ఈ పోరాటంలో తిరుగుబాటు యోధులు పలువురు నేలకూలసాగారు. ఫిరోజ్ షా బలగాలు తగ్గిపోయాయి. ఆంగ్లేయ సైనికులు అన్నివైపుల నుండి చుట్టుముట్టి, ఎలాగైనా నాయకులను పట్టుకోవాలని పలు విధాల ప్రయత్నిస్తున్నాయి. ఒక వైపు తిరుగుబాటు వీరులు పెద్ద సంఖ్యలో నేలకొరుగుతుండగా, మరో వైపు ఆయుధాలు, మందుగుండు సామాగ్రి తరిగిపోసాగింది. శత్రువు బలాన్నీ, బలగాన్నీ గమనించిన నాయకులు, సాహసంతో ముందు కెళ్ళి సహచరులను బలిపెట్టేకంటే, రణరంగం నుండి తాత్కాలికంగా తప్పుకుని తిరిగి యుద్ధానికి దిగటం మంచిదని భావించారు. తాంతియాతోపే తోపాటుగా ఫిరోజ్ షా అటవీ ప్రాంతంలోకి తప్పుకున్నారు. ఆ అడవుల్లో ఫిరోజ్ షా, తాంతియా తోపేలు తిరుగుబాటు భవిష్యత్తు గురించి చర్చించారు. స్వదేశీ బలగాలకు, తమతో కలసి వచ్చే విదేశీ బలగాలు కూడా తోడైతే తప్ప తిరుగబాటు విజయం కాజాలదని నాయకులు భావించారు. ఆ ప్రయత్నాలలో భాగంగా తమ ప్రయత్నాలను తాము చేసేందుకు నాయకులు తలోదారి ఎన్నుకున్నారు. సన్నిహిత సహచరులతో కలసి షిరోజ్ షా రాజస్థాన్‌లోని సిరోంజ్ అటవీ ప్రాంతానికి చేరుకున్నారు.

ఆ పాటికి భారతావనిలో తిరుగుబాటు పోరాటాలు సన్నగిల్లాయి. ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలన కూడా ముగిసింది. బ్రిటీష్ రాణి విక్టోరియా పాలన స్వీకరించింది. 1858 నవంబరులో ఆమె ఒక ప్రకటన చేసింది. తిరుగుబాటు నాయకులు లొంగిపోతే క్షమాభిక్ష ప్రసాదిస్తానంది. ప్రజలను, స్వదేశీ పాలకులను లొంగదీసుకునేందుకు పలు వాగ్దానాలు చేసింది. ప్రలోభాలకు గురిచేసింది. ఆ ప్రకటనల ఫలితంగా పలువురు పోరు బాట నుండి తప్పుకున్నారు. గత్యంతరం లేని పరిస్థితులలో కొందరు నేపాల్ అడవుల్లోకి తప్పుకున్నారు. స్వతంత్రత ప్రకటించుకున్న చాలా ప్రాంతాలు తిరిగి ఆంగ్లేయుల స్వాధీనంలోకి వచ్చేశాయి. మాతృ భూమి విముక్తి కోసం పోరాడిన వీరపుత్రులు వేలాదిగా ప్రాణాలు కొల్పోయారు. ఉరితీతలకు బలయ్యారు. నిర్బంధాలకు గురయ్యారు.

ఈ ప్రతికూల పరిస్థితులేవీ ఫిరోజ్ షాకు నిరాశ కల్గించలేదు. సిరోంజ్ అడవుల్లో తలదాచుకున్న ఫిరోజ్‌షా మళ్ళీ పోరుకు తయారు కాసాగారు. రాణి చేసిన ప్రకటనను దృష్టిలో ఉంచుకుని పోరాటం విరమించటం ఉత్తమమని కొందరు ఉద్బోధించారు. ఆగ్రాకు చెందిన డాక్టర్ నజీర్‌ఖాన్ షెహజాదా ఫిరోజ్ షా తరుపున మధ్యవర్తిగా వ్యవహరించాడు. 1859 జూన్ 4వ తేదీన విక్టోరియా రాణి ప్రతినిధికి ఆయన లేఖ పంపారు. ఆ లేఖలో భరణం సంగతేంటని ప్రశ్నిస్తూ, తనకు సంపూర్ణ స్వేచ్ఛ కావాలన్నారు. స్వతంత్రుడనైన తాను ఎక్కడికి వెళ్ళినా అవరోధాలు ఉండరాదన్నారు. ఆయన అనుచరుల ఆయుధాలను స్వాధీనం చేసుకోరాదన్నారు. ఆ లేఖను పంపి ఒకవైపున సంప్రదింపులు సాగిస్తూ, పాలకులను

ఏమార్చి, మారువేషంలో రహస్యంగా ఆఫ్ఘనిస్తాన్ వెళ్ళిపోయారు.

ఆ విధంగా దేశం నుండి అదృశ్యమైన ఫిరోజ్ షా బ్రిటీషర్లకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటానికి మధ్య ఆసియా, పశ్చిమ దేశాల అధినేతల సహకారం కోరుతూ పర్యటనలు గావించారు. చివరకు 1860 నాటికి ఫిరోజ్ షా కాందహార్ చేరుకుని, అక్కడ నుండి 1862 లో టెహరాన్ వెళ్లారు. మార్గమధ్యంలో పలువురు రాజులను కలసి తమ పోరాటానికి సహాయం కోరారు. చిన్నపాటి సహచరుల దళంతో సంచారం సాగించారు. అతి కష్టం మీద సేకరించిన ధనంలో ఆయుధాలను సమకూర్చుకునేందుకు లక్ష రూపాయలను అమెరికాకు పంపారు. తుపాకులు అందకపోవటమే కాదు అక్కడకు పంపిన ధనం కూడా ఏమైందో ఆ తరువాత అంతుపట్టకుండా పోయింది.

ఈ లోగా ఫిరోజ్‌షా ప్రయత్నాలను తెలుసుకున్న బ్రిటీష్ ప్రభుత్వం సరిహద్దు దేశాధినేతలకు లేఖలు రాసి ఫిరోజ్‌కు సహకరించ వద్దని కోరింది. ఫిరోజ్ షా మీద గట్టి నిఘా ఏర్పాటు చేసి, ఆయన కదలికలను గమనించసాగింది. బ్రిటీషర్ల కన్నుగప్పి కార్యకలాపాలు సాగించటం ఫిరోజ్‌కు కష్టమైపోయింది. ఆర్థిక ఇబ్బందులు చుట్టుముట్టాయి. విరామమెరుగక సాగుతున్న సంచారం వలన సరైన ఆహారం, తగినంత విశ్రాంతి కరువు కావటంతో అనారోగ్యంతో పాటుగా, కంటిచూపు తగ్గింది. రోజురోజుకు బలపడుతున్న బ్రిటీష్ సామ్రాజ్య వాదుల బలాన్ని ఎదుర్కోవటం ఆయనకు అసాధ్యమైంది. బలపడిన సామ్రాజ్యవాద శక్తుల ఆదేశాలను కాదని ఫిరోజ్‌కు సహాయపడగల స్వతంత్ర శక్తులు లేకుండా పోయాయి. చిగురంత ఆశను కల్గించే వాతావరణం కరువయ్యింది. అనారోగ్యం బాధిస్తుండగా చివరకు ఆయన 1875లో మక్కా చేరుకున్నారు.

శత్రువు మీద పోరుకు బలగాలను కూడగట్టుకోడానికి దేశం వదలి వెడుతున్నప్పుడు భార్య తుకలాంబా బేగంకు ఎటువంటి ఆపదరాకూడదని బావిచిన ఫిరోజ్‌షా ఆమెకు విడాకులు ఇచ్చారు. అయినా భర్తే సర్వస్వం అనుకున్న ఆమె ఫిరోజ్ షా కోసం అన్వేషణ సాగించి, ఓ డచ్ నావికుని సహాయంతో ఫిరోజ్ షా తలదాచుకున్న ఆదాన్ చేరుకుంది. ఆ రాచ దంపతులను అక్కడ ఆదుకునే వారు కరువయ్యారు. భార్యాభర్తలకు తిండీ బట్టా కరువైపోయింది. అ దుర్భర పరిస్థితులలో కూడా ఫిరోజ్ షా ఆంగ్లేయ వ్యతిరేక చర్యలు మానలేదు. ఈ మేరకు ఆయన సాగించిన ఆ అవిశ్రాంత శ్రమ వలన చివరకు ఆయన కళ్ళేకాకుండా కాళ్ళు కూడా సహకరించటం పూర్తిగా మానేశాయి. ప్రతికూల పరిస్థితులు చుట్టుముట్టడంతో మాతృదేశాన్ని వదిలి పరదేశంలో తలదాచుకోవాల్సిన దుస్థితి ఆయనను బాగా కుంగదీసింది. మాతృదేశం పూర్తిగా పరదేశీయుల వశమైపోయిందన్న చింత ఆయన ఆరోగ్యాన్ని మరింత దెబ్బతీసింది.







భర్త ఆరోగ్యం కుదుటపడాలని ప్రార్థిస్తున్న ఫిరోజ్ షా భార్య.

ఆ వ్యధ నుండి ఆయన కోలుకోలేరు. చివరకు 1877 డిసెంబరు 8వ తేదీన మొఘల్ రాకుమారుడు ఫిరోజ్ షా తన 45 సంవత్సరాల వయస్సులో మక్కాలో అంతిమ శ్వాస విడిచారు. చరిత్రలో ఫిరోజ్ షా పేరు ఎక్కడా వినిపించ కూడదనీ, ప్రజల హృదయాల నుంచి ఆయన పేరు చెరిగిపోవాలనీ, ఆదేశిస్తూ బ్రిటీష్ పాలక వర్గాలు ఎంతటి కుశ్చితాలకు పాల్పడినా, ఫిరోజ్ షా పేరును ప్రజల హృదయాల నుండి తుడిచివేయటం సాధ్యం కాలేదు.

మొగల్ రాజకుమారుడు ఫిరోజ్ షా సాగించిన పోరాటాలనూ, సాహసకృత్యాలను ప్రముఖ చరిత్రకారుడు తారా చంద్ తన గ్రంథం *History of The Freedom Movement In India.* Vol.2 ( Page 101 ) లో ఈ విధంగా ప్రసంశించాడు.

'.. The royal house of Delhi gave to the cause a representative not unworthy of its noble traditions. Though young in age - for he was in twenties when the revolt broke out- Prince Firoz Sha was a born leader of men. .. Although in dire circumstances, he refused to barter self-respect, personal liberty, or the claims of his house for life in durance vile and humilating. He had been an intrepid fighter, and his faith in the destiny of his country remained unshaken till the end. He died in exile. .' ◆

ప్రాణాలొడ్డైనా పరదేశీయులను పాలద్రోలాలని తపించిన

# 30.మీర్ మహమ్మద్ హసన్ ఖాన్

ప్రథమ భారత స్వాతంత్ర్యసమరంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ప్రముఖ పాత్ర వహించింది. ఈ రాష్ట్రంలో జరిగిన తిరుగుబాట్లకు నానాసాహెబ్, తాంతియాతోపే, మౌల్వీ అహమ్మదుల్లాషా, ఝాన్సీ రాణి లక్ష్మీబాయి, అవథ్ బేగం హజరత్ మహల్, రోహిల్‌ఖండ్ నేత ఖాన్ బహుదూర్ ఖాన్ లాంటి ప్రముఖులు ప్రధానంగా నాయకత్వం వహించారు. ఈ నేతలంతా ఆయా ప్రాంతాలకు రాజులు, రాణులు కనుక తమతమ రాజ్యాల నుండి పరదేశీయులను తరిమి కొట్టడానికి నడుంకట్టటం సహజం. ఆ పాలకుల పట్ల గల గౌరవాభిమానాల దృష్ట్యాగానీ, పురటిగడ్డ పట్ల గల ప్రేమాభిమానాల వలన గాని ఆయా నేతల సిపాయిలతో పాటుగా సామాన్య ప్రజలు కూడా ఆయుధాలు చేపట్టారు. ఆనాడు ప్రజలంతా తమ రాజ్యాలను తమ ప్రియతమ పాలకులు మాత్రమే పాలించాలని కోరుకుంటూ ముందుకు సాగారు. ఈస్ట్ ఇండియా కంపెనీ అపహరించిన తమ రాజ్యాధీశుల సింహాసనాలను తిరిగి కైవసం చేసుకోవాలన్న లక్ష్యంతో ఆయుధం చేపట్టి కదనరంగానికి కదలిన యోధులలో మీర్ మహమ్మద్ హసన్ ముఖ్యులు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అయోధ్య నవాబు రాజ్యంలో గోరఖ్‌పూర్ ఒక సంస్థానం. శ్రీహన్మంత్ సింగ్ ఆసంస్థానానికి అధిపతి.ఆ సంస్థానాధీశుని వద్ద‘ మంత్రి ’ గా హసన్ ఖాన్ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. అయోధ్య నవాబు వాజిద్ అలీషా ఈస్ట్ ఇండియా కంపెనీతో



సత్సంధాలు కలిగియున్నా, సామ్రాజ్య విస్తరణ కాంక్షతో రగిలిపోతున్న కంపెనీ పాలకులు, అవమానకరమైన రీతిలో ఆయనను పదవీచ్యుతుని చేసి, మాయమాటలతో కలకత్తా పంపి నిర్బంధించారు. ఫలితంగా అయోధ్యలో భాగమైన గోరఖ్‌పూర్ కంపెనీ పాలక క్రిందకు వచ్చేసింది. అ కారణంగా శ్రీహన్మంత్ సింగ్ సంస్థానాన్ని కోల్పోయారు. ఈ పరిస్థితులను, మహమ్మద్ హసన్ ఖాన్ సహించలేకపోయారు.

సమయం కోసం ఎదురు చూస్తున్న ఆయనకు మీరట్‌లో రగిలిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఉత్సాహాన్నిచ్చింది. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులపై ఆయోధ్య నవాబు భార్య బేగం హజరత్ మహల్ పూరించిన సమర శంఖారావం ఆయనలో ఆత్మవిశ్వాసం కలిగించటంతో గోరఖ్‌పూర్‌లో మహమ్మద్ హసన్‌ఖాన్ తిరుగుబాటు పతాకాన్ని ఎగురవేశారు. స్వతంత్ర్య రాజ్యాన్ని ప్రకటించారు. స్వదేశీ సిపాయిలకు తోడుగా గోరఖ్‌పూర్ వాసులతో సైన్యాన్ని తయారు చేసుకున్నారు. ప్రముఖ చరిత్రకారుడు తారాచంద్ ప్రకారం ఆయన వెంట 12వేల మంది సైనికులున్నారు. గోరఖ్‌పూర్‌లో నున్న ఆంగ్లేయులకు తాము వ్యతిరేకం కాదనీ, అసలు తిరుగుబాటు వ్యక్తిగతమైంది కానే కాదన్నారు. ఈ పోరాటం దేశవాసుల ఉమ్మడి ప్రయోజనాల కోసం మాత్రమే ప్రారంభించామన్నారు. అయోధ్య గద్దె మీద నవాబును, గోరఖ్‌పూర్ సంస్థానంలో శ్రీహన్మంత్ సింగ్ పాలనను చూడాలన్నది తమ ప్రధానాశయం అన్నారు. ఆ లక్ష్యం కోసం తన ప్రాణాలను ఫణంగా పెట్టేందుకు సిద్ధమయ్యారు.

ఈ మేరకు హసన్ ఖాన్ స్వతంత్ర పాలన ప్రజారంజకంగా నాలుగు మాసాల పాటు సాగింది. ఒక చిన్న సంస్థానంలోని ‘ నాజిమ్ ’ ప్రజలతో కలసి తిరుగుబాటు చేయటం, స్వతంత్ర పతాకాన్ని ఎగురవేసి, కంపెనీ పాలనకు సవాల్ విసరటాన్ని కంపెనీ పాలకులు జీర్ణం చేసుకోలేకపోయారు. బలగాలను సమీకరించుకుని 1857 నవంబరు 24వ తేదీన గోరఖ్‌పూర్ మీద దాడి చేశారు. మహమ్మద్ హసన్ ఖాన్ నాయకత్వంలో తిరుగుబాటు వీరులు ఎంతగా పోరాడినా, చివరకు ఆంగ్లేయులకే విజయం లభించింది. విజయం కంటే మహమ్మద్ హసన్ ఖాన్‌ను సజీవంగా పట్టుకోవటం ప్రతిష్టాకరంగా కంపెనీ సైన్యాధికారులు భావించారు.

ఆ ప్రతికూల పరిస్థితులను గ్రహించిన మహమ్మద్ హసన్ అనుచరులు తమ ప్రాణాలను పణంగా పెట్టి, ఆయనను కదన రంగం నుండి తప్పించారు. ఆ విధంగా కంపెనీ సైన్యాధికారుల కంటపడకుండా తప్పించుకుని నేపాల్ పర్వత ప్రాంతాలకు ఆయన చేరుకున్నారు. అక్కడ అజ్ఞాతంగా గడుపుతూ, తిరిగి దాడులు చేసేందుకు బలగాల సమీకరణ ప్రయత్నాలలో నిమగ్నమయ్యారు. ఆర్థిక పరిస్థితులు దారుణంగా ఉండటంతో యత్నాలు అనుకూలించలేదు.

ఆ సమయంలో ఆయన సన్నిహిత మిత్రుడు షేఖ్ ఖైరుద్దీన్ నుండి ఆయనకు ఒక లేఖ వచ్చింది. షేక్ ఖైరుద్దీన్ గోరఖ్‌పూర్ సంస్థానంలో డిప్యూటీ మెజిస్ట్రేట్. మహమ్మద్ హసన్ ఖాన్, షేక్ ఖైరుద్దీన్‌లు ప్రాణమిత్రులు. ఆయన కూడా తిరుగుబాటును ప్రోత్సహించారు కాని తిరుగుబాటులో పాల్గొనలేదు. అజ్ఞాతంలో అష్టకష్టాలు పడుతున్న మిత్రుని పరిస్థితులను తెలుసుకుని వ్యథ చెందాడు. కంపెనీ పాలకులను సవాల్ చేసిన తన మిత్రుడు అడవుల్లోనే ఉన్నందున ఆయన కోసం గాలిస్తున్న కంపెనీ సైనికులు గానీ, బ్రిటీషర్ల తొత్తుగా వ్యవహరిస్తూన్న జంగ్ బహుదూర్ సైనికులు గాని హసన్ ఖాన్‌ను హతమార్చే అవకాశం ఉందనుకుని మిత్రుడ్ని కాపాడాలనుకున్నాడు. హసన్ ఖాన్ వ్యక్తిగతంగా హింసకు పాల్పడలేదన్న అంశం ఆయనను కాపాడటానికి ఉపయోగపడగలదని భావించాడు. ఈ మేరకు ఆయన అడవుల్లో ఉన్న హసన్‌కు ఒక లేఖ రాసి పంపాడు. **మన ఆశయం నెరవేలేదు. పోరాటంలో ఓడిపోయాం. ఆంగ్లేయులకు విజయం లభించింది. మన ఉద్యమాన్ని అణచివేశారు. కంపెనీ పాలన కూడా పోయింది. ప్రస్తుతం భారతదేశం బ్రిటన్‌లో భాగమయ్యింది. ఆ దేశం రాణి విక్టోరియా, మన దేశానికిప్పుడు మహారాణి. ఆ రాణి చేసిన రాజ్యప్రకటనలో లొంగిపోయిన వారందరికీ క్షమాభిక్ష ప్రకటించారు. నీవు వ్యక్తిగతంగా ఆంగ్లేయులను హత్యచేయలేదు. కల్నర్ లెనోక్స్ లాంటి వాళ్ళను కాపాడావు. నీవు లొంగిపోతే ఏ హానీ జరుగదు. అందువల్ల తక్షణం లొంగిపొమ్మని**, కోరాడు. (*Eighteen Fifty Seven*, Surendra Nath Sen, Govt. of India Publications, New Delhi, 1957, Page 364-66 and 389-91) మహ్మద్ హసన్ ఖాన్ మిత్రుని లేఖను జాగ్రత్తగా పరిశీలించాడు. గతంలో కంపెనీ పాలకులైన బ్రిటీషర్లు, స్వదేశీయుల పట్ల వ్యవహరించిన తీరుతెన్నులను బేరీజు వేసుకున్నారు. నమ్మశక్యం కాని బ్రిటీషర్ల ప్రవర్తన దృష్ట్యా పోరాటం తప్ప, లొంగిపోవటం కుదరదనుకున్నారు.

ఈ మేరకు ఖైరుద్దీన్ లేఖకు సమాధానం రాసి పంపారు. ఆ సుదీర్ఘమైన లేఖలో **అయోధ్య నవాబు ఎడల ఎలా ప్రవర్తించారో చూడలేదా? అయన రాజ్యాన్ని ఎంత దుర్మార్గంగా అపహరించారో, నవాబును ఎలా తొలగించారో తెలియదా? అయోధ్య పాలకులెన్నడూ ఆంగ్లేయుల పాలనను వ్యతిరేకించలేదు. ఎల్లప్పుడూ వారికి విధేయతనే ప్రకటించారు గదా?...అందువల్ల హిందూస్థానంలోని రాజులు, సంస్థానాధిపతులు, సిపాయిల తిరుగుబాటును అవకాశంగా తీసుకుని తిరుగబడ్డారు. అయోధ్య నవాబు సేవకులుగా, విధేయులుగా ఆ రాజ్యాన్ని నిలబెట్టటానికి పూనుకున్నాం. అది మన కర్తవ్యం. దేశంలో కాలు మోపి సుస్థిరతను పొందాలనుకునే వాళ్ళను ఎదుర్కొన్నాం, అది నా భాగ్యంగా భావిస్తున్నాను. అలా చేయకపోతే ఈ లోకంలో, పరలోకంలో కూడా ద్రోహిగా నా ముఖం మీద నల్లగుడ్డ కప్పుకోవాల్సి వుంటుంది**, అని ఆ లేఖలో తన మనోభావాలను హసన్‌ఖాన్





స్పష్టంగా వ్యక్తీకరించారు. అంతేకాదు, **నిజమే నేను ఆంగ్లేయులను హత్య చేయలేదు. ఆటువంటి దాన్ని ప్రోత్సహించలేదు. ఆంగ్లేయ అధికారులు, సైనికులు అమాయకులైన స్త్రీలు, గుడ్డివారు, బికారులు అనే విచక్షణ లేకుండా ఊచకోచ కోశారు. ఆస్తులు దోచుకున్నారు. ప్రజల నివాసాలు ధ్వంసం చేశారు.** (Ibid Pages 364-66 and 389-91) అని తన లేఖలో ఆనాడు కంపెనీ పాలకులు, సైనికులు జరిపిన రాక్షస కృత్యాలను వివరించారు. ప్రజలపై దుర్మార్గాలకు పాల్పడిన బ్రిటీషర్ల పై పోరాటం సాగించకుండా మిన్నకుండిపోవాలా? అంటూ మిత్రుడ్ని ప్రశించారు. పట్టుబడతానన్న భయంగానీ, చనిపోతాన్న చింతగానీ తనకు లేదన్నారు. చావు ఎవ్వరికైనా ఎప్పుడుడైనా తప్పదు. ఆ చావు సత్కార్యం కోసం సంభవిస్తే అంతకంటే ఆనందం ఏముంటుందన్నారు.

మహమ్మద్ హసన్ ఖాన్ సమాధానం చూసి ఖైరుద్దీన్ కంగారు పడ్డాడు. మిత్రుని అభిప్రాయలు ప్రశంసించదగినవిగా ఉన్నా, ఆ పట్టుదల వలన ఆయనెక్కడ బ్రిటీషర్ల చేతచిక్కి చిక్కి ప్రాణాలు పోగొట్టుకుంటాడోనన్న భయం పట్టుకుంది. ఆయనకు నచ్చచెప్పేందుకు మరొక లేఖ రాసాడు. ఆ లేఖలో **ఆయోధ్య రాజ్యాన్ని తిరిగి నవాబుకు అప్పగించాలనీ, గతంలో చేసుకున్న ఒప్పందాలను అమలు జరపాలనీ, ఇక ముందు రాజ్య విస్తరణకు పూనుకోమని ప్రకటించాలనీ నీవు వెలిబుచ్చిన అభిప్రాయాలు, షరతులు, నీ ఆశలు తప్ప అవి అమలు జరిగేవి కావు. ప్రభుత్వం అక్రమించుకున్న రాజ్యంలో ఒక్క 'బిగా' కూడా వదలుకోదు. అనవసరమైన వాదనకు స్వస్తి చెప్పి నీ విషయం నీవు ఆలోచించుకో సమయం మించక ముందే లొంగిపోయి ప్రాణాలు కాపాడుకో**, మని కోరాడు. (Ibid Pages 364-66 and 389-91)

మిత్రుడు ఎన్ని విధాల నచ్చచెప్పినా తిరుగుబాటు వీరుడు మహమ్మద్ హసన్‌ఖాన్ లొంగిపోవటానికి ససేమిరా ఇష్టపడలేదు. మిత్రుని ధోరణి చూసి ఖైరుద్దీన్ ఆందోళన పడ్డాడు. మహమ్మద్ హసన్ తో కలసి తిరుగుబాటులో పాల్గొన్న శంకరపూర్, గోండ, బిస్వా తదితర ప్రాంతాల తిరుగుబాటు నాయకులు ద్వారా కూడా ఆయనకు లేఖలు రాయించాడు. ప్రతికూల వాతావరణాన్ని వివరిస్తూ ఆశయాల సాధన ఎంతటి అసాధ్యమో ఆద్యంతం వివరిస్తూ లేఖలు రాసాడు. శత విధాల ప్రయత్నించాక, మిత్రుల, సన్నిహితుల ఒత్తిడి మేరకు మహమ్మద్ హసన్ ఖాన్ లొంగిపోటానికి అంగీకరించాడు. అజ్ఞాతవాసం నుండి ఆయన బయటకు వచ్చారు. ప్రభుత్వం విచారణ ప్రారంభించింది. వ్యక్తిగతంగా ఎవ్వరినీ హత్య చేయకపోవటం, అంతకు మించి తిరుగుబాటు సమయంలో ఆంగ్లేయ అధికారుల కుటుంబీకులను సురక్షిత ప్రాంతాలకు పంపివేయటం తదితర అంశాలను పరిగణలోకి తీసుకోవాలని ఆయన మిత్రులు ప్రభుత్వాన్ని కోరారు.









**మిత్రుడు ఖైరుద్దీన్‌కు మహ్మద్ హసన్ రాసిన లేఖ ప్రతి**

ఆ ప్రయత్నాల ఫలితంగా, ఆనాటి విపత్కర పరిస్థితులలో హసన్ తన కుటుంబానికి ప్రాణభిక్ష పెట్టిన తీరును వివరించి, ఆయనను నిర్దోషిగా విడుదల చేయాలనీ, ఆయనకు భరణం ప్రకటించాలనీ ఆంగ్లేయాధికారి కల్నర్ లెనోక్స్ ప్రభుత్వానికి సిఫార్సు చేశాడు. ఆ సిఫారస్సులను గోరఖ్‌పూర్ కమీషర్ తీవ్రంగా వ్యతిరేకించాడు. ' పెప్పే ' అను ఆంగ్లేయుడి హత్యతో హసన్‌కు సంబంధం ఉందని అతను ఆరోపించాడు. ఆ ఆరోపణల మీద విచారణ ప్రారంభమైంది. మహమ్మద్ హసన్‌ఖాన్ ముద్దాయిగా నిలవాల్సి వచ్చింది. విచారణ సాగుతున్న సమయంలో ఎవ్వరూ ఊహించని విధంగా హత్యకు గురయ్యాడనుకున్న ' పెప్పే ' సజీవంగా ప్రత్యక్షమయ్యాడు. ప్రభుత్వం హసన్‌ను నిర్దోషిగా ప్రకటించింది. మిత్రుల ప్రయత్నాలు ఫలించాయి. అసమాన ధైర్యసాహసాలతో తిరుగుబాటును నడిపి, ప్రాణం కంటే స్వతంత్ర పాలన ప్రధానమని ప్రకటించిన మహమ్మద్ హసన్ ఖాన్ భారత చరిత్రలో చిరస్మరణీయమైన స్థానాన్ని సొంతం చేసుకున్నారు. ◆



## స్వయంగా కత్తిపట్టి కదనరంగానికి కదలిన ధార్మికవేత్త

# 31. మౌల్వి సయ్యద్ అల్లావుద్దీన్

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో ఉత్తర భారత దేశంలోని ధార్మిక నాయకులు ఏవిధంగానైతే, ప్రజలను, స్వదేశీ సైనికులను బ్రిటీషు పాలకులకు వ్యతిరేకంగా విజృంభించమని ప్రోత్సహించారో, అదే విధంగా దక్షిణ భారతదేశంలోని మౌల్వీలు ప్రజలను ఉత్తేజితులను చేశారు. అత్యంత ధైర్యసాహసాలతో, ప్రాణాలను తృణప్రాయంగా భావించి బహిరంగంగా తిరుగుబాటు కార్యకలాపాలను ప్రోత్సహించటం మాత్రమేకాదు తిరుగుబాటు దళాలను ముందుండి నడిపించారు. ఈ మేరకు దక్షిణ భారత దేశంలో బలమైన సంస్థానమగు నైజాంలో తిరుగుబాటుకు ప్రజలను ప్రతిస్పందింపచేయటంలో ధార్మికవేత్తలు ప్రయత్నించారు. నైజాం నవాబు లాంటి బలమైన సంస్థానాధీశులు ఆంగ్లేయులకు అండగా ఉన్నప్పటికి తిరుగుబాటు జ్వాలల వేడిని ఆంగ్ల అధికారులు చవిచూడాల్సి వచ్చిందంటే, తిరుగుబాటు యోధులు ఎంతటి దృఢ నిశ్చయంతో ముందుకు సాగారో తెలుస్తుంది. ప్రజలను తిరుగుబాటు యోధులను ప్రోత్సహించటమే కాకుండా స్వయంగా పోరాటంలో అగ్రభాగాన నిలచిన ధార్మిక నేతలో మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ ఒకరు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని, పూర్వ నైజాం సంస్థానం హైదరాబాదు మౌల్వీ అల్లావుద్దీన్ నివాస స్థలం. ఆయన జననం, తల్లి తండ్రుల వివరాలు, బాల్యం గురించిన సమాచారం అందుబాటులో లేదు. 1857లో హైదరాబాదు రెసిడెన్సీ మీద జరిగిన దాడి





సంఘటన నుండి ప్రారంభమై అండమాన్ దీవులలోని జైలులో ఆయన అంతిమ శ్వాస విడిచేంతవరకు వివరాలు తెలుస్తున్నాయి.

1857కు ముందే బ్రిటీషు పాలకుల పెత్తనానికి వ్యతిరేక భావనలు నైజాం ప్రాంతంలో మాత్రమే కాదు నైజాం రాజధాని హైదరాబాదులో కూడా పొడచూపాయి. బ్రిటీషర్లతో నిజాం నవాబు ఒప్పందానికి వచ్చాక, ఆంగ్లేయులకు ' జో హుకుం ' అనటం సహించలేని ప్రజలు, రాజవంశీకులు ఏదోకారణంగా తిరగబడుతూనే వచ్చారు. ఆంగ్ల అధికారుల అహంకారం, అతిశయించిన పెత్తనాన్ని సహించని సైనికులు ప్రారంభ నుండీ అసంతృప్తిని వెల్లడిస్తూనే వచ్చారు. ఈ అంసంతృప్తిని అణిచివేయడానికి ఎంతగా ప్రయత్నించినా పాలక వర్గాలకు సాధ్యంకాలేదు. చివరకు నిజాం సికిందర్‌ఝా దర్బారులోని నూరుల్ ఉమ్రా ఆనాటి అసంతృప్తి సిపాయిలకు నాయకత్వం వహించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పద్దతులు,పెత్తనం నచ్చని వారు నూరుల్ ఉమ్రా సైన్యంలో చేరారు. ఈ పరిస్థితులను గమనించిన ఆంగ్లేయాధికారులు కఠినంగా వ్యవహరించటమే కాకుండా, నిజాంను కూడ ప్రభావితుడ్ని చేసి, నిజాం దర్బారులోని ప్రముఖుడైన నూరుల్ ఉమ్రా పదవిని ఊడగొట్టారు. 1812 ప్రాంతంలో హైదరాబాదు నగరంలోని బ్రిటీషు రెసిడెన్సీకి చెందిన సిపాయిలు తిరుగుబాటు చేశారు. ఆంగ్ల సైనికాధికారి మేజర్ ఎడ్వర్డ్ గోర్డన్‌ను శతఘ్నికి బంధించి, తమ తిరుగుబాటును మన్నిస్తాననీ, సిపాయిలకు వేతనాలు యథావిధిగా చెల్లిస్తాననీ హామీ ఇవ్వకపోతే శతఘ్నిని పేల్చివేస్తామని బెదిరించారు. ఈ సందర్భంగా నిజామాబాద్, నాందేడ్, పర్భనీ, బేరూర్, సిరివంద, మహదేవపూరు ప్రాంతాలలో కూడా తిరుగుబాట్లు రచ్చకెక్కాయి. ఆ తరువాత సిపాయిలకు హామీలిచ్చి ప్రాణం కాపాడుకున్న మేజర్ గోర్డన్ తిరుగుబాటు నాయకులందర్నీ ఉరికంబాలెక్కించాడు.

1838లో నైజాం సందర్శించిన వహాబీ నేతలు మౌల్వీ విలాయత్ అలీ, సలీం అలీల ప్రభావం వలన బ్రిటీషు వ్యతిరేక వహాబి ఉద్యమానికి బలమైన బీజాలు పడ్డాయి. నిజాం వంశజుడు ముబారిజుద్దౌలా (గోహర్ అలీ ఖాన్) బ్రిటీషు వారికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటం ప్రారంభించారు. 1839లో ఆంగ్లేయుల అధిపత్యాన్ని ప్రశ్నించినందుకు 1840లో ఆయనను గొల్కొండ కోటలో బంధించారు. ఆ కోట జైలులో 14 సంవత్సరాలు గడిపిన ముబారిజుద్దౌలా 1854లో కన్నుమూసాడు. గోహర్ ఖాన్ ప్రోద్భలంతో కర్నూలు నవాబు గులాం రసూల్ ఖాన్ బ్రిటీషర్ల మీద పోరాటానికి సన్నద్ధులయ్యారు. ఆ విషయం తెలిసి కర్నూలులో సైనిక బలగాలు దిగాయి. స్వల్పఘర్షణ తరువాత, రసూల్ ఖాన్‌ను బ్రిటీషర్లు బంధించి, కర్నూలు సంస్థానాన్ని మద్రాసు ప్రెసిడెన్సీలో విలీనం చేశారు.

బ్రిటీషు పాలకుల పట్ల వ్యతిరేకంగా ఉత్తరాదిలో బలంగా వీస్తున్న తిరుగుబాటు

పవనాలు దక్షిణాదిని కూడా అతి త్వరలోనే తాకాయి. ఆంగ్లేయుల పెత్తనాన్ని సహించని కొందరు వారి నైతిక స్థైర్యాన్ని దెబ్బతీసేందుకు, వారంతా ప్రాణభయంలో పారిపోయేలా చేయడానికి కూడా భయం గొలిపే అంశాలను ప్రచారంలో పెట్టారు. ఆంగ్లేయ అధికారులతో స్నేహం నటిస్తూ, '.. **నైజాం సంస్థానంలోని మంత్రులు, ఉన్నతాధికారులు తేనేపూసిన కత్తుల్లా వ్యవహరించేవారు. పైకి ఎంతో స్నేహపూరితంగా ఉంటూనే..మీరు ఇక్కడ నుండి వెళ్ళి పోండి...ఇక్కడ పరిస్థితులు అంత బాగా లేవు. మీ ప్రాణాలకు ముప్పు ఏర్పడవచ్చు**...' ( *1857 తెలుగునాట తిరుగుబాటు*, డాక్టర్ మహంకాళిరావు, నవయుగభారతి ప్రచురణలు, భాగ్యనగర్, 2001, పేజీ 17) అని ప్రకటిస్తూ అధికారులను అదరగొట్టేవారని బ్రిటీషు సైనికాధికారి మేజర్ హెచ్.సి. బ్రిగ్స్ వివరించాడు.

ప్రస్తుత సికింద్రాబాదు, ఆనాటి బొల్లారం వద్ద ఉన్న బ్రిటీషర్ల సైనిక స్థావరం 1855లో అతలాకుతలం అయ్యింది. ఆ సంవత్సరం మోహర్రం పండుగ ఆదివారం నాడు వచ్చింది. ఆరోజున ఎటువంటి ఊరేగింపులు జరుపరాదని బ్రిగేడియర్ మెకంజీ ఆదేశాలు జారీచేశాడు. ఆ ప్రాంతంలో మొహర్రం పండుగ మత, కులాల ప్రసక్తి లేకుండా ప్రజలంతా కలసి జరుపుకుంటారు. ఈ పండుగ రోజున మేళతాళాలతో ఊరేగింపు ఉండటం సహజం. ఈ వాతావరణానికి అవకాశం కల్పించకుండా, అధికారులు ఉత్తర్వులు జారీచేయటంతో ప్రజలలో ఆగ్రహం కట్టలుతెగింది. బ్రిటీషు కంటింజెంటు సైన్యంలోని హవల్దార్ గులాం ఖాదిర్ ఆవేశంలో బ్రిగేడియర్ మెకంజీని కత్తితో పొడిచాడు. ఈ సందర్భంగా ఆంగ్లేయాధికారి వ్యక్తిగత సిబ్బంది అధికారిని కాదంటూ ప్రజల పక్షాన నిలిచారు. ఈ సంఘటనలో మతాలకు అతీతంగా వ్యక్తమైన ఐక్యతను గమనించిన ఆంగ్ల అధికారులు భయకంపితులై సుమారు 10 రోజుల పాటు తమ గృహాలు దాటి బయటకు రాలేక పోయారు.

1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం అయ్యాక ఉత్తరాది నుండి నానా సాహెబ్ ప్రతినిథి రంగారావు పాగే దక్షినాదికి వచ్చాడు. ఆయన హైదరాబాదు వచ్చి సఫ్దరుజుద్దౌలా అను యోధుడ్ని కలిశాడు. నానా సాహెబ్ ఉత్తరానికి ప్రతిస్పందిస్తూ ఆయన కొందరికి లేఖలు రాసి తన అనుచరుడు షేక్ మదార్‌కు అందించాడు. ఆయన శత్రువు మీదకు విసిరే 25 వేల విస్ఫోటకాలను సేకరించి అందించాడు. రంగారావుకు హైదరాబాదు పరిసరగ్రామానికి చెందిన బందా అలీ పటేల్ మద్దతు పలికాడు. ఈ విషయాన్ని పసిగట్టిన బ్రిటీషర్లు రంగారావును పట్టుకున్నారు. ఆయన అరెస్టు కావటంతో సఫ్దరుజుద్దౌలా, తదితరులు కూడా పట్టుబడ్డారు. సఫ్దరుజుద్దౌలా, గ్వాలియర్ మహారాజు భార్య, తిరుగుబాటు నాయకురాలు బైజాబాయితో తరచుగా విప్లవం గురించి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడని విచారణలో రుజువైంది. న్యాయస్థానంలో విచారణ జరిగినప్పుడు సఫ్దరుజుద్దౌలా చాలా నిర్భయంగా





వ్యవహరించాడు. మాతృభూమిని పరాయిపాలకుల బానిసత్వం నుండి విముక్తం చేయడం కోసం స్వచ్ఛందంగా ఈ పోరాటంలో పాల్గొన్నానని ప్రకటించాడు. ప్రభుత్వం యావజ్జీవ కారాగార శిక్ష విధించి, ఆయన ఆస్తులను జప్తు చేసింది. ఈ విధంగానే కలాన్ ఖాన్, గులాబ్ ఖాన్ అనే రోహిల్లా యోధులు బ్రిటీషర్ల మీద దాడులు జరిపేందుకు రోహిల్లా సైన్యాన్ని తయారు చేసుకున్నారని, ఈ సందర్భంగా జరిగిన విచారణలో బహిర్గతమైంది.

1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటం ప్రారంభం కాగానే హైదరాబాదులోని నిజాం నవాబు కూడా పోరులో భగస్వాములవుతాడని స్వేఛ్ఛాపిపాసులైన ప్రజలు ఆశించారు. నిజాం నవాబు తమ గూటి నుండి తప్పుకున్నట్టయితే తమ పట్టంతా జారిపోగలదని భావించిన కంపెనీ అధికారులు భయపడి, నిజాం తమకు దూరం కాకుండా తగు జాగ్రత్తలు తీసుకున్నారు. ( ' If the Nizam goes all goes ' - *Highlights of the Freedom Movement in Andhra Pradesh*, Sarojini Regani, 1972, Page 7 ) ప్రజలు ఆశించినట్టుగా నిజాం ప్రథమ స్వాతంత్ర్య సమరంలో చేరలేదు. ఆంగ్లేయులకు నైజాం ప్రాంతం అటు తమ చేతుల్లో నుంచిగానీ, ఇటు నిజాం చేతుల్లోనుండిగానీ జారిపోవటం ఇష్టంలేదు. నైజాం చేజారినట్టయితే తమ మనుగడకు ప్రమాదమని పసిగట్టిన ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారులు ఎటువంటి ధిక్కారాన్ని కూడా సహించలేకున్నారు. ఆ కారణంగా తిరుగుబాటును క్రూరంగా అణిచివేసేందుకు బ్రిటీషు పాలకవర్గం సన్నద్ధమైంది.

ఆ వాతావరణంలో రంగప్రవేశం చేసిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ హైదరాబాదు కేంద్రంగా జరిగిన తిరుగుబాటు కార్యకలాపాలకు కేంద్ర బిందువయ్యారు. తిరుగుబాటు కార్యకలాపాలు మౌల్వీ మార్గదర్శకత్వంలో ముమ్మరమయ్యాయి. ఓ దశలో నిజాం నవాబును తిరగబడమని కోరుతూ నగరంలో పోస్టర్లు వెలిశాయి. ఈ మేరకు నగరంలో వెల్లడైన ఒక పోస్టరులో, ' The aid of the Almighty and his Prophet is present with Afzal-ud Dowla Bahadur who should not fear and be apprehensive. If fearful he should wear bangles and sit at home...If after reading this paper on hearing of it a representation is not made to the king(Nizam) or his Diwan, the oath of the swine is on him and if in case of a Hindu the oath of a cow '. (ibid page 7-8) అని పేర్కొన్నారు. మౌల్వీ ఇబ్రహీం నాయకత్వంలో 1857 జూన్ 10వ తేదిన తిరుగుబాటు చేయాలనుకున్నారు. ఈ మేరకు మౌల్వీ అక్బర్ తగిన ప్రచారం కూడా నిర్వహించారు. ఈ ప్రచారంతో సైనిక స్థావరాలలోని స్వదేశీ సైనికులు ఆంగ్ల అధికారులను లెక్కచేయక ఇష్టారాజ్యంగా వ్యవహరించటం ప్రారంభించారు. ప్రజలు, సిపాయిలు తిరుగుబాటు గురించి బహిరంగంగా ముచ్చటించుకోవడం ప్రారంభించారు. పలు ప్రాంతాలలో

వివిధ విభాగాల సైనికులు తిరుగుబాటు దళాలతో కలసి పోతున్నారని నైజాం సంస్థానంలో వార్తలు గుప్పుమనసాగాయి.

ఈ వార్తలతో ప్రజలు ఉత్తేజితులు కాసాగారు. మౌల్వీ అల్లావుద్దీన్ లాంటి ఆలోచనాపరులు, యోధులు తిరుగుబాటుకు అవసరమైన ఆర్థిక, అంగ, ఆయుధ బలాలను సమకూర్చుకోసాగారు. జూన్ 13వ తేదిన చార్మినార్ దగ్గరలో గల మక్కా మసీదులో నమాజు తరువాత ప్రసంగం సాగుతుండగా, ఇరువురు వ్యక్తులు లేచి స్వాతంత్ర్యసంగ్రామం గురించి ప్రసంగించమని కోరి, బ్రిటీషు సైనికులు వచ్చి వారిని పట్టుకునేలోగా కనుమరుగయ్యారు. స్వేచ్ఛను కోరుకుంటున్న ప్రజలు ఆ యోధులను శత్రువు చేతికి చిక్కకుండా కాపాడి తప్పించారు.

నైజాం రాజధాని తిరుగుబాటు వార్తలతో అతలాకుతలం అవుతుండగా, అటు ఔరంగాబాదులో ప్రథమ అశ్వికదళం, బుల్దానాలోని మరోక దళం తిరుగుబాటు చేశాయని వార్తలు అందాయి. ఈ రెండు దళాలు హైదరాబాదుకు చెందినవి కావటం వలన తిరుగుబాటు వార్త సహజంగా హైదరాబాదులో ఉద్రిక్త పరిస్థితికి కారణమైంది. ఔరంగాబాదు తిరుగుబాటుకు నాయకులైన జమేదార్ అమీర్ ఖాన్, దఫేదార్ మీర్ ఫిదాఅలీలలో ఫిదా అలీని పట్టుకున్నారు. మీర్ ఫిదాఅలీ ఉరిశిక్షకు గురికాగా, అమీర్ ఖాన్ తప్పించుకున్నారు. బుల్దానా తిరుగుబాటుకు నాయకత్వం వహించిన జమేదారు చిద్దా ఖాన్ తన 10 మంది అనుచరులతో జూన్ 24 నాటికి హైదరాబాదు చేరుకున్నారు. నైజాం ప్రభుత్వం నుండి రక్షణ లభిస్తుందన్న భావనతో విచ్చేసి, సాలార్ జంగ్‌ను కలసిన చిద్దాఖాన్ ఆయన అనుచరులను సాలార్ జంగ్ తన గదిలోనే ఖైదు చేయించాడు. ఆ తరువాత విచారణ నిమిత్తం బ్రిటీషు రెసిడెన్సీకి అప్పగించాడు. ఈ వార్తతో ప్రజల హృదయాలు భగ్గుమన్నాయి. ఫిరంగీయులను చంపమంటూ నగరంలోని పలు చోట్ల పోస్టర్లు దర్శనమిచ్చాయి. ఆ పోస్టర్ల మీద ' Faithful to murder the feringhee ' , (- *History of The Deccan*, J D E Gribble, Vol.2, Mittal Publications, New Delhi, 1990 , Page 237 ) అంటూ ప్రజలకు పిలుపునిచ్చారు.

జూలై 17వ తేదిన మక్కా మసీదులో ముస్లింలు పెద్ద సంఖ్యలో సమావేశమయ్యారు. ఈ సమావేశంలో మౌల్వీ అల్లావుద్దీన్ పాల్గొన్నారు. చిద్దాఖాన్, ఆయన అనుచరులను విడుదల చేయించాలని నిర్ణయించారు. ప్రతినిధివర్గంగా నలుగురు మౌల్వీలను పంపి బ్రిటీషు రెసిడెంట్‌ను కలసి మాట్లాడి ఎలాగైనా చిద్దాఖాన్‌ను విడుదల చేయించాలని సంకల్పించారు. ఒకవేళ చర్చలు ఫలప్రదం కానట్టయితే, బలప్రయోగానికి పూనుకోవాలని నిశ్చయించారు. ఈ విషయం తన వేగుల ద్వారా తెలుసుకున్న సాలార్ జంగ్ మక్కా మసీదులో సమావేశమైన వారిని చెదరగొట్టేందుకు అరబ్ గార్డులను పంపాడు. ఈ విషయాన్ని ఆఘమేఘాల మీద





బ్రిటీషు రెసిడెన్సీకి కబురు చేసి, ఈ పరిణామాల వలన భయపడాల్సిన అవసరంలేదనీ, రక్షణకు అవసరమైన అన్ని చర్యలు తీసుకున్నట్టూ విన్నవించుకున్నాడు.

మక్కా మసీదు వద్ద సమావేశాన్ని చెదరగొట్టేందుకు సాలార్ జంగ్ ఎప్పుడయితే పూనుకున్నాడో, ఆ చర్యతో ప్రజలు రగిలిపోయారు. మౌల్వీ అల్లావుద్దీన్ ఆగ్రహం వ్యక్తం చేశారు. ఆయన మస్తిష్కంలో రూపుదిద్దుకుంటున్న పోరాట వ్యూహం మరింత త్వరితగతిన రూపును సంతరించుకుంది. చర్చల వలన సాధించేది ఏమీ ఉండదని స్పష్టమైన తరువాత సాయుధపోరాటమే చివరి మార్గమని ఆయన నిర్ణయానికొచ్చారు. ఈ రకంగా పాలకవర్గాలను ఎదుర్కోవాల్సి వస్తుందని ముందుగా ఊహించిన మౌల్వీ అందుకు తగిన ఏర్పాట్లు ఎప్పుడో చేసుకుని సిద్ధంగా ఉన్నారు. ఆయన ఆదేశాల మేరకు అగ్నిగుండంలో నైనా దూకేందుకు, స్వాతంత్ర్య సంగ్రామంలో సమిధలయ్యేందుకు సిద్ధంగా ఉన్న మూడు వందల మంది సాహసులను ఆయన ఏరికోరి సమకూర్చుకుని ఉన్నారు. ఆ సాహసుల నుండి ప్రమాణ పత్రాలు కూడా ఆయన తీసుకున్నారు. ఏ క్షణాన ఆదేశించినా వెంటనే రంగంలోకి దిగడానికి సాహసుల దళం మౌల్వీ అల్లావుద్దీన్ సైగ కోసం ఎప్పుడెప్పుడా అంటూ ఎదురు చూస్తోంది.

ఆ క్షణం రానే వచ్చింది. బ్రిటీష్ రెసిడెన్సీ, సాలార్‌జంగ్ ప్రతిస్పందనల మీద సహచరుడు పఠాన్ తుర్రేబాజ్ ఖాన్‌తో మౌల్వీ అల్లావుద్దీన్ సంప్రదించారు. 1857 జూలై 17వ తేదీన మధ్యాహ్నం నాలుగు గంటల సమయానికల్లా మూడు వందల మంది పోరాటయోధులు రణనినాదం చేస్తూ, పోరుకు సిద్ధమయ్యారు. విజయమో వీరస్వర్గమో సాధించేందుకు బయలుదేరిన ఆ యోధులు ప్రస్తుత సుల్తాన్ బజారు దిశగా బ్రిటీష్ రెసిడెన్సీ వైపుకు దూసుకువెళ్ళారు. ప్రస్తుతం హైదరాబాదు నగరంలోని కోఠి సెంటరులో గల మహిళా కళాశాల ఆనాడు 'బ్రిటీషు రెసిడెంట్' గా పిలువబడిన ఆంగ్ల అధికారి నివాసం మరియు కార్యాలయం. ఈ విషయం గమనించిన సాలార్ జంగ్ బ్రిటీషు అధికారిని అప్రమత్తం చేస్తూ, తమ బలగాలు వచ్చేంతవరకు ఆత్మరక్షణకు పూనుకోవాల్సిందిగా సమాచారం పంపారు.

ఏది ఏమైనా సిద్ధమని బయలుదేరిన తిరుగుబాటు దళాలు, రెసిడెన్సీకి పడమర వైపు నుండి దాడికి సమాయత్తమయ్యాయి. ఆ ప్రాంతంలో ఉన్న అబ్బాన్ సాహెబ్, జయగోపాల్ దాస్ అను ఇరువురు షావుకార్ల భవనాలను తమ స్థావరాలుగా చేసుకున్నారు. ఆ ప్రాంతం నుండి పుత్లీ బౌలీ, దిల్‌షుక్ తోటల వైపుఉన్న ద్వారాల మీద అదుపు సాధించేందుకు వీలుగా వ్యూహాత్మకంగా నాయకులు చర్యలు తీసుకున్నారు. ఆ సమయంలో మేజర్ హెచ్.సి బ్రిగ్స్ రెసిడెన్సీ రక్షణ బాధ్యత స్వీకరించాడు. రాత్రిపూట కావటం వలన తిరుగుబాటు దళాలను కదలించకుండా, ఆ బలగాల చుట్టూతా తన బలగాలను మోహరించేందుకు వ్యూహాత్మకంగా సమయం తీసుకున్నాడు. శత్రువు మీద ఎంతో కసితో ఉన్న తిరుగుబాటు

బలగాలు దూకుడుగా ముందుకు ఉరికేసరికి, పోరు ప్రారంభమైంది. ఆంగ్ల సేనలు తెల్లవారుజాము వరకు కాల్పులు జరిపాయి. ఆంగ్లేయుల ఫిరంగి గోళాల సెగలుపొగలకు తట్టుకుని నిలబడగలిగే ఆచ్ఛాదన కరువుకావటంతో తిరుగుబాటు బలగాలు వెనక్కు తగ్గాయి. తిరుగుబాటు దళాలను దిగ్భంధనం చేసేందుకు ఏర్పాటు చేసిన అరబ్బు దళాలు, తిరుగుబాటు యోధులకు అనుకూలంగా వ్యవహరించాయి. ఆ దళాల సహకారంతోనే, తిరుగుబాటు దళాలు అబ్బాన్ సాహెబ్, జయగోపాల్ దాస్‌ల గృహాలను వదలి, పోరులో మరణించిన వారిని వదలి, గాయపడిన సహచరులను మాత్రం వెంట తీసుకుని వెనుకకు వెళ్ళిపోయాయి. ఈ పోరాటంలో మొత్తం మీద నలుగురు మృతిచెందగా, పలువురు గాయపడ్డారు. ఆంగ్ల సేనలు, నైజాం ప్రభువు సహకారంలో తిరుగుబాటు దళాల దాడిని తిప్పికొట్టగలిగాయి. తిరుగుబాటు దళాలకు సహకరించిన అబ్బాన్ సాహెబ్, జయగోపాల్ దాస్‌ల భవనాలను ఆంగ్లసేనలు ధ్వంసంచేసి, ఆ ప్రముఖుల కుటుంబ సభ్యులను ఊచకోత కోసాయి. ఆ ప్రముఖుల ఆస్తిపాస్తులను జప్తు చేశాయి.

దక్షణాదిలో అతిపెద్ద సంఘటనగా చరిత్రలో నిలచిపోయిన ' రెసిడెన్సీ మీద దాడి ' లో నైజాం ప్రభువుల చలవ ఫలితంగా ఆంగ్లేయులకు విజయం దక్కినా, విప్లవ జ్వాలలను పూర్తిగా ఆర్పివేయటం బ్రిటీషర్లకు వీలుకాలేదు.' If the Nizam goes all goes ' అని భయపడిన ఆంగ్లేయులకు నైజాం ప్రభువు అండదండలుగా నిలువకున్నట్టయితే ప్రథమ స్వాతంత్ర్యసమరయోధులకు తప్పక విజయం దక్కియుండేది.

ఆ తరువాత ఆంగ్లేయుల విజయానికి కారణమైన నిజాంను బ్రిటీషు పాలకులు సత్కరించదలచి, కలకత్తా వెళ్ళి గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్‌ను కలసి, నిజాం కోసం ప్రత్యేక ' ఖతీరా ' ను మోసుకొచ్చారు. ఆ ప్రశంసాపత్రాన్ని 1859 మార్చి 15వ తేదిన ప్రత్యేక దర్బారు ఏర్పాటు చేసి, నైజాం సంస్థానాధీశునికి అందించారు. ఆ కార్యక్రమం ముగిశాక నిజాం నవాబుతో పాటుగా దర్బారు నుండి దర్పంగా బయటకు వస్తున్న ఆంగ్లేయాధికారి డేవిడ్‌సన్ మీద జహంగీర్ ఖాన్ అను యువకుడు కార్బన్‌తో దాడి చేశాడు. తుపాకి గుళ్ళ తాకిడి నుండి డేవిడ్‌సన్ తృటిలో తప్పించుకోవడంతో, అతనిని ఎలాగైనా సంహరించాలన్న లక్ష్యంతో మరుక్షణం జహంగీర్ కత్తి దూశాడు. అంతలోగా నిజాం అనుచరులు అప్రమత్తులై జహంగీర్ ఖాన్ మీద కాల్పులు జరపటంతో ఆ యోధుడు అక్కడిక్కడే కుప్పకూలిపోయాడు. ఈ అనూహ్య సంఘటనతో బిత్తరపోయి భయంతో వణికిపోతూ ఆంగ్లేయుడు డేవిడ్‌సన్ పక్కనే ఉన్న గదిలోకి పిరికి పందిలా పరుగులు తీసి దాక్కొన్నాడు. ప్రమాదం పూర్తిగా తప్పిందని రూఢిగా తెలుసుకున్నాక గాని అతను బయటకు రాటానికి సాహసించలేదు. జహంగీర్ ఖాన్ ఒకనాటి నిజాం దర్బారులో ప్రముఖుడైన ఉమ్రా





మనవడు. ఆయన కూడా ఆంగ్లేయుల పెత్తనాన్ని అంగీకరించక, నిజాం ఆగ్రహానికి గురైన వ్యక్తి. ఈ కాల్పులలో తీవ్రంగా గాయపడిన జహంగీర్‌ను ఆసుపత్రికి తరలించి చికిత్స చేయించారు. ఈ సంఘటన నిజాం ప్రభుత్వాన్ని కుదిపేయటంతో, దీని వెనుక కుట్ర ఉందని భావించి, జహంగీర్ ఖాన్‌ను ఎంతగా వేధించినా, ఈ సంఘటనకు తానొక్కడే కారణమనీ, మరెవ్వరి ప్రమేయం లేదనీ ఆయన ప్రకటించాడు. బ్రిటీషు పాలకుల చేతుల్లో చిత్రహింసలకు గురైన జహంగీర్ ఖాన్ 1859 జూన్ మాసంలో చివరి శ్వాస వదిలారు.

ఈ విధంగా ఉత్తర భారత దేశంలోనే కాదు దక్షిణాది బిడ్డలు మౌల్వీ అల్లావుద్దీన్ లాంటి యోధులు స్వేచ్ఛ కోసం, పరాయి పాలకుల పెత్తనం నుండి మాతృభూమి విముక్తి కోసం చివరి కంటా పోరాడారు.

1858 జూన్ 18వ తేదిన నగరంలోని తిరుగుబాటు దళాల మీద ఆంగ్ల సైన్యాలు విరుచుకు పడ్డాయి. భారీ ఎత్తున అరెస్టులు ఆరంభమయ్యాయి. ఆ సమయంలో మౌల్వీ అల్లావుద్దీన్ ఆంగ్ల సైనికుల కన్నుగప్పి తప్పించుకున్నారు. అలా తప్పించుకున్న మౌల్వీ ఒకటిన్నర సంవత్సరం పాటు ఆంగ్లసైనికుల కంటపడకుండా రహస్య జీవితం గడిపారు. ఆయనకు పీర్ మహమ్మద్ అను వ్యక్తి ఆశ్రయం కల్పించి కాపాడాడు. ఈ రహస్య జీవితంలో మౌల్వీ అల్లావుద్దీన్ ఫరూఖ్ నగర్, బెంగుళూరు తదితర ప్రాంతాలలో తలదాచుకున్నారు. ఈ సందర్భంగా మళ్ళీ తిరుగుబాటుకు మార్గాల అన్వేషణ సాగిస్తూ గడిపారు. తిరుగుబాటు నాయకులు సయ్యద్ భిక్కూ, సయ్యద్ లాల్, మహమ్మద్ అలీ తదితర నేతలను ఆయన కలుసుకుని సంప్రదింపులు జరిపారు.

ఈ విధంగా ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని సవాల్ చేసి, తిరుగుబాటుకు నాయకత్వం వహించిన మౌల్వీ అల్లావుద్దీన్‌ను ఎలాగైనా పట్టుకోవాలని కసితో ఉన్న ఆంగ్లేయాధికారులు మౌల్వీని పట్టిచ్చిన వారికి నాలుగు వేల రూపాయల నజరానాను నిజాం ప్రభుత్వం ద్వారా ప్రకటింపచేశారు. ( 'A reward of 4 thousand for his arrest was anounced by Nizam's Government...', *Who's Who Of Freedom Struggle in Andhara Pradesh*, Vol. , Ed. by Sarojini Regani, AP Govt. Publications, 1978, page 457)

చివరకు మౌల్వీ అల్లావుద్దీన్‌ను ఆంగ్లేయులు పట్టుకోగలిగారు. అనంతరం విచారణ తంతును జరిపించి ఆయనకు ద్వీపాంతరవాస శిక్ష విధించారు. 1859 జూన్ 28వ తేదిన అండమాన్ దీవులలోని సెల్యూలర్ జైలుకు పంపించారు. ఆ అండమాన్ దీవులలోనే పాతికేళ్ళ దుర్భర నిర్బంధ జీవితం గడిపిన మౌల్వీ సయ్యద్ అల్లావుద్దీన్ 1884లో కన్నుమూశారు. ◆



పన్నెండేండ్ల వయస్సులో ఆంగ్లేయుల పీచమణచడానికి రాజైన

# 32. మీర్జా బిర్జిస్ ఖదీర్

మాతృభూమిని పరాయిపాలకుల కబంధహస్తాల నుండి విముక్తం చేసేందుకు ప్రారంభమైన ప్రథమ స్వాతంత్ర్యపోరాటంలో పలు విశిష్ట ఘట్టాలు చోటుచేసుకున్నాయి. పాతికేళ్ళు నిండకున్నా కదనరంగంలో దుమికిన తల్లి పరాయి పాలకులను సవాల్ చేస్తూ, స్వతంత్ర రాజ్యాన్ని ప్రకటించుకుని పన్నెండేళ్ళు కూడా దాటని బిడ్డను రాజుగా ప్రకటించి, 14 మాసాల పాటు పాలన సాగించిన మాతృమూర్తి ఈ చరిత్రలో తారసపడుతారు. పన్నెండు సంవత్సరాల వయస్కుడైనా అంతకు మించిన పరిణతితో, అనునిత్యం వెంటాడుతున్న శత్రువు దాడుల ఛాయలో కూడా సమర్ధవంతంగా రాజ్యపాలన సాగించిన స్వతంత్ర అవధ్ రాజ్యాధినేత మీర్జా బిర్జిస్ ఖదీర్ స్వాతంత్ర్యసమర చరిత్రలో సరికొత్త అధ్యాయాన్ని ప్రారంభించారు.

అవధ్ మొఘల్ రాజ్యంలో ఒక భాగం. లక్నో అవధ్ రాజధాని. మొగల్ ప్రభువుల బలాధిక్యత క్షీణిస్తున్న సమయంలో అవధ్ స్వతంత్ర్య రాజ్యంగా ప్రకటితమైంది. ఆ అవధ్ చివరి నవాబు వాజిద్ అలీషా 1847లో సింహాసనం అధిష్టించాడు. ఆ సంవత్సరం గవర్నర్ జనరల్‌గా లార్డ్ డల్హౌసీ భారతదేశం విచ్చేసాడు. రాజ్య విస్తరణ కాంక్షతో ఒక్కొక్క రాజ్యాన్నీ అక్రమంగా ఆక్రమించుకుంటున్న అతని చూపు సుసంపన్నమైన అవధ్ మీద పడింది. ఒక బ్రిటీష్ అధికారి ద్వారా, **నేను నా ఇష్టపూర్వకంగా నా రాజ్యాన్ని కంపెనీ పరం చేయదానికి సమ్మతిస్తున్నాను,** అని రాసిన లొంగుబాటు పత్రాన్ని నవాబ్ వాజిద్ అలిషాకు పంపి, అందులో





సంతకం చేయమని గవర్నర్ జనరల్ ఆదేశించాడు. ఆ పత్రం మీద సంతకం చేయనట్టయితే కంపెనీ సేనలు రాజ్యంతో పాటుగా అంతఃపురాన్ని స్వాధీనం చేసుకోగలవని బెదిరించాడు. ఆ బెదిరింపులకు భయపడిన నవాబు అవధ్‌ను కంపెనీ పరం చేయడానికి సిద్ధపడ్డాడు. చివరకు నవాబ్ వాజిద్ అలీషాను 1856 ఫిబ్రవరి 13వ తేదీన నిర్బంధంలోకి తీసుకుని, మార్చి 13న కలకత్తా పంపారు. నవాబు పరివారంలో చాలా మంది అవధ్ వదలి కలకత్తాకు వెళ్ళిపోగా, బేగం హజరత్ మహల్ మాత్రం అవధ్‌ను విడిచిపెట్టి వెళ్ళేది లేదని నిర్ణయించుకుని, తన 11 సంవత్సరాల బిడ్డడు మీర్జా బిర్జిస్ ఖదీర్‌తోపాటు లక్నోలోని కౌసర్ బాగ్‌లో ఉండిపోయారు. మీర్జా బిర్జిస్ ఖదీర్ అసలు పేరు మొహమ్మద్ రంజాన్ అలీ బహుద్దూర్. 1845లో జన్మించిన ఆ బాలుడే సరికొత్త చరిత్రకు కారణమయ్యాడు.

అక్రమంగా అవధ్‌ను ఆక్రమించుకొని, అన్ని విధాల ఆధిపత్యం సాగిస్తున్న ఆంగ్లేయుల మీద 1857 నాటి తిరుగుబాటు, బేగం హజరత్ మహల్, మీర్జా బిర్జిస్ ఖదీర్‌లకు వరమైంది. అవధ్‌లో ప్రజలు, సైనికులు స్వరాజ్యం కోసం కంపెనీ పాలకులకు ఎదురు తిరిగారు. ఆ తిరుగుబాటులో అవధ్‌లోని కొన్ని ప్రాంతాలు ప్రజల ఆధిపత్యంలోకి వచ్చాయి. ఆ వాతావరణాన్ని తల్లీ బిడ్డలు అనుకూలంగా మార్చుకున్నారు. 1857 మే 31న లక్నో ఛావనీలో తిరుగుబాటు ఫిరంగులు పేలాయి. ప్రజలు తిరగబడ్డారు. ఆ సమయంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వీరుడు మౌల్వీ అహమ్మదుల్లా షా తన బలగాలతో లక్నో చేరుకుని, బేగంకు మద్దతుగా కంపెనీ పాలకులను ఎదుర్కొన్నాడు. ఈ సందర్భంగా బేగం మరింత చొరవ తీసుకోవడంతో, పది రోజుల్లో లక్నో తిరుగుబాటు సేనలపరమైంది. కంపెనీ పాలనాధికారం ఆనవాళ్ళు కూడా లేకుండా పోయాయి.

ఒక పాలకుడంటూ లేకుండా పోయిన లక్నోలో ఏర్పడిన గందరగోళ పరిస్థితులను చక్కదిద్దేందుకు, తిరుగుబాటు దళాలకు మార్గదర్శకత్వం చేయగల పాలకుని అవసరం ఏర్పడింది. నవాబు వంశస్థుల కోసం అన్వేషణ ప్రారంభమైంది. బ్రిటీష్ పాలకులంటే ఏర్పడిన భయంతో, నవాబు వాజిద్ అలీషా ఇతర భార్యలు తమ బిడ్డలను నవాబుగా ప్రకటించి కంపెనీ పాలకుల ఆగ్రహానికి బలి చేయవద్దని ప్రాధేయపడసాగారు. ఆ సమయంలో బేగం హజరత్ మహల్ కంటకప్రాయమైన మార్గంలో చారిత్రక పాత్ర నిర్వహించేందుకు ముందుకొచ్చారు. ఆమె తన పదకొండు సంవత్సరాల బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను నవాబుగా ప్రకటించేందుకు అంగీకరించారు. ఆ అంగీకారంతో మీర్జా బిర్జిస్ ఖదీర్ 1857 జూలై 7వ తేదిన స్వతంత్ర అవధ్ నవాబు అయ్యారు. ఫిరంగులు మోగించి సైనికులు ఆయనపాలనకు స్వాగతం పలికారు. లక్నో నగరంలో ప్రజల సంబరాలు మిన్నుముట్టాయి.

అంతటి చిన్నవయస్సులో, అత్యంత ప్రతికూల వాతావరణంలో, అన్నివిధాలా బలవంతుడైన శత్రువును ఎదుర్కోవాల్సిన అత్యంత క్లిష్టపరిస్థితులలో అవధ్ రాజ్యంలో పసివాడైన బిర్జిస్ ఖదీర్ పాలన ప్రారంభమైంది. ఈ విషయం మొఘల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్‌కు తెలియపర్చి ఆయన ప్రతినిధిగా అవధ్‌లో పాలన చేసేందుకు అనుమతి పత్రం తెచ్చేందుకు మిర్జావుద్దౌలా అను వ్యక్తిని ఢిల్లీకి పంపారు. చక్రవర్తి ఎంతగానో సంతోషిస్తూ అనుమతి పత్రం పంపటమే కాకుండా, ఆ పత్రంలో **' ప్రియమైన కుమారా '** అని సంబోధిస్తూ, బిర్జిస్ ఖదీర్ పట్ల ఆయనకున్న ప్రేమాభిమానాలను వ్యక్తం చేశారు.

అవధ్ ఆర్థిక పరిస్థితులను చక్కదిద్దేందుకు బిర్జిస్ ఖదిర్ పక్షాన బేగం నడుం కట్టారు. మాతృభూమి కోసం ప్రాణాలు త్యజించడానికి సిద్ధమైన ప్రజలు, సిపాయిలు లక్నోకు తరలి వచ్చారు. ప్రజల అపూర్వ సహకారంతో 1,80,000 మంది సైనికులను బేగం సమకూర్చుకున్నారు. 250 కోటలు ఆమె ఆధిపత్యంలోకి వచ్చాయి. ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులకు పరాజయం తప్పలేదు. బ్రతుకుజీవుడా అంటూ లక్నోలోని రెసిడెన్సీలో నుంచి బయటకు కూడా చూడలేని దుస్థితిని ఆంగ్లేయులు చవిచూశారు.

అవధ్‌లో పరిస్థితులు కొంతమేరకు మెరుగు పడ్డాక బేగం హజరత్ మహల్ తన రాజకీయ బుద్ధి కుశలతను చూపనారంభించారు. అవధ్ ఇరుగుపొరుగు స్వదేశీ పాలకులకు రానున్న గడ్డు పరిస్థితుల పట్ల హెచ్చరికలు చేస్తూ, అవసరాన్ని బట్టి ప్రతి అవకాశాన్నీ వినియోగించుకుంటూ, మంత్రాంగం నడుపుతూ, బేగం హజరత్ మహల్ కంపెనీ పాలకులకు చెమటలు పట్టించి, కంటి మీద కునుకు లేకుండా చేసారు. స్వతంత్ర అవధ్‌లో అన్ని పరిస్థితులు చక్కబడ్డాక, ఆంగ్లేయులు దాక్కొని ఉన్న రెసిడెన్సీమీద దాడికి సైనికులను పురికొల్పారు. ఆ సందర్భంగా జరిగిన పోరాటంలో 12 సంవత్సరాల వయస్సుడైన బిర్జిస్ ఖధీర్ తల్లి వెంట రణభూమిలోకి అడుగు పెట్టారు. ఏనుగు అంబారి మీద తమ ప్రియతమ నేత రణభూమికి రావటంలో అవధ్ యుద్ధవీరుల ఉత్సాహం ఇనుమడించింది. మాతృ దేశం కోసం ప్రాణాలొడ్డి పోరాడుతున్న సైనికులనూ, ప్రజలనూ ఆ ప్రోత్సాహం ఎంతో శక్తినిచ్చింది. చివరకు విజయం బిర్జిస్ ఖధీర్ వశమైంది. ఈ మేరకు11 మాసాల పాటు మిర్జా బిర్జిస్ ఖధీర్ పాలన సాగింది.

ఈ ప్రతికూల పరిస్థితులను తట్టుకోలేక పోయిన ఆంగ్ల అధికారులు లక్నో మీద దృష్టి సారించారు. పన్నెండేండ్ల బిర్జిస్ ఖదిర్ చేతిలో 'అజేయ' ఆంగ్ల శక్తి పరాభవం కావటం సైనికాధికారులు జీర్ణించుకోలేకపోయారు. భారతదేశ వ్యాపితంగా పలుప్రాంతాలలో ఆరంభమైన తిరుగుబాట్లను దాదాపు అణచివేసిన బ్రిటీష్ సైన్యాలు, సేనాధిపతులకు, లక్నోను వీలయినంత త్వరగా పట్టుకోవలసిందిగా లార్డ్ కానింగ్ నుండి ఆదేశాలందాయి. బ్రిటీష్





సైన్యాధిపతులు కోలిన్ క్యాంప్‌బెల్, జనరల్ హ్యావ్‌లాక్, జనరల్ ఓంట్రాం తదితరులు తమ సైనిక బలగాలతో లక్నోను తలా ఒకవైపు నుండి చుట్టుముట్టారు. ఆ సమయంలో సిక్కులు, గూర్ఖాలు ఆంగ్ల బలగాలకు అండగా నిలిచారు. లక్నోలోని ప్రతి అంగుళం యుద్ధరంగమై పోయింది. ప్రజలు, స్వతంత్ర అవధ్ సైనికులు, సేనా నాయకులు ప్రాణాలకు తెగించి పోరాటంలో పాల్గొన్నారు. ఈ పోరాటం సాగుతుండగా కంపెనీ బలగాలకు అండగా అదనపు బలగాలు వచ్చి చేరాయి. కంపెనీ సైనిక బలగాలు అత్యాధునిక ఆయుధాలతో అన్ని దిశలా భయంకర దాడులు ప్రారంభించాయి. లక్నో పరాజయం తప్పదని బిర్జిస్ ఖదీర్ సేనాధిపతులు గ్రహించారు. ఆ ప్రమాదకర పరిస్థితులలో హజరత్ మహల్ లక్నోలో ఉండటం క్షేమం కాదని భావించి యుద్ధ రంగం నుండి నిష్క్రమించాల్సిందిగా అతికష్టం మీద ఆమెకు నచ్చచెప్పారు. మిర్జా బిర్జిస్ ఖధీర్, బేగం హజరత్ మహల్ అయిష్టంగా కైసర్‌బాగ్ నుండి బయటపడ్డారు. ఆ తరువాత శత్రువు నుండి తప్పించుకోడానికి ఆమె ప్రవాసంలోకి వెళ్ళక తప్పలేదు.

బిర్జిస్ ఖదీర్, హజరత్ మహల్ ప్రవాసంలో ఉండగా 1858 నవంబర్ 1వ తేదీన విక్టోరియా మహారాణి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను రద్దుచేసి, పాలనాధికారాన్ని స్వయంగా స్వీకరించింది. ఆ తరువాత **విక్టోరియా రాణి ప్రకటన** గా ఖ్యాతి గాంచిన ఓ ప్రకటన విడుదల చేసింది. ఆ ప్రకటనలో స్వదేశీ పాలకులకు, ప్రజలకు పలు హామీలు కుమ్మరించింది. పలు ఆకర్షణీయమైన ఆశలను చూపెట్టింది. తిరుగుబాటు యోధులకూ, నేతలకూ క్షమాభిక్ష ప్రసాదిస్తానంది. ఈ ప్రకటన తిరుగుబాటులో పాల్గొన్న స్వదేశీ పాలకులను, ప్రజలను ఆకర్షించింది. ఆ పరిస్థితులలో విక్టోరియా ప్రకటనకు ధీటుగా బిర్జిస్ ఖదీర్ పేరిట 1858 డిసెంబర్ 31తేదీన మరో చారిత్రాత్మక ప్రకటనను బేగం విడుదలచేసింది. సామ్రాజ్యవాద కాంక్ష కలిగిన బ్రిటన్, స్వదేశీ సంస్థానాలను ఎలా ఆక్రమించుకుంది, గతంలో మాట తప్పి స్వదేశీ పాలకులను ఎలా మోసగించిందీ, పలు ఒప్పందాలు చేసుకుని వాటిని నిస్సిగ్గుగా ఎలా ఉల్లంఘించిందీ, ప్రజల మీద స్వదేశీ పాలకుల మీద ఎంతటి దారుణాలకు ఒడిగట్టిందీ ఆ ప్రకటనలో వివరించారు. స్వదేశీ ఆత్మాభిమానాన్ని ఏవిధంగా ఆంగ్లేయులు దెబ్బగొట్టింది, స్వదేశీయుల మతధర్మాలను ఏవిధంగా కించపర్చిందీ, మత మనోభావాలను ఏ విధంగా అవమానపర్చిందీ సోదాహరణంగా ప్రకటన వివరించింది. స్వదేశీయోధుల తిరుగుబాటుకు భయపడి తిరగబడ్డ సైనికులను, నేతలను మాలిమి చేసుకునేందుకు ఎలాంటి ఆశలు చూపిందీ, గతంలో వాగ్దానాలు చేసి ఆ వాగ్దానాలను తుంగలో తొక్కి, స్వదేశీ పాలకుల మీద ఎంతటి అఘాయిత్యాలకు పాల్పడిందీ ఆ చారిత్రాత్మక సుదీర్ఘ ప్రకటన సాక్ష్యాధారాలతో సహా పేర్కొంది. వివరించారు. చివరకు ఈ మభ్యపెట్టుమాటలను నమ్మవద్దని ప్రజలకూ, స్వదేశీ పాలకులకూ

తన ప్రకటన ద్వారా బిర్జిస్ ఖదీర్ విజ్ఞప్తి చేశారు.

స్వతంత్ర అవధ్ రాజు బిర్జిస్ ఖదీర్ చేసిన ఈ విజ్ఞప్తిలో గల నిజానిజాలను గ్రహించిన ప్రజలు ఆయన వెంట నడవడానికి సిద్ధపడ్డారు. అయినా, ఆంగ్లేయుల భారి సైన్యం ముందు అవధ్‌ను కాపాడుకునేందుకు స్వదేశీ సేనలు చేసిన అన్ని ప్రయత్నాలు విఫలమయ్యాయి. మాతృదేశానికి ద్రోహం తలపెట్టిన విద్రోహుల సంఖ్య కూడా క్రమంగా పెరగసాగింది. ఆ సమయంలో ఆంగ్లేయుల చేత చిక్కటం ఇష్టంలేని బేగం అవధ్ స్వతంత్ర పాలకుడు, తన కుమారుడు అయిన మిర్జా బిర్జిస్ ఖదీర్‌తోపాటుగా నేపాల్ పర్వత సానువుల్లోకి ప్రస్థానం గావించారు. ఆ కారడవుల్లో, మంచు కొండలో బిర్జిస్ ఖదీర్ వెంట నడిచిన యోధులు ఒక్కొక్కరే మృత్యువువాత పడుతుండగా, అన్ని అవరోధాలనూ అధిగమించి పోరాటానికి మళ్ళీ సిద్ధమయ్యేందుకు ఆమె చేసిన ప్రయత్నాలు ప్రతికూల వాతావరణం వలన ఫలించలేదు. అనుచరులు పర్వత ప్రాంతాల్లో పలు వ్యాధులకు గురయ్యారు. ప్రధానంగా మలేరియా వ్యాధి ఆ వీరయోధులను మృత్యుగహ్వరంలోకి లాక్కొంది. ఒంటరిగా మిగిలిన బిర్జిస్ ఖదీర్ బేగం హజరత్ మహల్‌లు చివరికంటా తమ తిరుగుబాటు ప్రయత్నాలను కొనసాగిస్తూ, బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను ఏకాకిని చేసి 1874లో తుది శ్వాస వదిలారు. బేగం కన్నుమూసేవరకు ఆంగ్లేయులు ఆమెను, బిర్జిస్ ఖదిర్‌ను లొంగదీసుకోడానికి పలు విఫలప్రయత్నాలు చేశారు. ఆ సమయంలో బిర్జిస్ ఖదిర్ తల్లికి బాసటగా నిలిచారు. స్వతంత్ర అవధ్‌ను తిరిగి స్వాధీనం చేసుకోవాలని కలలు గంటున్న ఆయనకు తల్లి మరణం కోలుకొలేని విధంగా దెబ్బ తీసింది.

బిర్జిస్ ఖదీర్ ఒంటరివారయ్యారు. శత్రువు చుట్టుముట్టి ఉన్నాడు. అవధ్ వారసుడ్ని అంతం చేస్తే, తిరుగుబాటుకు ప్రాణంగా నిలచిన అవద్‌ను పూర్తిగా స్వాధీనం చేసుకున్నట్టు కాగలదని అంగ్లేయులు భావించసాగారు. ఆ లక్ష్యసాధనకు ఎత్తులు వేయసాగారు. ఆ సమయంలో బ్రిటీషర్ల నిర్భంధంలో ఉన్న ఆయన తండ్రి వాజిద్ అలీషా కన్నుమూసారు. ఆ అవకాశాన్ని అందిపుచ్చుకుని, బిర్జీస్ ఖదీర్ రూపంలోఉన్న అడ్డును తొలగించుకునేందుకు బ్రిటీషర్లు కుటిల యత్నాలను ప్రారంభించారు. బిర్జీస్‌కు ఆశ చూపించి, ఆయనను ఆకర్షించి తమ దారికి తెచ్చుకోవాలని ఎత్తులు వేశారు. అవధ్ పాలకునిగా తనకు జన్మసిద్ధంగా లభించిన హక్కును వదలుకుంటే, భారీ నజరానాను అందచేస్తామని కంపెనీ అధికారులు వర్తమానం పంపారు. మాతృభూమికి ఆంగ్లేయుల నుండి స్వేచ్ఛను ప్రసాదించటం తప్ప మరొకటి తనకు ససేమిరా ఇష్టంలేని బిర్జిస్ ఖదీర్ ఆ ప్రతిపాదనలను నిర్ధ్వందంగా తిరస్కరించారు. ఆయన తలదాచుకుంటున్న నేపాల్ సంస్థానాధీశుడు జంగ్ బహుదూర్ బ్రిటీష్ పాలకవర్గాల తొత్తు కావటంతో అవసర సమయంలో అటునుండి ఎటువంటి సహకారం అందించకపోగా, నేపాల్ వదలి పోవాల్సిందిగా బిర్జీస్ మీద వత్తిడి తెచ్చాడు. ఆ పరిస్థితులలో





అష్టకష్టాలు పడుతూ కూడా, శత్రువును తునుమాడే సంకల్పాన్ని, స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను మాత్రం బిర్జిస్ ఖదీర్ విడువలేదు.

ఆ చివరి దశలో ప్రఖ్యాత రాజ కుటుంబం పడుతున్న ఇక్కట్లను గమనించిన నేపాల్ రాజు కొంత దిగి వచ్చి మిర్జా బిర్జిస్ ఖదిర్‌కు ఉన్నత సైనికాధికారి హోదాను కల్పించి, ఆర్థికంగా సదుపాయాలలో కొంత మేరకు ఆదుకున్నా, కీలకసమయాలలో అంగ్లేయులకు అనుకూలంగా వ్యవహరించాడు. ఈ గత్యంతరం లేని పరిస్థితులలో బిర్జిస్ ఖధీర్ అజ్ఞాతం నుండి బయటపడ్డారు. ఆయన బయటకు రావటంతో తండ్రి వాజిద్ అలీషా వారసుడిగా ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రకటించిన పెన్షన్ కోసం నవాబు కుటుంబీకులు తగాదా పడసాగారు. ఆ సమస్యను పరిష్కరించుకునేందుకు కలకత్తా రావాల్సిందిగా బ్రిటీషు అధికారులు మిర్జా బిర్జిస్ ఖదీర్ ఆహ్వానం పంపారు.

ఆ ఆహ్వానం వెనుకనున్న కుట్రను గ్రహించలేకపోయిన మిర్జా బిర్జిస్ ఖదీర్ కలకత్తా సందర్శనకు సుముఖత వ్యక్తం చేశారు. ఆ సమయంలో ఆయన హజ్ యాత్ర కూడా చేయ సంకల్పించారు. మిర్జా హజ్ చేయదానికి మక్కాకు వెళ్ళాలనుకున్నారు. ఆ ప్రయత్నంలో ఇండియా మీదుగా వెళ్ళాల్సి వచ్చింది. అన్నీ కలసి వస్తాయని అమాయకంగా భావించిన బిర్జిస్ ఖదీర్ కలకత్తాకు బయలుదేరారు. ఆ అవకాశాన్ని వినియోగించుకున్న బ్రిటీష్ అధికారులు ఆయనను నమ్మబలికి కలకత్తా వచ్చేలా చేసారు. కలకత్తా వచ్చిన బిర్జిస్ ఖదిర్ గౌరవార్థం 1893 ఆగస్టు 13వ తేదిన ఆంగ్లేయులు రాచవిందు ఏర్పాటు చేశారు. ఆ విందుకు కుమారుడు ఖుర్షీద్ ఖదీర్, కుమార్తె జమాల్ ఆరా బేగంలతో సహా బిర్జిస్ ఖదీర్ హజరయ్యారు. ఆంగ్లేయులు ఓ పథకం ప్రకారంగా విందు కోసం తయారు చేసిన ఆహార పదార్థాలలో విషం కలిపి, ఆ పదార్థాలను ఆ రాజకుటుంబీకులకు వడ్డించారు. పరాయి పాలకుల ఆతిధ్యంలో నున్న కుట్రను గ్రహించలేక, అమాయకంగా విషాహారాన్ని స్వీకరించిన బిర్జిస్ ఖదీర్, ఇరువురు బిడ్డలతో సహా ప్రాణాలు విడిచారు. ఆయన భార్య మొహబత్ ఆరా బేగం, చిన్న కుమార్తె హుస్నా అదా బేగం ఆ విందుకు హాజరు కాకపోవటంతో బ్రిటీషర్ల ప్రాణాంతక కుట్ర నుండి బతికి బయపడి బట్టకట్టగలిగారు. ( *అవధ్ కి బేగం* ( హిందీ), డాక్టర్ సుధా త్యాగి, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1992, పేజీ 20 )

ఈ విధంగా చివరి వరకు స్వతంత్ర అవధ్ కోసం తపించి, అందుకు గాను ఒంటరి పోరాటం సాగించిన మిర్జా బిర్జిస్ ఖదీర్ 1893 ఆగస్టు 13వ తేదిన అంగ్లేయుల కుట్రకు బలయ్యారు. ◆

### శత్రువును తునుమాడి పుట్టినగడ్డ రుణం తీర్చుకున్న పులిబిడ్డడు

# 33.పులి బిడ్డ మహమ్మద్ అబ్దుల్లా

మాతృభూమి మీద ఏర్పడిన అపరిమిత గౌరవాభిమానాలు, లక్ష్యాన్ని త్వరితగతిన సాధించాలని మనస్సులో స్థిరపడిన కాంక్ష, స్వాతంత్ర్య సంగ్రామంలో వ్యక్తిగత త్యాగాలకూ పురికొల్పాయి. శత్రువు బలసంపన్నుడైనా బలమైన స్వేచ్ఛాకాంక్షతో రగిలిపోతున్న యోధులు ప్రాణాలను తృణప్రాయంగా భావించి శత్రువుమీద ఒంటరిగా యుద్ధభేరి మ్రోగించారు.

ఆ విధంగా ఆంగ్లేయుల మీద తిరగబడిన మహమ్మద్ అబ్దుల్లా పంజాబ్ రాష్ట్రంలోని, ప్రస్తుతం పాకిస్థాన్‌లో గల పెషావర్‌లో జన్మించారు. వహాబీల పాఠశాలలో విద్యాభ్యాసం పూర్తియ్యాక అబ్దుల్లా కూడా వహాబీ ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. అచిర కాలంలోనే నిబద్ధతగల వహాబీ కార్యకర్తగా ఆయన రూపొందారు.

ఆనాడు వహాబీలను అణిచివేసేందుకు బ్రిటీషు ప్రభుత్వం వ్యవహరిస్తూ,Detention Regulation Act 1818 చట్టాన్ని తీసుకొచ్చింది. ఈ చట్టాన్ని ఉపయోగించి వహాబీలను అణచివేసేందుకు బ్రిటీష్ పోలీసులు కుట్ర పన్నారు. బ్రిటీష్ న్యాయవ్యవస్థ పోలీసులతో మిలాఖత్ అయ్యింది. ఉద్యకారులను అరెస్టు చేసి ఎటువంటి విచారణ లేకుండా హింసలకు గురిచేయసాగారు. నామమాత్రంగా విచారణలు జరిపి, పలువురికి ప్రవాసశిక్షలు విధించారు. భయంకర చిత్రహింసలు, కాల్చివేతలు, ఉరిశిక్షలు, నిర్భంధాలు విముక్తి పోరాట యోధులకు సర్వసాధారణమయ్యాయి.





1869 జూలైలో అమీర్ ఖాన్, హస్మత్ ఖాన్, ముబారక్ అలీ అను ప్రముఖ వహాబీ నేతలను బ్రిటీషు పోలీసులు అరెస్టు చేసారు. ఆ నాయకులలో అమీర్ ఖాన్ నిర్బంధంలో మృతిచెందారు. పోలీసుల భయానక చిత్రహింసల కారణంగా హస్మత్ కన్ను మూసారు.

ఈ శిక్షలతో వహాబీలు ఆగ్రహంతో రగిలిపోయారు. ఈ కేసులను ఉన్నత న్యాయస్థానానికి అప్పీల్ చేసుకోగా, కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ నార్మన్ ఆ అప్పీలును కొట్టివేశాడు. పలువురు ప్రముఖ నేతలు నిందితులుగా నున్న చారిత్రాత్మక పాట్నా కేసు అప్పీలును కూడా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి నార్మన్ వివక్షతో వ్యవహరించి దారుణమైన ప్రవాస శిక్షలను ఖాయం చేశాడని వహాబీలు భావించారు. ఈ శిక్షలు, అప్పీళ్ళ పర్యవసానాన్ని ఊహించిన మహమ్మద్ అబ్దుల్లాలో ఆగ్రహం కట్టలు తెంచుకుంది. ప్రతీకార జ్వాల రగిలింది. పరాయి పాలకుల తొత్తుల మీద పెరిగిన కసి తీర్చుకోవాలని నిర్ణయించుకున్నారు.

ఆంగ్ల న్యాయమూర్తి నార్మన్‌ను హతం చేయడానికి పథకం తయారు చేసుకున్నాడు. ఆ న్యాయమూర్తి రాకపోకల మీద కన్నేశాడు. అది 1871 సెప్టంబర్ 20వ తేదీ. కలకత్తా ఉన్నత న్యాయస్థానం వద్ద నార్మన్ కోసం మహమ్మద్ అబ్దుల్లా ఎదురు చూస్తున్నారు. వలసపాలకుల దౌష్ట్యాన్ని ఎదుర్కొంటూ పోరాడుతున్న వహాబీ వీరుల శిక్షలను ఖాయపర్చిన నార్మన్ న్యాయస్థాన భవనం మెట్లు దిగుతూ కంటపడ్డారు. ఆలస్యం చేయకుండా అబ్దుల్లా ముందుకు దూసుకుపోయాడు. జస్టిస్ నార్మన్ వెంటనున్న రక్షణ వలయాన్ని ఛేధించుకుని రివ్వున ముందుకెళ్ళి నార్మెన్ మీద ఆకస్మిక దాడి చేశాడు. ఏం జరిగిందో గ్రహించే లోపున అబ్దుల్లా తన ప్రతీకారం తీర్చుకున్నాడు. జస్టిస్ నార్మన్‌ను హతమార్చారు.

అబ్దుల్లాను పోలీసులు పట్టుకున్నారు. ఆయన మీద హత్యకేసు నమోదైంది. యారైంది.దాస్య విముక్తి కోసం పాటుపడుతున్న ఉద్యమకారులను బలిగొన్న విదేశీయుడ్ని హతం చేయటం తన విధిగా భావించినట్టు అబ్దుల్లా న్యాస్థానంలో వెల్లడిస్తూ, తన లక్ష్యం నెరవేరినందున ఇక తనకు ఏ శిక్ష విధించినా చింత లేదన్నాడు. ఆయనకు ఉరిశిక్ష విధించారు.

1871లో అబ్దుల్లాకు విధించిన ఉరిశిక్షను అమలు చేశారు. ఆయన మృతదేహాన్ని అంత్యక్రియల కోసం అప్పగించమని బంధువులు కోరినా, నిరాకరించిన ఆంగ్లేయాధికారులు మత సంప్రదాయం ప్రకారంగా ఖననం చేయాల్సిన వీరుడి అబ్దుల్లా భౌతికకాయాన్ని తగులబెట్టించి, తమ రాక్షస ప్రవృత్తిని, అబ్దుల్లా పట్ల ఉన్న భయాన్ని, ఆగ్రహాన్ని ప్రకటించుకున్నారు. ( " He was sentenced to death and in fury of revenge his body was cremated by the British instead of being buried " , *Encyclopaedia of Muslim Biography* Vol. I, Ed. Nagendra Kr. Singh, APH publishing Corporation, New Delhi, 2001, Page 141). ◆

## మాతృ భూమి విముక్తి కోరుతూ ఉరిని ముద్దాడిన సింహం

# 34. మహమ్మద్ ' షేర్ ' అలీ

స్వాతంత్ర్య సంగ్రామంలో వ్యక్తిగత పోరాటాలు, ఉమ్మడి ఉద్యమాలు సాగాయి. ప్రజలు ఏకోన్ముఖంగా సాగి నిర్వహించిన ఉద్యమాలలో సంఘటితశక్తి, బలమైన స్వేచ్ఛాకాంక్ష వ్యక్తం కాగా, వ్యక్తిగత పోరాటాలలో మాత్రదేశం పట్ల ప్రగాఢమైన ప్రేమ, శత్రువులైన పరాయిపాలకుల పట్ల తిరుగులేని ద్వేషం, అత్యున్నత స్థాయి ధైర్యసాహసాలు చాలా స్పష్టంగా బహిర్గతమయ్యాయి. ఈ మేరకు వ్యక్తిగత త్యాగాల బాటన నడిన యోధులలో మహమ్మద్ షేర్ అలీ ఒకరు.

మహమ్మద్ షేర్ అలీ అప్పటి ప్రస్తుత పాకిస్థాన్‌లోని పంజాబ్ రాష్ట్రం పెషావర్‌లో 1842లో జన్మించారు. తన పేరులోనే **' షేర్ '** (సింహాన్ని) ని ఇముడ్చుకున్న ఆయన నిజజీవితంలో సింహంలానే వ్యవహరించాడు. చిన్న నాటనే వహాబీ ధార్మికతను వంటబట్టించుకున్న ఆయన పరాయి పాలకుల మీద వహాబీ వీరులు సాగిస్తున్న పోరాటాలతో ఉత్తేజితులయ్యారు. ఆయన ఉద్యోగం రీత్యా పలుప్రాంతాలు తిరిగి 1863లో అంబాలలో స్థిరపడ్డారు. ఒకసారి గ్రామంలో జరిగిన ఘర్షణ పాల్గొన్న కారణంగా 1868 ఏప్రియల్ 2వ తేదిన ఉరిశిక్ష ప్రకటించినా, ఆయన ప్రవర్తన వలన ఆ ఉరిశిక్షను ద్వీపాంతరవాస శిక్షగా మార్చి ఆయనను 1869లో అండమాన్ జైలుకు పంపారు.





వహాబీ ఉద్యమ కార్యకర్తగా దేశం కోసం, స్వజనుల కోసం ఏమీ చేయకుండానే జైలులో ఇరుక్క పోయానని ఆయన బాధపడసాగారు. అంగ్లేయులలో ఒక్కరినైనా పరిమార్చాలని 1869లో నిశ్చయించుకున్నారు. అందుకుగాను పథకం రూపొందించుకుని, తన ఎత్తుగడలను మార్చారు. జైలులో మంచిగా ప్రవర్తిస్తూ, అధికారులకు సన్నిహితులయ్యారు. ఆ కారణంగా షేర్ అలీకి కొంత స్వేచ్ఛ లభించింది. ఆయన తన పథకంలో భాగంగా, జైలులోని ఖైదీలకు క్షవరం చేసేందుకు అంగీకరించారు. అందుకు అవసరమైన సామాగ్రి ఆయనకు లభించింది. ఆ సామాగ్రిలో ఒక పదునైన కత్తి కూడా ఉంది. ఆ కత్తిని శతృసంహారానికి ఉపయోగించుకోలని ఆయన అనుకున్నాడు.

సమయం గడవ సాగింది. సమయంతోపాటుగా మహమ్మద్ షేర్ అలీ మనస్సులోని లక్ష్యం మరితంగా దృఢపడసాగింది. చివరకు 1872 ఫిబ్రవరి 8వ తేదీన బ్రిటీష్ వైశ్రాయ్ లార్డ్ మేవ్ అండమాన్ జైలుకు వచ్చాడు. ఆ అవకాశాన్ని వృధాగా పోనివ్వదలచుకోలేదు. క్షురకర్మల సామాగ్రిలో ఉన్న పదునైన కత్తిని తయారుగా ఉంచుకున్నాడు.' **షేర్** ' లాగా వేట కోసం ఆయన ఎదురు చూడసాగారు. ఆంగ్లేయుడు లార్డ్ మేవ్ జైలు సందర్శిస్తున్నాడు. అదను దొరికింది. అకలిగొన్న సింహంలా అకస్మాత్తుగా కత్తితో లార్డ్ మేవ్ మీద లంఘించి అతడ్ని హతమార్చి తన లక్ష్యాన్ని నెరవేర్చుకున్నారు.

ఆ తరువాత జరిగిన విచారణలో లార్డ్ మేవ్‌ను అంతం చేసింది తానేనని ఆయన అంగీకరించారు. ఆ రోజున ఆ ' **సింహం** ' పలికిన పలుకులు భావితరాల విప్లవకారులకు ఉత్తేజాన్ని ఇచ్చాయి. **"...నా మాతృభూమి విముక్తి కోసం ఏనాడయితే నేను పోరాట దీక్ష చేపట్టానో, అనాడే నా ప్రాణం మీద తీపిని వదలుకున్నాను...మన శత్రువులలో ఒకరిని నేను అంతం చేసాను...నేను నా కర్తవ్యాన్ని నిర్వహించాను...నా పవిత్ర కార్యంలో భగవంతుని వద్ద మీరంతా నాకు సాక్ష్యం...'** అన్నాడు. ( *Hindustan Musalmano Ka Jang-e-Azadi Mein Hissa*, (*Hindi*) Syed Ibrahim fikri, New Delhi 1999, Page 30)

చివరకు విచారణ పూర్తిచేసి షేర్ అలీకి మరణదండన విధించారు. 1872లో ఉరిశిక్ష అమలు జరిగిన రోజున ఆయన మాట్లాడుతూ, **నేను చేసిన పని పట్ల నాకు కించిత్తు బాధపడటంలేదు...ఎంతో గర్విస్తూ, మరణాన్ని స్వీకరిస్తున్నాను,** ( Ibid, Page 30 ) అన్నారు. ఖురాన్ గ్రంథంలోని ఆయత్‌లను మననం చేసుకుంటూ, ప్రశాంతంగా ఉరి త్రాడును స్వయంగా స్వీకరించారు. ఈ సందర్భంగా,' **వలస పాలకుల నుండి మాతృదేశ విముక్తి కోసం పోరాడిన ప్రతి విప్లవకారుడు షేర్ అలీ ధైర్యసాహసాలను, నిబద్ధతను ఆదర్శంగా తీసుకున్నార'** ని, శ్రీ శాంతిమోయ్ రాయ్ *Freedom Movement and Indian Muslims* (పేజీ 18) గ్రంథంలో వ్యాఖ్యానిస్తూ , ఆ వీరునికి ఘనంగా నివాళులు అర్పించారు. ◆

## స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం నినదించిన విజయవాడ వీరుడు

# 35.అమానుల్లా ఖాన్

మాతృదేశాన్ని బ్రిటీషర్ల బానిస బంధనాలనుండి విముక్తి కలిగించేందుకు భారతీయులు పలు మార్గాలలో పోరాడారు. అహింసామార్గం కొందరిదైతే, సాయుధ పోరాటబాట మరికొందరిది. ఈ క్రమంలో ధార్మిక మనోభావాలను జాగృత పరిచి, ఆ దిశగా జనసమూహాలను కదిపి, బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను మోహరింప జేసిన నేతలూ లేకపోలేదు. ఈ మేరకు ఆధ్యాత్మిక మార్గాన సాగారు అమానుల్లాఖాన్.

అమానుల్లాఖాన్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, కృష్ణా జిల్లాలోని విజయవాడ నివాసి. ఆయన తాత సయిాదుల్లా జాగీర్దార్. తండ్రి పేరు తెలియదు. అమానుల్లా ఖాన్ పూర్వీకులు లక్నో నుంచి విజయవాడకు వచ్చి స్థిరపడ్డారని చెబుతారు.తాత జాగీరు తండ్రి హయాంలో ఖర్చు అయిపోయింది. అమానుల్లాకు కొండపల్లి కాగితాల మీద రాసిన ఖురాన్ గ్రంథం, పేదరికం తప్ప తండ్రి మరేమీ ఇవ్వలేదు. అమానుల్లా విజయవాడలోని బంగారుకొట్ల సందులోని ఒక మసీదు సమీపంలో నివసించేవాడు.

పరాయిపాలకులకు ఊడిగం బాధించినంతగా అంటిపెట్టుకుని ఉన్న దారిద్ర్యం అమానుల్లాను బాధపెట్టలేదు. తండ్రి తనకు ధార్మిక మార్గనిర్దేశనం చేసే సంపదను ఇచ్చి వెళ్ళాడని ఆయన స్పష్టం చేసాడు. ఒక కవితలో, నేనెంత అదృష్టవంతుడిని..నా తండ్రి నాకు పేదరికం ఇచ్చాడు, అంటాడు. భయం లేదుగా...ఎంత అదృష్టవంతుడిని....అల్లా





ఎవరో నా తండ్రి నాకు చూపించాడు...నా తండ్రి రాసుకున్న పవిత్ర గ్రంధాన్ని నాకు ఇచ్చాడు...తరగని సిరిసంపదలు పట్టుకుని తిరుగుతున్న వాడిని...అయినా ఏ దొరలు కొల్లగొట్టలేరు కదా. అల్లా తోడుగా చెబుతున్నా, అంటూ ధార్మిక విషయాలను వివరిస్తూ, ఆ దొంతరలలోనే, తెల్లదొరలు సాగిస్తున్న దోపిడీని అమానుల్లా తన కవితో ప్రస్తావించారు. తెల్లపాలకుల మీద ' నమాజ్ ' అను ఆధ్యాత్మిక ఆయుధంతో పోరాటం సాగించాలని ఆయన భావించాడు. నమాజు ద్వారా తిరుగుబాటు చేయడానికి అల్లా అనుగ్రహాన్ని అర్ధించాడు. ఈ విషయాన్ని మరొక కవితలో ఈ విధంగా చెబుతాడు, భయం లేకుండా స్వేచ్ఛగా నమాజుచేసుకోడానికి, స్వాతంత్ర్యం కోసం తిరుగుబాటు చేయడానికి బలం ఇవ్వు..ఈ నేలమీద ఈ కొండల్లో...నేను చేసే నమాజ్ ప్రతిధ్వనించి తెల్లగుండెలు తారెత్తి పోవాలి..నా సోదరులంతా నాతోపాటుగా స్వేచ్ఛగా సర్వేశ్వరుడ్ని ధ్యానించాలి, అన్నాడు.

అమానుల్లా కవి. ఆయన మార్గం ఆధ్యాత్మిక మార్గం. బ్రిటీషర్ల మీద పోరాటాన్ని ఆయన అల్లా మార్గంలో సాగించాలని అనుకున్నాడు. దాస్య శృంఖలాలు తెగిపోయి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు సిద్ధిస్తే భగవంతుడ్ని తన ఇష్టానురీతిగా ప్రార్ధించుకోవచ్చు. అంటే రాజకీయ స్వాతంత్యం లభిస్తే గాని మత స్వాతంత్ర్యం సాధ్యం కాదని భావించాడు. భగవంతుడ్ని స్వేచ్ఛగా ఆరాధిస్తే స్వాతంత్ర్యం వస్తుంది. సామూహిక ప్రార్ధన ద్వారా ఐకమత్యం ఏర్పడుతుంది. ఐక్యంగా సాగించే పిలుపు భగవంతుడ్ని కరిగింప చేస్తుంది. అల్లా కరుణాకటక్షాల ఫలితంగా విమోచన లభిస్తుంది. ఈ భావనలతో ఈనాడు గాంధీ పర్వతంగా పిలువబడుతున్న ఆనాటి ' ఆర్‌హిల్ ' మీద కూర్చొని ధార్మికతను మేళవించిన తిరుగుబాటు కవిత్వం రాసాడు. ఆ పర్వతం మీద నుండి గొంతెత్తి కవితా గానం చేశాడు.

ఒకసారి ఆయన పర్వతం మీద నుండి ప్రార్ధనకు రమ్మని అజాఁ ఇస్తుండగా, గ్లాడ్ స్టోన్ అను తెల్లదొరకు నిద్రాభంగం కల్గిందట. అందుకు ఆగ్రహించిన ఆ తెల్లవాడు అమానుల్లాను అరెస్టుచేశాడు. కొరడాతో చితకబాదాడు. ఆ సంఘటన విజయవాడలో సంచలనం కలిగించింది. ఆనాడు తగిలిన కొరడా దెబ్బలు అమానుల్లాను బాధించటమే కాక, కదుములు కట్టి పుండ్లు పట్టాయి. అవి భరింపరాని బాధకు కారణమయ్యాయి. ఆయన ఆ బాధను అలాగే భరిస్తూ, ఎంతో సంతోషంగా ఉంది. ప్రార్దనతో ఐకమత్యం ..ఐక్యమత్యంతో స్వాతంత్ర్యం...స్వాతంత్ర్యంతో ప్రార్దన...ప్రార్ధనతో భగవంతుని రాజ్యం...భగవంతుని అనుగ్రహంతో ప్రజల రాజ్యం, అంటూ కవితలను అల్లాడు.

అవి 1875 నాటి రోజులు. మానవత్వం కంటే మతం, మతం కంటే మత శాఖలు జనం మీద పెత్తనం సాగిస్తున్న రోజులు. ఆ నాటి సంక్షోభ కాలంలో ఆహేతుకమైన మత విశ్వాసాల మీద, మత శాఖల మీద, మత శాఖల ఆసరాగా తమ పబ్బం గడుపుకుని

బ్రతికేస్తున్న వంచకుల మీద, తమ వ్యక్తిగత స్వార్ధ ప్రయోజనాల కోసం జనం మధ్య మానసిక విభేదాలను సృష్టిస్తున్న పాలకుల మీద తిరుగుబాటు చేయటం అంటే సాహసమే. అయినప్పటికీ నిర్భయుడైన అమానుల్లా తిరుగుబాటుకు పిలుపునిచ్చాడు. ఆ విధంగా 1875 నాటికే స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం బెజవాడ గడ్డ మీద నుంచి పాలికేక వేసిన బెజవాడ బిడ్డడయ్యాడు అమానుల్లా.

అమానుల్లా వైఖరి తెల్లదొరకు కొరుకుడు పడలేదు. ఆయనను అరెస్టు చేసి శిక్షవిధింప జేసేందుకు సాకు దొరకలేదు. ఆయన మీద నిర్దిష్టమైన ఆరోపణలు లేవు. సమస్యను దారి మళ్ళించేందుకు ఆలోచిస్తున్న ఆంగ్లేయుడు గ్లాడ్‌స్టోన్‌కు విభజించు - పాలించు కుటిల నీతి గుర్తుకు వచ్చింది. అమానుల్లా ముస్లింలను హిందువులకు వ్యతిరేకంగా రెచ్చగొడుతున్నాడని ప్రచారం చేశాడు. హిందూ-ముస్లింల మధ్యన వైషమ్యం సృష్టించాడు. అందుకు తగినట్టుగా దుష్ప్రచారం సాగించాడు. ఆ ప్రచారంతో జనసమూహాలు రెచ్చిపోయాయి. ఒక చోట మసీదు దగ్గర అపవిత్రం కనబడిందంటే, మరోచోట దేవాలయం వద్ద మరేదో జరగరానిది జరిగిందని ప్రచారం సాగింది. జనసముదాయాలు ఘర్షణలకు దిగాయి.

ఈ కల్లోల వాతావరణం వలన అమానుల్లా కోరుకుంటున్న ఐక్యత క్షీణించింది. ఆ పరిస్థితులు ఆయనను మానసికంగా దెబ్బతీశాయి. ఆయన కోరుకున్న ఐక్యత చిన్నాభిన్నం కావటంతో కృంగిపోయాడు. తెల్లవాడి కొరడా దెబ్బలు పుండ్ల రూపంలో బాధించసాగాయి. ఆయన పరిస్థితి విషమించింది. మానసికంగా ఆందోళన చెందుతున్న అమానుల్లాకు ఆయన శరీరం సహకరించటం పూర్తిగా మానేసింది. ప్రజల ఐక్యత సాధించనిదే తాము కోరుకున్న స్వేచ్ఛ లభించదని ఆయన దృఢంగా నమ్మాడు. జన సమూహాల మధ్యన ఐక్యత ఆకాంక్షిస్తూ, భగవంతుడ్ని ప్రార్థించేందుకు పర్వంతం మీదకు వెళ్లిపోయాడు. ప్రజలను ఉన్మాదం నుండి దూరంగా ఉంచమంటూ అల్లాను కోరుతూ ప్రార్ధనలు సాగించాడు. ఆ ప్రయత్నంలో అవిశ్రాంతంగా ప్రార్ధన చేస్తూ అమానుల్లా ప్రాణాలు వదిలాడు.

అమానుల్లా ఖాన్ పుట్టుపూర్వోత్తరాలు గురించి, ఆ తరువాత ఆయన నిర్వహించిన కార్యక్రమాల గురించి తెలియడం లేదు. ఆయన కవితలు ఆయన మార్గాన్ని చూచాయగా తెలుపుతున్నాయి. ' ఎ గైడ్ టూ గుంటూరు ' లోని అంశాలు, ఆనాటి పోలీసుల నివేదికల ద్వారా, బ్రిటీష్ దొరల దురహంకారాన్ని ప్రతిఘటించి, ప్రార్ధన ద్వారా స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల సాధనకు పిలుపునిచ్చిన విశిష్ట యోధుడిగా సాక్షాత్కరిస్తాడు. ◆

**( చరిత్ర పరిశోధకులు, ప్రముఖ పాత్రికేయులు శ్రీ యల్.వి. రమణ గారి సహకారంతో )**

# ః అనుబంధం ః

# ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం అమర వీరులు

**అబ్బాస్ బేగ్, మిర్జా** ః ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం ఆగ్రాలో 1823లో జననం. కోట (KOTA) సంస్థానం సైన్యంలో దఫేదార్‌గా పని చేస్తూ తిరుగుబాటులో ప్రముఖ పాత్ర. బ్రిటీష్ సైన్యాలతో, కోట సంస్థానం సైన్యాలతో సాగిన పలు పోరాటాలలో పాల్గొన్నారు. చివరకు కోట సంస్థానాధీశుడు, బ్రిటీషర్ల తొత్తు మహారావు సైనికబలగాలు అరెస్టు చేసి, 1858లో ఆయనను అంతం చేశాయి.

**అబ్దులా హాజీః** ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొని పట్టుబడి తప్పించుకున్నారు. బ్రిటీష్ అధికారి ఫ్రేజర్‌ను హతం చేశారన్న ఆరోపణ మీద 1861లో అరెస్టు చేసి, విచారణ తంతు నిర్వహించి, ఉరిశిక్ష విధించి, 1862 ఫిబ్రవరిలో శిక్ష అమలు చేశారు.

**అబ్దుల్ జలీల్, మౌల్వీ** ః ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఛటారి (CHATARI )నివాసి. తిరుగుబాటు యోధులకు నాయకత్వం వహించారు. 1857 ఆగస్టు 21న అలీఘర్ వద్ద బ్రిటీష్ సైనిక దళాలతో సాగిన పోరులో పాల్గొన్నారు. ఆ సమయంలో బ్రిటీష్ అధికారి కెప్టన్ ముర్రేతో సాగిన ద్వంద్వ యుద్ధంలో అమరులయ్యారు.

**అబ్దుల్ ఖయ్యాం ఖాన్, పఠాన్** ః ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు నివాసి. తిరుగుబాటులో చురుకైన పాత్ర వహించినందుకు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించారు.





**అబ్దుల్ రహీం ఖాన్** ః ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం ముజఫర్‌పూరు లోని థానా భవన్‌లో జననం. జాగిర్దార్ ఖ్వాజీ నియామత్ అలీ కుమారుడు. బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా సాగిన తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించటం మాత్రమే కాకుండా, ఆయన పెద్దన్న ఖ్వాజీ ఇనాయత్ అలీ సాగించిన సాయుధ పోరుకు క్రియాశీలక సహకారాన్ని అందించారు. తిరుగుబాటును విజయవంతం చేసేందుకు ముగ్గురు అనుచరులతో కలసి మారువేషాలలో ముజఫర్‌పూరుకు రాగా, ఓ పరిచయస్థుని నమ్మకద్రోహం వలన బ్రిటీష్ సైన్యాలకు పట్టుబడ్డారు. ముగ్గురు అనుచరులతోపాటుగా ఆయన ఉరిశికక్షు గురయ్యారు.

**అబ్దుల్ రెహమాన్ ఖాన్** ః హర్యానా రాష్ట్రం ఝుజ్జార్ (Jhajjar) జిల్లా రోథక్ నివాసి. ఆయన ఝుజ్జార్ పాలకుడు. ఢిల్లీ రక్షణకూ, ఢిల్లీలోని పోరాటయోధులకూ అండగా తన దళాలను పంపారు. ఆ తరువాత బ్రిటీష్ సైనిక బలగాలు ఆయనను అరెస్టు చేసి, రాజద్రోహం నేరం ఆపాదించి, ఢిల్లీలో సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపి, 1857 డిసెంబరు 14న ఉరిశిక్ష విధించారు. డిసెంబరు 23న ఢిల్లీలోని కొత్వాలి వద్ద ఉరిశిక్ష అమలు జరిపి, మృతదేహాన్ని పక్కన ఉన్న గోతిలోకి నిర్లక్ష్యంగా విసిరేశారు. ఆయన ఆస్తిపాస్తులన్నిటినీ ప్రభుత్వం జప్తు చేయగా నవాబు కుటుంబీకులు అనాథలయ్యారు.

**అబ్దుల్ రెహమాన్, పఠాన్** ః ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో ప్రముఖ పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేశాయి. ఫిబ్రవరి 23,1857న ఉరికి గురయ్యారు.

**అబ్దుల్లా , షేక్** ః ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో ప్రముఖ పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి, నవంబరు 18, 1857న ఉరితీశాయి.

**అబ్దుల్లా** ః ఢిల్లీ నివాసి. బ్రిటీషు సైన్యంలోని కాల్బలంలో అధికారి. అంబాల సైనిక స్థావరంలో బాధ్యతలు నిర్వహిస్తూ, బ్రిటీషు సైన్యాన్ని వదలి వచ్చి, తిరుగుబాటులో ప్రముఖ పాత్రవహించారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, సైన్యాన్ని వీడినందుకు, తిరుగుబాటులో పాల్గొన్నందుకు విచారణ జరిపి 1857 జూన్‌లో ఉరితీశారు.

**అబిద్ అలీ ఖాన్** ః ఉత్తరప్రదేశ్ రాష్ట్రం మొరాదాబాద్ నివాసి. తిరుగుబాటు సమయంలో తిరుగుబాటు సేనలకు మొరదాబాదులో క్రియాశీలక మార్గదర్శకత్వం. బ్రిటీషు సేనలు మొరాదాబాదును పునరాక్రమించుకున్నాక 1858 ఏప్రిల్ 25న అరెస్టు చేసి, తిరుగుబాటు నేతలు నవాబ్ అసద్ అలీ ఖాన్, సజ్జాద్ అలీ ఖాన్, షేక్ అమానుల్లా ఖాన్ తదితరులతోపాటుగా ఆయనను 1858 ఏప్రిల్ 27వ తేదిన సామూహికంగా ఉరితీశారు.

**అబీదుద్దీన్ అబ్బాస్, మిర్జా** ః ఢిల్లీనివాసి. మొగల్ రాజవంశీకుడు. మిర్జా జహీరుద్దీన్ కుమారుడు. తిరుగుబాటు సమయంలో ఢిల్లీని తిరిగి ఆక్రమించుకునేందుకు

తరలి వస్తున్న బ్రిటీషు సేనలను నిరోధించటంలో భాగస్వామ్యం. బ్రిటీషు సైనికాధికారి కెప్టన్ హడ్సన్ ఆయనను హుమాయూన్ సమాధి వద్ద పట్టుకుని,1857 సెప్టెంబరు 22న ఢిల్లీ గేటువద్ద కాల్చి చంపాడు.

**అబూబకర్, మీర్జా** : ఢిల్లీ నివాసి. మొగల్ రాజవంశీకుడు. రెండవ బఃహదూర్ షా మనుమడు. 1857 తిరుగుబాటు సమయంలో చక్రవర్తి సేనలకు నాయకత్వం. బ్రిటీషు సైనికాధికారి కెప్టన్ హడ్సన్ ఆయనను హుమాయూన్ సమాధి వద్ద పట్టుకుని,1857 సెప్టెంబరు 22న ఢిల్లీ గేటువద్ద కాల్చి చంపాడు.

**అచ్చేంఖాన్** (Achchham Khan) : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఫైజాబాద్ జిల్లా, అయోధ్య నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. 1857లో ఆయనను పట్టుకుని, ఆయన సహచరుడు శ్రీ శంభూ ప్రసాద్ శుక్లాతోపాటుగా చంపేశారు.



**1856 నాటికి కొవ్వుతో పూయబడిన కొత్త రకం తూటాలను కంపెనీ వాడకంలోకి తెచ్చింది. ఆ తూటాల వినియోగం తమ మత విశ్వాసాలకు విఘాతమని భావించి సైనికులు ఆగ్రహించారు. తుపాకుల శుభ్రం చేసుకుంటున్న కంపెనీలో సైన్యంలోని భారతీయ సైనికులు.**

**అజాజ్ షా** : మొగల్ రాజవంశీకుడు. మీర్జా నాజిం భక్త కుమారుడు. అవధ్‌లో బ్రిటీషు సైన్యాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు సేనలకు నాయకత్వం వహించాడు. ఆయన అరెస్టుకు జరుగుతున్న ప్రయత్నాలను వమ్ముచేస్తూ, మక్కా మీదుగా రష్యా చేరుకున్నారు. ఆ తరువాత ఆయన మక్కాలో 1895లో కన్నుమూశారు.

**అస్గరీ బేగం** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ముజఫర్‌పూర్ నగరంలో 1811 జులై 5వ తేదిన అస్గరీ బేగం జన్మించారు. 1857 నాటి పోరాటంలో ఖ్వాజీ అబ్దుల్ రహిమాన్, ఆయన సోదరులు ప్రముఖ పాత్ర వహించారు. ఆ వీరులను బ్రిటీష్ ప్రభుత్వం ఉరితీసింది. అటువంటి వీరులను కన్న వీరమాత అస్గరీ బేగం. ఆ తిరుగుబాటులో పాల్గొన్న ప్రతి ఒక్కరూ తన బిడ్డలేనని భావించిన విశాలహృదయం అమెది. తిరుగుబాటు వీరులకు ఆశ్రయం కల్పించటం, ఆహార పదార్ధాలు, ఆయుధాలు అందించటంలో సహాయపడ్డారు. ఈ విషయం తెలిసిన సైనికాధికారులు ఆమెను బంధించారు. ఆమె మీద రాజద్రోహ ముద్రవేసారు. తిరుగుబాటు దారుల రహస్యాలు చెప్పమని వేధించారు. అధికారులతో సహకరించకపోతే, సజీవదహనం చేస్తామని బెదిరించారు.ఆ హెచ్చరికలు ఆమె పట్టుదలను ఏమాత్రం సడలించలేకపోయాయి. భయంకర చిత్రహింసల పాల్జేసినా లొంగకపోవటంతో ఆగ్రహించిన అధికారులు ఆమెను సజీవదహనం చేశారు. ఆ మంటల్లో ఆహుతైపోతున్నా చివరి వరకు తిరుగుబాటు దారుల రహస్యాల గురించి పెదవి విప్పకుండా, అన్ని హింసాత్మక చేష్టలను భరించి అస్గరి బేగం సజీవంగా దహనమైపోయింది.





**అఫ్సర్ యార్ ఖాన్, నవాబ్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో చురుకైన పాత్ర. అరెస్టు చేసి, తిరుగుబాటు, కుట్రల నేరారోపణలు చేసి ఢిల్లీలో ఉరితీశారు.

**ఆఘా హుస్సేన్ పఠాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో చురుకైన పాత్ర. 1857లో అరెస్టు చేసి, తిరుగుబాటు, కుట్రల నేరారోపణలు చేసి 1858 ఫిబ్రవరి 22న ఉరితీశారు.

**అహ్మూ ఖాన్** : బీహార్ రాష్ట్రం భాగల్పూరు జిల్లా నివాసి. తిరుగుబాటులో క్రియాశీలక పాత్ర. బ్రిటీషర్లకు సహకరిస్తున్న షాహదత్ అలీ అనునతనిని హతమార్చాడని, తిరుగుబాటులో పాల్గొన్నాడనీ ఆరోపణల మీద 1857 అక్టోబరు 10న ఉరి తీశారు.

**అహమ్మద్ బక్ష్ , మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. మీర్జా ఖాదర్ బక్ష్ తనయుడు. 1857 తిరుగుబాటు సమయంలో ఢిల్లీ నగరం రక్షణ కోసం చక్రవర్తి సేనలకు నాయకత్వం వహించాడు. ఆయనను హుమాయూన్ సమాధి వద్ద పట్టుకుని, 1857లో ఉరిశిక్షను విధించారు.

**అహమ్మద్ యార్ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం జలాలాబాద్ జిల్లా షాజహాన్‌పూరు నివాసి. జలాలాబాద్ తహసిల్దార్. తిరుగుబాటులో పాల్గొని, తిరుగుబాటు ప్రభుత్వంలో జలలాలాబాద్ 'నాజిం'గా బాధ్యతలు నిర్వహించారు. ఆ తరువాత ఎప్రిల్ 20వతేది 1858లో బ్రిటీషు సేనలు అరెస్టు చేసి కాల్చి చంపాయి.

**అహ్మదుల్లా ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బదౌన్ (BUDAUN) నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించి, తిరుగుబాటు ప్రభుత్వంలో నాజింగా బాధ్యతలు నిర్వహించారు. రోహిల్ ఖండ్‌లో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. ప్రస్తుత రాజస్థాన్‌లోని రాంపురా అను ప్రాంతంతో బ్రిటీష్ సేనలు సర్వర్ అను ప్రాంతంలో పట్టుకుని ఆయనను

ఫేరంగికి కట్టి దారుణంగా పేల్చివేశారు.

**అహమ్మద్ బక్ష్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ ( GURGAON) నివాసి. షేక్ అమీరుల్లా తనయుడు. తిరుగుబాటులో చురుకైన భాగస్వామ్యం వహించారు. బ్రిటీష్ బలగాలు పట్టుకుని 1857 డిసెంబరు 27న కాల్చివేశాయి.

**అహమ్మద్ బక్ష్ మొఘల్ :** ఢిల్లీ నివాసి. తిరుగుబాటు సమయంలో ముందుకు దూసుకొని వస్తున్న బ్రిటీష్ సైన్యాలను నిలువరించిన తిరుగుబాటు వీరుడు. ఆంగ్ల సేనలు పట్టుకుని 1858 ఫిబ్రవరి 23న కాల్చివేశాయి.

**అహమ్మద్ ఖాన్ :** ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. 1858 ఫిబ్రవరి 27, 1858లో ఉరి తీయబడ్డారు.



**1857 మార్చి 29న 34వ బెంగాల్ స్వదేశీ కాల్బలానికి చెందిన శ్రీమంగళ పాండే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ భేరిని మోగించిన కలకత్తా సమీపంలోని బారక్‌పూర్ ప్రాంతం.**

**అహమ్మద్ ఖాన్ :** ఢిల్లీ నివాసి. బ్రిటీషు బలగాలకు వ్యతిరేకంగా పోరాటాలలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలం అయ్యాక బ్రిటీషు సైనికాధికారి హడ్సన్ ఆయనను రాజస్థాన్‌లోని హిండాన్ జిల్లా సవాయ్ మాధవపూరు వద్ద అరెస్టు చేశాడు. అయితే అక్కడ ఉన్న తిరుగుబాటు దళాలు బంధించాయి. 1857లో ఉరితీతకు గురయ్యారు.

**అహమ్మద్ ఖాన్ :** ప్రస్తుత పాకిస్థాన్ లోని ముల్తాన్ ( MULTAN ) నివాసి. ఖుర్రల్ గిరిజన తెగ నాయకుడు. ఆ ప్రాంతంలోని ఇతర తెగలతో కలసి తిరుగుబాటులో భాగస్వామ్యం. బ్రిటీషు అధికారులకు సమాచారం చేరనివ్వకుండా, ముల్తాన్ మరియు





లాహోర్ నగరాల మధ్యన బ్రిటీషు సమాచార వ్యవస్థను ఛిన్నాభిన్నం చేశారు. పలు చోట్ల బ్రిటీషు సైనిక దళాలతో తలపడి శత్రుసైనికులను పరుగులెత్తించారు. మేజర్ చాంబర్లేన్ ( Major Chamberlain ) దళాలను ముట్టడించారు. పంజాబ్ చీఫ్ కమీషనర్ సర్ జాన్ లారెన్స్ అదనపు బలగాలు పంపటంతో చాంబర్లేనుది పైచేయి అయ్యింది. గొగారియా (GOGARIA) అను చోట బ్రిటీషర్లతో పోరాడుతూ రణభూమిలో ఆయన అమరుడయ్యారు.

**అహమ్మద్ మిర్జా, నవాబ్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రకు పాల్పడ్డాడంటూ నేరారోపణ చేసి 1857 డిసెంబరు 15న ఉరితీశారు.

**ఆజిబ్ ఖాన్ :** హర్యానా రాష్ట్రంలోని అంబాలా సైనికస్థావరంలోని బ్రిటీషు సైన్యంలో ఉద్యోగం. తిరుగుబాటు శంఖారావంతో పోరాటంలో పాల్గొన్నాడు. అరెస్టు చేసి 1858 ఏప్రిల్ 6న కాల్చి చంపారు.

**అంజాన్ అలీ ఖాన్ :** ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని గోరఖ్‌పూర్‌లో జననం. తండ్రి పేరు ముఆజ్జం అలీ. మిడిల్ క్లాసు వరకు చదువు. భూస్వామి. అవధ్ ఆస్థానంలో రిసాల్‌దార్. బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు కార్యకలాపాలను ప్రోత్సహించారు. ఈ విషయాన్ని గ్రహించిన ఆంగ్ల అధికారులు రాజద్రోహానికి పాల్పడవద్దని, తిరుగుబాటు కార్యకలాపాలను మానుకోవాలనీ ఆదేశించారు. బ్రిటీషు అధికారుల హెచ్చరికలు ఖాతరు చేయకుండా బ్రిటీషు వ్యతిరేక పోరాటాలను ముమ్మరం చేశారు. అధికారుల ఆదేశాలను పాటించక పోవటమే కాకుండా వ్యతిరేక కార్యకలాపాలను ముమ్మరం చేయటంతో ఆగ్రహించిన అధికారులు ఆయన కుటుంబ సభ్యులను పట్టుకెళ్ళి చంపివేశారు. అతి కష్టం మీద ఆయనను అరెస్టు చేసి ఉరిశిక్ష విధించారు. బంధువులను, కుటుంబ సభ్యులను భయానకంగా అంతం చేశారు. ఆయనకు సంబంధించిన గుర్తు కూడా ఏమీ మిగలరాదని, ఆయన నివాస గృహాన్ని పూర్తిగా నేలమట్టం చేసి, అక్కడ అధికార కార్యాలయం నిర్మించారు.

**అజ్మీర్ ఖాన్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూరు నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి 1857 నవంబరులో కాల్చి చంపారు.

**అజ్మేరిఖాన్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి 1857 నవంబరు 10న ఉరి తీశారు.

**అక్బర్ ఖాన్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నాగల్ (Nagali) నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి ఫిబ్రవరి 1858లో ఉరి తీశారు.

**అక్బర్ ఖాన్ :** రాజస్థాన్ రాష్ట్రం కరౌలి (Karauli)లో 1820 ఫిబ్రవరి 7న జననం. ఆనాటి కోట సంస్థానంలో ఆయన సోదరుడు మహమ్మద్ ఖాన్ రిసాలుదారు.

బలగాలతో సాగిన పోరాటాలలో ఆయన పాల్గొన్నారు. 1858 మార్చిలో పట్టుబడ్డారు. తిరుగుబాటు విఫలం అయ్యాక, అక్బర్ ఖాన్‌ను ఆంగ్ల సైనికులు కాల్చి చంపారు.

**అక్బర్ ఖాన్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూరు నివాసి. గ్వాలియర్ సైనిక స్థావరంలో సైనికుడు. తిరుగుబాటులో పాల్గొన్నారు. పట్టుకుని 1858 జనవరిలో ఉరి తీశారు.

**అక్బర్ ఖాన్, నవాబ్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టాడంటూ అరెస్టు చేసి 1857 డిసెంబరు 15న ఉరి తీశారు.



**నిరసన వ్యక్తం చేసి ఆదేశాలను ఉల్లంఘించిన భారతీయ సిపాయిల నుండి ప్రమాదం పొంచిఉందని భయపడిన ఆంగ్లేయులు స్వదేశీ సైనికులను నిరాయుధులను చేస్తున్న దృశ్యం.**

**అక్బర్ షికోహ్, మొఘల్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు పట్టుకుని 1858 నవంబరు 18న ఉరి తీశారు.

**అలా ఉద్దౌలా** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1857 అక్టోబరు 3న ఉరి తీశాయి.

**అల్లాఉద్దీన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు పట్టుకుని 1857 నవంబరు 18న ఉరి తీశారు.

**అలీ బహుద్దూర్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని, తిరుగుబాటుకు ప్రజలను రెచ్చకొడుతున్నారన్న ఆరోపణలతో విచారణ జరిపి 1857 నవంబరు 18న ఉరి తీశారు.





**అలీబక్ష్ షేక్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1857 నవంబరు 18న ఉరి తీశాయి.

**అలీగౌర్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టాడని ఆరోపిస్తూ అరెస్టు చేసి 1857 డిసెంబరు 15న ఉరి తీశారు.

**అలీ హైదర్ ఖాన్** : ఢిల్లీ నివాసి. బ్రిటీషు బలగాలతో తిరుగుబాటు దళాలు సాగించిన పోరాటాలలో పాల్గొన్నారు. తిరుగుబాటు దళాల పరాజయం తరువాత జైపూరు సంస్థానం వెళ్ళారు. రాజస్థాన్‌లోని హిండాన్ జిల్లా సవాయ్ మాధవపూరు అను గ్రామంలో బ్రిటీషు బలగాలకు చిక్కారు. హిండాన్ కేంద్రంగా చేసుకుని తిరుగుబడిన రాజస్థాన్ సేనల సహాయంతో బ్రిటీషు బలగాల చెర నుండి తప్పించుకున్నారు. ఆయనను మళ్ళీ పట్టుకుని ఆగ్రా జైలులో ఉంచారు. ఆ తరువాత విచారణ జరిపి 1857లో ఉరి తీశారు.

**అలీం ఖాన్, హఫీజున్నుమర్** : రాజస్థాన్‌లోని టొంక్ ( Tonk State ) సంస్థానం నవాబు వంశంలో 1794లో జన్మించారు. ఆయన టొంక్ నవాబుకు మామ అవుతారు. ఉర్దూ, పర్షియన్ భాషలలో మంచి పండితుడు. 1857లో టొంక్ సంస్థానం రాకుమారులు మహ్మద్ మునీర్ ఖాన్, అజీముల్లా ఖాన్ సహాయంతో సంస్థానంలోని సైనికుల దళాలతో బ్రిటీషు పాలకుల మీద తిరగబడ్డారు. పలు ప్రాంతాల నుండి తిరుగుబాటు దళాలను సమీకరించి వెయ్యి మంది సైనికులకు నాయకత్వం వహించారు. బ్రిటీషు దళాలతో పోరాటాలు సాగిస్తూ ఢిల్లీ రక్షణకు బయలు దేరారు. తిరుగుబాటు విఫలం చెందాక తిరిగి టొంక్ చేరుకున్నారు. టోంక్ సంస్థానంలోని ఈస్ట్ ఇండియా కంపెనీ తొత్తులైన కొందరు అధికారులతో 1858 డిసెంబరులో జరిగిన ఘర్షణలో కన్నుమూసారు.

**అలీ మొహ్మద్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా ఫరీదాబాద్ గ్రామ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టాడంటూ అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 22న ఢిల్లీలో ఉరి తీశారు.

**అలీ మొహమ్మద్, సయ్యద్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1857 అక్టోబరు 3న ఉరి తీశాయి.

**అల్లా బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూరు నివాసి. తిరుగుబాటులో క్రియాశీలక పాత్ర. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1858 ఏప్రిల్ 1న ఉరి తీశాయి.

**అల్లా బక్ష్, షేక్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1857 అక్టోబరు 3న ఉరితీశాయి.

**అల్లాహ్‌దాద్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో క్రియాశీలక పాత్ర. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1858 డిసెంబరు15న ఉరిశిక్ష విధించాయి.

**అల్లాహ్‌దాద్ ఖుదాబక్ష్** : ఉత్తర ప్రదేశ్‌లోని మీరట్ జిల్లా లొహారి (Lohari) గ్రామ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1857లో ఉరి తీశాయి.

**అల్లాదియా** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లా థానాభవన్‌లో జననం. కాపలాదారుడు. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు థానాభవన్ మీద చేసిన దాడికి వ్యతిరేకంగా పోరాడారు.బ్రిటీష్ సైనిక బలగాలు పట్టుకుని ఉరికంబం ఎక్కించాయి.



ఆంగ్లేయుల మీద తిరుగుబాటు ప్రారంభమయ్యాక సమాలోచనలు చేస్తున్న స్వదేశీ సిపాయిలు

**అల్లాహ్‌దిత్తా** : బ్రిటీష్-భారత సైన్యంలోని లూధియానా రెజిమెంటులో సిపాయి. హర్యానాలోని అంబాలా సైనికస్థావరం వద్ద బాధ్యతలు నిర్వహిస్తూ, తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీష్ సైనిక బలగాలు పట్టుకుని, తిరుగుబాటు, కుట్ర, సైన్యాన్ని వదలిపెట్టాడన్న నేరారోపణల మీద సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపి మరణశిక్ష విధింపు. 1858 మే 7వ తేదిన ఉరి తీసారు.

**అల్లాహ్‌వుద్దీన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని ఉరిశిక్ష విధించి 1858 డిసెంబరు 15న శిక్షను అమలు చేశాయి.

**అమన్ అలీ, సయ్యద్** : ఢిల్లీలోని రోహిల్లాసరాయి నివాసి. ఢిల్లీ ఆక్రమణకు





ముందుకు చొచ్చుకు వస్తున్న బ్రిటీషు బలగాలను తరిమికొట్టేందుకు కృషి చేశాడు. శత్రు బలగాలు పట్టుకుని 1858 ఫ్రిబవరి 1న ఉరిశిక్ష విధించాయి.

**అమానత్ అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీష్-భారత సైన్యంలోని గ్వాలియర్ రెజిమెంటులో సిపాయి. తిరుగుబాటు దళాలతో చేరి ఈస్ట్ ఇండియా కంపెనీ బలగాలకు వ్యతిరేకంగా పోరాడారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని ఉరిశిక్ష విధించి 1858 జనవరి 1న శిక్షను అమలు చేశాయి.

**అమానతుల్లా ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని మొరాదాబాద్ నివాసి. మొరాదాబాద్ కేంద్రంగా తిరుగుబాటుకు మార్గదర్శకత్వం వహించారు. స్వతంత్ర రాజ్యాన్ని ప్రకటించారు. తిరుగుబాటు విఫలమయ్యాక 1858 ఏప్రిల్ 25న బ్రిటీష్ బలగాలు మొరాదాబాద్ పట్టణాన్ని తిరిగి స్వాధీనం చేసుకున్నాయి. ఆ తరువాత తిరుగుబాటు వీరులను అరెస్టు చేసి విచారణ జరిపారు. ఆ విచారణలో అమానతుల్లా ఖాన్ తోపాటుగా తిరుగుబాటు యోధులు నవాబ్ అసద్ అలీ ఖాన్, సాజిద్ అలీ ఖాన్, కబీర్ అలీ ఖాన్, అబిద్ అలీ ఖాన్ తదితరులకు ఉరిశిక్ష విధించారు.

అమీర్ అలీ : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ఫైజాబాద్ జిల్లా అయోధ్య నివాసి అయోధ్యలోని హనుమాన్‌గడి ఆలయం ప్రధానాచార్యులు బాబా రాంచరన్‌దాస్ నాయకత్వాన ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో చురుగ్గా పాల్గొన్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ బలగాలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కారణంగా ఆయనను అరెస్టు చేసిన కంపెనీ బలగాలు కుబేర్ తీలా లోని చింత చెట్టుకు వేలాడదీశారు.

అమీర్ : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బార్కా నివాసి. తండ్రి పేరు ముబారక్ మియా. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీష్ బలగాలు అరెస్టుచేసి, తిరుగుబాటుకు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న ఆరోపణ మీద విచారణ జరిపి 1858 జనవరి 6న ఉరిశిక్ష అమలుచేశారు.

**అమీర్ అలీ, సయ్యద్** : ఢిల్లీకి చెందిన తెలివారా (Teliwara) ప్రాంతం నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1858 ఫిబ్రవరి 13న ఉరిశిక్ష విధించాయి.

**అమీర్ ఖాన్** : బ్రిటీషు సైన్యంలోని భారతీయ కాల్బలంలో సైనికుడు. గుజరాత్‌లోని దేవ్‌గౌడ్ బరియా అను ప్రాంతంలో ముస్లింలు, భిల్లులతో కలసి ఆయన సైనిక స్థావరంలోని రెజిమెంటులో తిరుగుబాటు లేవదీసాడు. తేలిదార్ ఖాన్ అను మరొక తిరుగుబాటు దళ నాయకునితో కలసి పోరాటాలలో పాల్గొన్నారు. ఆ తిరుగుబాటు బలగాలను కెప్టెన్ బకిల్ (Captain Buckle) నాయకత్వంలోని కంపెనీబలగాలు ఓడించాయి. ఆయనను

అరెస్టు చేసి ఫిరంగికి కట్టి పేల్చివేశారు.

**అమీర్ ఖాన్, నవాబ్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకున్నారు. 1858 ఫిబ్రవరి 13న ఉరిశిక్ష విధించారు.

**అమీర్ మియో** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకున్నాయి. 1858 జనవరి మాసంలో ఆయనకు ఉరిశిక్ష విధించారు.

**అన్వర్ ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నూహ్ ( Nooh ) గ్రామ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకున్నాయి. 1858 ఏప్రిల్ 1న ఉరిశిక్ష విధించారు.



**1857 ఆగస్టు 1వ తేదిన బరంపూరు వద్ద ఆంగ్లేయ సైనిక దళాల సమక్షంలో స్వదేశీ సిపాయిల దళం మొత్తాన్ని పూర్తిగా నిరాయుధులను చేస్తున్న ఆంగ్ల అధికారి కల్నల్ క్యాంప్‌బెల్.**

**అసాలత్ ఖాన్** : హర్యానా రాష్ట్రంలోన్ని గుర్‌గాంవ్ జిల్లా హూస్సేన్‌పూర్‌నివాసి. తండ్రి పేరు నవాబ్ ఖాన్ పఠాన్. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకున్నాయి. 1858 జనవరి 13న ఉరిశిక్ష విధించారు.

**అస్ఘర్ అలీ** : బీహార్ రాష్ట్రంలోని పాట్నా నివాసి. తిరుగుబాటు వీరుడు పీర్ అలీ సహచరుడు. పలు పోరాటాలలో పాల్గొన్నారు. అరెస్టు చేసి హత్యలు, దొమ్మి నేరారోపణలు చేసి విచారించి, 1857 జూలై 7వ తేదిన ఉరిశిక్ష విధించారు

**అస్ఘర్ యార్ ఖాన్** : ఢిల్లీ సమీప గ్రామమైన ఖిర్కి నివాసి. తిరుగుబాటులో పాల్గొని ఢిల్లీ మీదకు వస్తున్న బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక అరెస్టు చేసి 1858 జనవరి 18న ఉరిశిక్ష విధించారు.





**అతావుల్లా ఖాన్** : ఢిల్లీ సమీపాన గల ఫతక్ హబాష్ ఖాన్ (Phatak Habash Khan) నివాసి. తిరుగుబాటులో పాల్గొని ఢిల్లీ ఆక్రమణకు వస్తున్న బ్రిటీషు బలగాలను నిలువరించేందుకు జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి 1858 జనవరి 18న కాల్చి చంపాయి.

**అవుఖాబ్ భక్త్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తండ్రి పేరు నవాబ్ ఖాన్ పఠాన్. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకుని, 1857 డిసెంబరు 15న ఉరిశిక్ష విధించాయి.

**ఆజం అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రసూల్‌పూర్ నివాసి. బ్రిటీషు- భారత సైన్యంలో గ్వాలియర్ రెజిమెంటులో సైనికుడు. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకున్నాయి. 1858 జనవరి మాసంలో ఉరిశిక్ష విధించారు. ఆనాడు ఆయనతోపాటుగా అజం బేగ్ అను మరోక యోధుడ్ని కూడా ఉరితీసారు.

**అజీం బేగ్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా సోహ్‌నా గ్రామ నివాసి. తండ్రి పేరు మొహమ్మద్. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకున్నాయి. 1857 డిసెంబరు 21న ఉరిశిక్ష విధించారు.

**అజీం మియో** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగలి గ్రామ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకుని 1858 ఫిబ్రవరిలో ఉరితీశాయి.

**అజీముల్లా ఖాన్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీలో బ్రిటీష్ బలగాలతో తలపడిన దళాలతో కలసి తిరుగుబాటులో పాల్గొన్నందుకు అరెస్టు చేసి, రాణికి వ్యతిరేకంగా కుట్ర పన్నారన్న నేరం మీద విచారణ తంతు జరిపి, 1857 డిసెంబరులో ఉరిశిక్ష అమలు జరిపారు.

**అజీజుద్దీన్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు బలగాలతో తలపడ్డాడు. అరెస్టు చేసి 1857 నవంబరు 18న కాల్చి చంపారు.

**అజీజుద్దీన్ మీర్జా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు పట్టుకున్నాయి. 1858 డిసెంబరు 15న ఢిల్లీలో ఉరిశిక్ష విధించాయి.

**అజీజుల్లా, సయ్యద్** : ఢిల్లీ నివాసి. బ్రిటీష్ బలగాలతో తలపడిన దళాలతో కలసి తిరుగుబాటులో పాల్గొన్నందుకు అరెస్టు చేసి, విచారణ జరిపి, 1857 డిసెంబరు 5న ఉరిశిక్ష విధించారు.

**బాదుల్లా జాట్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూర్ గ్రామ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకుని. 1857 నవంబరు మాసంలో ఉరితీసారు.

**బహదూర్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని జునాపూరు జిల్లా హజౌ గ్రామ నివాసి. భూస్వామి. తిరుగుబాటు సందర్భంగా 1857 జూన్ 5న సాగిన పోరులో బ్రిటీష్ ఆధికారి సార్జెంట్ డిగ్‌ఉడ్‌ను చంపారు. ఆయనను, ఆయన అనుచరులు 14 మందినీ అరెస్టు చేసి 1858 జూన్ మాసంలో, జూన్ 6,7 తేదీలలో ఉరిశిక్ష అమలుచేశారు.

**బహదూర్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా కన్‌హీర్ గ్రామ నివాసి. తండ్రి పేరు షేక్ ఖుదాబక్ష్. తిరుగుబాటులో పాల్గొన్నారు. ప్రజలను తిరుగుబాటుకు పురికొల్పారన్న ఆరోపణ మీద 1857 డిసెంబరు 30న ఉరితీసారు.



**1857 ఏప్రియల్ 24న మీరట్ వద్ద నూతన తుటాలను వినియోగించ నిరాకరించినందున స్వదేశీ సైనికులకు బ్రిటీషు అధికారులు శిక్షలు విధించటంతో రగిలిన ఆగ్రహం మే10వ తేది సాయంత్రం తిరుగుబాటుగా రూపుదిద్దుకుని, అక్కడ ఆంగ్లేయుల భరతం పట్టి, అటు నుండి ఢిల్లీ దారి పట్టి , ఎర్రకోట మీద స్వదేశీ జెండా ఎగరేసేందుకు తరలిన స్వదేశీ సైనిక బృందాలు.**

**బహదూర్ మిర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. తండ్రి పేరు మిర్జా బులంద్. ఢిల్లీ రక్షణకు నడుంకట్టి బ్రిటీషు బలగాలను నిరోధించేంకుకు పోరాడారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**బందా అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా సుల్తాన్‌పూరు గ్రామ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి 1858 జనవరి 13న ఉరితీసారు.

**బందే అలీ** : బీహార్ రాష్ట్రంలోని అర్రాహ్(Arrah) గ్రామనివాసి. అర్రాహ్ న్యాయస్థానంలో చిన్న ఉద్యోగి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులకు పట్టబడగా 1858లో ఉరిశిక్ష విధించారు.





**బందే ఖాన్** : లూథియానాలోని బ్రిటీషు సైన్యంలోని సిక్కు రెజిమెంటులో సైనికుడు. తిరుగుబాటులో క్రియాశీలక పాత్ర. అరెస్టు చేసి 1858లో మరణశిక్ష విధించారు.

**బంద్రాబ్ అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూరు గ్రామ నివాసి. బ్రిటీష్-భారత సైన్యానికి చెందిన గ్వాలియర్ సైనిక స్థావరంలో సైనికుడు. తిరుగుబాటులో పాల్గొన్నారు. సైనిక క్రమశిక్షణను ఉల్లంఘించడం, తిరుగుబాటు ఆరోపణ మీద 1858 జనవరిలో ఉరితీసారు.

**బషిరుల్లా ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని అంజేహరా సంస్థానం నివాసి. అంజేహరా సంస్థానంలో ముఖ్యమంత్రి. సంస్థానాధీశుడు రాజా భక్తావర్ సింగ్ నేతృత్వంలో సాగిన తిరుగుబాటులో ప్రధాన పాత్ర. 1857 జూలై 3న భోపావర్ పోలిటికల్ ఏజెన్సీ మీద దాడి జరిపారు. కంపెనీ ప్రతినిథిని తరిమేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. ఆ ప్రాంతాన్ని తిరిగి ఆక్రమించుకునేందుకు కంపెనీ అధికారులు ఇందోర్ సంస్థానాధీశుడ్ని వశం చేసుకుని కుయుక్తులు పన్నారు. ఇండొర్ సంస్థానాధీశుడు బక్షీ ఖుమాన్ సింగ్ నమ్మక ద్రోహం వలన బ్రిటీష్ బలగాలకు పట్టుబడ్డారు. 1858 ఫిబ్రవరి 10వ తేదిన ఉరితీశారు.

**బాబా సాహెబ్** : కర్ణాటక రాష్ట్రంలోని రాయచూరు జిల్లా కుర్లహళ్ళి నివాసి. భీంరావు, కంచనగౌడల నాయకత్వంలో కొప్పలదుర్గ ప్రాంతాన్ని స్వతంత్రం చేయడానికి సాగిన తిరుగుబాటులో ప్రముఖ పాత్ర. ఆ పోరాటంలో గాయపడి కంపెనీ సైనికులకు పట్టుబడ్డారు. కొప్పలదుర్గలో ఫిరంగికి కట్టివేసి పేల్చివేశారు.

**బిక్కం ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని ధార్ నివాసి. తండ్రి పేరు పీర్ మొహమ్మద్. ధార్‌లోని బ్రిటీష్ స్థావరాల మీద దేశభక్తులైన తిరుగుబాటు వీరులకు నాయకత్వంవహించి దాడులు జరిపారు. ఆయనను పట్టుకుని మండలేశ్వర్‌కు తరలించారు. 1858 జనవరి 11న ఉరితీశారు.

**బూహద్ మియో** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగలి గ్రామ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకుని 1858లో ఉరితీసారు.

**బులంద్ బక్ష్ షేక్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ మీద దాడికి సిద్ధపడిన బ్రిటీషు బలగాలను నిరోధించేందుకు పోరాడారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 23న ఢిల్లీలో ఉరిశిక్ష విధించాయి.

**బులందే, మిర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. తండ్రి మిర్జా ముకర్రం. ఢిల్లీ మీద దాడికి సిద్ధపడిన బ్రిటీషు బలగాలను నిరోదించేందుకు పోరాడారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి 1857 ఢిల్లీలో ఉరిశిక్ష విధించాయి.

**బులాఖి మిర్జా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో

పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకుని మరణదండన విధించారు. 1857 డిసెంబరు 15న ఉరిశిక్ష అమలు చేశారు.

**బుఖ్ష్నూ ఖాన్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ మీద దాడికి సిద్ధపడిన బ్రిటీషు బలగాలను నిరోధించేందుకు పోరాడారు. పోరు విఫలమయ్యాక సహచరులతో సహా జైపూరు దిశగా వెళ్ళారు. రాజస్థాన్‌లోని సవాయ్ మాధోపూరు జిల్లా హిందన్ అను ప్రాంతంలో బ్రిటీషు సైనికులకు పట్టుబడ్డారు. హిందన్ వద్ద తిరగబడిన సైనికులు ఆయనకు చెరనుండి విముక్తి కలిగించారు. ఆగ్రా వద్ద మరోమారు బంధించి ఆంగ్ల సైన్యాలు 1857లో ఉరి తీశాయి.



**మీరట్ నుండి బయలుదేరిన స్వదేశీ సైనికులు ఢిల్లీ నగర ప్రాకారం సమీపాన గల జమునా నదిలో పడవల వంతెన సహాయంతో 1857 మే11న ఎర్రకోటలోకి ప్రవేశించారు.**

**బహదూర్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా కన్‌హీర్ గ్రామ నివాసి. తండ్రి పేరు షేక్ ఖుదాబక్ష్. తిరుగుబాటులో పాల్గొన్నారు. ప్రజలను తిరుగుబాటుకు రెచ్చకొడుతున్నారన్న అరోపణ మీద 1857 డిసెంబరు 30న ఉరితీసారు.

**బహదూర్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. తండ్రి పేరు మీర్జా బులంద్. ఢిల్లీ రక్షణకు నడుంకట్టి బ్రిటీషు బలగాలను నిరోధించేంకుకు పోరాడారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**చందా బక్ష్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ మీద దాడికి సిద్దపడిన బ్రిటీషు బలగాలను నిరోధించేందుకు పోరాడారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని 1858 మార్చి 20న మరణదండన విధించాయి.

**చందా ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమార్ నివాసి. తండ్రి పేరు ఛోటే ఖాన్.





తిరుగుబాటు నాయకులు సీతారాం నాయకత్వంలో బ్రిటీషు బలగాల మీద పోరుసల్పారు. బ్రిటీషు బలగాలు పట్టుకుని నిమార్‌లో ఉరితీశాయి.

**దావూద్ బేగ్** : బ్రిటీషు-భారత సైన్యంలో సుబేదార్. సైనిక రెజిమెంటులో తిరుగుబాటు లేవదీసారు. పలు పోరాటాలలో పాల్గొన్నారు. అరెస్టు చేసి సైనిక న్యాయస్థానం విచారణ జరిపి మరణ శిక్ష విధించింది. 1858 మార్చి 11న మరఫిరంగికి కట్టి పేల్చివేశారు.

**దాదూ షా** : ఢిల్లీ నివాసి. రాజవంశీకుడు. తిరుగుబాటు సమయంలో ఢిల్లీ ఎర్రకోటను పునరాక్రమించేందుకు వస్తున్న బ్రిటీషు బలగాను తిప్పికొట్టే పోరాటంలో పాల్గొన్నారు. అరెస్టు చేసి 1857 నవంబరు 18న మరణశిక్ష విధించారు.

**దావుద్ సాహెబ్** : కర్ణాటక రాష్ట్రంలోని రాయచూరు జిల్లా హునక్తాప్పూరు నివాసి. కొప్పల దుర్గం స్వాతంత్ర్యం కోసం భీంరావు, కంచనగౌడల నాయకత్వంలో సాగిన పోరాటంలో క్రియాశీలక పాత్ర వహించారు. కొప్పలదుర్గం వద్ద బ్రిటీషు సైనిక దళాలకు పట్టుబడ్డారు. మరఫిరంగికి కట్టి పేల్చివేశారు.

**దౌల్హా మియా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు బలగాలు పట్టుకున్నాయి. విచారణ జరిపి మరణదండన విధించాయి. 1857 డిసెంబరులో ఉరితీశారు.

**దియాం ఖాన్** : ప్రస్తుత పాకిస్థాన్‌లోని వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని పెషావర్ నివాసి. బ్రిటీష్-భారత సైన్యంలో హవల్‌దార్. తండ్రి పేరు సాదుల్లా ఖాన్. భారత సైనికులను నిరాయుధులను చేయడాన్ని సహించలేక, ఆ చర్యకు నిరసనగా సహచరులతో సహ తిరుగుబాటు చేశారు. ఈ చర్యను తీవ్రంగా పరిగణించిన బ్రిటీషు అధికారులు ఆయనను వెంబడించి, అరెస్టు చేసి, 1857 మే 20న సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపి ఆయనకూ, ఆయన సహచరులు 250 మందికీ 1857 జూన్ 3వతేదిన మరణశిక్ష విధించారు. ఈ సందర్భంగా సుబేదార్-మేజరును తొలుతగా ఉరితీసి, తరువాత మిగిలిన అందరిని ఉరితీశారు. అ తరువాత భారత సైనికులు నివాసం ఉంటున్న రెజిమెంటల్ లైన్లను అవమానకర రీతిలో బ్రిటీషు అధికారులు సోదా చేయడాన్ని భారత సైనికులు ఆగ్రహం వ్యక్తం చేసినందుకు, 1857 అగస్టు 28న మరోమారు 150 మంది భారత సైనికుల మీద క్రమశిక్షణారాహిత్యం నేరాన్ని ఆపాదించి కాల్చి చంపారు.

**దిల్‌దార్ ఖాన్** : బ్రిటీష్-బెంగాలు సైన్యంలో సైనికుడు. మధ్యప్రదేశ్ రాష్ట్రం నాగపూరులో బాధ్యతలు నిర్వహిస్తూ, తిరుగుబాటు దళాలతో చేరి తన రెజిమెంటుకు చెందిన బ్రిటీషు అధికారులను ధిక్కరించారు. ఆ కారణంగా అరెస్టు చేసి నాగపూరులో బహిరంగంగా మరణదండన అమలు చేశారు.

**దిల్వేర్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమార్ నివాసి. ప్రముఖ తిరుగుబాటు నాయకుడు. 1859 ఆగస్టు మాసంలో మండలేశ్వర్ అను ప్రాంతంలో తిరుగుబాటును నిర్వహించారు. బ్రిటీషు బలగాలతో పోరాడారు. అనంతరం పట్టుబడగా బ్రిటీషు సైనికులు ఆయనను కాల్చి చంపారు.

**దిన్ మొహమ్మద్, సయ్యద్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులకు పట్టుబడగా 1857 అక్టోబరు 3న ఉరితీశారు.

**దూలా జాన్, నవాబ్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు అధికారులు పట్టుకుని ప్రజలను తిరుగుబాటుకు పురికొల్పారన్న ఆరోపణ మీద మరణదండన విధించారు. 1857 డిసెంబరు15వతేదిన ఉరితీశారు.



**1857 తిరుగుబాటుకు ముందు ఢిల్లీ నగరంలోని ప్రధాన రాజవీధి చాందనీ చౌక్ దృశ్యం.**

**దుల్లా మియో** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నాగలి నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు సైనికులు పట్టుకుని, తిరుగుబాటుకు పురికొల్పుతున్నారన్న ఆరోపణ మీద మరణదండన విధించారు. 1858 ఫిబ్రవరి మాసంలో ఉరితీశారు.

**దుల్హా** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి మరణ దండన విధించారు. 1857 నవంబరు 18న ఢిల్లీలో ఉరిశిక్ష అమలుచేశారు.

**ఎల్లా మియా** : కర్ణాటక రాష్ట్రంలోని రాయచూరు జిల్లా హునక్తాపూరు నివాసి. కొప్పల దుర్గం స్వాతంత్ర్యం కోసం భీంరావు, కంచనగౌడల నాయకత్వంలో సాగిన పోరాటంలో క్రియాశీలక పాత్ర వహించారు. కొప్పలదుర్గం వద్ద పట్టుబడగా మరఫిరంగికి కట్టి పేల్చివేశారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి 1857 ఢిల్లీలో ఉరిశిక్ష విధించాయి.

**ఇమాం సాహెబ్** : కర్ణాటక రాష్ట్రంలోని రాయచూరు జిల్లా కుర్లాహళ్ళి నివాసి.





కొప్పల దుర్గం స్వాతంత్ర్యం కోసం భీంరావు, కంచనగౌడల నాయకత్వంలో సాగిన పోరాటంలో క్రియాశీలక పాత్ర వహించారు. కొప్పలదుర్గం వద్ద బ్రిటీషు సైనిక దళాలకు పట్టుబడ్డారు. మరఫిరంగికి కట్టి పేల్చివేశారు.

**ఇమాం ఖాదర్** : ఢిల్లీ లోని ఖారిబౌలి నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు అధికారులు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 22న ఉరిశిక్ష విధించారు.

**ఫైజ్ షా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1857 డిసెంబరు 15వ తేదిన మరణదండన విధించారు.

**ఫైజ్ అలీ** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బరేలి నివాసి. రోహిల్ ఖండ్ నవాబు ఖాన్ బహదూర్ ఖాన్ నేతృత్వంలో జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. 1857 మేలో బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటాలలో ప్రముఖ పాత్రవహించారు. 1860 మార్చి 20న అరెస్టు చేసి, సామూహికంగా మరణశిక్షలను విధించారు. ఆయనతోపాటుగా మరొ243 మందిని సహచరులను బ్రిటీష్ కమీషనర్ కార్యాలయంలోని మర్రిచెట్టుకు వేలాడదీశారు.

**ఫైజ్ అలీ మీర్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు అధికారులు అరెస్టు చేసి, రాణికి వ్యతిరేకంగా కుట్ర పన్నారన్న నేరారోపణ చేసి, విచారణ జరిపి, 1857లో ఉరిశిక్ష అమలుచేశారు.

**ఫైజ్ ఖాన్** : పంజాబ్‌లోని లూధియానా బ్రిటీషు సైనిక స్థావరంలో సైనికుడు. పంజాబ్‌లోని సట్లెజ్ డివిజన్ ఉద్యోగబాధ్యతల నిర్వహణ సందర్భంగా తిరుగుబాటు కార్యక్రమాలలో పాల్గొన్నారు. బ్రిటీషు అధికారులు అరెస్టు చేసి, తిరుగుబాటు కుట్ర, ప్రజలను రెచ్చకొట్టారన్న ఆరోపణల మీద విచారణ నిర్వహించి 1858 ఏప్రిల్ 21న ఉరిశిక్ష విధించారు.

**ఫైజుల్లా ఖాజి** : కాశ్మీరు ప్రాంతీయుడు. ఢిల్లీ కొత్వాల్‌గా ఢిల్లీలో బాధ్యతల నిర్వహణ. తిరుగుబాటులో ప్రముఖ పాత్ర. తిరుగుబాటు విఫలమయ్యాక అరెస్టు చేసి ఉరితీశారు.

**ఫకీర్ సాహెబ్** : కర్ణాటక రాష్ట్రంలోని రాయచూరు జిల్లా హునక్తాపూరు నివాసి. కొప్పల దుర్గం స్వాతంత్ర్యం కోసం భీంరావు, కంచనగౌడల నాయకత్వంలో సాగిన పోరాటంలో క్రియాశీలక పాత్ర వహించారు. కొప్పలదుర్గం వద్ద బ్రిటీషు సైనిక దళాలకు పట్టుబడగా, మరఫిరంగికి కట్టి పేల్చివేశారు.

**ఫకీరుద్దీన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో ప్రముఖ పాత్ర. తిరుగుబాటు విఫలమయ్యాక అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 27న ఉరిశిక్ష అమలుచేశారు.

**ఫసాహత్ జహాన్, రాజా** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ఆజంఘర్ జిల్లా మాహౌల్ నివాసి. మాహౌల్ రాజు. జునాపూరులో బ్రిటీషు కమాండర్ జనరల్ రౌటన్ చంపారు.

**ఫతే అలీ లంబర్దార్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా ఖిరాలి నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1857 నవంబరు 10న మరణదండన విధించారు.

**ఫతే షా ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని రోహిల్ ఖండ్ నివాసి. తిరుగుబాటు చేసి స్వతంత్ర రోహిల్ ఖండ్‌ను ప్రకటించిన ఖాన్ బహుద్దూర్ ఖాన్ నేతృత్వంలో జరిగిన పోరాటాలలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా జరిగిన పలు పొరాటాలలో ప్రముఖ పాత్ర వహించారు. తిరుగుబాటు విఫలమయ్యాక అరెస్టు చేసి 1858 మేలో ఉరితీసారు.

**ఫౌజ్దార్ ఖాన్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా హూసైన్‌పూర్ నివాసి. తండ్రి పేరు హిదాయత్ ఖాన్ పఠాన్. బ్రిటీషు-భారత సైన్యంలోని గ్వాలియర్ రెజిమెంటులో సిపాయి.



**ఢిల్లీ నగరంలో ప్రవేశించాక తొలుతగా స్వదేశీ సైనికులు ఆంగ్లేయ సైనికుల మీద దాడి చేసి వారి నుండి స్వాధీనం చేసుకున్న బ్రిటీషర్ల బ్యాంకు భవనం. దాడికి ముందు నాటి దృశ్యం.**

తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 జనవరి 13వ తేదీన ఉరితీశారు.

**ఫయ్యాజ్ అలీ** : ఢిల్లీలోని షాహ్‌దరా నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు పట్టుకుని, విచారణ జరిపి, 1858 ఫిబ్రవరి 27న మరణశిక్ష విధించారు.

**ఫయ్యాజ్ ఖాన్** : బ్రిటీషు-భారత సైన్యంలో సైనికుడు. హర్యానా రాష్ట్రంలోని అంబాటా సైనికస్థావరంలో బాధ్యతల నిర్వహణ. తిరుగుబాటులో పాత్ర. అరెస్టు చేసి, తిరుగుబాటు చేసినందుకూ, సైన్యం విడిచి వెళ్ళినందుకూ సైనిక న్యాయస్థానంలో విచారణ జరిపి 1858 ఏప్రిల్ 6న ఉరితీశారు.

**ఫజల్ హఖ్, మౌల్వీ** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షాహజహాన్‌పూర్ నివాసి.





తిరుగుబాటులో భారీ సైనికదళానికి నాయకత్వం వహించి షహబాద్ దిశగా ప్రయాణిస్తూ, బ్రిటీషు సేనలతో పలు పోరాటాలు చేశారు. ఢిల్లీ తిరిగి బ్రిటీషర్ల వశమైనప్పటికి ఎంతో సాహసంతో ఆయన పోరాటాలు సాగించారు. చివరకు 1858 డిసెంబరు మాసంలో ఈటావాలో (Etawah) జరిగిన పోరులో ఆయన కన్నుమూశారు.

**ఫజల్ హఖ్,మౌల్వీ** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని మాల్వా నివాసి.పండితుడు. బహుళ ప్రజాదరణ పొందిన నాయకుడు. బ్రిటీష్ సైన్యాలతో పోరుసల్పుతున్న మొఘల్ రాజకుమారుడు షెహజాదా ఫిరోజ్ షా నాయకత్వాన బ్రిటీషు సైన్యాలను ఎదుర్కొన్నాడు.ఈ పోరాటాలు తాంతియాతోపే, రావు సాహెబ్, షెహజాదా ఫిరోజ్ షా సంయుక్త నాయకత్వంలో సాగాయి.1858 డిసెంబరు 17న రాండ్ అను ప్రాంతంలో బ్రిటీషు సైనికాధికారి కెప్టెన్ నాపైర్ దళాలతో జరిగిన భీకరపోరులో ఆయన, మరో ప్రధాన నాయకుడు జౌహర్ అలీతోపాటుగా మరో 480 మంది తిరుగుబాటు యోధులు అమరులయ్యారు.

**ఫాజిల్ మొహమ్మద్ ఖాన్, నవాబ్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని పూర్వ భోపాల్ సంస్థానానికి చెందిన అంబాపాని నివాసి. అంబాపాని జాగీర్దారు. తండ్రి పేరు సఫ్రారాజ్ మొహమ్మద్ ఖాన్ అలియాస్ కులే ఖాన్. మధ్య భారతదేశంలో తిరుగుబాటు చేసిన యోధులలో ప్రముఖులు. బ్రిటీష్ వర్గాలను సమర్థించిన భోపాల్ సంస్థానం సైన్యాలు దాడిచేసి అంబాపాని, షిహోర్‌ను స్వాధీనం చేసుకోగా, రాహత్‌ఘర్ కోటను ఫాజిల్ మొహమ్మద్ ఖాన్ 1857 అక్టోబరు మాసంలో స్వాధీనపర్చుకున్నారు. భోపాల్ ప్రాంతం ప్రధాన తిరుగుబాటు దళాల నాయకుడు, ఆయన సహోదరులు అయిన నవాబ్ ఆదిల్ మొహమ్మద్ ఖాన్ తోడ్పాటుతో కోటను పటిష్టపర్చారు. రాహత్‌ఘర్ కోటను కేంద్రంగా చేసుకుని బ్రిటీషు సైన్యాలను, ఆ సైన్యాలకు మద్దతుగా వచ్చిన భోపాల్ సంస్థానం సైన్యాలతో పలుచోట్ల ఢీకొని పరాజయం పాల్జేశారు. బ్రిటీషర్ల ఆధిపత్యానికి సవాల్‌గా మారిన ఫాజిల్ మొహమ్మద్ పట్ల ప్రత్యేక వ్యూహం పన్నిన శత్రుసేనలు 1858 జనవరి మాసం 24న అన్నివైపుల నుండి ముట్టడించాయి. నాలుగు రోజులపాటు భయంకర పోరాటం జరిగింది. తిరుగుబాటు యోధులు ప్రాణాలకు తెగించి పోరాడినా, అనివార్య పరిస్థితులలో తిరుగుబాటు దళాలు జనవరి 28న కోటను విడిచి పెట్టాల్సి వచ్చింది. ఆ తరువాత ఫాజిల్ మొహమ్మద్ తప్పుకుంటే ప్రమాదమని గ్రహించిన బ్రిటీషు సేనలు తిరుగుబాటు దళాలను వెంటాడాయి.ఆ వేటలో ఫాజిల్, ఆయన ముఖ్యఅనుచరులు 18మంది పట్టుబడ్డారు. పట్టుబడిన అందరిని ఫాజిల్‌తో పాటుగా రాహత్‌ఘర్ కోట సింహద్వారం వద్ద 1858 జనవరి 29న ఉరితీశారు.

**మౌల్వీ ఫజల్-ఉల్-హఖ్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని సితాపూర్ జిల్లా ఖైరాబాద్ నివాసి. తండ్రి పేరు మౌలానా ఫజల్ ఇమాం ఖైరాబాది. పండితుల కుటుంబంలో జన్మించిన

పండితుడు. ఢిల్లీ రెసిడెన్సీలో కచేరీ ప్రధానాధికారి (సిరిస్తాదార్) ఉద్యోగం. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా తిరుగుబాటు ప్రారంభకానున్న తరుణంలో ఉద్యోగానికి రాజీనామా చేశారు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఢిల్లీ బ్రిటీషర్ల నుండి విముక్తి పొంది తిరుగుబాటు యోధుల హస్తగతం అయ్యాక, స్వదేశీ పాలకులకు అవసరమైన రాజ్యాంగాన్ని రూపొందించటంలో ఆయన సహకరించారు. మంచి వక్త. అద్భుతమైన ప్రసంగాలతో మొగల్ రాజకుమారులను, ప్రజలను బ్రిటీషు పాలకులకు వ్యతిరేకంగా పోరుకు పురికొల్పారు. ఢిల్లీని మళ్ళీ బ్రిటీషు సేనలు స్వాధీనం చేసుకున్నాక ఆయన స్వస్థలమైన ఖైరాబాద్‌కు తరలి వెళ్ళారు. స్వస్థలంలో కూడా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రచార కార్యక్రమాలను నిర్వహిస్తుండగా,



**ఢిల్లీలో ప్రవేశించిన మొదటి రోజుననే స్వదేశీ సైనికుల అసంఖ్యాక బలిదానాలతో స్వాధీనం చేసుకున్న ఆంగ్లేయుల ఆయుధాగారం. ఈ ఆయుధాగారాన్ని స్వదేశీ సైనికుల స్వాధీనం కానివ్వకుండా పేల్చివేసిన సంఘటనలో మరికొంత మంది స్వదేశీ సైనికులు అమరులయ్యారు.**

బ్రిటీషు అధికారులు అరెస్టు చేశారు. ఫజల్-ఉల్ హఖ్ మీద పలు నేరాలను ఆరోపించి, విచారణ జరిపి, ప్రవాసశిక్షను విధించారు. ఆ శిక్షమేరకు మౌల్వీ హఖ్‌ను అండమాన్ దీవులకు పంపగా, అక్కడే 1861 సంవత్సరంలో కన్నుమూశారు.

**ఫిర్దౌస్ అలీ** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకునేందుకు వచ్చిన బ్రిటీషు బలగాలతో పోరాడారు. ఢిల్లీలో తిరుగుబాటు యోధుల పోరాటం విఫలమై, డిల్లీని ఆంగ్లేయులు స్వాధీనం చేసుకున్నాక బ్రిటీషు సేనలు ఆయనను అరెస్టు చేసి 1858 మార్చి 11న ఉరిశిక్ష విధించాయి.

**ఘూసితా, షేక్** : బీహార్ రాష్ట్రం పాట్నా నివాసి. లుతుఫ్ అలీ ఖాన్ అను సంపన్నుడి వద్ద ఉద్యోగి. తిరుగుబాటు ప్రారంభం కాగా అందులో క్రియాశీలకంగా పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు ఆయనను అరెస్టు చేసి ఉరితీశాయి.





**ఘజాన్ఫర్ అలీ** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా సుల్తాన్‌పూర్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. బ్రిటీషు సైనికులు ఆయనను పట్టుకుని, విచారణ జరిపి, 1858 జనవరి 13న ఉరిశిక్ష విధించారు.

**గజాన్ఫర్ అలీ** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూర్ నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. గ్వాలియర్ రెజిమెంటులో ఉద్యోగ బాధ్యతలు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 జనవరి 13న ఉరిశిక్ష విధించాయి.

**గయాజుద్దీన్ మీర్జా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనిక బలగాలు పట్టుకుని 1857 డిసెంబరు 15న ఉరితీశాయి.

**గులాం అబ్బాస్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. మీర్జా ఆగా జాన్ కుమారుడు. ఢిల్లీని పునరాక్రమించేందుకు వచ్చిన బ్రిటీషు బలగాలతో పోరాడారు. బ్రిటీషు సేనలు ఆయనను అరెస్టు చేసి ఉరితీశాయి.

**గులాం అష్రాఫ్ పఠాన్** : హర్యానా రాష్ట్రంలోని కర్నాల్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకునేందుకు వచ్చిన బ్రిటీషు బలగాలతో పోరాడారు. తిరుగుబాటు విఫలమై, ఢిల్లీని స్వాధీనం చేసుకున్నాక బ్రిటీషు సేనలు ఆయనను అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 4న ఉరిశిక్ష విధించాయి.

**గులాం ఫక్రుద్దీన్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. మీర్జా అగా జాన్ కుమారుడు. ఢిల్లీని పునరాక్రమించేందుకు వచ్చిన బ్రిటీషు బలగాలతో పోరాడారు. బ్రిటీషు సేనలు ఆయనను అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**గులాం బక్ష్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనిక బలగాలు పట్టుకుని, 1857 నవంబరు 10న ఉరితీశాయి.

**గులాం గౌస్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ఝాన్సీ నివాసి. ఝాన్సీ రాణి లక్ష్మీబాయి శతఘ్నిదళంలో గన్నర్. ఝాన్సీ రక్షణ కోసం సాగిన పోరాటాలలో ఆయన పాల్గొన్నారు. 1858 జూన్ 4వ తేదిన ఆంగ్లేయుతో జరిగిన ద్వంద్వయుద్ధంలో పాల్గొన్నారు. బ్రిటీష్ సైనికుల కాల్పులకు బలయ్యారు.

**గులాం కుతుబుద్దీన్ షేక్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీని పునరాక్రమించేందుకు వచ్చిన బ్రిటీషు బలగాలతో పోరాడారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**గులాం మహమ్మద్దీన్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1857 డిసెంబరు 15న ఉరితీశాయి.

**గులాం మొహమ్మద్ మొఘల్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. ఢిల్లీని పునరాక్రమించేందుకు వచ్చిన బ్రిటీషు బలగాలతో పోరాడారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 23న ఉరిశిక్ష విధించాయి.

**గులాం మొహమ్మది మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశస్థుడు. మీర్జా

కరీం బక్ష్ కుమారుడు. ఢిల్లీని పునరాక్రమించేందుకు వచ్చిన బ్రిటీషు బలగాలతో జరిగిన భీకరపోరాటంలో ప్రధాన పాత్రవహించారు. స్వదేశీసేనల పరాజయం తరువాత బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1857 డిసెంబరు మాసంలో ఉరి తీశాయి.

**గులాం ముస్తఫా పఠాన్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు బలగాలతో జరిగిన భీకర పోరాటంలో పాత్ర. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1857 అక్టోబరు 3న ఉరి తీశాయి.

**గులాం నబీ** : బ్రిటీషు-భారత సైన్యంలో సైనికుడు. హర్యానా రాష్ట్రంలోని లూథియాన రెజిమెంటులో బాధ్యతలు. తిరుగుబాటులో పాత్ర. సైన్యం విడిచి వెళ్ళినందుకు, తిరుగుబాటు కుట్రలో పాల్గొన్నందుకు విచారణ జరిపి 1858 ఏప్రిల్‌లో మరణశిక్ష విధించారు.



**' బదిలీకి సరాయి ' అను ప్రాంతంలో బ్రిటీషు బలగాలతో జరుగుతున్న భయంకర పోరులో వైరివర్గాలను తునుమాడేందుకు దూసుకపోతున్న స్వదేశీ సైనికుల బృందంలోని యోధులు**

**గులాం నబీ** : బ్రిటీషు-భారత సైన్యంలోసైనికుడు. హర్యానా రాష్ట్రంలోని అంబాలా సైనిక స్థావరంలో బాధ్యతలు. తిరుగుబాటులో పాత్ర. సైన్యం విడిచి వెళ్ళినందుకు, తిరుగుబాటు కుట్రలో పాల్గొన్నందుకు విచారణ జరిపి 1958 ఏప్రిల్ 6వ తేదిన అంబాలాలో మరణశిక్ష విధించారు.

**గులాం నబీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూర్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని,1857 నవంబరులో కాల్చి చంపారు.

**గులాం నబీ** : బ్రిటీషు-భారత సైన్యంలోని లూథియాన రెజిమెంటులో సైనికుడు. పంజాబులోని సట్లెజ్ డివిజన్‌లో బాధ్యతలు. తిరుగుబాటులో పాత్ర. సైన్యం విడిచి వెళ్ళినందుకు, తిరుగుబాటు కుట్రలో పాల్గొన్నందుకూ విచారణ జరిపి 1858 ఏప్రిల్ 21న అంబాలాలో మరణశిక్ష అమలు జరిపారు.





**గులాం నశీరుద్దీన్, షేక్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1857 నవంబరు 18న ఉరి తీశాయి.

**గులాం షా షేక్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాత్ర. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1858 జనవరి18 న ఉరి తీశాయి.

**గులాం యాహ్యా** : బీహార్ రాష్ట్రంలోని జగ్దీష్‌పూర్ నివాసి. బీహార్ ప్రజల ప్రియతమ నాయకుడు బాబు కున్వర్ సింగ్ కొలువులో న్యాయ సలహాదారుడు. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు దళాలు అర్రాహ్‌ను స్వాధీనం చేసుకున్నాక, అక్కడ న్యాయాధికారిగా వ్యవహరించారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు అధికారులు అర్రాహ్‌ను ఆక్రమించుకున్నాక పలు నేరారోపణలు చేసి, విచారణ జరిపి 1858లో ఉరితీశారు.

**గోలా మెహర్బాన్** : బీహార్ రాష్ట్రం షహదాద్ నివాసి. బ్రిటీషు సైన్యంలోని 7వ రెజిమెంటులోని కాల్బలంలో సైనికుడు. బ్రిటీషు అధికారులకు వ్యతిరేకంగా తిరుగుబాటు. తిరుగుబాటు కుట్రలో పాల్గొన్నందుకు 1957 అక్టోబరు 5న మరణశిక్ష విధించారు.

**గోంషూ షేక్** : ఢిల్లీలోని నజాఫ్‌గర్ నివాసి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి విచారణ జరిపి, 1858 ఫిబ్రవరి 16వ తేదిన ఉరి తీశాయి.

**గులాబ్ అక్బర్ పఠాన్** : ఢిల్లీలోని కుచాచేలాన్ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాత్ర. అరెస్టు చేసి 1858 జనవరి 18న ఉరి తీశాయి.

**గులాబ్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమార్ ప్రాంత నివాసి. మండలేశ్వర్ సైన్యంలో ' మాస్టర్ గన్నర్ '. బ్రిటీషు సైనికమూకల ఆక్రమణ నుండి ఝాన్సీని రక్షించుకునేందుకు 1858 జూన్‌లో జరిగిన పోరాటంలో వీరోచితంగా పోరాడారు. అనంతరం ఝాన్సీ కోటలోకి జొరబడిన బ్రిటీషు సైనికులతో సాగిన ద్వంద యుద్ధంలో జూన్ 4న అమరులయ్యారు.

**గుల్ మొహమ్మద్** : 1828 సంవత్సరం, రాజస్థాన్ లోని కోట సంస్థానానికి చెందిన కరౌలి గ్రామంలో జననం. కోట సంస్థానంలోని సైన్యంలో జమేదారు ఉద్యోగం. ప్రథమ స్వాతంత్ర్యసమరయోధుల నాయకుడు మెహర్బాన్ ఖాన్ తమ్ముడు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించి, బ్రిటీషు సేనలు, బ్రిటీషు సైన్యాలకు మద్దతు పలికిన కోట సంస్థానాధీశుడి సైన్యాలతో జరిగిన పలు పోరాటాలలో పాల్గొన్నారు. ప్రజలను, సైనికులను తిరుగుబాటుకు ప్రేరేపించారు. చివరి వరకు ఆంగ్లేయుల గులాంగిరి చేసు&తన్న సంస్థానాధీశుడి సైన్యాలకు పట్టుబడటంతో ఆయనను 1858 మార్చిలో కాల్చి చంపారు.

**గుల్ మొహమ్మద్ నిషాంచి, హఫీజ్** : రాజస్థాన్ రాష్ట్రంలోని చిత్తోర్‌ఘర్ జిల్లా

నివాసి. రాజస్థాన్‌లోని టోంక్ సంస్థానానికి చెందిన సైన్యంలో ' గన్నర్ '. తిరుగుబాటు దళాల సభ్యునిగా బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటాలలో పాల్గొన్నారు. ఢిల్లీ చక్రవర్తికి మద్దతుగా టోంక్ నుండి బయలుదేరిన తిరుగుబాటు దళాలతో ఆయన ఢిల్లీ వెళ్ళారు. ఆ సందర్భంగా ఢిల్లీలో బ్రిటీషు సేనలతో జరిగిన భయంకర పోరాటంలో చివరివరకు పోరుసల్పుతూ 1857లో రణరంగంలో ఆయన నేలకొరిగారు.

**హబీబ్ బక్ష్ :** ఢిల్లీలో నివాసి. ఢిల్లీలో చక్రవర్తికి మద్దతుగా, బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాత్ర.బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1857 డిసెంబరు 7న ఉరి తీశాయి.

**హైదర్ అలీ ఖాన్ :** బీహార్ రాష్ట్రం పాట్నా నివాసి. పాట్నాలోని తిరుగుబాటుకు నాయకత్వం వహించి, తిరుగుబాటు దళాలను పోరుబాటన నడిపారు. పాట్నా జిల్లాలోని



**ఢిల్లీ నగరం పూర్తిగా స్వాధీనమై, చక్రవర్తి బహదుర్షా జఫర్ అధికారం చేపట్టాక సేదతీరుతున్న స్వదేశీ సైనికులు. గుర్రం మీద కూర్చొని సహచరులకు సూచనలు అందచేస్తున్న వ్యక్తి, కుడివైపున నులక మంచం మీద కూర్చున్న వ్యక్తి సుబేదారు హోదా కలిగిన స్వదేశీ సైనికాధికారులు.**

రాజ్‌గిర్ పరగణాకు స్వతంత్రపాలకునిగా ప్రకటించుకున్నారు. న్యాయస్థానం, పోలీసు స్టేషన్‌ల మీద దాడి చేసి, బ్రిటీషు అధికారులను వెడలగొట్టారు. అనంతరం తిరుగుబాటు దళాలకు, బ్రిటీషు బలగాలకు మధ్యన జరిగిన భీకర పోరులో అతికష్టం మీద ఆయనను బ్రిటీషు సేనలు అరెస్టు చేశాయి. 1857 అక్టోబరు 9న ఆయనను ఉరితీశాయి.

**హీన్ :** మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమర్ నివాసి. గ్రామంలో పేరుప్రఖ్యాతులు గలిగిన పెద్దమనిషి. ప్రజలను తిరుగుబాటుకు ప్రేరేపించి, దళాలకు నాయకత్వం వహించారు. మండలేశ్వర్ అను ప్రాంతంలో తిరుగుబాటును ప్రకటించారు. బ్రిటీషు బలగాలు అరెస్టు





చేసి, 1859లో కాల్చి చంపాయి.

**హాజీ జాన్ :** బీహార్ రాష్ట్రం పాట్నా నివాసి. ప్రథమస్వాతంత్ర్య సమరంలో బ్రిటీషు బలగాలకు వ్యతిరేకంగా, స్వదేశీయులను ఏకం చేసేందుకు కృషి చేసి, అంతిమంగా పోరాటం ప్రారంభించి, బ్రిటీషు సైన్యాధికారులకు నిద్రపట్టకుండా చేసిన పోరాటయోధుడు పీర్ అలి సహచరుడు. తిరుగుబాటు దళాలు జరిపిన పలు పోరాటాలలో ప్రధాన పాత్ర. ఆయన మీద దొమ్మి, హత్యలు లాంటి పలు నేరాలను నమోదుచేసి, విచారణ జరిపి మరణదండన ప్రకటించారు. 1857 జూలై 7న ఆయనకు ఉరిశిక్ష విధించారు.

**హఖ్‌దియా ఖాన్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూర్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1857 నవంబరులో కాల్చి చంపారు.

**హమీద్ సాహెబ్ :** కర్ణాటక రాష్ట్రం రాయచూరు జిల్లా కుర్లహళ్ళి గ్రామ నివాసి. భీంరావు, కంచనగౌడల సంయుక్త నాయకత్వంలో కొప్పలదుర్గం విముక్తి కోసం, బ్రిటీషు సైన్యాల మీద సాగిన పోరాటంలో పాలుపంచుకున్నారు. అరెస్టు చేసి, విచారణ జరిపి మరణశిక్ష విధంచగా, ఆయనను ఫిరంగి గొట్టానికి కట్టి పేల్చివేశారు.

**హమీరా :** ఢిల్లీ నివాసి. క్షురకుడు. ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాత్ర. అరెస్టు చేసి విచారణ జరిపి,1858 జనవరి 18న ఉరి తీశారు.

**హన్సే ఖాన్ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా సరళ గ్రామ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 మార్చి 29న కాల్చి చంపారు.

**హఖ్‌ద్దాద్ ఖాన్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూర్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1857లో కాల్చి చంపారు.

**హరూం బక్ష్ :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూర్ నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలో సైనికుడు. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 జనవరిలో ఉరితీశారు.

**హసన్ అలీ ఖాన్ :** బీహార్ నివాసి. తిర్హుట్ లో పోలీసు జమేదార్ ఉద్యోగం. 1846 ప్రాంతం నుండి బ్రిటీషు వ్యతిరేక కార్యకలాపాలు నిర్వహించారు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 జనవరిలో ఉరిశిక్ష విధించాయి.

**హస్తి మియా :** హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూర్ నివాసి తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, విచారణ జరిపి మరణ దండన విధజంచారు. 1858 జనవరి మాసంలో ఉరితీశారు.

**హయాత్ అలీ** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ నివాసి. తిరుగుబాటు సమయంలో ఢిల్లీ రక్షణ లక్ష్యంగా పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 ఫిబ్రవరి 11వతేదిన ఉరితీసి చంపారు.

**హయాత్ సాహెబ్** : కర్నాటక రాష్ట్రం రాయచూరు జిల్లా కుర్లహళ్ళి గ్రామ నివాసి.భీంరావు, కంచనగౌడల సంయుక్త నాయకత్వంలో కొప్పల దుర్గం విముక్తి కోసం బ్రిటీషు సైన్యాల మీద సాగిన పోరాటంలో పాలుపంచుకున్నారు. అరెస్టు చేసి, విచారణ జరిపి మరణశిక్ష విదించగా, ఆయనను ఫిరంగి గొట్టానికి కట్టి పేల్చివేశారు.



**1857 జూన్ 8వ తేదిన ఎర్రకోటకు బయట అతి కీలక ప్రదేశమైన ' రిడ్జి ' ప్రాంతాన్ని కంపెనీ బలగాలకు దక్కనివ్వరాదని ప్రాణాలకు తెగించి భీకర పోరును సాగిస్తున్న సమరయోధులు. ప్రాణాలు పణంగా పెట్టి స్వదేశీ సైనికులు పోరాడినా రిడ్జి ప్రాంతం ఆంగ్ల సైన్యాల హస్తగతమైంది.**

**హజారియా ధోబి** : ఢిల్లీ నివాసి. క్షురకుడు. ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాత్ర. అరెస్టు చేసి విచారణ జరిపి,1857 డిసెంబరు 8న ఉరి తీశారు.

**హజరత్ అలీ** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌నగర్ జిల్లా ఖేరి గ్రామ నివాసి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి 1857లో ఉరిశిక్ష విధించాయి.

**హజరత్ బక్ష్**: ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాత్ర. అరెస్టు చేసి విచారణ జరిపి, 1858 ఫిబ్రవరి 23న కాల్చి చంపారు.

**హోష్దార్ ఖాన్** : హర్యానా రాష్ట్రం హసన్‌పూరు నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి.బ్రిటీషు సైనికులు పట్టుకుని,1858 జనవరి కాల్చి చంపారు.

**హోషియార్ ఖాన్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా హుస్సేన్‌పూర్ నివాసి. షేక్ రహమాన్ ఖాన్ కుమారుడు. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు పట్టుకుని, ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొడుతున్నారన్న ఆరోపణ మీద విచారణ జరిపి, 1858





జనవరి 2వ తేదిన ఉరిశిక్ష విధించారు.

**హుస్నా మియా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 ఫిబ్రవరి మాసంలో కాల్చి చంపారు.

**హుస్సేన్ బక్ష్ ఖాన్** : బీహార్ రాష్ట్రంలోని గయా జిల్లా నవడా గ్రామనివాసి. తిరుగుబాటు యోధుడు హైదర్ అలీ ఖాన్ అనుచరుడు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. పలు పోరాటాలలో పాల్గొన్నారు. కెప్టెన్ రాట్టరీ నాయకత్వంలోని బ్రిటీషు-భారత సైన్యంలోని సిఖ్ఖుల రెజిమెంటుతో జరిగిన పోరాటంలో అమరులయ్యారు.

**హుసైన్ బక్ష్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొగల్ రాజవంశస్థుడు. మీర్జా ఖాదర్ బక్ష్ కుమారుడు. ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు తరలి వచ్చిన బ్రిటీషు సైన్యాలతో సాగిన పోరాటంలో ప్రముఖ పాత్ర. అరెస్టు చేసి విచారణ జరిపి ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**హుసైన్ బక్ష్ మొఘల్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజ వంశస్థుడు. ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు తరలి వచ్చిన బ్రిటీషు సైన్యాలతో సాగిన పోరాటంలో పాత్ర. అరెస్టు చేసి, విచారణ జరిపి, 1858 ఫిబ్రవరి 18న ఉరిశిక్ష విధించారు.

**హుస్సేన్ ఖాన్ పఠాన్** : ఢిల్లీలోని నజఫ్‌ఘర్ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సైన్యాలతో సాగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు 1858 ఫిబ్రవరి 1న ఉరితీశాయి.

**హుస్సేన్ సాహెబ్** : కర్నాటక రాష్ట్రం రాయచూరు జిల్లా కుర్లహళ్ళి గ్రామ నివాసి. భీంరావు, కంచనగౌడల సంయుక్త నాయకత్వంలో కొప్పలదుర్గం విముక్తి కోసం బ్రిటీషు సైన్యాల మీద సాగిన పోరాటంలో పాలుపంచుకున్నారు. అరెస్టు చేసి, విచారణ జరిపి మరణశిక్ష విధించగా, ఆయనను ఫిరంగి గొట్టానికి కట్టి పేల్చివేశారు.

**ఇబ్రహీం ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని మాల్వా నివాసి.బ్రిటీషు-భారత సైన్యంలోని కాల్బలంలో సైనికుడు. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి, విచారణ జరిపి, 1858 ఫిబ్రవరి 26న మరణదండన విధించారు.

**ఇలాహి బక్ష్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూరు నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 నవంబరులో కాల్చి చంపారు.

**ఇలాహి బక్ష్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో పాత్ర. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, విచారణ జరిపి, 1857 డిసెంబరు 7న కాల్చి చంపాయి.

**ఇలాహి బక్ష్, షేక్** : ఢిల్లీ నివాసి.ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు బలగాలతో జరిగిన పోరాటంలో ఆయన పాల్గొన్నారు. బ్రిటీష్ సైన్యాలు అరెస్టు చేసి, విచారణ జరిపి,1858

జనవరి 18న కాల్చి చంపాయి.

**ఇమాం అలీ** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూరు నివాసి. తండ్రి పేరు నూరిష్ అలీ. బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 డిసెంబరు 27న కాల్చి చంపారు.

**ఇమాం బక్ష్** : ఉత్తరప్రదేశ్ ముజఫర్‌నగర్ జిల్లా ఖేరి గ్రామ నివాసి. తిరుగుబాటులో ప్రధానంగా పాల్గొన్నందుకు, బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857లో ఉరిశిక్ష విధించాయి.

**ఇమాం బక్ష్ అలియాస్ థల్లా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా సుల్తాన్‌పూరు నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, విచారించి మరణదండన విధించారు. 1858 జనవరి 16న కాల్చి చంపారు.



**ఇరు పక్షాల మధ్యన భయంకరంగా జరిగిన పోరులో రిడ్జిని పట్టుకున్నాక ఆ ప్రాంతంలో కంపెనీ సైనికులు రిడ్జికు ఎడమ వైపున ' ఫ్లాగ్ స్టాఫ్ టవర్ ' పికెట్ ఏర్పాటు చేసుకున్న దృశ్యం.**

**ఇమాం ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని మాల్వా నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలోని కాల్బలంలో రిసాల్‌దారు. మాల్వా ప్రాంతంలో తిరుగుబాటు దళాలతో కలసి బ్రిటీషు ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూ, బ్రిటీషు సేనలతో జరిగిన పలు పోరాటాలలో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలతో షాహజహాన్‌పూరు వద్ద జరిగిన పోరాటంలో పట్టుబడ్డారు. విచారణ తంతు జరిపి, 1858లో మరణదండన విధించారు.

**ఇమాముద్దీన్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా పాల్వాల్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, విచారించి,మరణదండన విధించారు. 1858 జనవరి 7న కాల్చి చంపారు.

**ఇమాం బక్ష్ సభాయ్** : ఢిల్లీ నివాసి. పారసీ భాషలో పండితుడు.బహు గ్రంథరచయిత. ఢిల్లీ కళాశాలలో అధ్యాపకుడు. తిరుగుబాటు సమయంలో ప్రజలను ఉత్తేజపర్చుతూ, కుటుంబ సభ్యులతో సహా బ్రిటీషు వ్యతిరేక కార్యకలాపాలు నిర్వహించారు. తిరుగుబాటు విఫలమయ్యాక





ఆయననూ, ఆయన ఇరువురు కుమారులనూ బ్రిటీషు సైనికులు అరెస్టు చేశారు. రాజ్‌ఘాట్ వద్ద ఆయనను, ఆయన కుమారులను నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపారు. ఆ యోధుల అంత్యక్రియలను కూడా గౌరంగా జరిపించే అవకాశం ఇవ్వకుండా మృతదేహాలను పక్కనే ప్రవహిస్తున్న యమునా నదిలోకి ఆంగ్ల సైనికులు గిరవాటు వేశారు.

**ఇనాయత్ అలీ ఖాన్, ఖ్వాజీ** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూర్ జిల్లా థానా భవన్‌లో 1831 డిసెంబరు 10న జన్మించారు. థానాభవన్ జాగిర్దారు, పట్టణ ప్రముఖుడు షహదత్ అలీ ఖాన్ కుమారుడు. ఇనాయత్ అలీ చిన్న తమ్ముడు అబ్దుల్ రహీం ఖాన్ కూడా బ్రిటీష్ వ్యతిరేక పోరాటంలో పాత్ర నిర్వహించారు. ఆయన మీద నేరారోపణ చేసి, విచారించి, ఆయనతోపాటుగా, సహచరులకు కూడా బ్రిటీష్ మేజిస్ట్రేటు మరణదండన విధించాడు. ఆ చర్యతో ఆగ్రహించిన ఇనాయత్ అలీ ఆ ఆంగ్లేయాధికారితోపాటుగా, బ్రిటీషు పాలకుల మీద ప్రతికారం తీర్చుకోవాలనుకున్నారు. బ్రిటీషు వ్యతిరేకులందర్ని సమీకరించి ప్రత్యేక దళం తయారు చేసి, ఆ దళ నాయకత్వం స్వీకరించారు. బ్రిటీషు స్థావరాల మీద దాడులకు వ్యూహరచన చేశారు. ప్రఖ్యాత షామ్లి తహసిల్ మీద దాడిచేసి తన తమ్ముడు, ఇతర యోధులకు మరణదండన విధించిన ముజఫర్‌నగర్ మేజిస్ట్రేటును అంతం చేయడానికి పథకం రూపొందించారు. థానా భవన్ ప్రజలు, స్వదేశీ సైనిక బలగాలతో కలసి షామ్లిని స్వాధీనం చేసుకున్నారు. షామ్లి పునరాక్రమణ కోసం తరలి వచ్చిన అంగ్ల సైన్యాలను తరిమికొట్టడంలో విజయం సాధించారు. చివరకు సుశిక్షుతులైన బ్రిటీషు సైన్యాలు మళ్ళీ ముట్టడిస్తే, యుద్ధకళలో ప్రవేశం లేని సామాన్య ప్రజలు, ఆయుధ సంపత్తి లేకుండా పోరాటానికి సిద్ధపడుతున్న తిరుగుబాటు దళాలతో కలసి ఆంగ్ల సైన్యాలతో తలపడటం దుస్సాహసం కాగలదని ఇనాయతుల్లా గ్రహించారు. చివరి పోరుకు సిద్ధం అవుతూ, కుటుంబంలోని మహిళలను, పిల్లలను థానా భవన్ నుండి రహస్య ప్రదేశానికి పంపించివేశారు. ఆయన ఊహించిన విధంగా భారీ సంఖ్యలో బ్రిటీషు సేనలు థానా భవన్‌ను చుట్టుముట్టాయి. ఇనాయతుల్లా చేతిలో పరాజయం చవిచూసిన ఆంగ్ల సైన్యం కసితో రగిలిపోతూ, థానా భవన్‌ను విధ్వంసం చేశారు. దోపిడీకి పాల్పడ్డారు. అందిన వారిని అందినట్టు కాల్చివేశారు. పలువురిని ఉరి తీశారు. థానా భవన్ సర్వనాశనానికి పాల్పడ్డారు. ఆ సమయంలో ఎవ్వరికీ తెలియని రహస్య ప్రదేశానికి ఇనాయత్ అలీ వెళ్ళిపోయారు. ఆ తరువాత ఇయాత్ అలీ జాడ తెలియరాలేదు. రహస్య ప్రదేశంలో ఆయన కన్నుమూసినట్టు సమాచారం.

**ఇనాయత్ హుస్సేన్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశస్థుడు. తిరుగుబాటు సమయంలో, ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు తరలి వస్తున్న బ్రిటీషు సైన్యాలను నిలువరించేందుకు పోరుబాటలో నడిచారు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**ఇనాయత్ హుస్సేన్** : మధ్యప్రదేశ్ రాష్ట్ర రాజధాని భోపాల్ నివాసి. పూర్వపు భోపాల్ సంస్థానానికి చెందిన సైన్యంలోని కాల్బంలో జమేదార్. తిరుగుబాటులో తాను మాత్రమే పాల్గొనటం కాకుండా సహచరులను కూడా తిరగబడమని ప్రోత్సహించారు. సిహోర్ పోరాటంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సైన్యం అరెస్టు చేసి జనవరి 13, 1858న ఆయనను ' ఫీల్డ్ గన్ ' తో పేల్చివేశారు. ఆయనతోపాటుగా మరో వంద మంది సహచరులను ఉరితీయడం, కాల్చివేయడం లేదా ఫిరంగులకు కట్టి పేల్చివేశారు.

**ఇనాయతుల్లా ఖాన్** : బ్రిటీషు సైన్యంలోని బెంగాల్ కాల్బంలో సైనికుడు. అప్పటి మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నాగపూరులో ఉద్యోగ బాధ్యతల నిర్వహణ. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా ఆరంభమైన తిరుగుబాటులో తన రెజిమెంటులోని ఆంగ్ల అధికారుల ఆజ్ఞలను



**ఢిల్లీ నగరాన్ని చుట్టు ముట్టిన ఆంగ్ల సైన్యం రిడ్జిని పట్టుకున్నాక, ఢిల్లీ నగరానికి ఎదురుగా ఉన్న ఈ ప్రాంతంలో కంపెనీ పటాలాల క్యాంపు ఏర్పాటు చేసుకుంది. నగరం ఆంగ్లేయుల హస్తగతమయ్యేంత వరకు ఈ క్యాంపు నుండి అధికారులు తమ కార్యకలాపాలు జరిపారు.**

ధిక్కరించారు. ఆయనను అరెస్టు చేసి, తిరుగుబాటు, తిరుగుబాటు ప్రోత్సాహం తదితర నేరారోపణల మీద మరణదండన విధించారు. బహిరంగ ప్రదేశంలో అయనను, ఆయన సహచరులో మరో 18 మందినీ ఉరితీశారు.

**ఇంకార్ షా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి మరణదండన విధించాయి. 1858 మార్చి 24న శిక్ష అమలు జరిగింది.

**ఇస్తిక్ అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రసూల్‌పూరు నివాసి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి మరణదండన విధించాయి.1858 జనవరి 13వ తేదిన శిక్ష అమలు జరిగింది.





**ఇస్తిక్ అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రసూల్‌పూరు నివాసి. బ్రిటీషు-భారత సైన్యానికి చెందిన గ్వాలియర్ రెజిమెంటులో సిపాయి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి మరణదండన విధించాయి. 1858 జనవరిలో ఉరిశిక్ష అమలు జరిగింది.

**జాబాబ్ ఖాన్** : బ్రిటీషు-భారత సైన్యానికి చెందిన లూధియాన రెజిమెంటులో సిపాయి. అంబాల సైనిక స్థావరంలో ఉద్యోగ బాధ్యతలు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆయనను అరెస్టు చేసి, తిరుగుబాటు కుట్ర, అనుమతి లేకుండా సైన్యాన్ని వదలిపెట్టడం లాంటి నేరారోపణల మీద విచారణ జరిపి మరణశిక్ష విధించారు.

**జఫా హుస్సేన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రసూల్‌పూరు నివాసి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి మరణదండన విధించాయి. 1858 జనవరి 13న శిక్ష అమలు జరిగింది.

**జాఫర్ హుస్సేన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రసూల్‌పూరు నివాసి. బ్రిటీషు-భారత సైన్యానికి చెందిన గ్వాలియర్ రెజిమెంటులో సిపాయి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి, 1858 జనవరిలో మరణదండన విధించాయి.

**జహంగీర్ ఖాన్** : ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం హైదరాబాదు నివాసి. రోహిల్లా పఠాన్. సైనికుడు. 1857 నాటి తిరుగుబాటులో పాల్గొన్నారు. హైదరాబాదులోని రెసిడెన్సీకి చెందిన ఆంగ్లేయాధికారి కల్నల్ డేవిడ్‌సన్‌ను అంతంచేయాలని పథక రచనచేశారు. 1859 మార్చి15న నిజాం అంతఃపురం నుండి బయటకు వస్తూన్న డేవిడ్‌సన్ మీద కాల్పులు జరిపారు. గురి తప్పింది. లక్ష్యాన్ని సాధించాలన్న దృఢ సంకల్పంతో మృత్యువు వెంటాడుతున్నా భయపడక, కత్తి దూసి ఆ అధికారి వెంటబడ్డారు. ఆంగ్లేయాధికారి వెంట వస్తున్న ఒకటవసాలార్‌జంగ్ అంగరక్షకులు అడ్డుకుని ఆయనను కత్తివాదరకు గురిచేయడంతో జహంగీర్ ఖాన్ కన్నుమూశారు.

**జలాలుద్దీన్** : బ్రిటీషు సైన్యంలోని భారత రెజిమెంటులో సైనికుడు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఆగ్రా వద్ద ఉద్యోగ బాధ్యతల నిర్వహణ. తిరుగుబాటు సమయంలో ఆంగ్లేయాధికారుల ఆదేశాలను బేఖాతర్ అంటూ, తిరుగుబాటును ప్రటించి తిరుగుబాటు దళాలలో చేరి పలు పోరాటాలలో పాల్గొన్నారు. 1857లో ఢిల్లీ పతనం, ఆగ్రా వద్ద తిరుగుబాటు సేనల పరాజయం తరువాత రాజస్థాన్ సంస్థానంలోకి తప్పుకున్నారు. రాజస్థాన్‌లోని జైపూరు సంస్థానానికి చెందిన సైన్యం సవాయ్ మాధవపూరు జిల్లా హిండాన్ వద్ద ఆయనను బంధించాయి. జైపూరు సంస్థానం సైన్యంలోని బ్రిటీషు వ్యతిరేక, దేశభక్తియుత సైనికులురహస్యంగా ఆయనను బంధిఖానా నుండి తప్పించాయి. జైపూరు సేనలు ఆయనను

మళ్ళీ పట్టుకుని, ఆగ్రాకు తరలించి, విచారణ జరిపి ఉరిశిక్ష విధించారు.

**జమాల్ ఖాన్** : ఢిల్లీ లోని మొఘల్ చక్రవర్తి సైన్యంలో సైనికుడు. 1857 నవంబరులో బ్రిటీషు వ్యతిరేక తిరుగుబాటు దళాలతో చేతులు కలిపి మాధవపూరు అనుచోట తిరుగుబాటులో పాల్గొన్నారు. ఆయనను మాధవపూరులో అరెస్టు చేసి ఉరిశిక్ష విధించారు.

**జాన్ మొహమ్మద్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూరు నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 నవంబరు 10న ఢిల్లీలో కాల్చి చంపారు.

**జంగ్ బక్ష్ ఖాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1857 నవంబరు 18న ఢిల్లీలో కాల్చి చంపారు.



**ఢిల్లీలోని స్వదేశీ సిపాయి వీరులను ఎదిరించటం అసాధ్యం కావటంతో 'సీజ్‌ట్రైను' పేరుతో అదనంగా ఆయుధాలను, ఫిరంగులను, బలగాలను భారీ ఆయుధ సామగ్రిని ఢిల్లీకి తరలిస్తున్న దృశ్యం. ఏడు మైళ్ళ పోడవు ఉన్న ఈ 'సీజ్‌ట్రైను' 1857 సెప్టెంబరు 3వ తేదిన ఢిల్లీ చేరుకుంది.**

**జంగ్ బక్ష్, షేక్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1857 అక్టోబరు 3న ఢిల్లీలో ఉరిశిక్ష విధించాయి.

**జంగూ మియా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరిలో ఉరిశిక్ష విధించారు.

**జాన్ మొహమ్మద్** : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం హైదరాబాదు నివాసి. హైదరాబాదులోని రోహిల్లా జనసముదాయానికి నాయకుడు. 1857 నాటి తిరుగుబాటులో హైదరాబాదు కేంద్రంగా పాల్గొన్నారు. ప్రముఖ పోరాటయోధుడు పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. 1857 జూలై 17న హైదరాబాదు





బ్రిటీష్ రెసిడెన్సీ మీద జరిగిన దాడికి ఆయన వ్యూహకర్తగా వ్యవహరించారు. ఆ దాడి విఫలమయ్యాక, రెండురోజుల తరువాత తిరుగుబాటు దళాలను వెంటాడుతున్న బ్రిటీషు-నైజాం సేనల దాడి నుండి తమ నాయకుడు తుర్రేబాజ్ ఖాన్ అరెస్టు కాకుండా తప్పించే సాహసోపేత ప్రయత్నంలో శత్రుసేనల తుపాకి గుళ్ళకు బలయ్యారు.

**జౌహర్ బేగ్ మొఘల్** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా రేవారి నివాసి. ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు ముందుకు సాగుతున్న బ్రిటీషు సేనలను ఎదుర్కోవడంలో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 జనవరి 18వ తేదిన ఢిల్లీలో కాల్చి చంపారు.

**జవాబ్ ఖాన్** : బ్రిటీషు-భారత సైన్యంలోని లూథియాన రెజిమెంటులో సైనికుడు. పంజాబులోని లూథియానలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూ, ఆంగ్లేయాధికారుల ఆదేశాలను ఉల్లంఘించి తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, విచారణ జరిపి, 1848 మే 3న ఉరిశిక్ష విధించాయి.

**జీవన్ సాహెబ్** : కర్ణాటక రాష్ట్రం రాయచూరు జిల్లా హుమ్నాంగీ గ్రామ నివాసి. భీమారావు, కంచనగౌడల సంయుక్త నాయకత్వంలో కొప్పలదుర్గం విముక్తి కోసం బ్రిటీషు సైన్యాల మీద సాగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, విచారణ జరిపి మరణశిక్ష విధించగా, ఫైరింగ్ స్క్వాడ్ ఆయనను కాల్చి చంపింది.

**కబర్ది ఖాన్** : బ్రిటీషు సైన్యంలో జమేదారు. మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని బర్వాని ప్రాంతంలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూ, తిరుగుబాటులో పాల్గొన్నారు. బర్వాని ప్రాంతంలోని పలు బ్రిటీషు సైనిక స్థావరాల మీద దాడులు జరిపారు. 1858లో కెప్టెన్ కీటింగ్ నాయకత్వంలోని సైనికదళంలో జరిగిన పోరాటంలో అమరులయ్యారు.

**కబీర్ అలీ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని మొరాదాబాద్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆయన మార్గదర్శకత్వంలో తిరుగుబాటు కార్యకలాపాలు పెద్ద ఎత్తున జరిగాయి. మొరాదాబాదును పునరాక్రమించుకునేందుకు వచ్చిన అంగ్లేయ సేనలతో భయంకర పోరుసాగింది. 1858 ఏప్రిల్ 25న శత్రుసైన్యం మొరాదాబాదును ఆక్రమించుకున్నాక కబీరు అలీ ఖాన్ ఆయన అనుచరులు నవాబ్ అసాద్ అలీ ఖాన్, ఆబిద్ అలీ ఖాన్, సజ్జాద్ అలీ ఖాన్, షేక్ అమానుల్లా ఖాన్ తదితరులను అరెస్టు చేసి, ఆ యోధులను ఆంగ్లేయ సైన్యంలోని ' ఫైరింగ్ స్క్వాడ్ ' కాల్చి చంపింది.

**కబీర్ షా ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం బరేలిలో జననం. రోహిల్ ఖండ్ అధినేత, తిరుగుబాటు నాయకుడు ఖాన్ బహుదూర్ ఖాన్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ పక్షాన 1857మేలో బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో

ప్రధాన పాత్రవహించారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ మీద దాడిచేసిన ఆంగ్ల సేనలు విజయం సాధించాక 1860 మార్చి 20వతేదిన ఆయనకు మరణదండన విధించాయి. బరేలిలోని కమిషనర్ కార్యాలయంలో గల మఱ్రి చెట్టుకు, కబీర్ షా ఖాన్ తోపాటుగా మరో 243 మంది యోధులను వేలాడ దీసి అదేరోజున అందరి ఉరిశిక్షను అమలు జరిపారు.

**కబీరుద్దీన్ మిర్జా** : ఢిల్లీ నివాసి. మొగల్ రాజవంశీకుడు. మిర్జా కుతుబుద్దీన్ కుమారుడు. ఢిల్లీని అక్రమించుకునేందుకు బయలుదేరిన అంగ్ల సైన్యాలను ఎదుర్కోన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**కాబుల్ ఖాన్ మియా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా జాగినాలి నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలో సైనికుడు. అరెస్టు చేసి,1858 మార్చిలో కాల్చి చంపారు.



**అదనపు బలగాలు వచ్చి చేరగానే ఢిల్లీని తుఫానులా చుట్టుముట్టి ఎర్రకోట మీద సెప్టెంబరు 14వ తేదిన దాడి చేసిన కంపెనీ బలగాలను కోటలో నుండి ఎదుర్కొంటున్న స్వదేశీ వీరులు.**

**కాహేరా మియా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 మార్చిలో కాల్చి చంపారు.

**ఖాజా** : కర్ణాటక రాష్ట్రం రాయచూరు జిల్లా కుర్బరహళ్ళి గ్రామ నివాసి. భీమారావు, కంచనగౌడల సంయుక్త నాయకత్వంలో కొప్పలదుర్గం విముక్తి కోసం బ్రిటీషు సైన్యాల మీద సాగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, విచారణ జరిపి మరణశిక్ష విధించగా, ఫిరంగికి కట్టి కాల్చి చంపారు.

**కలంగీర్ బక్ష్ షేక్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు బయలుదేరిన అంగ్ల సైన్యాలను ఎదుర్కోన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1858 జనవరి 18తేదిన ఉరిశిక్ష విధించాయి.





**కాలే ఖాన్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు బయలుదేరిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1858 ఫిబవరి 27న ఉరితీశారు.

**కాలే మిర్జా** : ఢిల్లీ నివాసి. మొగల్ రాజవంశీకుడు. మిర్జా ఆగా జాన్ కుమారుడు. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు వచ్చిన అంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**కల్లూ మియా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి మాసంలో ఉరిశిక్ష విధించాయి.

**కాలూ షేక్** : హర్యానా రాష్ట్రం రోథక్ జిల్లా సోనేపట్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 డిసెంబరు 24వ తేదిన ఢిల్లీలో కాల్చి చంపారు.

**కామ్‌దార్ ఖాన్ పిండార** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని బెర్చా నివాసి. తండ్రి పేరు నాందార్ ఖాన్ పిండార. తిరుగుబాటు యోధుడు ఫైజల్ మొహమ్మద్ ఖాన్ సహచరుడు. 1857 నాటి తిరుగుబాటులో పాల్గొన్నాడు. రాహత్‌ఘర్ కోట కోసం బ్రిటీషు-భోపాల్ సంస్థానానికి చెందిన సైన్యంతో జరిగిన పోరాటాలలో భాగస్వామ్యం. తిరుగుబాటు విఫలమయ్యాక ఆంగ్లేయాధికారులు ఆయన పిన తండ్రులు ఇరువురినీ, ఆయన సహచరులు మరో 17 మందినీ అరెస్టు చేసి మరణదండన విధించారు. ఆ యోధులందర్ని 1858 జనవరి 29న, 30 తేదీలలో కాల్చి చంపారు. కామ్‌దార్ ఖాన్‌ను రాహత్‌ఘర్ కోట గుమ్మానికివేలాడదీసి బహిరంగంగా ఉరిశిక్ష అమలు జరిపారు.

**కామ్‌దార్ ఖాన్** : రాజస్థాన్ రాష్ట్రంలోని కోట సంస్థానంలో 1819లో జననం. పారసీ, ఉర్దూ భాషలలో పండితుడు. కోట సంస్థానంలోని సైన్యంలో ఉన్నతోద్యోగం. 1857నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు-కోట సంస్థానానికి చెందిన సైన్యంతో జరిగిన పోరాటాలలో పాల్గొన్నారు. బ్రిటీషర్ల తొత్తుగా వ్యవహరిస్తున్న కోట సంస్థానాధీశుడు మహారావు సైన్యంతో 1857 నవంబరులో జరిగిన పటాన్‌పోలే పోరాటానికి నాయకత్వం వహించారు. కోట సైన్యానికి ఠాకూరు లక్ష్మన్ దాస్ నాయకత్వం వహించారు. ఈ పోరాటంలో చివరికంటా శత్రువును తునుమాడుతూ అమరులయ్యారు.

**కరాముల్లా** : హర్యానా రాష్ట్రం రోథక్ జిల్లా పాల్వాల్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. 1858 జనవరి మాసంలో ఉరిశిక్ష విధించారు.

**కరీం ఖాన్** : మధ్య ప్రదేశ్ రాష్ట్రలోని మాల్వా నివాసి. బ్రిటీషు సైన్యంలో స్వదేశి కాల్బలంలో రిసాల్‌దారు. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు దళాలతో చేతులు కలిపి మాల్వా ప్రాంతంలో ఆంగ్లేయాధికారుల ఆధిపత్యాన్ని ధిక్కరించారు. పలు పోరాటాలలో

ప్రముఖ పాత్ర వహించారు. చివరకు ఆంగ్ల సేనలతో జరుగుతున్న పోరాటంలో గాయపడి శత్రువు చేత చిక్కిన ఆయనను షాహజహాన్‌పూరు వద్ద బ్రిటీషు ' ఫైరింగ్ స్క్వాడ్ ' కాల్చి చంపింది.

**కరీముల్లా** : హర్యానా రాష్ట్రం రోథక్ జిల్లా రసూల్‌పురా నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 జనవరి 16న కాల్చి చంపారు.

**కరీం** : ఢిల్లీ నివాసి. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు వచ్చిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1857 నవంబరు 30న కాల్చి చంపాయి.



**కంపెనీ బలగాలకు, స్వదేశీ యోధులకు 1857 సెప్టెంబరు 14వ తేదిన భీషణ పోరాటం జరిగిన కాశ్మీర్ గేటు. భారీ ఫిరంగులతో ఈ గేటును పేల్చివేయడంతో ఆంగ్లేయులు ఎర్రకోటలోనికి అతి సులువుగా ప్రవేశించగలిగారు. ఆ తరువాత బ్రిటీషర్లకు విజయం మరింత సులువైంది.**

**కరీం బక్ష్** : ఢిల్లీకి చెందిన షాహదరా ప్రాంత నివాసి. ఢిల్లీలో ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నందుకు, బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 27న కాల్చివేశాయి.

**కరీం బక్ష్** : ఢిల్లీకి చెందిన షాహదరా ప్రాంతం నివాసి. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు వచ్చిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నందుకు, బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1858 జనవరి 20న ఉరిశిక్ష విధించాయి.

**కరీం బక్ష్** : హర్యానా రాష్ట్రం రోథక్ జిల్లా సోనేపట్ నివాసి. తిరుగుబాటు సమయంలో ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 జనవరి 16న కాల్చి చంపారు.

**కరీం బక్ష్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో ఆంగ్ల సైన్యాలను





ఎదుర్కొన్నందుకు, అరెస్టు చేసి 1857 డిసెంబరు 7న కాల్చి చంపాయి.

**కరీం బక్ష్** : హర్యానా రాష్ట్రం రోథక్ జిల్లా హుస్సేన్‌పురా నివాసి. తండ్రి పేరు బాదుల్లా. తిరుగుబాటు సమయంలో ఆంగ్లేయ అధికారుల పెత్తనాన్ని సవాల్ చేశారు. ప్రజలను తిరుగుబాటుకు రెచ్చకొట్టారన్న నేరారోపణ మీద బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 నవంబరులో కాల్చి చంపారు.

**కరీం బక్ష్** మీర్జా : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. మీర్జా మక్‌హూ కుమారుడు. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు వచ్చిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**కరీం బక్ష్, షేక్** : హర్యానా రాష్ట్రం రోథక్ జిల్లా బల్లామాగ్రాహ్ నివాసి. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు వచ్చిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1857 డిసెంబరు 15న కాల్చి చంపాయి.

**ఖైరాతి ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రం భోపావారా నివాసి. భోపావారాలోని బ్రిటిష్ రాజకీయ ప్రతినిధి వద్ద చిన్న ఉద్యోగి. తిరుగుబాటులో పాల్గొని ధార్ అనుచోట బ్రిటీష్ సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. 1858లో అరెస్టు చేసి కాల్చి చంపారు.

**ఖైరాతి ఖాన్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీని ఆక్రమించుకునేందుకు వచ్చిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్న తిరుగుబాటు దళాలతో కలసి ఆంగ్ల సైన్యాన్ని ఎదుర్కొన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీష్ సైన్యాలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**ఖైరాతి ఖాన్, నవాబ్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూర్ జిల్లా పడసోలి గ్రామ నివాసి. రోహిల్లా పఠాన్ల అధినాయకుడు. 1857 నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. బుధానా తహ్‌సిల్ ప్రధాన కేంద్రం మీద దాడి చేసి, బ్రిటీషు సేనలనూ, అధికారులనూ వెడలగొట్టి ఆ ప్రాంతాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకున్నారు. ఈ ప్రాంతానికి స్వతంత్ర రాజ్యాధినేతగా రెండు మాసాలపాటు పాలించారు. బ్రిటీషు సైనికబలగాలు అకస్మాత్తుగా పడసోలి మీద దాడిచేయగా, ఆ దాడిని శక్తివంతంగా ఎదుర్కొన్నారు. ఆ దాడిలో తన కుమారుడ్ని కోల్పోయారు. బ్రిటీషు అధికారుల ఆధిపత్యాన్ని రెండు మాసాలపాటు సవాల్ చేసినందుకు కసిగా ఉన్న అధికారులు భారీ సంఖ్యలో పడసోలిని చుట్టుముట్టడంతో గాయపడిన ఆయన బ్రిటీషు సైన్యానికి పట్టుబడగా, మరణదండన విధించారు. ఈ సందర్భంగా ఆయన అనుచరులను పలు ప్రాంతాలకు తరలించి ఉరిశిక్షలు విధించారు.

**ఖైరాతి మియా** : హర్యానా రాష్ట్రం గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటు సమయంలో ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరిలో ఉరిశిక్ష విధించారు.

**ఖైరాతి, షేక్** : హర్యానా రాష్ట్రంలోని మహేంద్రఘర్ జిల్లా నార్‌నౌల్ నివాసి. తిరుగుబాటు సమయంలో ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 జనవరి 18న ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**ఖాజా బందిష్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమర్ నివాసి. నిమర్ పట్టణ ప్రముఖుడు. భారత ప్రథమ స్వాతంత్ర్యసమరం విఫలమయ్యాక కూడా, ఆనాటి స్ఫూర్తిని హృదయం నిండా నింపుకున్న ఆయన 1859లో తిరుగుబాటు దళాన్ని ఏర్పాటు చేసుకుని, ఆ దళానికి నాయకత్వం వహించి, మండలేశ్వర్ వద్ద బ్రిటీషు సేనలతో పోరుసల్పారు. అనంతరం ఆంగ్ల సేనలు అరెస్టు చేసి 1859లో కాల్చి చంపాయి.



**ఈస్ట్ ఇండియా కంపెనీ బలగాలకు స్వదేశీ సైనికుల మధ్య భీకరపోరు జరిగిన పాతకోట సలీంఘర్. జమునా నది తీరాన ఉన్న ఈ కోట సెప్టెంబరు 20న ఆంగ్ల సైన్యాల స్వాధీనమైంది.**

**ఖాజూర్ సుల్తాన్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజకుమారుడు. ఢిల్లీని తిరిగి ఆక్రమించుకునేందుకు తరలి వచ్చిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. ఢిల్లీ పతనం తరువాత బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1857 నవంబరు 18న మరణదండన విధించాయి.

**ఖాన్కా మియా** : హర్యానా రాష్ట్రంలోని మహేంద్రఘర్ జిల్లా నార్‌నౌల్ నివాసి. తిరుగుబాటు సమయంలో ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 జనవరి 18న ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**ఖేవాస్ ఖాన్ అలియాస్ ఈవాజ్ ఖాన్** : రాజస్థాన్ రాష్ట్రంలోని కోట సంస్థానం నివాసి. సంస్థానం సైన్యంలో సైనికుడు. తండ్రి పేరు ఇనాయతుల్లా ఖాన్. 1857 అక్టోబరు మాసంలో కోట సంస్థానంలో సంస్థానం సైన్యంలో ప్రారంభమైన తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటులో ప్రముఖ పాత్ర వహించిన ప్రజా నాయకులు లాలా జై దయాల్, మెహరాబ్





ఖాన్‌ల సంయుక్త నాయకత్వంలో కోటలోని ఆంగ్ల అధికారి నివాసం మీద 1857 అక్టోబరు 15న జరిగిన దాడిలో చురుగ్గా పాల్గొన్నారు. ఈ దాడిలో తిరుగుబాటు వీరులు ఆంగ్లేయాధికారి నివాసాన్ని ధ్వంసం చేసి, ఆంగ్లేయాధికారిని మట్టుబెట్టారు, ఆ విషయం తెలిశాక ఆగ్రహంతో, తిరుగుబాటును అణిచివేయడానికి బ్రిటీషు సైనికాధికారి జనరల్ రాబర్ట్స్ భారి బలగంతో వచ్చాడు. ఆ సందర్భంగా సంకులసమరం జరిగింది. తిరుగుబాటు యోధులలో సైనిక శిక్షణ లేని సామాన్యప్రజలు అత్యధికంగా ఉండటం వలన, సుశిక్షితులైన బ్రిటీషు బలగాలది పైచేయయ్యింది. ఆంగ్ల సైనికులు ఈవాజ్ ఖాన్‌ను చుట్టుముట్టి అరెస్టు చేశారు. అనంతరం విచారణ జరిపి ఆయనకు మరణ దండన విధించారు. ' కోట ' సింహద్వారం వద్ద బహిరంగంగా ఉరిశిక్ష అమలుపర్చారు.

**ఖిజారుద్దీన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 డిసెంబరు 15న ఉరిశిక్ష విధించారు.

**ఖుదా బక్ష్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు తరలి వచ్చిన బ్రిటీషు సైన్యాలను అడ్డుకున్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 డిసెంబరు 7న కాల్చి చంపారు.

**ఖుదా బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రసూల్‌పూర గ్రామనివాసి తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి, 1857 డిసెంబరు 15న ఉరితీశారు.

**ఖుదా బక్ష్**: ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో చురుకుగా వ్యవహరించారు. ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు తరలి వచ్చిన బ్రిటీషు సైన్యాలను అడ్డుకుని ఢిల్లీ రక్షణ కోసం ముందుకు వచ్చారు. ఆ కారణంగా బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 ఆగస్టు 28న కాల్చి చంపారు.

**ఖుదా బక్ష్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఝాన్సీ నివాసి. ఝాన్సీ మహారాణి లక్ష్మీబాయి కాల్బలం కమాండర్. ఆంగ్లేయుల దాడి నుండి ఝాన్సీ కోటను రక్షించుకునే ప్రయత్నంలో సాగిన భయంకర పోరుకు నాయకత్వం వహించారు. చివరకు 1858 జూన్ 4న శత్రువుతో పోరాడుతూ రణరంగంలో కన్నుమూసారు.

**ఖుదా బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరిలో ఉరిశిక్ష విధించారు.

**ఖుదా బక్ష్ మణిహార్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా లోని ఫరీదాబాదాబాద్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు, బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 22న డిల్లీలో ఉరితీశారు.

**ఖుదా బక్ష్, షేక్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో చురుకుగా వ్యవహరించారు.

బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 డిసెంబరు 2న మరణదండన విధించారు.

**ఖుదా బక్ష్,షేక్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా ఫరిదాబాద్ నివాసి. తిరుగుబాటులో పాల్గొని, ఢిల్లీ రక్షణకు నిలిచారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 4వ తేదిన డిల్లీలో కాల్చి చంపారు.

**ఖుదా బక్ష్, షేక్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాత్ర. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 అక్టోబరు 3వ తేదిన కాల్చి చంపారు.

**ఖుదా బక్ష్, సయ్యద్** : ఢిల్లీలోని లాహోరి గేటు నివాసి. ఢిల్లీని స్వాధీనం చేసుకునేందుకు వచ్చిన బ్రిటీషు సైన్యాలను అడ్డుకున్నారు. ఆయనను పట్టుకుని, 1858 జనవరి 18వ తేదిన కాల్చి చంపారు.



**ఓటమి ఖరారు కావటంతో సర్వసైన్యాధిపతి భక్తఖాన్ సలహా వినకుండా, చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ తన భార్య జీనత్ మహల్ ఇతర పరివారంతో తలదాచుకున్న హుమాయున్ సమాధి.**

**ఖుర్రం బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి, 1857 నవంబరు 10న ఉరిశిక్ష విధించారు.

**కులీ బేగ్** : ఢిల్లీలోని చాందనీచౌక్ గేటు నివాసి. తిరుగుబాటు దళాలతో కలసి ఢిల్లీ రక్షణకు నిలచి, బ్రిటీషు సైన్యాలను అడ్డుకున్నారు. ఆయనను అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 13న కాల్చి చంపారు.

**కుతుబుద్దీన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుసైన్‌పూర్ నివాసి. తండ్రి పేరు షేక్ కరీం బక్ష్. తిరుగుబాటులో పాల్గొన్నారు. శత్రు సైనికులను ముప్పతిప్పలు పెట్టారు. బ్రిటీషు సైనికులు ఆయనను అరెస్టు చేసి, తిరుగబాటుకు ప్రజలను ప్రేరేపించారని, విధ్వంసానికి పాల్పడ్డారన్న నేరారోపణలు చేసి, 1858 జనవరి 2న ఉరితీశారు.





**మద్హోష్ ఖాన్ పఠాన్** : ఢిల్లీలోని చాందనీ షాహ్‌దరా నివాసి. తిరుగుబాటులో పాలుపంచుకున్నారు. బ్రిటీషు సైన్యాలను అడ్డుకున్నందున అరెస్టు చేసి,1858 ఫిబ్రవరి 11న కాల్చి చంపారు.

**మహబూబ్ అలీ** : బ్రిటీషు-భారత సైన్యంలోని ' సప్పర్స్ అండ్ మైనర్స్ ' రెజిమెంటులోని సైనికుడు. హర్యానా లోని అంబాలా సైనిక స్థావరంలో ఉద్యోగ బాధ్యత. అధికారుల ఆజ్ఞలను ధిక్కరిస్తూ తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి 1858 ఎప్రిల్ మాసంలో మరణదండన విధించారు.

**హహబూబ్ అలీ ఖ్వాజా** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లా థానా భవన్ నివాసి. పండితుడు. 1857 నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్రధారి. థానాభవన్‌ను ఆక్రమించడానికి తరలి వచ్చిన ఆంగ్ల సేనల దాడిని ప్రతిఘటించారు. ఆయనను అరెస్టు చేసి బహిరంగంగా ఉరిశిక్ష విధించారు. అనంతరం అయన కుటుంబ సభ్యులందర్నీ అరెస్టు చేసి, ఆసిపాస్తులను జప్తు చేయడమే కాకుండా కుటుంబ సభ్యులందరిని నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపారు.

**మహఫూజ్ అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూర్ నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలోని గ్వాలియర్ రెజిమెంటులో సైనికుడు. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, తిరుగబాటుకు ప్రజలను ప్రేరేపించారన్న నేరారోపణ చేసి, 1858 జనవరిలో ఉరిశిక్ష విధించారు.

**మహిబుల్లాహ్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమార్ ప్రాతం నివాసి. మండలేశ్వర్ ప్రాంతంలో తిరుగుబాటు కార్యక్రమాలలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, ప్రవాసశిక్ష విధించారు. ప్రవాస జీవితంలోనే కన్నుమూసారు.

**మహమ్మూద్ షా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజకుమారుడు. ఢిల్లీ రక్షణ కార్యకలాపాలలో బ్రిటీషు సేనలకు ఎదురొడ్డి నిలిచారు. శత్రు సేనలు అరెస్టు చేసి 1857 నవంబరు 18న ఢిల్లీలో కాల్చి చంపారు.

**మహమ్మూద్ షికోహ్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజకుమారుడు. తండ్రి పేరు మీర్జా అబ్బాస్ షికోహ్. 1857 తిరుగుబాటు సమయంలో ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు సేనలతో పోరాడారు. శత్రుసేనలు అరెస్టు చేసి ఢిల్లీలో కాల్చి చంపారు.

**మహ్‌రుఖ్‌హ్ బేగ్ ఖాన్, మీర్జా** : ఢిల్లీ నివాసి. 1857 తిరుగుబాటులో బ్రిటీషు సేనలతో పోరాడారు. శత్రుసేనలు అరెస్టు చేసి ఢిల్లీలో కాల్చి చంపారు.

**మంజూ షా** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమార్ పాంత్ర నివాసి. మండలేశ్వర్ ప్రాంతంలో తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, ప్రవాసశిక్ష విధించారు.

ఆ శిక్షను అనుభవిస్తూ, ప్రవాస జీవితంలోనే ఆయన కన్నుమూసారు.

**మసూర్ అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి, తిరుగబాటుకు ప్రజలను ప్రేరేపించారన్న నేరారోపణ మీద మరణ దండన విధించారు. 1858 మార్చి 24న ఢిల్లీలో ఆయనను కాల్చి చంపారు.

**మక్సూద్** : బ్రిటీషు-భారత సైన్యంలోని కాల్బలం రెజిమెంటు సైనికుడు. హర్యానా లోని అంబాల సైనిక స్థావరంలో ఉద్యోగ బాధ్యత. అధికారుల ఆజ్ఞలను ధిక్కరిస్తూ తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి తిరుగుబాటు కుట్రకు పాల్పడ్డారని నేరారోపణ మీద 1858 ఏప్రిల్ 21న మరణదండన విధించారు.



**స్వతంత్ర రాజ్యాన్ని సుస్థాపితం చేసుకునేందుకు సాగిన స్వదేశీ సైనికుల వీరోచిత పోరు ఢిల్లీలో ముగిశాక, 1857 సెప్టెంబరు 21వ తేదిన హుమాయూన్ సమాధి వద్ద లొంగి పోయిన చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ ను తమ అదుపులోకి తీసుకున్న ఆంగ్ల అధికారి కెప్టెన్ హడ్సన్.**

**మక్సూద్ అలీ** : బ్రిటీషు-భారత సైన్యంలోని ' ఫోర్త్ లైట్ కావలరీ ' లో ఆయన సైనికుడు. పంజాబ్‌లోని సట్లెజ్ ప్రాంతంలోని సైనిక స్థావరంలో ఉద్యోగ బాధ్యత. అధికారుల ఆజ్ఞలను ధిక్కరిస్తూ తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటుకు కుట్ర పన్నారన్న ఆరోపణల మీద అరెస్టు చేసి మరణదండన విధించారు. 1858 ఏప్రిల్ మాసంలో శిక్ష అమలు చేశారు.

**మాసితా సయ్యద్** : ఢిల్లీలోని టర్కమన్ గేటు నివాసి. 1857 తిరుగుబాటులో పాల్గొన్నారు. శత్రుసేనలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 22న ఢిల్లీలో కాల్చి చంపారు.

**మీర్ ఖాన్** : బ్రిటీషు-భారత సైన్యంలోని లూథీయానా సైనికస్థావరంలో సైనికుడు. పంజాబ్‌లోని లూథీయానాలో ఉద్యోగ బాధ్యత. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి





మరణదండన ప్రకటించారు. 1858 మే మాసం 3న ఉరిశిక్ష విధించారు.

**మెహబూబ్ బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుసైనీపూరు నివాసి. తండ్రి పేరు రోషన్ పఠాన్. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. ప్రజలను తిరుగబాటుకు ప్రేరేపించారన్న నేరారోపణ మీద మరణ దండన ప్రకటించారు. 1858 జనవరి 2న ఉరిశిక్ష విధించారు.

**మెహబూబ్** : బీహార్ రాష్ట్రంలోని గయా జిల్లా నవడాలో జననం. 1857 నాటి తుగుబాటులో ప్రముఖ తిరుగుబాటు నేత హైదర్ అలీ ఖాన్ నాయకత్వంలో జరిగిన బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 27న ఉరిశిక్ష విధించాయి.

**మెహది అలీ ఖాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాలుపంచుకున్నారు. బ్రిటీషు సైన్యాలను అడ్డుకున్నందున అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 27న ఉరిశిక్ష విధించారు.

**మెహబూబ్ ఖాన్, నవాబు** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని నాజిమాబాద్ నివాసి. నాజిమాబాద్ నవాబు. 1857 నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర పోషించారు. బ్రిటీష్ పాలకవర్గాలకు, అధికారులకు వ్యతిరేకంగా తిరగబడమని ప్రోత్సహించారు. కుటుంబ ధనసంపత్తిని వెచ్చించి ఆయుధాలను సమకూర్చుకున్నారు. దేశభక్తిప్రపూరితులైన యువకులతో సైన్యాన్ని బలోపేతం చేశారు. బిజినూర్‌ను తనకు స్వాధీనం చేయమని ఆంగ్లేయాధికారులకు అల్టిమేటం జారీ చేశారు. ఆయన ప్రయత్నాలను గమనించిన బ్రిటీషు అధికారులు, పోరు నష్టమని భావించి బిజినూర్‌ను ఖాళిచేసి వెళ్ళిపోయారు. ఆంగ్ల అధికారులు పలాయనం చిత్తగించాక, బిజినూరును స్వాధీనం చేసుకుని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించారు. రూర్కీ సైనిక స్థావరంలోని భారతీయ సైనికులను తిరగబడమని ప్రోత్సహించారు. తిరుగుబాటు యోధులతో కలసి ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని గండికొట్టమని ప్రేరేపించారు. 1858 ఏప్రిల్ 21వ తేదిన బిజినూరు మీద దండయాత్రకు వచ్చిపడిన బ్రిటీషు సేనలతో అయన మేనల్లుడూ ప్రముఖ తిరుగుబాటు యోధుడూ అయిన మౌల్వి అహమ్మదుల్లా ఖాన్ ఫైజాబాది నాయకత్వంలో తిరుగుబాటు యోధులు నాగిని అనుచోట వీరోచితంగా పోరాడారు. ఆ తరువాత షాహజహాన్‌పూరు వద్ద ప్రముఖ తిరుగుబాటు నాయకులు షెహజాదా షిరోజ్ షా రోహిల్ ఖండ్‌లో స్వాతంత్ర్యం ప్రకటించుకున్న మహానాయకుడు ఖాన్ బహుద్దూర్ ఖాన్ సైన్యాలతో కలసి సమన్వయంగా ఆంగ్ల సైన్యాల మీద విరుచుకు పడ్డారు. ఈ మేరకు పలు పోరాటాలలో పరాజయం చవిచూసిన ఆంగ్లేయాధికారులు మెహబూబ్ ఖాన్ మీద కత్తికట్టి కసితో భారి బలగాలను సమకూర్చుకుని, భయంకరంగా పోరుకు సన్నద్ధమై వచ్చాయి. ఫలితంగా నాగిని వద్ద జరిగిన పోరులో పరాజయం తప్పలేదు. ఆ పరాజయమే కాకుండా

మెహబూబ్ ఖాన్ శత్రువుకు పట్టుబడ్డారు. ఆ తరువాత అదను చూసి శత్రువు కళ్ళుగప్పి తప్పించుకుని నేపాల్ అడవుల్లోకి నిష్క్రమించారు. అక్కడ సరికొత్త సైనిక బలగాలను సమకూర్చుకుని ఆంగ్లేయుల ఆధిపత్యం నుండి మాతృభూమిని విముక్తం చేయాలని సంకల్పించినా, ప్రకృతి అనుకూలించక రోగాలతో అనుచరవర్గం అంతరించి పోయింది. ఆ వాతావరణంలో 1859 జూలైలో మెహబూబ్ ఖాన్ ఆ అడవుల్లో అంతిమ శ్వాస విడిచారు.

**మెహరాబ్ ఖాన్** : రాజస్థాన్ రాష్ట్రంలోని పూర్వపు కోట సంస్థానంలోని కరౌలి గ్రామంలో 1815 మే11న జననం. కోట సంస్థానానికి చెందిన సైన్యంలో రిసాల్‌దార్ ఉద్యోగం. బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా తిరుగుబాటు ప్రారంభం కాగానే, స్వస్థలంలో



**హుమాయూన్ సమాధి వద్ద తలదాచుకున్న మొగల్ రాజకుమారులు మిర్జా మొగల్, మిర్జా ఖైజర్ సుల్తాన్, మిర్జా అబూబకర్ లను బంధించి, చక్రవర్తికి ఇచ్చిన వాగ్దానం తప్పి ప్రజలు తిరుగబడనున్నారన్న సాకుతో 1857 సెప్టెంబరు 22వ తేదిన ఢిల్లీ నగరంలోని ఢిల్లీ గేటు సమీపాన నిరాయుధులైన రాకుమారులను కాల్చి చంపుతున్న ఆంగ్ల అధికారి కెప్టెన్ హడ్సన్.**

ప్రజలనూ, సంస్థానానికి చెందిన సైన్యాన్నీ తిరుగుబాటుకు ప్రేరేపించి, తిరుగుబాటుకు నాయకత్వం వహించారు. 1857 అక్టోబరు 15న కోటలోని బ్రిటీషు అధికార ప్రతినిధి నివాసం మీద దాడిచేసి సైనిక కార్యకలాపాలను నిర్వహించారు. ఈ దాడిలో అధికార ప్రతినిధి మేజర్ బుర్టన్, అతని కుటుంబ సభ్యులు చనిపోగా, పలువురు ఆంగ్లేయాధికారులు తిరుగుబాటు యోధుల కరవాలాలకు బలయ్యారు. బ్రిటీషు అధికారుల బెడద తొలిగిపోగా, ప్రజల తిరుగుబాటు నేత శ్రీ లాలా జై దయాల్ భట్నాగర్‌తో కలసి కోట సంస్థానం పాలనావ్యవహారాల నిర్వహణా బాధ్యతలు స్వీకరించారు. చేజారిన ఆధిపత్యాన్ని తిరిగి రాబట్టుకునేందుకు, ఆంగ్ల అధికారుల మరణానికి ప్రతీకారం తీర్చుకునేందుకు కోట మీద బ్రిటీషు సైన్యం పలు మార్లు దాడులు చేయగా, ఆ దాడులను సమర్ధవంతంగా తిప్పికొట్టారు. భారీ సైన్యంతో ఆంగ్లేయ సైనికాధికారులు కోటను చుట్టుముట్టగా భయంకరంగా పోరు





సాగించారు. చివరకు బ్రిటీషు సేనలు తిరుగుబాటు యోధులను 1859లో పట్టుకొగలిగాయి. ఆవిధంగా పట్టుబడిన మెహరాబ్ ఖాన్ మీద పలు నేరారోపణలు చేసి, విచారణ తంతు జరిపి1860 కోట అధికార ప్రతినిధి నివాసం వద్ద బహిరంగంగా ఉరిశిక్ష విధించారు.

**మెహ్‌తాబ్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గావ్ జిల్లా సోహనా నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. ఆంగ్ల అధికారులు అరెస్టు చేసి మరణ దండన ప్రకటించారు. 1858 ఫిబ్రవరి 1న ఢిల్లీలో కాల్చి చంపారు.

**మెహ్‌తాబ్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా సోహనా నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. ఆంగ్ల అధికారులు అరెస్టు చేసి మరణ దండన విధించి,1858 ఫిబ్రవరి 1వ తేదీన ఢిల్లీలో కాల్చి చంపారు.

**మెహ్‌తాబ్ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌నగర్ జిల్లా నివాసి. తండ్రి పేరు షాహ్‌బాజ్ ఖాన్. తిరుగుబాటులో చురుగ్గా పాల్గొన్నారు. అరెస్టు చేసి మరణదండన ప్రకటించారు. అనంతరం ఆయనను ఉరితీశారు.

**మెహ్‌తాబ్ ఖాన్ పఠాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 27న ఢిల్లీలో ఉరితీశారు.

**మియాన్ మొహమ్మద్ అమిన్ పంజాకుష్** : ఢిల్లీకి చెందిన ప్రముఖ రచయిత. తిరుగుబాటులో కలంతో మాత్రమే కాకుండా కత్తితో కూడా పాల్గొన్నారు. 1857 సెప్టెంబరులో ఢిల్లీ పతనం తరువాత ఆంగ్ల సైన్యాలకు పట్టుబడ్డారు. ఆయనను రాజ్‌ఘాట్ వద్ద కాల్చి చంపి, అంత్యక్రియలకు అవకాశం ఇవ్వకుండా, ఆయన భౌతికాయాన్ని జమునా నదిలోకి పారేశారు.

**మీర్ గులాం** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో ఢిల్లీ రక్షణ కోసం సాగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి విచారణ జరిపి మరణదండన విధించి, 1858 జనవరిలో కాల్చి చంపారు.

**మీర్ గులాం, సయ్యద్** : ఢిల్లీలోని కుచా చేలాన్ ప్రాంత నివాసి. తిరుగుబాటులో ఢిల్లీ రక్షణ కోసం సాగిన పోరాటంలో పాల్గొన్నారు. అరెస్టు చేసి విచారణ జరిపి మరణదండన ప్రకటించి, 1858 జనవరి 18న బ్రిటీషు సేనలు కాల్చి చంపాయి.

**మీర్ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌నగర్ జిల్లా జౌలా గ్రామనివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**మీర్ ఖాన్** : బ్రిటీషు-భారతసైన్యంలోని లూథియాన రెజిమెంటులో సైనికుడు. హర్యానా రాష్ట్రంలోని అంబాలా సైనిక స్థావరం వద్ద ఉద్యోగం. 1857 నాటి తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి ఆయన మీద పలు నేరారోపణలను చేసి, విచారణ జరిపి బహిరంగంగా కాల్చి చంపారు.

**మీర్ ఖాన్ మియో** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రైసినా నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. ఆంగ్ల అధికారులు అరెస్టు చేసి మరణ దండన ప్రకటించారు. 1858 ఫిబ్రవరిలో ఉరిశిక్ష విధించారు.

**మీర్ కుర్బాన్ అలీ** : ఢిల్లీ లోని తుర్కమన్ గేటు ప్రాంత నివాసి. ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 22న ఉరిశిక్ష విధించారు.

**మీర్ మెహదీ** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని అవధ్ రాజకుమారుడు బిర్జిస్ ఖదిర్‌కు ఉపాధ్యాయుడు.అవధ్ రాజధానిలో బేగం హజరత్ మహల్ నాయకత్వంలో తిరుగుబాటు



**ఢిల్లీని పూర్తిగా స్వాధీనం చేసుకోగానే ఆంగ్లేయులు నియమించిన 'ప్రైజ్ ఏజెంట్లు' నగరంలోని ధనిక-సంపన్న వర్గాలను భయభ్రాంతులను చేసి దోపిడి సాగించారు. ఆయుధాల గురిపెట్టి ప్రజలను 2భయకంపితుల్ని చేసి ధనసంపదను బయటకు తీయించి దోచుకుంటున్న దృశ్యం.**

ప్రారంభమై, బిర్జిస్ ఖదీర్‌ను పాలకునిగా ప్రకటించాక 1857-1858 సంవత్సరం వరకు జరిగిన పోరాటాలలో పాల్గొన్నారు. లక్నోను బ్రిటీషు సేనలు తిరిగి ఆక్రమించుకున్నాక, ఆయన కూడా బేగం హజరత్ మహల్, బిర్జిస్ ఖదీర్‌లతోపాటుగా నేపాల్ అడవుల్లోకి వెళ్ళిపోయారు. అక్కడే ఆయన కన్నుమూసినట్టు భావిస్తున్నారు.

**మీర్ మియాన్ ఖాజి** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు అరెస్టు చేసి రాజ్‌ఘాట్ వద్దకు తీసుకు వెళ్ళి కాల్చి చంపారు. అనంతరం భౌతికకాయాన్ని జమునా నదిలో గిరువాటు వేశారు.

**మీర్ షా, సయ్యద్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన





పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1858 జనవరి 18న కాల్చి చంపారు.

**మీర్జా అబ్దాలి** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1857 నవంబరు 15న ఉరిశిక్ష విధించారు.

**మీర్జా ఛోటే** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. ఆంగ్ల సైనికులు అరెస్టు చేసి మరణదండన ప్రకటించి, 1857 డిసెంబరు 15న ఉరిశిక్ష విధించారు.

**మీర్జా గఫూర్ షికోహ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా పాల్వాల్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. అరెస్టు చేసి మరణదండన ప్రకటించి, 1857 డిసెంబరులో ఉరితీశారు.

**మీర్జా హాజీ మొఘల్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. 1857 నవంబరు 18న ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**మీర్జా హైఖుస్రో బక్ష్ మొఘల్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు పట్టుకుని 1857 నవంబరు 18న ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**మీర్జా కుల్లుం** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. అరెస్టు చేసి తిరుగుబాటుకు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న ఆరోపణల మీద విచారణ జరిపి 1857 డిసెంబరు15న ఉరిశిక్ష విధించారు.

**మీర్జా మొహమ్మద్ బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ పాల్‌వాల్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. అరెస్టు చేసి తిరుగుబాటుకు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న ఆరోపణల మీద విచారణ జరిపి మరణ దండన విధించి,1857 డిసెంబరు మాసంలో ఉరిశిక్ష అమలు చేశారు.

**మీర్జా మొహమ్మద్ ఇబ్రాహిం** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ పాల్‌వాల్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1857 డిసెంబరులో ఉరిశిక్ష విధించారు.

**మీర్జా మోమిన్** : ఢిల్లీ లోని ఢిల్లీ కోట నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1858 ఫిబ్రవరి 22న ఉరిశిక్ష విధించారు.

**మీర్జా రంజాని** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు

సేనలతో జరిగిన పోరాటంలో చురుకైన పాత్ర వహించారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1857 నవంబరు 18న ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**మిర్జా షుజా షికోహ్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాత్ర. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి, 1857 నవంబరు 18న కాల్చి చంపాయి.

**మొహబ్బత్, షేక్** : ఢిల్లీలోని పురానా ఖిల్లా నివాసి. తిరుగుబాటులో చురుకైన భాగస్వామ్యాన్ని నిర్వహించారు. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1858 ఫిబ్రవరి 11న కాల్చి చంపారు.



**తిరుగుబాటు సమయంలో ఫిరోజ్‌పూరు స్వదేశీ యోధులను ఫిరంగి గొట్టాలకు కట్టి పేల్చివేస్తున్న దృశ్యం. శరీరం తునాతునకలై, ప్రాణాలు గాలిలో కలసిపోతాయని తెలిసి కూడా విముక్తి పోరాట యోధులు ఏ మాత్రం భీతిచెందకుండా ఆనందంగా మృత్యువును ఆహ్వానించారు.**

**మొహమ్మద్ అలీ ఖాన్** : ఢిల్లీలోని కుచే చేలన్ ప్రాంత నివాసి. తండ్రి పేరు నవాబ్ షేర్ జంగ్ ఖాన్. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు 1857లో కాల్చి చంపాయి.

**మొహమ్మద్ అలీ మిర్జా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు వెంటాడి పట్టుకుని, 1857 డిసెంబరు 15న మరణదండన విధించాయి.

**మొహమ్మద్ అమీన్ ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం బరేలిలో జననం. రోహిల్ ఖండ్ అధినేత, తిరుగుబాటు నాయకుడు అయిన ఖాన్ బహుదూర్ ఖాన్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ పక్షాన మే 1857లో బ్రిటీషు





సేనలతో జరిగిన పోరాటంలో ప్రధాన పాత్ర వహించారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ మీద దాడిచేసిన ఆంగ్ల సేనలు విజయం సాధించాక 1860 మార్చి 20న ఆయనకు మరణదండన విధించాయి. బరేలిలోని కమీషనర్ కార్యాలయంలో గల మర్రి చెట్టుకు, మొహమ్మద్ అమీన్ ఖాన్ తోపాటుగా మరో 243 మంది తిరుగుబాటు యోధులను వేలాడ దీసి సామూహిక ఉరిశిక్షలను అమలు జరిపారు.

**మొహమ్మద్ హబీర్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా ప్రారంభమైన తిరుగుబాటులో పాల్గొన్నారు. ఆంగ్ల సైనికులు అరెస్టు చేసి తిరుగుబాటుకు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న ఆరోపణల మీద విచారణ జరిపించి 1857 డిసెంబరు 15న కాల్చి చంపారు.

**మొహమ్మద్ హైరూ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీషు వ్యతిరేక తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. తిరుగుబాటుకు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న ఆరోపణల మీద విచారణ జరిపి 1857 డిసెంబరు15న కాల్చి చంపారు.

**మోహమ్మద్ హసన్ ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని బర్ద్వాన్ జిల్లా సహస్వాం నివాసి. తిరుగుబాటులో చురుకైన పాత్ర నిర్వహించారు. తిరుగుబాటు నాయకుల ఆధ్వర్యంలో ఏర్పడిన ప్రభుత్వంలో సహస్వాన్ థానేదార్‌గా వ్యవహరించారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1858 జూన్ 5న కాల్చి చంపాయి.

**మొహమ్మద్ ఇబ్రాహిం** : హర్యానా లోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి తిరుగుబాటుకు 1857 డిసెంబరు 15న కాల్చి చంపారు.

**మొహమ్మద్ ఖాన్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1858 మార్చి 19న ఢిల్లీలో కాల్చి చంపారు.

**మొహమ్మద్ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లా ఝింజానా నివాసి. తండ్రి పేరు షంషేర్ జంగ్. తిరుగుబాటులో చురుకైన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, ఉరిశిక్ష విధించాయి.

**మొహమ్మద్ ఖాన్ :** హర్యానా లోని గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూర్ నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలోని గ్వాలియర్ రెజిమెంటులో సిపాయి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**మొహమ్మద్ సాదత్ బక్ష్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1857 డిసెంబరు 15న కాల్చి చంపాయి.

**మొహమ్మద్ షికోహ్ మొఘల్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో చురుగ్గా పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1858 ఫిబ్రవరి 23న కాల్చి చంపాయి.

**మొహమ్మద్ యార్ బిల్లోచ్ :** హర్యానా లోని రోథక్ జిల్లా బహదూర్‌ఘర్ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో చురుగ్గా పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1857 డిసెంబరు 29న కాల్చి చంపాయి.

**మొహమ్మద్ యూసుఫ్ :** హర్యానా లోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో చురుగ్గా పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1857 డిసెంబరు 15న కాల్చి చంపాయి.

**మొహమ్మద్ అబ్దుల్ హఖ్, హకీం :** ఢిల్లీ నివాసి. తండ్రి పేరు మొహమ్మద్ హసన్ బక్ష్. మొఘల్ ప్రభువు ఆస్థానంలో భల్లభాగ్రామ్ రాజు ప్రతినిధిగా వ్యవహరించారు. తిరుగుబాటు సమయంలో మొఘల్ చక్రవర్తికి సహాయకుడిగా బాధ్యతలు నిర్వహించారు.



**ప్రస్తుత పాకిస్థాన్‌లోని పెషావర్‌లో భారీ స్థాయిలో మూకుమ్మడి ఉరితీతలు, ఫిరంగులతో పేల్చివేతలు సాగుతున్న దృశ్యం. ఆంగ్ల అధికారులు దగ్గరుండి ఈ హత్యాకాండను నిర్వహించారు.**

చక్రవర్తి పక్షాన హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బాధ్యునిగా క్రియాశీలక పాత్రవహించారు. నాలుగు వందల అశ్విక దళం, కాల్బలానికి కమాండర్‌గా నాయకత్వం వహించారు. ఢిల్లీ పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సేనలు పట్టుకుని 1857 నవంబరు 18న ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**మొహమ్మద్ సాదత్ బక్ష్ :** ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1857 డిసెంబరు 15న కాల్చి చంపాయి.

**మొహమ్మద్ హసన్ ఖాన్, నవాబ్ :** ఢిల్లీ నివాసి. తండ్రి పేరు నవాబ్ ఇర్తిజా ఖాన్. కులీన వర్గానికి చెందిన ప్రముఖుడు. తిరుగుబాటులో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. మొగల్ రాజకుమారుడు, తిరుగుబాటు నాయకులలో ఒకరైన మిర్జా వజీర్ సుభాన్‌కు అంతరంగిక ప్రతినిధి. మొగఘల్ రాకుమారుడు మిర్జా మొఘల్ నాయకత్వంలోని సైనిక





బలగంలోని ఓ దళం నాయకునిగా హిండాన్, బద్లి సరాయ్ ప్రాంతాలలో బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటాలలో పాల్గొన్నారు. జహ్‌గ్గర్ నవాబు పరగణాలో బ్రిటీషు సేనలకు పట్టుబడగా మరణదండన ప్రకటించి, ఢిల్లీలో 1857లో ఉరిశిక్ష విధించారు.

**మొహమ్మద్ ఖాన్ :** రాజస్థాన్ రాష్ట్రంలోని పూర్వపు కోట సంస్థానంలోని కరౌలి లో 1817 జనవరి 5న జన్మించారు. తండ్రి పేరు నాసిర్ ఖాన్. ఉర్దూ, ఆంగ్ల భాషలను అధ్యయనం చేశారు. కోట సంస్థానాధీశుని సైన్యంలో రిసాల్‌దార్ ఉద్యోగం. కోట సంస్థానాధీశుడు మహారావు బ్రిటీషర్ల తొత్తుగా వ్యవహరిస్తున్నప్పటికీ, ఆంగ్ల పాలకుల మీద 1857లో తిరుగుబాటు ప్రకటించారు. కోట సంస్థానాధీశుని సేనలతో జరిగిన పలు పోరాటాలలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక మహరావు సేనలు పట్టుకుని 1858 మార్చిలో ఆయనను కాల్చి చంపేశాయి.

**మొహమ్మద్ ఖాన్ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుసైన్‌పూరు నివాసి. తండ్రి పేరు షేక్ సాబుత్ ఖాన్. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి తిరుగుబాటుకు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న ఆరోపణలు చేసి, 1858 జనవరి 2న కాల్చి చంపారు.

**మొహమ్మద్ ఖాన్ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుసైన్‌పూరు నివాసి. తండ్రి పేరు ఖాదిర్ బక్ష్. తిరుగుబాటులో పాల్గొన్నారు. అరెస్టు చేసి తిరుగుబాటుకు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న ఆరోపణలు చేసి, 1857 డిసెంబరు 21న ఉరితీశారు. **మొహమ్మద్ రాజా :** మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని పూర్వపు మాధిపూర్ సంస్థానం నివాసి. తిరుగుబాటు ప్రకటించి మాధిపూరు సంస్థానంతో కలిసి 1857 నవంబరు నాటి తిరుగుబాటు పోరాటాలలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి మాధిపూరులో బహిరంగంగా ఉరితీశాయి.

**మొహమ్మద్ సలీం :** మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని ధార్ నివాసి. తండ్రి పేరు మహమ్మద అజీం. 1857 నాటి తిరుగుబాటు పోరాటాలలో పాల్గొని ధార్ ప్రాతంలోని పలు బ్రిటీషు స్థావరాల మీద దాడులు నిర్వహించారు. బ్రిటీషు సేనలు 1857 డిసెంబరులో అరెస్టు చేసి 1858 జనవరి 11న మండలేశ్వర్‌లో కాల్చి చంపారు.

**మొహమ్మద్ షా :** ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం బరేలిలో జననం. రోహిల్‌ఖండ్ అధినేతా, తిరుగుబాటు నాయకుడు అయిన ఖాన్ బహుదూర్ ఖాన్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ పక్షాన మే 1857లో బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో ప్రధాన పాత్రవహించారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ మీద దాడిచేసిన ఆంగ్లేయ సేనలు పూర్తి విజయం సాధించాక 1860 మార్చి 20న ఆయనకు మరణదండనవిధించాయి. బరేలిలోని కమిషనర్ కార్యాలయంలో గల మర్రి చెట్టుకు, మొహమ్మద్ అమిన్‌ఖాన్ తోపాటుగా మరో 243 మంది తిరుగుబాటు యోధులను వేలాడ

దీసి సామూహిక ఉరిశిక్షలను అమలు జరిపారు.

**మహమ్మద్ యార్ ఖాన్ పఠాన్** : ఢిల్లీకి చెందిన కుచా చేలన్ నివాసి. ఢిల్లీ రక్షణకు బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1858 ఫిబ్రవరి 22న ఢిల్లీలో కాల్చి చంపారు.

**మహమ్మద్ యూసఫ్** : హర్యానా లోని గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1857 డిసెంబరులో ఉరితీశారు.

**మొహిద్దీన్ ఖాన్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు వచ్చిన బ్రిటీషు సైన్యాలను తిరుగుబాటు దళాలతో కలసి ఎదుర్కొన్నారు. ఢిల్లీ రక్షణ విఫలమయ్యాక జైపూరు



**తిరుగుబాటులో భాగంగా ఆంగ్లేయాధికారి నికల్సన్ బలగాలను ఎదుర్కొంటున్న తిరుగుబాటు యోధులు. ఈ వీరోచిత పోరాటంలో అత్యధిక సంఖ్యలో స్వదేశీ యోధులు నిహతులయ్యారు.**

సంస్థానంలోకి ప్రవేశించారు. జైపూరులోని సవాయ్ మాధవపూరు జిల్లా హిండాన్ వద్ద బ్రిటీషు సేనలకు పట్టుబడ్డారు. అ సమయంలో తిరుగుబాటు ప్రకటించిన జైపూరు సంస్థానం సైనికులు ఆయనకు నిర్బంధం నుండి విముక్తి కలిగించారు. బ్రిటీషు సేనలు ఆయనను వెంటాడి మళ్ళీ అరెస్టు చేసి ఆగ్రాకు తరలించాయి. ఆగ్రాలో విచారణ తంతు జరిపి 1857లో ఉరిశిక్ష విధించాయి.

**మొయినుద్దీన్, సయ్యద్** : ఢిల్లీలోని పురానాఖిల్లా నివాసి. తిరుగుబాటులో చురుకైన పాత్రను నిర్వహించారు. తిరగుబాటు విఫలమయ్యాక ఆంగ్ల సేనలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 4న కాల్చి చంపాయి.

**మొషిన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరగుబాటు విఫలమయ్యాక ఆంగ్ల సేనలు అరెస్టు చేసి 1857 డిసెంబరు 8న ఉరిశిక్ష విధించారు.





**మొయినుద్దీన్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. తండ్రి పేరు మీర్జా అల్లా బక్ష్. తిరుగుబాటు సమయంలో బ్రిటీషు సైన్యాలతో సాగిన పోరాటంలో చురుకైన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సేనలు పట్టుకుని 1857లో ఉరిశిక్ష విధించాయి

**మొయినుద్దీన్ మొఘల్** : ఢిల్లీ నివాసి. 1857 నాటి తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 23న కాల్చి చంపాయి.

**మొసి ఖాన్, నవాబ్** : ఢిల్లీ నివాసి. 1857 నాటి తిరుగుబాటు దళాలలో ఒక దళానికి ఆయన నాయకత్వం వహించారు. బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి ద్రోహం, తిరుగుబాటు నేరారోపణలు చేసి, ఉరిశిక్ష విధించాయి.

**మౌలా బక్ష్, మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. తండ్రి పేరు మీర్జా రహీం బక్ష్. తిరుగుబాటు సమయంలో బ్రిటీషు సైన్యాలతో సాగిన పోరాటంలో చురుకైన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సేనలు పట్టుకుని, 1857లో ఉరిశిక్ష విధించాయి.

**ముబారక్, మీర్జా** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం బరేల్లిలో జననం. రోహిల్ ఖండ్ అధినేత, తిరుగుబాటు నాయకుడు, రోహిల్ ఖండ్ స్వతంత్ర రాజుగా ప్రకటించుకున్న ఖాన్ బహుదూర్ ఖాన్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటు పోరాటాలలో పాల్గొన్నారు. స్వతంత్ర రోహిల్‌ఖండ్ పక్షాన మే 1857లో బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో ప్రధాన పాత్రవహించారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ మీద దాడిచేసిన ఆంగ్ల సేనలు విజయం సాధించాక 1860 మార్చి 20న ఆయనకు ఉరిశిక్ష విధించాయి. ఆ రోజున బరేలిలోని కమిషనర్ కార్యాలయంలో గల మర్రి చెట్టుకు, మొహమ్మద్ అమీన్ ఖాన్ తోపాటుగా మరో 243 మంది తిరుగుబాటు యోధులకు సామూహిక ఉరిశిక్షను అమలు జరిపారు.

**ముబారిద్దౌలా నవాబ్** : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రస్తుత రాజధాని హైదరాబారులో1800 సంవత్సరంలో జననం. నైజాం ప్రాంతాన్ని పరిపాలిసున్న నిజాం రాజవంశీకుడు. తండ్రి పేరు నవాబ్ షికింద్ ఝా. తొలుత నుండి బ్రిటీషు పాలకుల ఆధిపత్యానికి వ్యతిరేకి. నైజాం పరిపాలనలో ఆంగ్లేయుల పెత్తనాన్ని నిరసించాడు. 1829-30 ప్రాంతంలో బ్రిటీషుపాలకులకు వ్యతిరేకంగా వెల్లువెత్తిన కార్యకలాపాలలో పాల్గొన్నారు. ఉత్తర భారత దేశంలోని వివిధ ప్రాంతాలలో 'వహాబీ' లు నిర్వహిస్తున్న బ్రిటీష్ వ్యతిరేక కార్యకలాపాల పట్ల ఆకర్షితులయ్యారు. ఆ ప్రభావంతో రహస్యంగా ఆంగ్లేయుల పెత్తనాన్ని అంతంగావించేందుకు పథకాలను రూపొందించారు. ప్రతిఘటన కార్యకలాపాలను ముమ్మరం చేశారు. 1830 ఏప్రిల్ 19న అరబ్బు,ఆఫ్ఘాన్ జాతీయులతో కలసి పాలకులను ఎదిరించినందున, గోల్కోండ కోటలో బంధించారు. నిర్బంధం నుంచి విముక్తమయ్యాక యధావిధిగా తిరుగుబాటు కార్యకలాపాలను ఆరంభించారు. 1839లో అరెస్టయ్యారు.

వహాబీలతో కుమ్మక్కయ్యి కుట్రకుపాల్పడ్డారన్న ఆరోపణలతో విచారణకు గురయ్యారు. విచారణ జరిపి ఆయనకు జీవిత ఖైదు, అనుచరులకు 10 సంవత్సరాల జైలు శిక్ష విధించారు. ఆయనను గోల్కొండ కోటలో నిర్బంధించగా 1854 జూన్ 25న కన్నుమూశారు.

**ముద్దత్ అలీ** : హర్యానా లోని గుర్‌గాంవ్ జిల్లా సోహ్నా నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి మరణదండన ప్రకటించాయి. 1858 ఫిబ్రవరి 1న కాల్చి చంపాయి.

**ముద్గూరు మియో** : హర్యానా లోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి మాసంలో కాల్చి చంపాయి.

**ముఫ్తి అజ్మల్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం బరేలిలో జననం. రోహిల్ ఖండ్ అధినేత, తిరుగుబాటు నాయకుడు, రోహిల్ ఖండ్ స్వతంత్ర రాజుగా ప్రకటించుకున్న ఖాన్ బహద్దూర్



**తిరుగుబాటులో భాగంగా కాన్పూరుకు 48మైళ్ళ దూరానగల ఫతేపూరులో ఆంగ్ల అధికారి హెన్రీ హ్యావ్‌లాక్ బలగాలకు, స్వతంత్ర పోరాట వీరులకు భీషణ పోరాటం జరిగిన ప్రాంతం.**

ఖాన్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటు పోరాటాలలో పాల్గొన్నారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ పక్షాన మే 1857లో బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో ప్రధాన పాత్రవహించారు. స్వతంత్ర రోహిల్‌ఖండ్ మీద దాడిచేసిన ఆంగ్ల సేనలు విజయం సాధించాక 1860 మార్చి 20న ఉరిశిక్ష విధించాయి. ఆరోజున బరేలిలోని కమిషనర్ కార్యాలయంలో గల మర్రి చెట్టుకు వేలాడదీసి, ఆయన తోపాటుగా మరో 243 మంది తిరుగుబాటు యోధులకు సామూహిక ఉరిశిక్షను అమలు జరిపారు.

**మొఘల్ బేగ్** : హర్యానా లోని గుర్‌గాంవ్ జిల్లా ఝజ్జర్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్రవహించారు. తిరుగుబాటు దళాలకు నాయకత్వం వహించారు. 1857లో బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేయగా, సైన్యం కళ్ళుగప్పి తప్పించుకున్నారు. 1861లో బ్రిటీషు సేనలు అరెస్టు చేసి బ్రిటీషు అధికారి ఫ్రేజర్‌ను అంతం చేశారన్న ఆరోపణ మీద విచారణ





జరిపి, మరణదండన విధించాయి. 1862 ఫిబ్రవరి మాసంలో కాల్చి చంపాయి.

**మొఘల్, మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. మొఘల్ చక్రవర్తి బహద్దూర్ షా జఫర్ కుమారుడు. 1857 నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. స్వదేశీ సైన్యాలకు నాయకత్వం వహించి, ఢిల్లీ మీదకు తరలి వచ్చిన ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక, ఢిల్లీకి కొద్ది దూరంలో గల మొఘల్ చక్రవర్తి హుమాయూన్ సమాధి వద్ద 1857 సెప్టెంబరు 23న బ్రిటీషు సైనికాధికారి మేజర్ హడ్సన్‌కు పట్టుబడ్డారు. రాజవంశీకుల ప్రాణాలకు ఎటువంటి హాని తలపెట్టమని చేసిన వాగ్దానాన్ని భంగపర్చుతూ, ఢిల్లీ గేటు బయట పట్టుబడిన రాజకుమారులను, రాజ కుటుంబీకులను నిర్దాక్షిణ్యంగా కర్కోటకుడుగా అపఖ్యాతిని మూటగట్టుకున్న హడ్సన్ అదేరోజున కాల్చి చంపాడు

**మొజుద్దీన్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. తండ్రి మీర్జా మేధూ. 1857 నాటి తిరుగుబాటులో చురుగ్గా పాల్గొన్నారు. ఢిల్లీలో ఉరిశిక్ష విధించాయి.

**ముఖ్రా మియో** : హర్యానా లోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరిలో ఉరిశిక్ష విధించాయి.

**మునీర్ బేగ్ మీర్జా** : హర్యానా రాష్ట్రంలోని హిస్సార్ జిల్లా హాంస్సి గ్రామ నివాసి. పారసీ పండితుడు. ప్రథమ స్వాతంత్ర్యసమరయోధుడు లాలా హుకుంచంద్ జైన్‌కు అత్యంత సన్నిహితుడు. బ్రిటీషు పాలకవర్గాల ఆధిపత్యాన్ని సవాల్ చేస్తూ, లాల్ చంద్ నాయకత్వంలో ప్రారంభమైన తిరుగుబాటులో ప్రముఖ పాత్రవహించారు. హర్యానా రాష్ట్రంలోని హిస్సార్, కర్నాల్ జిల్లాల్లో ఆంగ్ల సేనలతో జరిగిన పలు పోరాటాలలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలను మట్టికరిపించేందుకు ఆయుధాలు అవసరమని, అందువలన ఆయుధాలను, మందుగుండును అందించి సహకరించవలసిందిగా, ఢిల్లీ చక్రవర్తి బహద్దూర్ షా జఫర్‌కు లాల్‌చంద్‌తో కలసి చారిత్రాత్మక లేఖను రాశారు. ఢిల్లీ పతనం తరువాత ఆంగ్ల సేనలు పట్టుకుని స్వగ్రామంలోని ఆయన నివాస గృహం వద్దే 1858 జనవరి 19న ఉరితీశారు. ఆయన గ్రామానికి చెందిన సహచరుడు లాల్ చంద్‌ను కూడా ఆయనతోపాటుగా ఉరితీశారు. ఆయన భౌతికకాయాన్ని స్వజనులకు అందచేయకుండా, ముస్లింల సంప్రదాయాలకు భిన్నంగా, ఆయనను అవమానపర్చేందుకు, ఆంగ్ల అధికారులు స్వయంగా దగ్గర ఉండి దహనం చేయించారు.

**మురాద్ ఖాన్ షేక్** : ఢిల్లీలోని నజఫ్‌గడ్ నివాసి. ఢిల్లీ రక్షణకు ఆంగ్ల సేనల మీద జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 15న ఉరితీశారు

**ముర్తుజా ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. ప్రథమ

తిరుగుబాటులో పాల్గొన్నందుకు, ఆంగ్ల సేనలు పట్టుకుని 1858 ఫిబ్రవరిలో ఉరిశిక్ష అమలు చేశారు.

**ముషీరుద్దీన్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజకుమారుడు. తండ్రి పేరు మీర్జా ఖాదర్ బక్ష్. ఢిల్లీ రక్షణ కోసం సాగిన పోరాటంలో ప్రధాన పాత్రవహించారు. పట్టుకుని ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**ముస్తఫా ఖాన్** : గుజరాత్ రాష్ట్రంలోని పూర్వ సంస్థానం సూత్ ( SOONTH ) నివాసి. సూత్ సంస్థానం సైన్యంలో జమేదార్. రేవాకాంత్ బ్రిటీషు రాజకీయ ప్రతినిధి వద్దగల స్వదేశీసైనిక దళానికి నాయకుడు. తిరుగుబాటు ప్రారంభంగానే బ్రిటీషు ప్రతినిధి ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూ తిరుగుబాటు ప్రారంభించారు. భిల్, కోలి తదితర జాతులు, ముస్లిం



ఫతేపూరు వద్ద ఆంగ్లేయాధికారి జనరల్ హ్యావ్‌లాక్ బలగాలను ఎదుర్కొంటున్న యోధులు.

దేశ భక్తుల సహకారంతో ఆంగ్ల సేనలతో జరిగిన పోరాటాలలో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికాధికారి లెఫ్టినెంట్ అల్‌బాన్ నాయకత్వంలోని బ్రిటీషు బలగాలతో రాజపిప్లా వద్ద జరిగిన పోరాటంలో తీవ్రంగా గాయపడ్డారు. ఆ గాయం మూలంగా కొద్ది రోజుకే కన్నుమూశారు.

**ముజఫరుద్దీన్ ద్దౌలా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి, రాజద్రోహం నేరాన్ని ఆరోపించి 1857 డిసెంబరు 15న ఉరితీశాయి.

**నబీ బక్ష్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణ కోసం సాగిన పోరాటంలో ప్రధాన పాత్రవహించారు. ఆంగ్ల సేనలు 1857 డిసెంబరు 13న ఉరిశిక్ష విధించాయి.

**నబీ బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలోని గ్వాలియర్ రెజిమెంటులో సిపాయి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషు





బలగాలు అరెస్టు చేసి, రాజద్రోహం నేరాన్ని ఆరోపించి 1858 జనవరిలో ఉరిశిక్ష విధించారు.

**నబీ బక్ష్ కశ్మీరీ** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని సాగర్ నివాసి. సాగర్‌లోని తపాలా శాఖలో డిప్యూటీ పోస్టు మాస్టర్ ఉద్యోగం. ప్రథమ స్వాతంత్ర్యసమరంలో పాల్గొన్నారు. ఆంగ్లేయాధికారులు సాగర్ ప్రాంతంలోని క్రిందిస్థాయి సైనికాధికారులకు పంపించే లేఖలను చించి చదివి, వాటిలోని సారాంశాన్ని, అధికారుల ఆలోచనలను తిరుగుబాటు దళాల నాయకులకు తెలుపుతూ, బ్రిటీషు సైనిక బలగాల కదలికల సమాచారాన్ని ఎప్పటికప్పుడు రహస్యంగా అందచేస్తూ, తిరుగుబాటుకు చేయూతనిచ్చారు. ఈ పని చాలా కాలం నిరాఘాటంగా సాగింది. అధికార రహస్యాలు తిరుగబాటు దళాలకు అందటం వలన ఆంగ్లేయుల దాడులను సమర్థవంతంగా తిప్పికొట్టసాగాయి. ఈ వ్యవహారాన్ని పసికట్టిన అధికారులు నిఘావేయటంతో అసలు విషయం బయట పడింది. అరెస్టు చేయగా ఏమాత్రం భయాన్నిగానీ, పశ్చాత్తాపాన్నీ గాని ప్రకటించని ఆయనకు మరణదండన విధించి, బహిరంగంగా ఉరితీసి సాగర్ కోట గుమ్మాకి వేలాడతీశారు.

**నబీ షేర్ ఖాన్** : రాజస్థాన్ రాష్ట్రంలోని పూర్వపు కోట సంస్థానంలోని కరౌలిలో 1815 సంవత్సరం జన్మించారు. కోట సంస్థానాధీశుని సైన్యంలో ఫిరంగి దళం నాయకుడు. కోట సంస్థానాధీశుడు మహారావు బ్రిటీషర్ల తొత్తుగా వ్యవహరిస్తున్నప్పటికీ, ఆంగ్ల పాలకుల మీద 1857లో తిరుగుబాటు ప్రకటించారు. కోట సంస్థానాధీశుని సేనలలో అధికభాగం తిరుగుబాటులో పాల్గొనగా, ఆ దళాలకు అనుకూలంగా కోటలోని ఫిరంగులను అందుబాటులో ఉంచారు. ఆ సందర్భంగా ఆంగ్ల అధికారి మేజర్ బుర్టన్ మీద తిరుగుబాటు దళాలు 1857 దాడి చేయగా, ఆ దాడి నుండి బ్రిటీషు అధికారిని రక్షించేందుకు కోట సంస్థానాధీశుడు మహారావు జరిపిన ప్రయత్నాలకు గండి కొట్టి తిరుగుబాటు యోధులకు తోడ్పడ్డారు. కంపెనీ పాలకులకు తొత్తుగా మారిన సంస్థానాధీశుని అనుకూల సేనలతో జరిగిన పోరాటాలలో తిరుగుబాటు దళాలకు క్రియాశీలక తోడ్పాటునిచ్చారు. తిరుగుబాటు విఫలమయ్యాక మహరావు సేనలు పట్టుకుని, 1858లో ఆయనను ఫిరంగికి కట్టి పేల్చివేశారు.

**నాదిర్ అలీ ఖాన్** : బీహార్ రాష్ట్రంలోని గయా జిల్లా చార్‌కోసా గ్రామంలో జననం. బ్రిటీషు-భారత సైన్యంలోని రాంఘర్ బెటాలియన్‌లో సుబేదారు. 1857 నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించి, పలు పోరాటాలలో తిరుగుబాటు దళాలకు నాయకత్వం వహించారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, ఆజంఘర్ వద్ద 1857 అక్టోబరు 11న కాల్చి చంపాయి.

**నాదిర్ భక్త్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొగల్ రాకుమారుడు. తండ్రి పేరు మీర్జా ఇఖ్‌తిదార్ భక్త్. ఢిల్లీ రక్షణకు సాగిన పోరాటంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు

సేనలు అరెస్టు చేసి ఢిల్లీలో ఉరిశిక్ష విధించాయి.

**నజాఫ్ అలీ** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్ నగర్ జిల్లా థానా భవన్ లో 1832 మార్చి 5న జననం. తండ్రి పేరు రహమత్ అలీ. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడుతూ రణరంగంలో తనువు చాలించారు.

**నన్నే మిర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. తండ్రి పేరు మిర్జా కరీముద్దీన్. ఢిల్లీ రక్షణకు సాగిన పోరాటంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఢిల్లీలో ఉరితీశారు.

**నశీర్ మియో** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి ఫిబ్రవరి 1858లో ఉరిశిక్ష విధించారు.

**నాసిర్ మొహమ్మద్** : రాజస్థాన్ రాష్ట్రంలోని పూర్వపు టొంక్ సంస్థానంలో 1825 అక్టోబరు 15న జననం. కోట సంస్థానానికి చెందిన సైన్యంలో అధికారి. 1857లో ఆరంభమైన సిపాయిల మరియు ప్రజల తిరుగుబాటులో ప్రధాన పాత్ర. బ్రిటీషర్లకు మద్దతు పలికిన



**ప్రస్తుత పాకిస్థాన్‌లోని అలనాటి పెషావర్ పట్టణంలో తిరగబడిన స్వదేశీ సిపాయిలను మూకుమ్మడిగా ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఫిరంగులకు కట్టి పేల్చివేస్తున్న భయానక దృశ్యం.**

కోట సంస్థానాధీశుడు మహారావు సేనలు, ఆంగ్ల సేనలకు వ్యతిరేకంగా సాగిన పలు పోరాటాలలో పాల్గొన్నారు. 1857 నంబరులో కోట మీద జరిగిన దాడిలో, ఆంగ్ల సేనలతో పోరాడుతూ రణరంగంలో కన్నుమూశారు.

**నశీరుద్దీన్ మొఘల్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. ఢిల్లీ రక్షణకు సాగిన పోరాటంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. 1858 ఫిబ్రవరి 23న కాల్చి చంపాయి.

**నసురుల్లా ఖాన్** : బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. ఆగ్రా సైనిక స్థావరం వద్ద బాధ్యతలు. బ్రిటీషు సైనికాధికారుల ఆజ్ఞలను బేఖాతర్ అంటూ తిరుగుబాటు యోధులతో చేతులు కలిపారు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆగ్రా, ఢిల్లీలలో దేశభక్తియుత సేనల ప్రయత్నాలు విఫలమయ్యాక జైపూరు సంస్థానం పరగణలోకి తప్పించుకున్నారు.





బ్రిటీషు పాలకులకు తొత్తుగా నిలచిన జైపూరు సంస్థానాధీశుని బలగాలు అరెస్టు చేసి, ఆగ్రాకు తరలించారు. ఆగ్రాలో విచారణ జరిపి ఉరిశిక్ష విధించారు.

**నత్తూ ఖాన్** : బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. హర్యానా రాష్ట్రంలోని లంబాలా సైనిక స్థావరం వద్ద బాధ్యతలు. బ్రిటీషు సైనికాధికారుల ఆజ్ఞలను బేఖాతర్ అంటూ తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. 1858 ఏప్రిల్‌లో కాల్చి చంపారు.

**నజీముద్దీన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా రేవారి నివాసి. తిరుగబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి ఫిబ్రవరి 1858లో ఉరిశిక్ష విధించారు.

**నేమాషాహ్ ఖాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక జైపూరు సంస్థానం పరగణలోకి తప్పించుకున్నారు. బ్రిటీషు పాలకులకు తొత్తుగా నిలచిన జైపూరు సంస్థానాధీశుని బలగాలు రాజస్థాన్‌లోని సవాయ్ మాధవపూరు జిల్లా హిండాన్ వద్ద ఆయనను అరెస్టు చేశారు. జైపూరు సంస్థానంలోని తిరుగుబాటు దళాలు ఆయనకు నిర్బంధం నుండి విముక్తి కల్పించారు. ఆయనను వెంటాడిన బ్రిటీషు సేనలు ఆగ్రా వద్ద తిరిగి అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**నియామత్ అలీ** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ నివాసి. తిరుగబాటులో పాల్గొన్నారు. బ్రిటీషర్లు అరెస్టు చేసి డిసెంబరు 1857లో ఉరిశిక్ష విధించారు.

**నిజాం అలీ ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని బరేలి నివాసి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఫతేఘర్ నవాబుతో కలసి పటిష్టమైన సాయుధ పోరాట దళాన్ని నిర్మించారు. సాయుధ వీరులలో బరేల్లి దిశగా ముందుకు సాగుతూ రిచ్చా అనుచోట పోలీసు ఠానా మీద దాడి చేసి ఠానాను తగుల బెట్టారు. అనంతరం ఫిల్‌భిత్ జిల్లా లోని పలు ప్రాంతాలలో గల బ్రిటీషర్ల సైనిక స్థావరాల మీద దాడులు నిర్వహించారు. 1858 మే 25న మోహన్‌పూరు అనుచోట బ్రిటీషు బలగాలలో ముఖాముఖి పోరాడారు. అధిక సంఖ్యలో నున్న శత్రుపక్షాన్ని ఎదుర్కోవటం అసాధ్యం కాగా తాత్కాలికంగా వెనక్కు తగ్గారు. బలగాలను సమకూర్చుకునేందుకు స్వతంత్ర రాంపూరు సంస్థానంలోకి తప్పుకున్నారు. అక్కడ తన బలగాలను సమికరించుకుని, ఆంగ్ల బలగాల మీద ఆకస్మిక దాడులు చేస్తూ, చికాకు పర్చసాగారు. రోహిల్‌ఖండ్‌ను స్వతంత్ర రాజ్యంగా ప్రకటించిన తిరుగుబాటు నాయకుడు ఖాన్ బహుదూర్ ఖాన్ మేనల్లుడి సహకారంతో పిలిభిత్ (PILIBHIT) మీద దాడికి వ్యూహరచన చేశారు. ఆ పథకాన్ని అమలు చేయక ముందే, సిర్పూరా అను ప్రాంతంలో ఆంగ్ల సైన్యాలతో తలబడిన ఆయన, 1858 ఆగస్టు 30న యుద్ధభూమిలో కన్నుమూసారు.

**నిజాం అలీ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షాహ్‌జహాన్‌పూర్ నగర నివాసి.

షాహ్‌జహాన్‌పూర్ కొత్వాల్‌గా పదవీ విరమణ చేశారు. 1857లో తిరుగుబాటు దళాలతో కలసి ఆంగ్ల సేనలకు ఎదుర్కొన్నారు. తిరుగుబాటు యోధుల స్వతంత్ర ప్రభుత్వంలో కొత్వాల్‌గా నియుక్తులయ్యారు. స్వతంత్ర సాయుధ దళాల నాయకత్వం స్వీకరించి షేహ్‌రామావు (SEHRAMAU) గ్రామం వద్ద ఆంగ్లసైన్యాల మీద దాడులు జరిపారు. అక్కడ నుండి బిచ్‌పూరియా (BICHPURIA) మీద దాడిచేసి, అక్కడ ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని అంతం చేసి, బ్రిటీషు సేనల దాడుల నుండి రక్షణకు పటిష్టమైన ఏర్పాట్లు చేశారు. ఈ విధంగా దాడులు చేస్తూ, బ్రిటీషు సైన్యాలను గందరగోళానికి గురిచేస్తూ ముందుకు సాగుతూ, 1858 ఏప్రిల్ 22వ తేదిన, ఆంగ్లేయాధికారి జనరల్ వాల్‌పోల్‌తో నాయకత్వంలోని ఆంగ సైనికులతో పోరాడుతూ యుద్ధ భూమిలో కన్నుమూశారు.



**ఆంగ్ల సేనల దాష్టీకాలను భరించలేక కాన్పూరు జిల్లాలోని ఓ గ్రామంలోని ప్రజలు వలస వెడుతుండగా, ఆంగ్ల సైనికులు ఆ ప్రజలను తరురుముతూ, గృహాలను తగులబెడుతున్న దృశ్యం.**

**నిజాం అలీ ఖాన్, నవాబ్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోలని షాజహాన్‌పూర్ నివాసి. 1857నాటి తిరుగుబాటుతో ఆంగ్ల సేనలను ఎదుర్కోవడంలో ప్రముఖ పాత్ర. తిరుగుబాటు యోధుల స్వతంత్ర ప్రభుత్వంలో కొత్వాల్‌గా నియుక్తులయ్యారు. తన రాజ్యంలోకి షాజహాన్‌పూర్ జిల్లా వద్ద జొరబడుతున్న ఆంగ్ల సేనలను ప్రతిఘటించేందుకు ప్రత్యేక దళాలను ఏర్పాటు చేసుకుని చొరబాటుదారులను నిరోధించారు. బిచ్‌పూరియా ఘాట్ వద్ద ఆంగ్ల సేనలతో వీరోచితంగా పోరాడి విజయం సాధించారు. కొంతకాలం తరువాత ఆకస్మికంగా భయంకర దాడి చేసిన బ్రిటీషు సైన్యాలలో ధైర్యసాహసాలతో పోరు చేస్తూ యుద్ధభూమిలో కన్నుమూశారు.





**నూర్ బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి గ్రామ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్రను పోషించారు. 1858 ఫిబ్రవరిలో ఉరిశిక్ష విధించారు.

**నూర్ ఖాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక జైపూరు సంస్థానం పరగణాలోకి తప్పించుకున్నారు. బ్రిటీషు బలగాలు రాజస్థాన్‌లోని సవాయ్ మాధవపూరు జిల్లా హిండాన్ వద్ద అరెస్టు చేశాయి. జైపూరు సంస్థానంలోని తిరుగుబాటు దళాలు ఆ నిర్బంధం నుండి విముక్తి కల్పించాయి. ఆంగ్ల సేనలు ఆయనను వెంటాడి ఆగ్రా వద్ద అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**నూర్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని సాగర్ జిల్లా నివాసి. 1857నాటి తిరుగుబాటులో ప్రముఖ పాత్ర. దేశభక్తులైన సాయుధులను సమీకరించి, బ్రిటీషు చౌకీల మీద దాడులు జరిపారు. ఆంగ్ల బలగాలు ఆయనను జూలై 20, 1857న ఉరితీశాయి.

**నూరా** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమర్ ప్రాంతవాసి. 1857లో మండలేశ్వర్ అనుచోట బ్రిటీషు అధికారుల పెత్తనాన్ని ఖాతరు చేయకుండా తిరుగుబాటులో ప్రముఖంగా పాల్గొన్నారు. ఆంగ్ల సైన్యాలు అరెస్టు చేసి దేశాంతర శిక్షను విధించాయి. ప్రవాస జీవితంలో అక్కడి జైళ్ళల్లో ఆయన కన్నుమూశారు.

**నూరుద్దీన్ మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. తండ్రి పేరు మీర్జా అబ్బూ. ఢిల్లీ రక్షణకు సాగిన పోరాటంలో ప్రధాన పాత్ర. 1857లో ఉరిశిక్ష విధించారు.

**పీర్ అలీ ఖాన్** : బీహార్ రాష్ట్రంలోని పాట్నా నివాసి. పుస్తకాల విక్రేత. 1857 జూలై మాసంలో పాట్నా కేంద్రంగా జరిగిన తిరుగుబాటులో ప్రముఖ పాత్ర వహించారు. తిరుగుబాటు విఫలమయ్యాక బ్రిటీషు సైన్యాలు ఆయనను అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**పీర్ అలీ మీర్జా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు 1857 డిసెంబరు 15న ఢిల్లీలో కాల్చి చంపారు.

**పీర్‌బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బహదూర్‌ఘర్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ఆయనను 1858 ఏప్రిల్ 1న కాల్చి చంపారు.

**పీర్ బక్ష్** : ఢిల్లీ నివాసి. 1857 నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహిచారు. తిరుగుబాటు విఫలమయ్యాక జైపూరు సంస్థానం పరగణాలోకి తప్పించుకున్నారు. బ్రిటీషు బలగాలు రాజస్థాన్‌లోని సవాయ్ మాదవపూరు జిల్లా హిండాన్ వద్ద అరెస్టు చేశాయి. జైపూరు సంస్థానంలోని తిరుగుబాటు దళాలు ఆ నిర్బంధం నుండి విముక్తి కల్పించాయి. ఆంగ్ల సేనలు వెంటాడి ఆగ్రా వద్ద అరెస్టు చేసి ఉరిశిక్ష విధించాయి.

**పీర్ ఖాన్** : బ్రిటీషు సైన్యంలోని మాల్వా సైనికుదళం జమేదారు. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా ప్రారంభమైన తిరుగుబాటులో ప్రధాన పాత్రవహించారు. ఆంగ్ల సేనలు అరెస్టు

ట చేసి మహిద్‌పూర్ వద్ద 1857లో కాల్చి చంపాయి.

**పీరూ మియా** ః హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. తిరుగబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి మాసంలో కాల్చి చంపారు.

**పింజారా** ః మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని పూర్వ మహిద్‌పూర్ సంస్థానం నివాసి. 1857 నవంబరులో ఆంగ్ల పాలకుల మీద తిరగబడిన మహిద్‌పూర్ తిరుగుబాటు దళాలలో కలసి తిరుగుబాటు ప్రకటించారు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి మహిద్‌పూర్ వద్ద కాల్చి చంపాయి.



**ఢిల్లీ పతనం తరువాత స్వదేశీ కూడా స్వదేశీ యోధులకు ఆశాజ్యోతిగా వెలుగొంది తిరుగుబాటు కార్యకలాపాలకు స్ఫూర్తి కేంద్రంగా నిలచిన అవధ్ రాజ్యం రాజధాని సుందర లక్నో నగరం.**

**పీరుషా షేక్** ః ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం కడప జిల్లా పూర్వపు సిద్దవట్టం తాలూకా యల్లంపేట గ్రామ నివాసి. పుట్టుకతో గుడ్డివాడైన నిరుపేద. నిరక్షరాస్యుడైనా గొప్ప దేశ భక్తుడు. పరాయిపాలకుల పెత్తనాన్ని సహించలేని అభిమానధనుడు. ఆలోచనాపరుడు. కడప ప్రభుత్వ సైన్యాగారానికి చెందిన 30వ పటాలంలోని స్వదేశీ సిపాయిలతో సంబంధాలు ఏర్పర్చుకున్నారు. ఆ పటాలంలోని వారి ఆర్థిక-ఆహార అవసరాలను తీర్చుతూస్నేహ సంబంధాన్ని పటిష్టం చేసుకున్నారు. ఓవైపు హిందూ-ముస్లింలలో ఐకమత్యాన్ని కోరుకుంటూ, ఆ దిశగా కృషి చేస్తూ, తెల్లవారి ఆధిపత్యాన్ని సవాల్ చేయసంకల్పించారు. 1857లో ప్రథమస్వాతంత్ర్య సమర శంఖారావం పూరించగానే ఆయన పూర్తిగా రంగలోకి దిగారు. సైన్యంలోని స్వదేశాభిమానం గల యోధులను తిరుగబాటుకు ప్రేరేపిస్తూ, **హిందూ ముస్లిం సిపాయిలంతా కలసి కట్టుగా ఉద్యమిస్తే ఆంగ్లేయ ప్రభుత్వం కూలిపోతుంది. స్వదేశీయుల పాలన తిరిగి నెలకొనబడుతుంది. అందుకోసం అన్ని విధాల సిద్ధం కండి**, అని సందేశం పంపారు. హిందూ-ముస్లింల మతమనోభావాలను అగౌరవపర్చేలా కంపెనీ సైనికాధికారులు





తీసుకుంటున్న చర్యలను వివరిస్తూ స్వదేశీ సైనికులలో బ్రిటీషు సైనికాధికారుల పట వ్యతిరేకభావనలను ప్రోదిచేశారు. ఈ సందర్భంగా ఆంగ్లేయులకు మద్దతు పలుకుతున్న నైజాం నవాబు చర్యలను కూడా ఆయన నిశితంగా విమర్శించారు. పరాయిపాలకుల చెంత చేరిన వారంతా దేశద్రోహులని ప్రకటించారు. చివరకు తిరుగుబాటుకు 1857 ఆగస్టు 28న ముహూర్తం నిర్ణయించారు. హిందూ-ముస్లింలు కలిసి జరుపుకునే మొహరం పండుగ రోజును తిరుగుబాటుకు అనువైన ముహూర్తంగా ఆయన భావించారు. ఈ విషయమై 30వ పటాలానికి చెందిన హవల్దార్ వరదరాజులు, లాన్స్‌నాయక్ పరుశురాం, సిపాయి వీరాస్వామి, దలాయత్ ఎల్లప్ప, సుబేదార్ మేజర్ మహమ్మద్ అష్రాఫ్, దలాయత్ సత్యాజీ, జమేదార్ సి.జగ్గయ్య, హవల్దార్ మహమ్మద్ గౌస్, మౌల్వీ అబ్దుల్ అజీజ్ హుస్సేన్ తదతరులతో సంప్రదించారు. ఈ మంతనాలు సాగుతున్న తరుణంలో, తిరుగుబాటు ఆలోచనలను పసిగట్టిన ఆంగ్ల అధికారులు మంతనాలలో పాల్గొన్న ఒకరిని లొంగదీసుకుని, లంచమిచ్చి రహస్య మంతనాల సారాంశాన్ని ఛేధించగలిగారు. తిరుగుబాటు కుట్ర జరుగుతుందన్న విషయం తెలియగానే ఆంగ్ల అధికారులు అప్రమత్తులయ్యారు. ఈ కుట్రకు పుట్టు అంధుడైన ఓ గ్రామీణుడు సూత్రధారి అని తెలుసుకుని నివ్వెరపోయారు. ఆఘమేఘాల మీద బయలుదేరి షేక్ పీరుషాను అరెస్టు చేశారు. విచారణ జరిపి ఆయనకు 10 సంవత్సరాల కఠిన కారాగారవాస శిక్షను విధించారు. ఈ తిరుగుబాటు యత్నంలో ఆయనతో చేతులు కలిపిన సైనికులు, సైనికాధికారుల మీద పలు నేరారోపణలుగావించి విచారణ జరిపి, నయాన భయాన లొంగదీసుకుని రహస్యాలను రాబట్టుకుని శిక్షలు విధించారు. ఉత్తర భారత దేశంలో తిరుగుబాటు ఆరంభమైనందున దక్షిణాదిలో అటువంటి అవాంఛనీయ పరిస్థితులు తలెత్తకుండా చూసేందుకు నియమించబడిన పోలీసు కమీషనర్ ఇ. ఇలియట్, పీరు షా పయత్నం గురించి వ్యాఖ్యానిస్తూ, **పీర్ షాను వంచనతో లొంగదీసుకోక పోయినట్టయితే అతను మద్రాసు సిపాయిలందరిలో సంచలన కలిగించి ఉండేవాడు**, అని అన్నాడంటే షేక్ పీరుషా ఏ స్థాయిలో తెల్లవారి ఉద్వాసనకు ప్రయత్నాలు సాగించారో అర్థం చేసుకోవచ్చు. **( షేక్ పీరుషా మీద మరిన్ని వివరాలకు చూడండి సాంబశివారెడ్డి, 'కడప జిల్లాలో స్వాతంత్ర్యోద్యమానికి జీవం పోసిన మహ్మదీయుల అద్భుత చైతన్యము ', సెల్యూట్ ది గ్రేట్ (మాసపత్రిక), రంజాన్ ప్రత్యేక సంచిక, తాజ్ పబ్లికేషన్స్, హైదరాబాద్, పేజీ 60.-63, ఇంకా చూడండి ' గీటురాయి ' వారపత్రిక)**

**పీర్ అలీ ఖాన్** ః ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని లక్నోలో జననం. పాట్నాలో పుస్తకాల వ్యాపారం. తిరుగుబాటులో చాలా చురుకైన భాగస్వామ్యం వహించారు. బ్రిటీషు వ్యతిరేక కార్యకలాపాలను రహస్యంగా ముమ్మరం చేశారు. ఆంగ్ల సేనలు ఆయన ఇంటి మీద దాడి చేయగా చాకచక్యంగా తప్పించుకుని అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. కొంత కాలం తరువాత

ఆంగ్ల సేనలకు పట్టుబడ్డారు. ప్రఖ్యాతి చెందిన పాట్నా కుట్ర కేసులో ప్రధమ నిందితునిగా పేర్కొన్నారు. విచారణ తరువాత మరణదండన విధించి, 1857లో ఉరితీశారు.

**పీర్ బక్ష్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1857 అక్టోబరు 3న అరెస్టు చేసి, ఉరిశిక్ష విధించాయి.

**పీర్ బక్ష్ షేక్** : ఢిల్లీకి చెందిన నజాఫ్‌ఘడ్ నివాసి. ప్రథమస్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నందుకు ఆంగ్ల సైన్యాలు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 18న ఉరిశిక్ష విధించాయి.

**పీర్ ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ఢిల్లీలో 1858 ఫిబ్రవరి 18వ తేదిన ఉరిశిక్ష విధించాయి.



**అవధ మహారాణి బేగం హజరత్ మహల్ నాయకత్వంలోని స్వదేశీ యోధుల ప్రతాపానికి తట్టుకోలేక ఆంగ్లేయాధికారులు, సైనికబలగాలు బ్రతుకుజీవుడా అంటూ దాక్కొన్న లక్నో రెసిడెన్సీ.**

**పీర్ మిరాసి** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లా బిరాల్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1857లో ఉరిశిక్ష విధించాయి.

**పున్నే సాహెబ్** : కర్ణాటక రాష్ట్రంలోని రాయచూరు జిల్లా మైసూరు నివాసి. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా శ్రీ భీంరావు, శ్రీ కంచన్ గౌడల నాయకత్వంలో కొప్పలదుర్గంలో ప్రారంభమైన తిరుగుబాటులో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా కొప్పలదుర్గం వద జరిగిన పోరాటంలో బ్రిటీషు సేనలకు పట్టుబడగా, మరఫిరంగికి బిగించి కట్టి పేల్చివేశారు.

**ఖాదిర్ అలీ ఖాన్, నవాబు** : మహారాష్ట్రలోని నాగపూరు నివాసి. పట్టణంలో పేరు ప్రఖ్యాతులు గల ప్రముఖుడు. నాగపూరు కేంద్రంగా 1857లో ప్రారంభమైన తిరుగుబాటులో ప్రముఖంగా పాల్గొన్నారు. నాగపూరులో ఉన్న బ్రిటీష్-భారత సైన్యంలోని భారతీయ సిపాయిలను తిరుగుబాటులో పాల్గొనాల్సిందిగా ప్రేరేపించారు. ఈ విషయం పసిగట్టిన ఆంగ్లేయాధికారులు ఆయనను అరెస్టు చేసి, విచారణ జరిపి మరణదండన





విధించారు. ఈ సందర్భంగా అలీ ఖాన్‌తోపాటుగా మరో 19 మందిని కాల్చి చంపారు.

**ఖాదిర్ బక్ష్** : ఢిల్లీ నివాసి. బ్రిటీషు ఆర్మీలోని సప్పర్స్ రెజిమెంటులో సుబేదారు. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు, విద్రోహం నేరారోపణల మీద బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, విచారణ జరిపి, 1857లో ఉరిశిక్ష విధించాయి.

**ఖాదిర్ బక్ష్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, విచారణ జరిపి 1858 ఫిబ్రవరి 27న ఢిల్లీలో ఉరితీశాయి.

**ఖాదిర్ బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, ఢిల్లీలో 1858 మే 22న ఉరిశిక్ష విధించాయి.

**ఖాదిర్ బక్ష్ మిర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజకుమారుడు. తండ్రిపేరు మిర్జా మక్‌హూ. ఢిల్లీ రక్షణకోసం జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, విచారణ జరిపి, 1857లో ఉరిశిక్ష విధించాయి.

**ఖాదిర్ బక్ష్ షేక్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాత్ర. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి, 1858 ఫిబ్రవరి 1న ఢిల్లీలో కాల్చి చంపాయి.

**ఖాదిర్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని కటాంగి నివాసి. ఆంగ్లేయుల పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటులో పాల్గొన్నారు. రణభూమిలో కన్నుమూసారు.

**ఖాశిం ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమర్ ప్రాంత నివాసి. ఆంగ్లేయుల పాలనకు వ్యతిరేకంగా మండలేశ్వర్ వద్ద జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి దేశాంతరవాస శిక్ష విధించాయి. ప్రవాసంలోనే ఆయన కన్నుమూశారు

**ఖుత్‌బుద్దీన్ మిర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాకుమారుడు. తండ్రి పేరు మిర్జాఖాదిర్ బక్ష్. ప్రథమస్వాతంత్ర్య సంగ్రామంలో ఢిల్లీ రక్షణకు ఆంగ్ల సైన్యంతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. ఆంగ్ల సైన్యాలు అరెస్టు చేసి, 1857లో ఉరిశిక్ష విదించాయి. **రహం ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. ఆంగ్ల-భారత సైన్యంలో సిపాయి. తిరుగుబాటులో పాల్గొన్నారు. 1858 జనవరిలో కాల్చి చంపారు.

**రహముల్లా మౌలానా** : 1818లో ఢిల్లీలో జననం. తండ్రి పేరు నజీబుల్లా. పండితుడు. అజ్ఞాతంలో ఉంటూ, బ్రిటీష్ పాలనను కూలద్రోసేందుకు సాగిన తిరుగుబాటులో చురుకైన పాత్ర వహించారు. బ్రిటీషు సేనలు ఆయన కోసం వెంటాడి చివరకు అరెస్టు ప్రయత్నాలు సాగిస్తుండగా చాకచక్యంగా తప్పించుకుని అరేబియా వెళ్ళిపోయారు. చివరకు అక్కడే కన్నుమూశారు.

**రహీమా బేగం** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్ పూర్‌కు చెందిన రాజపుత్రుల

కుటుంబంలో జన్మించారు. రాజపుత్రుల శౌర్యప్రతాపాలు సంతరించుకున్న ఆమె స్వాతంత్ర్య సంగ్రామంలో బ్రిటీష్ సైనిక మూకల మీద సమర శంఖారావం పూరించారు. తిరుగుబాటు దళాలలో చేరి, ఆయుధం ధరించి శత్రుమూకలను సంహరించే కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొంది. ఈ పోరులో గాయపడిన ఆమె బ్రిటీష్ సైనికాధికారులకు బందీగా చిక్కింది. శత్రువు గుప్పెట్లో ఉన్నా, ఏమాత్రం తలవంచని ఆ యోధురాలికి సైనికాధికారులు ఉరిశిక్ష విధించారు. మాతృదేశం కోసం మరణించటం కూడా గౌరవంగా భావించిన బేగం రహిమా చిన్న వయస్సులోనే, పుట్టిన గడ్డకోసం ప్రాణాలను తృణప్రాయంగా అర్పించి, విప్లవకారులకు ఆదర్శంగా నిలిచారు.

**రహీం బక్ష్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బాద్షాపూర్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నందుకు, అరెస్టు చేసి, 1858 ఏప్రిల్‌లో కాల్చి చంపారు.



**ఆవధ్ రాజధాని లక్నోకు రెండు మైళ్ళ సమీపాన ఉన్న అలంబాగ్ వద్ద జనరల్ ఓంట్రాం నాయకత్వంలోని బలగాలతో స్వదేశీ సైనికులు భయంకర పోరాటం సాగించిన ప్రాంతం.**

**రహీం బక్ష్ షేక్** : ఢిల్లీ నివాసి. ప్రథమస్వాతంత్ర్య సంగ్రామంలో ఢిల్లీ రక్షణకు ఆంగ్ల సైన్యంతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. 1857 అక్టోబరు 3న ఉరిశిక్ష విధించారు.

**రహీం ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుస్సేన్‌పూర్ నివాసి తండ్రి హఫీజుల్లా ఖాన్. తిరుగుబాటులో పాల్గొన్నందుకు, బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, రాజద్రోహం నేరాన్ని ఆపాదించి, 1858 జనవరి 2న ఉరిశిక్ష విధించాయి.

**రంజాన్** : బీహార్ రాష్ట్రంలోని పాట్నా నివాసి. ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు పీర్ అలీ సహచరుడు. తిరుగుబాటులో చురుకైన పాత్రవహించారు. బ్రిటీష్ బలగాలు అరెస్టు చేసి, దాడి-హత్యల నేరారోపణ చేసి విచారణ జరిపించి మరణదండన ప్రకటిచాయి. 1857 జూలై 7న ఉరిశిక్ష విధించారు.

**రంజాని** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. తిరుగుబాటు





విఫలమయ్యాక ఆంగ్లేయుల కన్నుగప్పి రాజస్థాన్‌లోని జైపూరు సంస్థానం పరగణాలోకి తప్పించుకున్నారు. రాజస్థాన్‌లోని సవాయ్ మాధవపూరు జిల్లా హిండాన్ వద్ద బ్రిటీషు బలగాలు ఆయనను అరెస్టు చేశాయి. హిండాన్ వద్ద ఉన్న జైపూరు సంస్థానంలోని తిరుగుబాటు దళాలు నిర్భంధం నుండి విముక్తి కల్పించాయి. ఆంగ్ల సేనలు వెంటాడి ఆగ్రా వద్ద అరెస్టు చేసి 1857లో ఉరిశిక్ష విధించాయి.

**రంజాని మీర్జా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ నివాసి. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి, ఢిల్లీలో 1857 డిసెంబరు 15న కాల్చి చంపాయి.

**రంబాజ్ మియో** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా బరకా నివాసి. తండ్రి పేరు మల్కాన్ మియో. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, రాజద్రోహ నేరారోపణ చేసి, 1858 జనవరి 6న ఉరితీశాయి.

**రంథాన్** : ఆంగ్ల సైన్యంలోని 51వ రెజిమెంటుకు చెందిన స్వదేశీ కాల్బలంలో నాయక్. ప్రస్తుత పాకిస్థాన్‌లో ఉన్న వాయువ్య సరిహద్దు రాష్ట్రంలోని పెషావర్‌లోని సైనికస్థావరంలో ఉద్యోగ బాధ్యతలు. తండ్రి పేరు ఖుమున్. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఆరంభంకాగానే, సైనిక స్థావరాన్ని వదలి పెట్టి, తిరుగుబాటు యోధులతో కలిశారు. భారతీయ సైనికుల మీద అనుమానంలో నిరాయుధులను చేయటం సహించని ఆయన నిరసన వ్యక్తంచేస్తూ ఉద్యోగం వదిలారు. బ్రిటీషు సైనికులు ఆ విధంగా నిరసన వ్యక్తంచేస్తూ స్థావరాలు వదలిన స్వదేశీ సైనికుల కోసం వెంటాడుతూ, రంథాన్, ఆయన సుబేదార్-మేజరును నిర్భంధించగలిగారు. సైనిక న్యాయస్థానం విచారణ జరిపి మరణశిక్ష విధించగా 1857 జూన్ 26న ఉరిశిక్ష అమలు చేశారు. తొలుత ఆయన సుబేదార్-మేజర్ ఉరి తీయగా, ఆయనతోపాటు ఆరోజున 250 మంది ఆత్మాభిమానంగల దేశభక్తియుత స్వదేశీ సిపాయిలకు మరణదండన అమలు చేశారు. ఆ తరువాత 1857 ఆగస్టు 28వ తేదిన సైనిక స్థావరంలోని తమ గృహాలలో జరిగిన తనిఖీ సమయంలో ఆంగ్ల అధికారులు అగౌరవంగా వ్యవహరించారని నిరసన వ్యక్తం చేసినందుకు నివాస గృహాలు గల ప్రాంతాలలో, ఇతర చోట్లలో మరో 150 మంది తిరుగుబాటు యోధులను బ్రిటీషు సైనికులు కాల్చి చంపారు.

**రాన్‌బిరి** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని మజఫర్‌నగర్ నివాసి. పారిశుద్ధ్య కార్మికురాలు. బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో తన చెలులతో పాటుగా పాల్గొన్నారు. పదకొండు మంది యువతులతో పాటు ఆమెను బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1857లో ఉరిశిక్ష విధించారు.

**రెహమత్ అలీ** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని మజఫర్‌నగర్ జిల్లా సయ్యద్‌వారా నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1857లో ఉరితీశారు.

**రెహమత్ ఖాన్** : ఢిల్లీ నివాసి. 1857 నాటి తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 27న ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**రెహమతుల్లా** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌నగర్ జిల్లా టోరా కళ్యాణ్‌పూర్ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1857లో ఉరిశిక్ష విధించారు.

**రెహమతుల్లా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ నివాసి. తిరుగుబాటులో ప్రముఖ పాత్రవహించిన కారణంగా, ఆంగ్ల సేనలు అరెస్టు చేసి 1857 డిసెంబరులో ఉరిశిక్ష విధించారు.



**అవధ్ రాణిమాత బేగం హజరత్ మహల్ స్వదేశీ సైన్యాలకు స్వయంగా నాయకత్వం వహించి ఆంగ్లేయ సైన్యాలను ఎదుర్కొని, గత్యంతరం లేని పరిస్థితులలో మౌల్వీ అహమ్మదుల్లా షా ఫైజాబాదితో సహకారంతో నేపాల్ పర్వత పానువుల్లోకి తప్పించుకున్న మూసాబాగ్ ప్రాంతం.**

**రహమతుల్లా షేక్** : బ్రిటీషు సైన్యంలోని మాల్వా కంటింజెంటులో సుబేదార్-మేజర్. మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని మాధిపూరులో ఉద్యోగబాధ్యతలు నిర్వహిస్తూ, తిరుగుబాటు ప్రకటించారు. మాల్వా కంటింజెంటులోని స్వదేశీ సేనలలో దేశభక్తిబావనలు మేల్కొల్పి తిరుగుబాకు ప్రోత్సహించారు. బ్రిటీషు సైన్యాలలో పలు చోట్ల పోరాటాలు చేశారు. అయన కోసం అంగ్ల సైన్యం, పోలీసులు ఎంతగా వెంటాడినా అజ్ఞాతంతోనున్న ఆయనను అంత త్వరగా అరెస్టు చేయలేకపోయారు. చివరకు అరెస్టు చేసి, పలునేరాలను ఆపాదించి, విచారణ తంతు నిర్వహించి, 1861లో కాల్చి చంపారు.

**రోషన్ బేగ్** : రాజస్థాన్‌లోని పూర్వపు కోట సంస్థానంలో 1817లో జననం. కోట సంస్థానం సైన్యంలో అధికారి. 1857లో కోటలో ఆరంభమైన తిరుగుబాటుకు ఆయన





ప్రేరణగా నిలిచారు. ఆనాడు కోట సంస్థానం ప్రాంతంలో తిరగబడిన ప్రజలు, సైనికులకు నాయకులుగా నిలిచిన నలుగురిలో ఆయనొకరు. ఆయన అధీనంలోనున్న తుపాకులనూ, మస్కట్‌లూ, ఇతర ఆయుధ సంపత్తిని, మందుగుండు సామగ్రిని తిరుగుబాటు యోధుల పరం చేశారు. బ్రిటీషర్ల మద్దతుదారుడైన కోట సంస్థానాధీశుడు మహారావు అనుకూల సైనికులతో జరిగిన పోరాటాలకు, మహారావుకు పటిష్టమైన స్థావరాల మీద జరిపిన దాడులకు మార్గదర్శకత్వం వహించారు. 1858లో మేజర్ జనరల్ రాబర్ట్స్ నాయకత్వంలోని ఆంగ్ల బలగాలను కైత్నిపోల్ (KAITHNIPOLE) అనుచోట ఎదుర్కొన్న ఆయన శత్రుసైనికులతో పోరాడుతూ, రణభూమిలో కన్నుమూశారు.

సాదత్ అలీ : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నివాసి. తండ్రి పేరు బహదూర్ అలీ. బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి 1857 డిసెంబరు 5వ తేదిన కాల్చి చంపాయి.

**సాదత్ అలీ షాయర్** : గుజరాత్ రాష్ట్రంలోని సూరత్‌లో జననం. ప్రముఖ తిరుగుబాటు నేత మానా సాహెబ్ నాయకత్వంలో, బ్రిటీషు ప్రభుత్వాన్ని కూలదోసేందుకు 1857లో సాగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక ఆంగ్ల సేనలకంటబడకుండా తప్పుకున్నారు. బ్రిటీషు పోలీసులు వెంటాడగా, వెంటాడగా 13 సంవత్సరాల తరువాత ఆయన పట్టుబడ్డారు. విచారణ జరిపి, 1871 ఏప్రిల్ 8న సూరత్‌లోని కిలా మైదానంలో బహిరంగంగా ఉరిశిక్ష విధించారు.

**సాదత్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని ఇండోర్ నివాసి. హోల్‌కార్ ( HOLKAR) ఇండోర్ సైన్యంలో అధికారి. 1857లో బ్రిటీషు పాలకులకు వ్యతిరేకంగా ఆరంభమైన తిరుగుబాటులో ప్రధాన పాత్రవహించారు. 1857 జూలై 1న బ్రిటీషు రెసిడెన్సీ మీద దాడి జరిపి, ఆంగ్ల ప్రతినిధిని పరాజితుడ్ని చేసి, ఇండోర్‌కు నవాబు అయ్యారు. ఈ దాడి పర్యవసానంగా, బ్రిటీషు కలక్టర్, ఇతర ఆంగ్లేయాధికారులు ఇండోర్ విడిచి సిహోర్‌కు పలాయనం చిత్తగించారు. స్వతంత్రత ప్రకటించుకున్నాక, ఢిల్లీలో జరుగుతున్న పోరులో చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్‌కు అండగా నిలిచేందుకు సాయుధ బలగాలతో ఢిల్లీకి బయలు దేరారు. ఈ సందర్భంగా దేశభక్తులైన పలువురు ఆయన వెంట నడిచారు. ఢిల్లీకి వెడుతున్న మార్గంలో కాపుకాసిన బ్రిటీషు సేనలతో పోరాడుతూ ముందుకు సాగారు. 1857 అక్టోబరు 10న ఆగ్రా వద్ద భారి సంఖ్యలో ఉన్న ఆంగ్ల సేనలతో తలపడ్డారు. ఆ పోరాటంలో పరాజితులై, శత్రువుకు పట్టుబడకుండా తప్పుకున్నారు. సైనిక బలం తగ్గటం, శత్రువుకు ఆధిపత్యం లభించటంతో గెరిల్లా యుద్ధం ప్రారంభించి, ఆంగ్లేయ సైన్యాలను చికాకు పర్చసాగారు. రహస్య జీవితం సాగిస్తూ గెరిల్లా పోరాటం సాగించారు. చివరకు శత్రువుది పైచేయి

అయ్యింది. అరెస్టు చేసి ఇండోర్‌కు తీసుకొచ్చి విచారణ జరిపి ఇండోర్ నడిబొడ్డున ఉరిశిక్ష విధించారు.

**సభాయ్, ఇమాం బక్ష్** : ఢిల్లీ నివాసి. ఢిల్లీ కళాశాలలో ఆధ్యాపకుడు. మంచి పండితుడిగా ప్రసిద్ధుడు. బహు గ్రంథ రచయిత. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో చురుగ్గా పాల్గొన్నారు. స్వదేశీ యోధులకు అండదండలందించారు. తిరగబాటు విఫలమై, ఢిల్లీని ఆంగ్లేయులు తిరిగి ఆక్రమించుకున్నాక ఆయనను రాజఘాట్ వద్ద అరెస్టు చేసి అక్కడికక్కడే కాల్చి చంపారు. ఆయన ఇరువురు కుమారులను కూడా బ్రిటీషు బలగాలు నిర్బంధంలోకి తీసుకుని అక్కడే కాల్చి చంపాయి.

**సఫ్‌దార్ యార్ ఖాన్** : రాజస్థాన్‌లోని పూర్వపు టొంక్ సంస్థానానికి చెందిన



**ఆనాడు సామాన్య ప్రజలు కూడా అందుబాటులో ఉన్న సాంప్రదాయక ఆయుధాలతో ఆంగ్ల సైన్యాల మీద తిరగబడిన దృశ్యం. ఆయుధాలు సరైనవి లేనందున ఈ తరహా సాహసికులు (ఘాజీలు) అసంఖ్యాకంగా ఆంగ్లేయ సైనికబలగాలు, అధికారుల చేతుల్లో హతమయ్యారు.**

చిల్లోర్‌ఫుర్ నివాసి. తండ్రి పేరు తాల్యార్ ఖాన్. టొంక్ సంస్థానంలోని జాగిర్దారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభంకాగానే, టొంక్ సంస్థానాన్ని విడిచిపెట్టి ఢిల్లీలో చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ నేతృత్వంలో సాగుతున్న పోరాటంలో పాల్గొనేందుకు ఢిల్లీ చేరుకున్నారు. ఢిల్లీని పునరాక్రమించుకునేందుకు వచ్చిన బ్రిటీషు సేనలకు తరిమికొట్టేందుకు సాగిన పోరాటంలో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక సకుటుంబ సమేతంగా ఆయన రాజస్థాన్‌లోని ఆల్వార్ ప్రాంతానికి తప్పుకున్నారు. చివరకు ఆల్వార్‌లో 1857డిసెంబరులో అరెస్టు చేసి, ఢిల్లీ తీసుకొచ్చి, ఢిల్లీలో ఉరిశిక్ష విధించారు.

**సాజిద్ అలీ ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని మురాదాబాద్ నివాసి. మురాదాబాద్





కేంద్రంగా సాగిన 1857నాటి తిరుగుబాటు కార్యకలాపాలు ఆయన నాయకత్వంలో సాగాయి. తిరుగుబాటు వీరులకు, దేశభక్తులైన ప్రజలకు ఆయన మార్గదర్శకత్వ వహించారు. మురాదాబాదును స్వతంత్ర ప్రాంతంగా ప్రకటించారు. ఆంగ్ల సేనలు దాడి చేసి మురాదాబాదును 1858 ఏప్రిల్ 25న పునరాక్రమించుకున్నాక, ఆయనను అరెస్టు చేసి ఏప్రిల్ 27న ఉరిశిక్ష విధించారు.

**సాకిన్ ఖాన్** : ఢిల్లీ నివాసి. బ్రిటీషు సేనల పునరాక్రమణ ప్రతిఘటించారు. అరెస్టు చేసి 1857 డిసెంబరు 24న మరణదండన విధించారు.

**సైపుల్లా ఖాన్, మౌల్వీ** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అలహాబాద్ నివాసి. ధార్మిక పండితుడు. బ్రిటీషు పాలకులకు వ్యతిరేకంగా ఆరంభమైన తిరుగుబాటులో ప్రధాన పాత్ర పోషించారు. ప్రజలను, స్వదేశీ సైనికులను ఆంగ్ల ప్రభువులకు వ్యతిరేకంగా తిరగబడమని ప్రేరేపించారు. తిరుగుబాటు విఫలం కావటంలో ఆంగ్ల సైన్యాలు అరెస్టు చేసి, కుట్ర, రాజద్రోహం నేరారోపణల మీద 1857లో బహిరంగంగా కాల్చిచంపారు.

**సలామత్ అలీ** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అలహాబాద్ నివాసి. అలహాబాదులో న్యాయమూర్తిగా ఉద్యోగం. బ్రిటీషు పాలకులకు వ్యతిరేకంగా ఆరంభమైన తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆంగ్ల ప్రభువులకు వ్యతిరేకంగా తిరగబడమని ప్రజలను ప్రేరేపించారు. తిరుగుబాటు పోరాటం విఫలం కావటంలో ఆంగ్ల సైన్యాలు అరెస్టు చేసి, కుట్ర, రాజద్రోహం నేరారోపణల మీద విచారణ తంతును నిర్వహించి 1857లో బహిరంగంగా మరణదండన విధించాయి.

**సర్ఫ్బద్ ఖాన్** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజకుమారుడు. ఢిల్లీ రక్షణకోసం సాగిన పోరాటంలో పాల్గొన్నారు. అంగ్లేయులు 1857 నవంబరు 18న ఢిల్లీలో కాల్చి చంపాయి.

**సర్దార్ అలీ** : రాజస్థాన్ రాష్ట్రంలోని పూర్వపు కోట సంస్థానం పరణగాలో 1830 జూన్ 4న జననం. తండ్రి ఇషార్ అలీ. కోట సంస్థానం సైన్యంలోని నారాయన్ పల్టాన్‌లో అధికారి. కోట సంస్థానం పరగణాలో బ్రిటీషర్లకు వ్యతిరేకంగా సాగిన తిరుగుబాటులో ప్రధాన పాత్రవహించారు.సంస్థానాధీశుడు మహారావు ఆంగ్లేయులకు తొత్తుగా వ్యవహరించినా, బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరగబడాల్సిందిగా ప్రజలను ప్రేరేపించారు. 1857 అక్టోబరు 15న ఆంగ్ల సైనికాధికారి మేజర్–జనరల్ బుర్టన్ అధికార నివాసం మీద జరిగిన దాడిలో పాల్గొన్నారు. ఆ దాడిలో ఆంగ్లేయాధికారి బుర్టన్ ఆయన ఇరువురు కుమారులను తిరుగుబాటు దారులు వధించారు. ఆ తరువాత మహారావు అనుకూల కోట సైన్యాలతో పోరాటం చేస్తూ రణభూమిలో కన్నుమూశారు.

**సర్దార్ అలీ ఖాన్** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని గోరఖ్‌పూర్‌లో జననం. తండ్రి

పేరు ముఆజం అలీ ఖాన్. మిడిల్ క్లాసు వరకు చదువు. భూస్వామి. అవధ్ అస్థానంలో రిసాల్‌దార్.బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు కార్యకలాపాలను ప్రోత్సహించారు. ఈ విషయాన్ని గ్రహించిన ఆంగ్ల అధికారులు రాజద్రోహానికి పాల్పడవద్దని, తిరుగుబాటు కార్యకలాపాలను మానుకోవాలని ఆదేశించారు. బ్రిటీషు అధికారుల హెచ్చరికలు ఖాతరు చేయకుండా బ్రిటీషు వ్యతిరేక పోరాటాలను ముమ్మరం చేశారు. అధికారుల ఆదేశాలను పాటించకుండా వ్యతిరేక కార్యకలాపాలను మరింత ముమ్మరం చేశారు. ఆదేశాలను తుంగలో తొక్కి ధిక్కారానికి పాల్పడ్డారంటూ, ఆగ్రహించిన అధికారులు కక్షకట్టారు. ఆయన కుటుంబ సభ్యులు పలువురిని పట్టుకెళ్ళి చంపివేశారు. ఆయనను కూడా అరెస్టు చేసి ఉరిశిక్ష విధించారు బంధువులను, కుటుంబ సభ్యులను భయానకంగా వధించారు. ఆయనకు సంబంధించిన



**తిరుగుబాటు బాటలో జయాపజయాలను ఏమాత్రం లెక్కచేయక మాతృభూమి విముక్తి ప్రధాన లక్ష్యంగా, దృఢ దీక్షతో ముందుకు సాగుతున్న కాన్పూరుకు చెందిన స్వదేశీ యోధుల బృందం.**

గుర్తులు కూడా ఎమాత్రం మిగలకూడని, ఆయన నివాస గృహాన్ని పూర్తిగా నేలమట్టం చేసి, అక్కడ అధికార కార్యాలయం నిర్మించుకున్నారు.

**సర్దార్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని ఇండోర్ నివాసి. ప్రముఖ తిరుగుబాటు నాయకుడు, ఇండోర్‌ను బ్రిటీషు ఆధిపత్యం నుండి విముక్తం చేసి, స్వతంత్రను ప్రకటించిన సాద్ ఖాన్ సోదరుడు. 1857 జూలై 1వ తేదిన బ్రిటీషు రెసిడెన్సీ మీద దాడిలో పాల్గొన్నారు. ఈ దాడి పర్యవసానంగా, బ్రిటీషు కలక్టర్, ఇతర ఆంగ్లేయాధికారులు ఇండోర్‌ను విడిచి సిహోర్‌కు పలాయనం చిత్తగించారు. చక్రవర్తి బహుదూషా జఫర్‌కు సహాయం అందిచేందుకు ఢిల్లీకి వెళ్ళారు. 1857 నాటి తిరుగుబాటు విఫలమయ్యాక ఆయన ఆగ్రా నుండే తిరిగి



ఇండోర్ చేరుకున్నారు. ఆంగ్ల సేనలు పట్టుకుని మరణదండన విధించాయి..

**సర్ఫరాజ్ ఖాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక, బ్రిటీషు బలగాలు అరెస్టు చేసి, 1858 మార్చి 20న కాల్చి చంపాయి.

**సీతల్ షా సయ్యద్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటు విఫలమయ్యాక, ఆంగ్ల సేనలు 1858 జనవరి 18న కాల్చి చంపాయి.

**సెహ్‌జా** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌నగర్ జిల్లా సిసౌలి నివాసి. పారిశుధ్యకార్మికుడు. 1857నాటి తిరుగుబాటులో పాత్ర. ఆంగ్ల సేనలు ఆయనను పట్టుకుని కాల్చిచంపాయి.

**హబీబా బేగం** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ముజఫర్‌పూర్‌లో 1833లో జన్మించారు. చిన్నతనం నుండే బానిస భావాలకు వ్యతిరేకంగా పోరాటాలు ప్రారంభించిన శ్రీమతి హబీబాని బ్రిటీషర్ల బానిసత్వంలో మగ్గుతున్న మాతృభూమి దయనీయ స్థితి కలచివేసింది. ఆ వ్యథ నుండి వలస పాలకుల మీద ఆగ్రహం ప్రజ్వరిల్లింది. తెల్లపాలకులను శతృవులుగా పరిగణించి, తన భూభాగాన్ని బ్రిటీషర్ల కబంధహస్తాల నుండి విముక్తం చేసుకునేందుకు సరైన అదునుకోసం ఎదురు చూడసాగారు. ఆ అవకాశం 1857లో రానే వచ్చింది. భారతావనిలోని పలు ప్రాంతాలో శ్రీమతి హబీబాలాంటి వీర నారీమణులు, వీర పుత్రులు ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల, అధికారుల మీద కత్తులు దూసారు. ఆ సమయం కోసం ఎదురు చూస్తున్న శ్రీమతి హబీబా తిరుగుబాటు యోధులతో కలసి రణరంగ ప్రవేశం చేశారు. బ్రిటీష్ సైనిక పటాలాల మీద సోదర తిరుగుబాటువీరులతో కలిసి తిరగబడ్డారు. చివరకు యుద్ధ క్షేత్రంలో గాయపడి కదలలేని స్థితిలో శతృవుచేత చిక్కారు. బ్రిటీష్ ప్రభుత్వం హబీబాకు ఉరిశిక్ష విధించింది.

**షఫాత్ అలీ** : హర్యానాలోని కర్నాయ్ జిల్లా పానిపట్ తాహసిల్ కొరా గ్రామ నివాసి. కస్టమ్స్ శాఖలో జమేదార్. ప్రభుత్వ ఉద్యోగి అయిఉండి తిరుగుబాటులో పాల్గొనటం నేరమని ఆరోపిస్తూ, అరెస్టు చేసి బ్రిటీషు సైనికులు 1857 డిసెంబరులో ఉరిశిక్ష విధించారు.

**షా బేగ్** : హర్యానాలోని గుర్‌గాంవ్ జిల్లా కన్హోర్ గ్రామం. తండ్రి పేరు మీర్ ఖుదాబక్ష్. తిరుగుబాటులో పాత్ర నిర్వహించినందుకు రాజద్రోహానికి పాల్పడ్డాడన్న ఆరోపణల మీద ఆంగ్ల సైనికులు ఆయనను పట్టుకుని 1857 డిసెంబరు 30న ఉరిశిక్ష విధించారు

**షాబుద్దీన్** : హర్యానాలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి గ్రామం. తిరుగుబాటులో పాల్గొన్నారు. రాజద్రోహానికి పాల్పడ్డాడన్న ఆరోపణల అరెస్టు చేసి 1857 డిసెంబరు 15న ఉరిశిక్ష విధించారు.

**షహదత్ పఠాన్** : ఢిల్లీ లోని పురానా ఖిల్లా నివాసి. ఢిల్లీ రక్షణ కోసం ఆంగ్లసేనలతో

సాగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు పట్టుకుని 1858 ఫిబ్రవరి 11న ఢిల్లీలో కాల్చి చంపాయి.

**షహామత్** : హర్యానాలోని గుర్‌గాంవ్ జిల్లా రసూల్‌పురా గ్రామం. తిరుగుబాటులో పాల్గొన్నారు. తిరుగుబాటుకు పాల్పడ్డాడన్న ఆరోపణల మీద ఆంగ్ల సైనికులు అరెస్టు చేసి మరణదండన ప్రకటించాయి. 1858 జనవరి 16న ఢిల్లీలో కాల్చి చంపారు.

**షేక్ బుఖారి** : బీహార్ నివాసి. కులీన సంపన్నుడు. తికాయత్ ఉమ్రావ్ సింగ్ వద్ద దివాన్‌గా బాధ్యతలు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్యవహరించినందుకు అరెస్టు చేశారు. ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేశారు. విచారణ జరిపి తిరుగుబాటులో పాత్ర నిర్వహించిన



**1858 మార్చి 15వ తేదిన లక్నోలోని కైసర్‌బాగ్‌లో జరిగిన పోరాటంలో అమరులైన స్వదేశీలను దోచుకుంటున్న ఆంగ్లేయుల అనుయాయులు. ఆ రోజుల్లో లక్నోలో ఉన్న ' ది టైమ్స్ ' పత్రిక ప్రతినిధి స్వయంగా చూసి వర్ణించిన దుస్సంఘటనలకు సజీవ సాక్ష్యం ఈ చిత్రం.**

కారణంగా 1858లో ఉరిశిక్ష విధించారు.

**షేక్ కరీం** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. తిరుగుబాటు విఫలమయ్యాక ఆంగ్లేయుల కన్నుగప్పి రాజస్థాన్‌లోని జైపూరు సంస్థానం పరగణలోకి తప్పించుకున్నారు. రాజస్థాన్‌లోని సవాయ్ మాధవపూరు జిల్లా హిండాన్ వద్ద బ్రిటీషు బలగాలు ఆయనను అరెస్టు చేశాయి. హిండాన్ వద్ద ఉన్న జైపూరు సంస్థానంలోని తిరుగుబాటు దళాలు ఆంగ్లేయుల నిర్బంధం నుండి విముక్తి కల్పించాయి. ఆగ్రా వద్ద ఆయనను అరెస్టు చేసి 1857లో ఉరిశిక్ష విధించాయి.

**షేక్ మొహమ్మద్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమార్ నివాసి. నిమార్ పట్టణానికి





చెందిన ప్రముఖుడు. 1859లో మండలేశ్వర్ అనుచోట బ్రిటీషు సేనలను సవాల్ చేసిన తిరుగుబాటు దళాలకు ఆయన నాయకత్వం వహించారు. చివరకు 1859లో ఆంగ్ల సేనలు అరెస్టు చేసి మరణదండన విధించాయి.

**షేక్ సాదత్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ గ్రామ నివాసి. తిరుగుబాటులో పాత్ర నిర్వహించారు. రాజద్రోహానికి పాల్పడ్డాడన్న నేరారోపణల మీద ఆంగ్ల సైనికులు పట్టుకుని 1858 మార్చిలో ఉరిశిక్ష విధించారు.

**సర్ఫదుల్లా ఇబ్రాహిం ఖాన్** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని లక్నో నివాసి. 1857నాటి తిరుగుబాటులో పాల్గొన్నారు. ఈ సందర్భంగా లక్నో ముట్టడిలో ఆంగ్ల సైన్యాలతో జరిగిన పోరాటంలో కన్నుమూసారు.

**షరీఫుద్దీన్** : హహర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా పాల్‌వాల్ గ్రామ నివాసి. తిరుగుబాటులో పాత్ర నిర్వహించారు. రాజద్రోహానికి పాల్పడ్డాడన్న నేరారోపణల మీద బ్రిటీషు సేనలు అరెస్టు చేసి, 1857 డిసెంబరులో ఉరిశిక్ష విధించారు.

**సుజాత్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని భోపాల్ జిల్లా బెర్చా నివాసి.ప్రభుత్వం నుండి పెన్షన్ పొందుతున్న పిండారి తెగ నాయకుడు. 1857నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. తిరుగుబాటు యోధులకు నాయకత్వం వహించి, బెర్చాలోని ప్రభుత్వ ఖజానా మీద దాడి చేసి స్వాధీనం చేసుకున్నారు. బ్రిటీషు అధికారుల బంగ్లా మీద దాడులు నిర్వహించి అధికారులను బెర్చా నుండి షిహోర్‌కు పలాయనం చిత్తగింపచేశారు. భోపాల్ జిల్లాకు నవాబుగా ప్రకటించుకుని ఆంగ్ల పాలకుల పెత్తనాన్ని సవాల్ చేశారు. అంబాపాని జాగీర్దార్ ఆదిల్ మొహమ్మద్ ఖాన్ బలగాలలో కలసి స్వతంత్ర భోపాల్‌ను ప్రకటించి, బ్రిటీషు సేనలతో పోరుకు సిద్ధమయ్యారు. పలు పోరాటాలలో పాల్గొన్నారు. చివరకు భారీ సంఖ్యలో ముట్టడించిన ఆంగ్ల సేనలతో సాగిన పోరులో శత్రువుకు పట్టుబడ్డారు. ఈ సందర్భంగా ఆయన ఇరువురు కుమారులు, ముగ్గురు సోదరులు, పలువురు అనుచరులను బ్రిటీషు సైనికుకు అదుపులోకి తీసుకున్నారు. 1858 జనవరి 1న షిహోర్‌లో ఆయనను బహిరంగంగా ఉరిశిక్ష విధించారు. ఆయన బిడ్డలను, అన్నదమ్ములను, అనుచరులను కాల్చి చంపారు. ఆ యోధుల కుటుంబ ఆస్తులను జప్తుచేశారు.

**సిరాజ్ ఖాన్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. తిరుగుబాటు యోధుల ప్రయత్నాలు విఫలమయ్యాక ఆంగ్లేయ సైనికుల కన్నుగప్పి రాజస్థాన్‌లోని జైపూరు సంస్థానం పరగణాలోకి తప్పుకున్నారు. రాజస్థాన్‌లోని సవాయ్ మాధవపూరు జిల్లా హిండాన్ వద్ద బ్రిటీషు బలగాలు ఆయనను అరెస్టు చేయగా, హిండాన్ వద్ద ఉన్న తిరుగుబాటు దళాలు ఆంగ్లేయుల నిర్బంధం నుండి ఆయనకు విముక్తి కల్పించాయి. ఆ తరువాత మళ్ళీ

ఆయనను ఆగ్రా వద్ద బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857లో ఉరిశిక్ష విధించారు.

**సిరాజుద్దీన్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని నిమార్ ప్రాంత నివాసి. 1859లో మండలేశ్వర్ అనుచోట, బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. చివరకు 1859లో ఆంగ్ల సేనలు అరెస్టు చేసి దేశాంతరవాస శిక్షను విధించాయి. సైనికుడు. ఆగ్రా వద్ద బాధ్యతల నిర్వహణ. ఆంగ్లేయాధికారుల ఆజ్ఞలను ధిక్కరించి, తిరుగుబాటు దళాలతో చేతులు కలిపి, పలు పోరాటాలలో భాగస్వాములయ్యారు. ఢిల్లీలో తిరుగుబాటు విఫలమయ్యాక జైపూరు సంస్థానం పరగణాలోకి తప్పుకున్నారు. పూర్వపు జైపూరు సంస్థానంలోని హిండాన్ అనుచోట బ్రిటీషు అనుకూలురైన జైపూరు సంస్థానం సైనిక బలగాలు అరెస్టు చేశాయి. ఆగ్రాకు తరలించి ఉరిశిక్ష విధించారు.



**చరిత్ర సృష్టించిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని దేశమంతటా పూర్తిగా అణిచి వేశాక ఆంగ్లేయులు స్వతంత్ర సంగ్రామ యోధుల మీద విరుచుకపడ్డారు. అసంఖ్యాకంగా మరణశిక్షలు విధించారు. ఆనాడు ఈ ఉరితీత దృశ్యాలు తిరుగుబాటు జరిగినచోటల్లా సాధారణమయ్యాయి.**

**సయ్యద్ అహమ్మద్ ముఫ్తీ** : ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బరేలిలో జననం. రోహిల్ ఖండ్ అధినేత, తిరుగుబాటు నాయకుడు ఖాన్ బహుదూర్ ఖాన్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటులో పాల్గొన్నారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ పక్షాన మే 1857లో బ్రిటీషు సేనలతో జరిగిన పోరాటంలో ప్రధాన పాత్రవహించారు. స్వతంత్ర రోహిల్ ఖండ్ మీద దాడిచేసిన ఆంగ్ల సేనలు విజయం సాధించాక 1860 మార్చి 20వతేదిన ఆయనకు మరణదండన విధించాయి. బరేలిలోని కమిషనర్ కార్యాలయంలో గల మర్రి చెట్టుకు, మొహమ్మద్ అమీన్ ఖాన్ తోపాటుగా ఆ రోజున మరో 243 మంది తిరుగుబాటు యోధులను వేలాడ దీసి సామూహిక ఉరిశిక్షలను అమలు జరిపారు.





**సయ్యద్ అహమ్మద్, మౌల్వీ** : ప్రస్తుత ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర రాజధాని, ఒకప్పటి నైజాం సంస్థానం రాజధాని అయినటువంటి హైదరాబాదులో జన్మించారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం సందర్భంగా హైదరాబాదు నగరంలో జరిగిన ' రెసిడెన్సీ మీద దాడి సంఘటనలో ప్రత్యక్షంగా ఆయన పాల్గొన్నారు. ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని సవాల్ చేస్తూ, బ్రిటీషు అధికారి నివాసం మరియు కార్యాలయం మీద 1857 జూలై 17న మూడు వందల మందితో మౌల్వీ అల్లావుద్దీన్, పఠాన్ తుర్రేబాజ్ ఖాన్‌ల నాయకత్వంలో జరిగిన సాహసోపేత దాడి అనాడు సంచలనం సృష్టించింది. ఆ దాడిలో శత్రుసేనలతో పోరాడుతూ ఆయన కన్నుమూసారు.

**సయ్యద్ బౌడెన్** : కర్ణాటక రాష్ట్రంలోని రాయచూరు జిల్లా బంకాపూరు నివాసి. 1858లో తిరుగుబాటు నాయకులు భీంరావు, కంచన్‌గౌడల నాయకత్వంలో కొప్పల దుర్గం విముక్తి కోసం ఆంగ్లేయులతో సాగిన పోరాటంలో పాల్గొన్నారు. ఆ పోరాటంలో శత్రువు చేతికి పట్టుబడగా, ఆయనను ఫిరంగి గొట్టానికి కట్టి పేల్చివేశారు.

**సయ్యద్ దాదు ఖాన్** : ఢిల్లీ నివాసి. 1857లో ఢిల్లీ రక్షణ కోసం ఆంగ్ల సేనలను ప్రతిఘటించంలో ప్రధాన పాత్ర వహించారు. ప్రతిఘటన విఫలమయ్యాక జైపూరు సంస్థానంలోకి తప్పించుకున్నారు. రాజస్థాన్‌లోని హిండాన్ జిల్లా సవాయ్ మాధవపూరు వద్ద ఆంగ్ల సేనలు పట్టుకుని నిర్బంధించగా, జైపూరులో తిరగబడిన స్వదేశీ సేనలు ఆయనను నిర్బధం నుండి విముక్తి కలిగించాయి. ఆ తరువాత మళ్ళీ బ్రిటీషు సేనలు ఆయనను అరెస్టు చేసి ఆగ్రాకు తరలించి, విచారణ జరిపి మరణదండన ప్రకటించాయి. 1857లో ఉరిశిక్ష విధించాయి.

**సయ్యద్ హుస్సేన్** : మహారాష్ట్రలోని బొంబాయి నివాసి. బ్రిటీషు–భారత సైన్యంలో హవల్దార్ ఉద్యోగం. 1857 నాటి తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి, 1857 అక్టోబరు 15న ఫిరంగికి బిగించి కట్టి పేల్చివేశారు.

**సయ్యద్ మహమ్మద్ అహిర్** : ఢిల్లీ నివాసి. చేతి రాత నిపుణుడు. తిరుగుబాటులో పాత్ర. ఆంగ్ల సేనలు పట్టుకుని కాల్చి వేశాయి.

**తాజ్ ఖాన్ పఠాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుసైన్‌పూరు నివాసి. తండ్రి పేరు సయ్యద్ అర్షద్ ఖాన్ పఠాన్. 1857 నాటి తిరుగుబాటులో ప్రధాన పాత్ర పోషించారు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి రాజద్రోహ నేరం మీద విచారణ జరిపి 1858 జనవరి 2న ఉరిశిక్ష విధించారు.

**తాజ్ ఖాన్ బలూచ్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుసైన్‌పూరు నివాసి. బ్రిటీషు–భారత సైన్యంలో సిపాయి. 1857 నాటి తిరుగుబాటులో పాల్గొన్నారు.

ఆంగ్ల సేనలు అరెస్టు చేసి రాజద్రోహ నేరం మీద విచారణ జరిపి 1858 జనవరిలో ఉరిశిక్ష విధించారు.

**తాలిబ్** : ఢిల్లీ నివాసి. తిరుగుబాటులో పాత్ర. ఆంగ్ల సేనలు పట్టుకుని 1858 ఫిబ్రవరి 27న ఉరిశిక్ష విధించాయి.

**తాన్ ఖాన్** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని పూర్వపు మాహిధిపూరు సంస్థానం నివాసి. మాధిపూరు సైన్యంలో జమేదారు. 1857 నవంబరులో సైనిక స్థావరంలో రగిలిన తిరుగుబాటులో ఆయన ప్రధాన పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సైన్యాలు అరెస్టు చేసి మాధిపూరులో ఉరిశిక్ష విధించాయి.

**ఉమర్ ఖాన్** : గుజరాత్ రాష్ట్రంలోని బరోడా నివాసి. స్థానికంగా బ్రిటీషర్లకు వ్యతిరేకంగా జరిగి తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించారు. ఆయనను, ఆయనతోపాటు మరో 13 మందిని అరెస్టు చేసి, ప్రభుత్వాన్ని కూలదొయడానికి కుట్ర పన్నారన్న నేరం మీద ఆజన్మ ద్వీపాంతరవాస శిక్ష విధించారు. ఈ మేరకు జైలులో ఆయన చివరి శ్వాస విడిచారు.

**ఉందా** : ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌నగర్ నివాసి. జాట్ తెగకు చెందిన యువతి. బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో తన చెలులతో పాటుగా ఆఅమె పాల్గొన్నారు. పదకొండుమంది యువతులతో పాటు ఆమెను బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి 1857లో అందరికీ ఉరిశిక్ష విధించారు.

**ఉస్మాన్ ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా సౌలి నివాసి. తండ్రి పేరు జౌహర్ ఖాన్ పఠాన్. తిరుగుబాటులో పాల్గొన్నారు. రాజద్రోహం నేరం మీద విచారణ జరిపి 1857 డిసెంబరు 18న ఉరిశిక్ష విధించారు.

**వజీర్ ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా సౌలి నివాసి. తండ్రి పేరు సమ్మొ ఖాన్ పఠాన్. తిరుగుబాటులో పాల్గొన్నారు. రాజద్రోహం నేరం మీద విచారణ జరిపి 1857 డిసెంబరు 18న ఉరిశిక్ష విధించారు.

**వజీర్ ఖాన్** : బ్రిటీషు సైన్యంలోని అశ్విక దళంలో రిసాల్‌దారు. పంజాబులోని కాలాబాగ్ వద్ద 1857లో తిరుబాటును ప్రకటించారు. ఆయన ప్రేరణ మేరకు రెజిమెంటు మొత్తం తిరుగుబాటులో పాల్గొంది. జంగ్ అను ప్రాంతంలో ఆంగ్ల సేనలతో జరిగిన పోరాటంలో అనుచరులతోపాటుగా ఆయన కన్నుమూశారు.

**వాహిద్ అలీ** : బీహార్ రాష్ట్రంలోని పాట్నా నివాసి. ప్రముఖ వహాబీ, బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడిన యోధుడు పీర్ అలీ సహచరుడు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి దాడి,హత్యల నేరాలను మోపి, విచారణ జరిపి మరణ దండన ప్రకటించాయి. 1857 జూలై 7న ఉరిశిక్ష





విధించారు.

**వలి షికో మీర్జా** : ఢిల్లీ నివాసి. మొఘల్ రాజవంశీకుడు. రాజకుమారుడు. తండ్రి పేరు మీర్జా బులంద్. ఆంగ్లేయులను ప్రతిఘటించడంలో ప్రధాన పాత్రవహించారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించారు.

**వారిస్ అలీ** : మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని ఇండోర్ నివాసి. ఇండోర్ రెసిడెన్సీలో సిపాయి. 1857 జూలై లో ప్రముఖ తిరుగుబాటు యోధుడు సాదత్ అలీ ఖాన్ నాయకత్వంలో ప్రారంభమైన తిరుగుబాటులో ఆయన పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించారు.

**వారిస్ అలీ** : బీహార్ రాష్ట్రంలోని పాట్నా నివాసి. ఆ ప్రాంతపు పెద్ద భూస్వామి. తిరుగుబాటులో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. తిరుగుబాటు కార్యకలాపాలకు మార్గదర్శకత్వం వహించారు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి ఉరిశిక్ష విధించారు.

**వారిస్ మొహమ్మద్ ఖాన్, నవాబు** : మధ్యప్రదేశ్ లోని ఇండోర్ నివాసి.తండ్రి పేరు జమాల్ మొహమ్మద్ ఖాన్. భోపాల్ సంస్థానం వ్యవస్థాపకుని వారసుడు. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా 1857లో ప్రారంభమైన తిరుగుబాటు కార్యకలాపాలలో చురుకైన పాత్ర నిర్వహించారు. ప్రముఖ తిరుగుబాటు యోధుడు సాదత్ అలీ ఖాన్‌తో చేతులు కలిపి ఆయన నాయకత్వంలో బ్రిటీషు రెసిడెన్సీ మీద జరిగిన దాడిలో పాల్గొన్నారు. ఈ సన్దర్భంగా జరిగిన పోరాటంలో పలువురు బ్రిటీషు సైనికులు మృతిచెందగా, అధికారి కల్నల్ దురాండ్ పలాయనం చిత్తగించాడు. ఆంగ్లేయ సైన్యాలను ఎదుర్కొంటూ, అధికారులను చికాకు పర్చుతూ ఆయన తన విప్లవ కార్యకలాపాలను కొనసాగించారు. భోపాల్‌కు చెందిన బేగం సికందర్‌ను కూడా తిరుగుబాటులో పాల్గొని, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరుగుతున్న స్వదేశీయుల పోరాటంలో భాగస్వాములు కావాల్సిందిగా ఆయన నచ్చచెప్పేందుకు విఫల పయత్నాలు చేశారు. చివరకు ఆయన ఆంగ్ల సేనలకు పట్టుబడగా 1857 డిసెంబరు 23న ఇండోరులో బహిరంగంగా ఉరిశిక్ష విధించారు. **వాజిర్ ఖాన్** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. తిరుగుబాటులో పాల్గొన్నారు. 1858 జనవరిలో ఉరిశిక్ష విధించారు.

**డాక్టర్ వాజిర్ ఖాన్** : బీహార్‌లో జననం. ప్రథమ స్వాతంత్ర్యసమరం సర్వసేనాని జనరల్ భక్త్ ఖాన్ నాయకత్వంలో ఆగ్రా ప్రాంతం గవర్నరుగా బాధ్యతలు నిర్వహించారు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. తిరుగుబాటు విఫలమయ్యాక అరేబియాకు తప్పించుకున్నారు. చివరకు మక్కాలో కన్నుమూసారు.

**వాజిర్ మియా** : హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నాగ్లి నివాసి. బ్రిటీషు-భారత

సైన్యంలో సిపాయి. తిరుగుబాటులో పాల్గొన్నారు. 1858 ఫిబ్రవరిలో ఉరికంబం ఎక్కించారు.

**యార్ ఖాన్ షేక్ :** ఢిల్లీలోని ఖిర్కి నివాసి. ఢిల్లీ రక్షణకు తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేశారు.1858 జనవరిలో ఉరిశిక్షకు గురయ్యారు.

**జమీలా :** ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌నగర్ లో 1835లో జననం. పఠాన్ కుటుంబానికి చెందిన యువతి. తన చెలులతో కలసి ప్రథమ స్వాతంత్ర్యసమరంలో ప్రముఖ పాత్ర వహించారు. బ్రిటీషు సేనలను ఎదుర్కొన్నారు. బ్రిటీష్ సైన్యాలు అరెస్టు చేసి మరో 11మందితో కలిపి ఉరితీశారు. ఈ సందర్భంగా 255 మంది యువతులు బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడుతూ ప్రాణాలు వదిలారు.

**జబర్దస్త్ ఖాన్ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హుసైన్‌పూరు నివాసి. తండ్రి హైదర్ ఖాన్. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు అధికారులు అరెస్టు చేసి, 1858 జనవరి 2వ తేదిన ఉరిశిక్ష విధించారు.

**జబర్దస్త్ ఖాన్ పఠాన్ :** ఢిల్లీ నివాసి. 1857నాటి తిరుగుబాటులో ఢిల్లీ రక్షణకు జరిగిన పోరాటంలో పాల్గొన్నారు. బ్రిటీషు సేనలు అరెస్టు చేసి 1858 ఫిబ్రవరి 1న ఢిల్లీలో బహిరంగంగా ఉరితీశారు.

**జఫర్ ఖాన్ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలో సిపాయి. తిరుగుబాటులో పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు పట్టుకుని, 1858 జనవరిలో ఉరిశిక్ష విధించారు.

**జఫర్ ఖాన్ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా గుద్రానాలో జననం. తండ్రి బషారత్ ఖాన్ పఠాన్. తిరుగుబాటులో చురుగ్గా పాల్గొన్నారు. బ్రిటీషు అధికారులు అరెస్టు చేసి, రాజద్రోహ నేరం అపాదించి మరణదండన విధించారు. 1858 జనవరి 8న ఉరిశిక్ష అమలుచేశారు.

**జహీరుద్దీన్ మొఘల్ :** ఢిల్లీ నివాసి. ఢిల్లీ రక్షణ కోసం బ్రిటీషు సైన్యాలతో సాగిన పోరులో ప్రధాన పాత్ర వహించారు. బ్రిటీషు అధికారులు పట్టుకుని 1858 ఫిబ్రవరి 23న కాల్చి చంపారు.

**జౌహర్ అలీ :** బ్రిటీషు సైన్యంలోని స్వదేశీ సైనికుల దళంలో రిసాల్‌దారు. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడిన మొఘల్ రాజకుటుంబీకుడు షెహజాదా ఫిరోజ్ షా నాయకత్వంలో తిరుగుబాటులో పాల్గొన్నారు. 1857 డిసెంబరు 17న రానొడ్ అను ప్రాంతంలో ఆంగ్ల సైనికులతో జరిగిన పోరాటంలో తిరుగుబాటు దళానికి నాయకత్వం వహించి పోరాడుతూ, రణభూమిలో కన్నుమూసారు. ఈ పోరాటంలో మొత్తం 480 మంది తిరుగుబాటు యోధులు అమరులయ్యారు.



**జాలిం అలీ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా హసన్‌పూరు నివాసి. బ్రిటీషు-భారత సైన్యంలోని గ్వాలియర్ రెజిమెంటులో సిపాయి. 1857నాటి తిరుగుబాటులో చురుగ్గా పాల్గొన్నారు. బ్రిటీషు సైనికులు అరెస్టు చేసి,1858 జనవరిలో ఉరిశిక్ష విధించారు.

**జామిన్ అలీ :** హర్యానా రాష్ట్రంలోని గుర్‌గాంవ్ జిల్లా సుల్తాన్‌పూరు నివాసి. తిరుగుబాటులో పాల్గొన్నారు. ఆంగ్ల సేనలు అరెస్టు చేసి, 1858 జనవరిలో ఉరితీశారు.

**జామిన్ అలీ షా, హాఫిజ్ :** ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లా థానాభవన్‌లో 1830 అక్టోబరు 15వ తేదిన జననం. తండ్రి పేరు ఖాశిం అలీ. తిరుగుబాటులో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. బ్రిటీషు సేనలతో పోరాడుతూ రణభూమిలో కన్నుమూశారు.

**జియావుద్దీన్ షేక్ :** ఢిల్లీ నివాసి. తండ్రి పేరు దరోగా షేక్ మొహమ్మద్ బక్ష్. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారు. ఆంగ్ల సేనలు తండ్రి తోపాటుగా ఆయనను కూడా పట్టుకుని ఇరువురిని ఒకేసారి ఉరితీసారు.

**( అనుబంధంలోని చిత్రాలన్నీ భారత ప్రభుత్వ పబ్లికేషన్స్ డివిజన్ 1957లో ప్రచురించిన ' 1857 A PICTORIAL PRESENTATION ' గ్రంథం లోనివి. ఈ చిత్రాలు ఆనాటి ఆంగ్లేయ చిత్రకారులు సృష్టించినవి. ఈ గ్రంథాన్ని సూచించి సహకరించిన** RAM MOHAN FREE LIBRARY & READING ROOM, VIJAYAWADA **గ్రంథాలయాధికారి శ్రీ తుర్లపాటి రాఘవేంద్ర రావు గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు. )**

# ఆధార గ్రంథాలు
## గ్రంథాలు-పత్రికలు-సావనీర్లు

### ఆంగ్ల గ్రంథాలు :


01. *1857 the Great Rebellion*, Ashok Mehatha

02. *20 Great Women of India*, Ed. by AP Sarma, Prasant, New Delhi, 2003

03. *A Concise History of The Indian People*, H.G Rawlinson, OUP, 1950

04. *The Indian Mutiny, G B Malleson*, London, 1906.

05. *A Narrative of the siege of Delhi 1857*, Chrles John Griffiths,London, 1910

06. *A Survey of Indian History*, K M Panikkar, Bombay, 1977

07. *An Advanced History of India*, RC Majumdar, Macmillan, Madras, 1996.

08. *Aurangzeb And Tipu Sultan*, BN Pande, IOS New Delhi, 1996

09. *Bondage and Freedom*, Visweswraiah

10. *Eighteen Fifty Seven*, Surendra Nathsen, Govt. of India Publications, 1957

11. *Eminent Mussalmans*, Ed. by G.A Natesan, Madras, 1925

12. *Eminent Muslim Freedom* Fighers, G.Allana, Delhi, 1993

13. *Encyclopaedia of Muslim Biography* ( 2Vols.), Ed. By N. Kr. Singh, APH Publishing Corporation, New Delhi ,1979

14. *Explosion In A Sub Continent*, Ed. by Robin Blackburn, Penguin, 1975,

15. *Freedom Fighters of Indian Mutiny 1857*, MP Srivastawa, Allababad,1997

16. *Freedom Movement and Indian Muslims*, Santimoy Ray, PPH, 1983

17. *Highlights of the Freedom Movement in AP*, Sarojini Regani, 1972

18. *History of Bengal*, Edited by Jadunath Sarkar.

19. *History of British India*, James Mill

20. *History of Freedom Movement in India*, RC Majumdar, Calcutta,1962

21. *History of Freedom Movement in India*, Tara Chand, NewDelhi, 1992

22. *History of India*, E. Marsden, Macmillan and Co Ltd, London, 1944

23. *History of The Deccan*, 2Vols. , GDE Gribble, New Delhi, 1990

24. *How India wrought for Freedom*, Annei Besant, 1915

25. *How India Struggled for Freedom*, Gopal Ram, Bombay, 1967

26. *India's Struggle for Independence*, Bibin Chandra, Penguin Books, 1997

27. *Indian Muslims : A Political Boigraphy*, Gopal Ram, Bombay, 1959

28. *Indian Muslims*, M. Mujeeb, New Delhi, 1967





29. *Indin Muslims*, Ed. by Asghar Ali Engineer, Delhi, 1985

30. *Islam In India's transition to Modernity*, MA Karnadikar, New Delhi, 1968

31. *Kerala Muslims*, Ed. Asghar Ali Engineer, Ajantha Publications,1995

32. *Medival India Under Mohammedan Rule*, Stanley Lane-Poole, 1963

33. *Mopilla Muslims of Kerala* - Ronald E Miller, Orient Longman, 1976

34. *Muslim India*, Md. Nomani. Kitabistan, Allahabad, 1942

35. *Muslim Politics in Sindh* (1938-1947) , Md. Qasim Soomro, Pakisthan, 1989

36. *Muslim Rule In India*, V D Mahajan, 1970

37. *Muslim Rule in India* : The Assessment of British Historian, J.S. Grewal, OUP, 1970

38. *Muslims and Freedom Movement In India*, K. Chabuey, Allahabad, 1990

39. *Muslims and India's Freedom Movement*, Shan Muhammad, IOS, 2002

40. *Muslims In India* - S.Abul Hasan Ali Nadwi, Lucknow, 1980

41. *Muslims In India*, A Biographical Dictionary (2Vols.) - Ed. by Naresh Kumar Jain, New Delhi, 2001

42. *Rise of Muslims in Indian Politics*, Rafiq Zakaria, Bombay, 1986

43. *Role of Indian Muslims in Struggle for Freedom*, Ed. by PN Chopra, 1979

44. *Role of Muslims in the National Movement*, Mujafar Iman, Delhi, 1987

45. *Saiyed Ahamed Shahid*, Mohiuddin Ahmed, AIRP, Lucknow, 1980

46. *Strom Over Srirangapatnam*, P. Fernandaz

47. *South India and Her Muhamadan Invaders*, S.Krishnaswami Ayangar, 1921

48. *The Communal Triangle In India*, Ashok Mehatha Ect., Allahabad, 1942

49. T*he Discovery Of India*, Jawahar Lal Nehru,1982

50. *The Fakirs and Sannyasi Uprisings*, Atis K. Dasgupta, New Delhi, 1992

51. *The Great Mutiny India 1857*, Christopher Hibbert, Penguin, 1980

52. *The Indian Musalmans*, W.W Hunter, Calcutta,

53. *The Legend Makers-Some Eminent Muslim Women of India*, Gouri Srivastava, CPC, New Delhi, 2003

54. *The Muslims of British India*, P Hardy, Cambridge, 1972

55. *The Politics of a Popular Uprisings* -Bundelkhand in 1857, Tapti Roy, OUP 1984

56. *The Role of Minorities In Freedom Struggle* - Ed. A. Ali Engineer, 1986

57. *The Seopy Mutiny and the Revolt of 1857*- R.C.Majumdar, Calcutta,1957

58. *The Sword of Tipu*, Bhawan S. Gidwani, Allied Publishers Ltd., 1990

59. *The Wahabi Movement in India*, Qeyammudin Ahamed, Calcutta, 1966
60. *Tipu Sultan*, Prof. B.Shaik Ali, National Book Trust, India, H1995
61. *Titu Mir*, Mahaswetha Devi, Seagull Books, Culcutta, 2000
62. *Wahabi and Farazi Rebels of Bengal*, N. Kaviraj, PPH, New Delhi, 1982
63. *Who is Who Indian Martyrs* (3 Vols.) , PN Chopra, 1973
64. *Who's Who Freedom Struggle in AP*, (3 Vols. )Sarojini Regani, 1982

**ఆంగ్ల పత్రికలు :**

01. *THE VOICE OF PEOPLE AWAKENING*, Feb 1998 Issue, Mumbai.
02. *RADIANCE* , Weekly, 31 Aug-6 Sept. 2003, Special Issue, New Delhi.
03. *SOCIAL SCIENTIST*, Vol. 26, Nos.1-4, Jan-Apr. 1998.
04. *RADIANCE*, Weekly Spl. Issue on Tipu Sultan, Aug.1999, New Delhi
05. *THE HINDU*, Daily, 28-08-1996, Hyderabad
06. *THE JOURNAL OF SECULARISM*, Quarterly, Oct-Dec 1997, Mumbai.
07. *MILLI GAZETTE* , Forthnightly, 16-31 Jan. 2002 Issue, New Delhi,
08. *ISLAMIC VOICE*, Monthly, Several Issues, Bangalore.
09. *INDIAN EXPRESS*, Daily, Aug. 13, 1995, Vijayawada.
10. *AMAN*, Ed, By Dr. Asghar Ali Engineer, Agugust 1994

**సావనీర్స్ :**

01. Souvenir, Institute of Objective Studies, New Delhi, 1998
02. Souvenir, Celebrations of Munshi Zakiuddin Ahamed, Bhalpur, 1990

**కన్నడ గ్రంథాలు :**

01. *Bharda Swathanryadalli Muslimara Patra* , Khuddam Publications, Bangalore 1999

**హిందీ గ్రంథాలు :**

01. *Hidustani Musalmano ka Jang-E-Azadi mein Hissa* ,-Syed Ibrahim Fikri, New Delhi, 1999
02. *Multan Ka Khidi*, ShekuL Hind Hazarath Hussain Ahamed Madani, Sharanpur
03. *Tipu ki Jeevan*, D.L Nigam,
04. *Bharath Ki Swathantra Sangram Mien Muslim Mahilavonka Yogadan*, Dr. Abeda Samivuddin, IOS, New Delhi, 1997
05. *Bharath Ki Nari Rathna*, Govt. Of India Publications, 1998
06. *Awadh Ki Begum*, Dr. Sudha Thyagi, Govt. of India Publications, 1996





**ఉర్దూ గ్రంథాలు :**

01. *Theharikhe Azadi-e-Hind me Muslim Ulma qur Awamka Kirdar*, Md. Salman Mansurpuri, Mushirabad, Hijri 1423.
02. *Theharikihe Azadi aur Musalman*, Aseera Darwi, Devband,1997

**తెలుగు గ్రంథాలు :**

01. స్వాతంత్ర్య సమర చరిత్ర, శ్రీ ముక్కామల నాగభూషణం, 1990
02. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి సెంటర్, 1999
03. భారత దేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర, కృష్ణా జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, 1984
04. భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్ర ప్రదేశ్ ముస్లింలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి సెంటర్ 2001
05. జ్ఞాపకం చేసుకోండి ఎప్పుడైనా...అమర వీరుల ఉత్తరాలు, తెలుగు సేత : జె లక్ష్మీ రెడ్డి, ప్రభుత్వ ప్రచురణలు, 1998
06. తెలుగు వెలుగులు, మోనికా బుక్స్, 2002
07. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం 1857-1859, మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, 1983
08. ఆంధ్ర ప్రదేశ్‌లో గాంధీజీ, తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1978
09. భారతీయ ముస్లింలు (నిన్న-నేడు-రేపు), షాలీ రహంతుల్లా, 2003.
10. భారత స్వాతంత్ర్య సాయుధ సమర చరిత్ర, పడాల రామారావు, విశాలాంధ్ర,1990
11. ఆధునిక భారత చరిత్ర, బిపిన్ చంద్ర, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 2000
12. 1857 తెలుగునాట తిరుగుబాటు, డాక్టర్ కె మంకాళిరావు. భాగ్యనగర్, 2001
13. అజ్ఞాత వీరగాథలు, గోవిందస్వరూప్, ప్రభుత్వ ప్రచురణలు, 1999
14. హైదరాబాదు సంస్థానంలో స్వాతంత్ర్యోద్యమం, వెల్దుర్తి మాణిక్యరావు, 1992
15. 1857 తిరుగుబాటు, తెలుగు ఆకాడమీ, హైదరాబాదు,
16. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు, నశీర్ అహమ్మద్, 2003
17. విప్లవ వీరులు, గద్దె లింగయ్య, ఆదర్శగ్రంథ మండలి, విజయవాడ,1982.
18. స్వాతంత్ర్య సమరవీరులు, కె ప్రతాపరెడ్డి,
19. విప్లవ మహాయుగం, పడాల రామారావు, ఆంధ్రశ్రీ ప్రచురణలు, 2004
20. 1857 స్వరాజ్య సంగ్రామం, వి.డి. సావర్కర్, ఆ : విజయ,నవయుగభారతి,2001
21. భారతస్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు, సయ్యద్ నశీర్ అహమ్మద్,

జె.పి పబ్లికేషన్స్, విజయవాడ, 2003
22. భారతస్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజా పోరాటాలు, సయ్యద్ నశీర్ అహమ్మద్, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, ఉండవల్లి సెంటరు, డిసెంబరు 2003
23. విప్లవ యుగము, గద్దె లింగయ్య, ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ, 1973

**పత్రికలు :**

01. గీటురాయి వారపత్రికలు, హైదరాబాదు

**సావనీర్ :**

01. స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీర్-రాయల సీమలో స్వాతంత్ర్యోద్యమం, అనంతపూరు, 1998

**ఫోటోలు - చిత్రాలు :**

01. 1857 A Pictorial Presentaion, Govt. of India Publictions, New Delhi, 1957
02. History of India, E. Marsden, Macmillan and Co Ltd, London, 1944
03. A Concise History of The Indian People, H.G Rawlinson, OUP, 1968
04. RADIANCE, Weekly Spl. Issue on Tipu Sultan, Aug.1999, New Delhi
05. The Great Mutiny India 1857, Christopher Hibbert, Penguin, 1980
06. Story of Swarajya, Vishnu Prabhakar, NBT, New Delhi, 1971
07. Rise of Muslims in Indian Politics, Rafiq Zakaria, Bombay, 1986
08. India's Struggle For Freedom - An Album, Govt. of West Bengal, 1987
09. 1857 తెలుగునాట తిరుగుబాటు, డాక్టర్ కె మంకాళిరావు. భాగ్యనగర్, 2001
10. అజ్ఞాత వీరగాథలు, గోవిందస్వరూప్, ప్రభుత్వ ప్రచురణలు, 1999
11. తెలుగు విజ్ఞాన సర్వస్వము, ప్రథమ సంపుటి, తెలుగుభాషాసమితి, మద్రాసు, 1954
12. విజ్ఞాన సర్వస్వము, నాల్గవ సంపుటి, తెలుగు విశ్వవిద్యాలయం, 1992.
13. గీటురాయి, వారపత్రికలు, హైదరాబాదు.
14. నల్ల గుర్రపు నాడా, సౌదా, న్యూ సిలబస్, 2001.

## భారత స్వాతంత్ర్యోద్యమం

# ముస్లిం ప్రజా పోరాటాలు

## పత్రికల - ప్రముఖుల స్పందన



మంచి ప్రయత్నం. మీ కృషిని కొనసాగించండి. తెలుగు నేర్చుకుంటున్నా. మీ పుస్తకం చదువుతా. పుస్తకం కవర్ పేజీ మీద ముద్రించిన చిత్రం చాలా బాగుంది.

**- శ్రీ సూర్జిత్ సింగ్ బర్నాల, గవర్నర్ ,ఆంధ్ర ప్రదేశ్. 09-02-2004, హైదరాబాదు.**

ఇది చరిత్ర కాదు..చరిత్ర నిర్మాణం. నిజం చెప్పమంటారా ? ఈ పుస్తకం చదువుతున్నంత సేపు నేనోక స్వాతంత్ర్య సమర యోధుడిలా స్వారీ చేశాను. నేనొక జ్ఞాన జ్యోతిగా వెలుగొందాను. నేనొక చరిత్ర నిర్మాతగా ముందుకు కదులుతున్నాను మీరూ నాతో నడుస్తారా ? రండి మన మాతృభూమిని రక్షించుకుందాం.

**- శ్రీ కత్తి పద్మారావు, ప్రముఖ రచయిత, అంబేద్కర నగర్, పొన్నూరు.**

నవ భారత నిర్మాణంలో ముస్లింల పాత్రను విభిన్నదృష్టి కోణాల నుంచి ప్రజలకు తెలిపే రచనలు చేశారు. చేస్తూన్నారు. స్వయంగా సమర్థుడైన పత్రికా రచయిత, న్యాయవాది కనుక సులభగ్రాహ్యమైన శైలిలో సత్యనిష్టతో రచన చేయగలగటం నశీర్ అహమ్మద్ ప్రత్యేకత. ఈ కారణంగా ఆయన రచనలకు విశ్వసనీయత పెరిగింది.

**- శ్రీ కె. రామచంద్ర మూర్తి, సంపాదకులు, ఆంధ్రజ్యోతి, హైదరాబాదు.**



చరిత్ర పుస్తకం అంటే సామాన్య పాఠకుడికి కొంత బెదురు ఉంటుంది. అలాంటి నదురు బెదురు లేకుండా చక్కని కథనాత్మక శైలిలో చదివించే పుస్తకం ఇది. ఈ పుస్తకం ఒక అమోఘ ప్రయత్నం...లౌకిక స్ఫూర్తిని పెంచే పుస్తకం. **- ఆంధ్రజ్యోతి దినపత్రిక**

జాతీయ విముక్తి పోరాటాలకు ముస్లింలు దూరంగా ఉన్నారని అపోహలున్నాయి. ప్రథమ స్వాతంత్ర్య పోరాట కాలం నుండి దేశంలోని అనేక మంది ముస్లిం ప్రజలు-స్త్రీ పురుషులు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న విషయం చాలా మందికి తెలియవు. ఈ చారిత్రక లోపాన్ని ఇటివల పత్రికా రచయిత, ..శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ సరిదిద్దడానికి బృహత్తర కృషి చేస్తున్నారు...భారత చరిత్ర సంస్థలు ఈ అమూల్యమైన కృషికి సముచిత గుర్తింపు యివ్వగలవనీ మనం ఆశించాలి. **- విశాలాంధ్ర, దినపత్రిక, 04-04-2004**

ఇదొక పరిశోధక గ్రంథం. బ్రిటీషు కాలం నాటి సామాజిక, ఆర్థిక రాజకీయ స్థితిగతులు-మనకు ఇంత వరకు తెలిసిన సమాచారం కంటే మిక్కిలి భిన్నమైన, లోతైన వాస్తవ చరిత్ర మనం ఈ పుస్తకంలో చూస్తాం. ఈ పుస్తకం ఆయన రచనా కీర్తిలో మరో కలికతురాయి. **- జనమిత్ర, వారపత్రిక, 27-06-04**

సంఘ పరివార్ శక్తులు చరిత్ర వక్రీకరణకు,విద్వేష ప్రచారానికి జవాబుగా నిలబడగల శక్తి ఈపుస్తకానికి ఉంది...రచయిత కృషి ఈదిశగా శక్తివంతగానూ, ఉపయోగ పదేదిగాను ఉంది. ప్రజాస్వామిక లౌకిక విలువల కోసం నిలబడాలనుకునేవాళ్ళు ఈ పుస్తకాన్ని తప్పక చదవాలి. **- అరుణతార, మాసపత్రిక, మార్చి 2004**

చారిత్రక పాధాన్యతగల వ్యక్తులను, సంఘటనలను, ఉద్యమాలను పాఠకులకు పరిచయం చేసే క్రమంలో నశీర్ అహమ్మద్ నైపుణ్యం మెట్టుమెట్టుకు చక్కబడుతోంది. బొట్టు బొట్టుగా చిక్కబడుతుంది. ఇది వ్యక్తీకరణతో పఠనాశక్తి కలిగించే శైలికి సంబంధించినది మాత్రమే కాదు-విషయ పరిశోధన-ఘటనల సేకరణ-సమన్వయం-అన్వయం-వీటన్నిటిలో కూడా పైన పేర్కొన్న అభివృద్ధిక్రమం వుంది...ముస్లింలంటే దేశ ద్రోహులనే భావనని వ్యాప్తి చేసే సంఘపరివారపు చరిత్రలనూ నశీర్ రాసిన ఈ పుస్తకం శక్తివంతంగా ఎండకట్ట గలుగుతుంది. **- ప్రజాసాహితి, మాసపత్రిక, ఆగస్టు 2004**

ముస్లిం భూపోరాటాలు, బ్రిటీష్ వలస పాలకులకు వ్యతిరేకంగా నడిపిన పోరాటాలకు సంబంధించిన చరిత్రను ఒక దగ్గర క్రోడీకరించి విడిగా ఒక పుస్తకాన్ని రూపొందిచటంలో సయ్యద్ నశీర్ అహమ్మద్ కృషి ప్రశంశనీయం...చరిత్రను సమగ్రంగా అధ్యయనం చేయదలచిన వారు ఆయన రచనలను తప్పక చదవాలి.

**- ప్రజాశక్తి, దినపత్రిక, 08-02-2004**

"..the works like this should form part of the curriculum at the school level itself, to shape the future generation to be more humane and civilized. not only this book all the books authored by Mr. Naseer may be translated into the other vernacular languages also to make secular India more stronger.." -Milli Gazette, Fortnightly, Spet..04

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం జనసముదాయాల
మహోన్నత భాగస్వామ్యాన్ని వివరిస్తూ వెలువడిన

# సయ్యద్ నశీర్ అహమ్మద్

## రచనలు

**1. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు**
( పునర్ముద్రణ 2003, పేజీలు 80, వెల రూ 20-00)

**2. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు**
( పునర్ముద్రణ 2003, పేజీలు 44, వెల రూ 10-00)

**3. భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు**
( పునర్ముద్రణ 2001, పేజీలు 80, వెల రూ 30-00

**4. మైసూరు పులి : టిపూ సుల్తాన్**
( పునర్ముద్రణ 2004, పేజీలు 28, వెల రూ 10-00 )

**5. షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్**
( ప్రథమ ముద్రణ 2002, పేజీలు 24, వెల రూ 10-00 )

**6. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు**
( ప్రథమ ముద్రణ 2003, పేజీలు 176, వెల రూ 50-00 )

**( తపాల లేక కొరియర్ ఖర్చులు అదనం )**

## మా రాబోవు గ్రంథాలు

1. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం యోధులు -2
2. చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు
3. భారతీయ ముస్లిం సమాజం : అపోహలు - వాస్తవాలు
4. భారతీయ ముస్లింలు - స్థితిగతులు

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**
**3-506, అప్సాఫర్, ఉండవల్లి సెంటర్ - 522 501,**
**తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా.**
✆08645-272940, సెల్ : 94402 41727

నా పరిమితుల మేరకు
నేను సమకూర్చుకొగలిగినంత
సమాచారంతో రూపొందించిన
ఈ గ్రంథంలో..
నేను స్థానం కల్పించ లేకపోయిన
**మహనీయులందరికి**
వినయపూర్వక క్షమాంజలులు. - **రచయిత**